

భారతదేశ చరిత్ర, సామాజిక జీవన చిత్రం

# కథలు-గాథలు

ఐదవ భాగము

## దిగవల్లి వేంకటశివరావు





**KATHALU GAADHALU - VOL-5**

*- Digavalli Venkata Siva Rao*

ప్రచురణ నెం. : 354/23

ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : మార్చి, 2019



**వెల: ₹ 220/-**

ప్రతులకు:

**నవచేతన పబ్లిషింగ్ హౌస్**

గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ(నాగోల్), జి.యస్.ఐ పోస్టు
హైదరాబాద్-500068. తెలంగాణ.
ఫోన్-అకౌంట్స్: 040-29884453
ఫోన్-గోడౌన్: 040-29884454
***E-mail:*** navachethanaph@gmail.com

**నవచేతన బుక్ హౌస్**

బ్యాంక్ స్ట్రీట్ (అబిడ్స్), కూకట్‌పల్లి,
కొండాపూర్, బండ్లగూడ(నాగోల్)- హైదరాబాద్.
హన్మకొండ, ఖమ్మం.



ముద్రణ: **నవచేతన ప్రింటింగ్ ప్రెస్,** హైదరాబాద్- 68.

# సంపాదకుని విజ్ఞాపనము

**మా** తండ్రిగారు, కీ.శే. దిగవల్లి వేంకట శివరావు గారు రచించిన కథలు గాథలు (1-4 భాగములు)1944 సంవత్సరములో ప్రచురించబడినది. అనేక సాహిత్యవేత్తలచే సమీక్షింపబడి ప్రశంసింపబడిన ఈ పుస్తకముయెక్క మూడవ సంకలనము 2010 సంవత్సరంలో మా అన్నగారు కీ.శే. దిగవల్లి వేంకటరత్నంగారు విశాలాంధ్ర పబ్లిషింగ్ వారిచే ప్రచురింపచేశారు.

నాన్నగారి ప్రచురిత పుస్తకముల చివర అముద్రిత పుస్తకముల జాబితాలో 8 పుస్తకముల పేర్లున్నవి. అందులో కథలు గాథలు 5,6 భాగములు 400 పుటలు అని చెప్పబడియున్నది. లండను నగర వాస్తవ్యులు, సాహిత్యాభిలాషులైన శ్రీ పరుచూరి శ్రీనివాస్ గారు 2011 సంవత్సరము భారతదేశ పర్యటనలో ఈ కథలు-గాథలు 5,6 భాగములను గురించి ప్రస్తావించి తాను ప్రచురించెదనని ముందుకు రావటం నాకు ఆశ్చర్యమేగాక ఆ విశేషకార్యము నేనే చేయవలెనన్న సంకల్పసిద్ధి కలిగించినది. దానికి చేదోడుగా మా అన్నగారి కుమారుడు, అమెరికా వాస్తవ్యుడైన డా శివరావు ప్రోత్సాహము చేకూరినది.

మా నాన్నగారి 94 ఏండ్ల దీర్ఘ జీవితకాలము(1898-1992)లో వారు రచించిన అనేక వ్యాసములు అనేక పత్రికలలో ప్రచురింపబడియుండెను. ఆయా వ్యాసముల ప్రతులను మా అన్నగారు కీ.శే. దిగవల్లి వేంకట రత్నంగారు(1936-2010)సేకరించి వర్గీకరించి జాబితాచేయుటయేగాక వాటిని పొందు పరిచియుంచిరి. వారి తదనంతరం 2014 సంవత్సరంలో వారి రెండవ కుమార్తె వడ్డాది శ్యామల (ప్రఖ్యాత కర్మవీర పురస్కార గ్రహీత) వాటిలోనుండి ప్రచురిత వ్యాస ప్రతులనేకాక నాన్నగారి చేతివ్రాతలోనున్న అనేక వ్యాసములు మరియూ చరిత్ర అన్వేషణకోసం వారు వ్రాసిపెట్టుకొనియున్న అనేక చిత్తు ప్రతులు నాకు అందజేయుటవలన ఈ కథలు-గాథలు 5,6 భాగములు పుస్తకరూపములో సంకలనము చేయుట సంభవమైనది.

నాన్నగారు రచించిన వ్యాసములు ఎక్కువగా ఆంధ్రపత్రికలో 1940 దశాబ్దములో కథలు-గాథలు అను శీర్షికలో ప్రచురించ బడినప్పటికినీ, అలనాటి పత్రికలైన స్వరాజ్య, కృష్ణాపత్రిక, భారతి, గ్రంథాలయ సర్వస్వము, ప్రభాతము, సమదర్శని మొదలగు

పత్రికలలో 1923 నుండీ, తదుపరికాలములో విశాలాంధ్ర, ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, ఉదయం, జమీను రైతు, సమాలోచన మొదలగు (ఇంకా అనేక) పత్రికలలో 1984 సంవత్సరము వరకూ ప్రచురించబడిన అనేక వ్యాసములుండెను. అట్టివాటిలో ప్రచురితమైనవేగాక, చేతివ్రాతతోనున్నవికూడా కలిపి 114 వ్యాసములు వెలికితీయ గలిగాను. కానీ అవి శిథిలావస్థలోనుండబట్టి వాటిని ఇంటిదగ్గరే జాగ్రత్తగా స్కాన్ చేసి సాఫ్టు కాపీలు చేసి MSSల సి.డి. తయారుచేసి ప్రచురించుటకు సిద్ధము చేశాను. సాహిత్యములోగానీ చరిత్రలోగానీ ప్రవేశములేనందుననూ, ఆ వ్యాసములు ఇదివరలో చదువకపోయిననూ ప్రూఫ్ సవరణలప్పుడు చదువుట అనివార్యమైనందున ప్రచురించబడ్డ తేదీలను బట్టి కొన్ని పెద్ద వ్యాసము ముందువెనుకలు సక్రమముగ జోడించి సవరణచేసి, సశేషమన్న వాటికి తరువాయి భాగములు వెదకి వెలుపలికి తీసి ఆయావ్యాసములకు జతచేసి వాటిని పరిపూర్ణముగనుండునటుల నిర్ధారించుకుని ప్రతి వ్యాసమునకు మూలాలు వెదకి, ప్రచురించిన తేదీలతో వ్యాసముచివర చూపించగలిగాను.

ఈ వ్యాసముల ప్రతులలో కొన్నింటికి కాగితములు చిరిగి అక్షరములు పోయి యుండిన చోట వాటిని సరిదిద్దే చరిత్రజ్ఞానము కలిగియండలేదు. అయినప్పటికీ వారి చేతివ్రాతతో పరచితుడనగుటవలన వారు అక్కడక్కడ చేసిన చిన్న చిన్న సవరణలు ఓరిమితో ప్రయాసపడి చాలమట్టుకు నిర్ధారించగలిగాను. వారు ఉల్లేఖించిన గ్రంథముల, రచయితల పేర్లు కొన్నిచోట్ల వారి చేతివ్రాత ఆంగ్లములోనున్నవాటికి ఇంటర్నెట్ సహాయముతో స్పెల్లింగులు నిర్ధారించగలిగాను. అదృష్టవశమున అట్టి సమస్యలు గల వ్యాసములు బహు తక్కువగానే యుండెను.

కొన్నిపూర్తిగా చేతివ్రాత ప్రతులుగానున్నవాటిని విడిచిపెట్టక తప్పలేదు. అట్టివిపోను పరిపూర్ణముగా సమకూరినవి 82 వ్యాసములు మాత్రమే. అందులో 34 వ్యాసములు బ్రిటిష్ ఇండియా చరిత్ర వ్యాసములగుటచే వాటిని వేరు పరచి 5వ భాగముగనూ మిగత 48 వ్యాసములు 6వ భాగముగను విభజించాను. కథలు-గాథలు 1-4 భాగముల పుస్తకము కొలమానముతో ఈ 5, 6 భాగములందలి వ్యాసములుకూడా సాధ్యమైనంత చిన్నవిగనుండవలసియుండెను. అయినప్పటికీ చరిత్రాత్మక వ్యాసములు కొన్ని పెద్దవిగనున్న వాటినిగూడ ఇచ్చుట సమకూర్చుట ఉచితమని తోచినది. చాల వ్యాసములు బ్రిటిష్ పరిపాలన జరుగుచుండిన 1940 దశాబ్దమునాటి రచనలైనందున అందలి కాలమాన ఉల్లేఖనములను, గ్రంథకర్త ఉద్దేశ్యములను తదనుసారము అన్వయించుకొనవలెను.



స్కాన్ చేసినవ్యాసములను కంప్యూటర్ సి.డి.ద్వారా ప్రచురణ కర్తలకందజేసి శ్రీమతి జయశ్రీ గారు నాకు ముందుగనే సహాయం చేశారు. దాదాపుగా 250 ప్రూఫ్ ప్రతులు చదివి శ్రమపడి సవరించిపెటిన శ్రీ చయనం సుబ్రమణ్య శర్మ - పద్మావతి దంపతులకు కృతజ్ఞుడను. ప్రముఖ చరిత్రకారులు ఆచార్య డా. వకుళాభరణం రామకృష్ణ గారితో పరిచయం ఈ మధ్యనే కలుగటవలన ప్రూఫ్ సవరణలప్పుడు నాకు కలిగిన సందేహములను వారితో సంప్రదించుటకవకాశము కలిగెను. వారు ఎంతో ఓపికతో విశదీకరించిన విషయములు నాకు చాల తోడ్పడినవి. ఆర్థికలాభసాటియే లక్ష్యముగా కాక మన దేశ చరిత్ర - సంస్కృతిని విస్తరించుటకు సహకరించవలెనన్న దృష్టికోణముతో ఈ పుస్తకమును ప్రచురించిన **నవచేతన పబ్లిషింగ్ హౌసు** వారికి నా హృదయపూర్వక అభినందనలు.

తేది: 03.12.2018

దిగవల్లి రామచంద్ర, ***Msc, Phd***

దిగవల్లి నివాస్, ప్లాటు నం. 83
రోడ్డు నం.9, జూబ్లీహిల్స్
హైదరాబాదు 500033.
ఫోన్ నం. 8106216512, 94490133
ఇ-మెయిలు : digavalli1943@gmail.com

# అంకితము



1923 నుండీ ప్రచురితమైన మా నాన్న గారు రచించిన అనేక పుస్తకములను, వ్యాసములను, వారి పరిశోధనా చిత్తు వ్రాతప్రతులను భద్రపరచి, వర్గీకరించి జాబితా చేసి, తన స్వగృహములోనే ఒక అంతస్తును నాన్న గారి పుస్తకములన్నింటినీ నిలువచేయుటకొక గ్రంథాలయమును స్థాపించి జీవితాంతము వరకూ నడపిన మా అన్నగారు, కీ.శే. దిగవల్లి వేంకటరత్నం గారు (1936-2010).

వారి దివ్యస్మృతికి

సంపాదకుడు
దిగవల్లి రామచంద్ర



# విషయసూచిక

# 1857 పూర్వపు తిరుగుబాట్లు

## 1824 వ సం॥ తిరుగుబాటు

1824వ సంవత్సరమున ఉత్తర హిందూస్థానములోని ఉత్తర రాష్ట్రము లన్నింటిలోను కలిగిన కల్లోలమునకు కూడ నిజమైన కారణము ప్రజాపీడనమే. అప్పుడు కొద్దిగనో గొప్పగనో ప్రభుత్వముపట్ల విరోధ భావము చూపని మండలమొకటి యైనను లేదని చెప్పవచ్చును. దీనికే వో కొన్ని కారణములను చూపుటకు కొందరు ప్రయత్నించిరి. బర్మా యుద్ధమునందు మనకు (ఆంగ్లేయులకు) అపజయములు కలిగినందువలన మన సైన్యములనక్కడికి పంపవలసి వచ్చుటయె యొక కారణమనినారు. తిరుగుబాటు చేసిన ముఠాలనాపి దోపిడికొరకు తిరుగుబందిపోటు గాండ్రేగాని అసంతృప్తిజెందిన జన సామాన్యము కాదనియు చెప్పుట ప్రారంభించిరి. ఇవన్నియుకూడ కారణములేయని ఒప్పుకొనుట కభ్యంతరములేదు. గాని మన పరిపాలనములో ఈ దేశీయులంత సౌఖ్యమే అనుభవించుచున్నయెడల మన యధికారమును ధిక్కరించుటకు వీరందరు నింత యుత్సాహముతో ఎందుల కేకమైరి? ఉత్తర పరగణాలలో నొక్క ప్రధాన భూస్వామియైనను మన ప్రభుత్వమునకు సాయముచేయుట కేల ప్రయత్నింపలేదు?

దోపిడి సొమ్ములోనుండి కొంతపాలు పంచుకొనవచ్చునని కొందరు బందిపోటు గాండ్రే తిరుగుబాటులో చేరినమాట నిజమే అని యొప్పుకొందము. కాని ప్రజల ప్రవర్తన ఎట్లున్నదో ఒక్కమారు పరికింతము. ఈ దోపిడి దొంగలకు మొదట గెలుపు కలుగగనే దేశములోని ప్రజలలో ఉన్నత తరగతులవారు కూడా చాలామంది వారితో కలిసిరి. అంతట నీ జనసమూహము యొక్క ఉద్దేశ్యము కేవలముదోపిడి చేయుటయేగాక ప్రభుత్వాధికారమును ధిక్కరించుటగనే పరిణమించెను. దేశమంతటను అమితోత్సాహముతో "ఈ యింగ్లీషువారి రాజరికము అంతరించినది! ఈ ప్రభుత్వము నశించునుగాక!! అను కేకలు ప్రతిధ్వనించినవి. ఈ కల్లోలము నణచుటకు తోడ్పడు పద్ధతి ఈ దేశ ప్రజలలో లేదనియు, అతనిని సర్కారు పోలీసువారికేవదలి ప్రజలు సేక్షాభావమువహించి తొలగియున్నారనియు చెప్ప సరిపెట్టుకొని నందువలన లాభములేదు. స్వదేశరాజుల

పరిపాలనలో కల్లోలములు కలిగినప్పుడు పలుకుబడి కలవారు తమ పరిజనులను, రైతులను పోగుచేసి, ఆ రాజుల ప్రభుత్వములకు సాహాయ్యముచేసిన యుదాహరణము లెన్నియైనను, ఈ దేశచరిత్రమునందు కనబడుచున్నవి.

పైన చెప్పిన 1824 వ సం॥ కల్లోలములో మాత్రమే ఇందుకు భిన్నముగా జరిగినవి. ప్రజలు కేవలము దూరముగా తొలగి యూరుకొనిరా యనినచో నదియును నిజముకాదు. సర్వసాధారణముగా ఇంగ్లీషు మేజిస్ట్రేటుల చుట్టును తిరుగుచుండు జోహుకుములు కూడా ఈ కల్లోలము ప్రారంభము కాగానే తమ తమ ప్రాకతములలో తమ పలుకుబడి నుపయోగించి కాంతి నెలకొల్పు నెపముతో చల్లగాజారి తమ తమ గ్రామములకు వెళ్లి అక్కడ మనుష్యులను ప్రోగుచేసిరి? తాము సిద్ధముగానుండి తరుణము రాగానే ప్రభుత్వమునకు వ్యతిరేకముగా నుపయోగించుటకే ఆ మనుష్యుల నట్లు ప్రోగుచేసిరి.

ఇటువంటివారు కొందరీ సందర్భములో ప్రభుత్వమనకు ఎదురుతిరిగిన వారు జాడకలరు. ఆ సమయమున శాంతి భద్రతలను కాపాడుటకొరకు వెంటనే చర్య తీసికొనకపోయి యుండిన ఎడల గాని పితూరీ దారులకును ప్రభుత్వ బలములకును జరిగిన మొదటి సంఘర్షణములో అదృష్టవశమువలన ప్రభుత్వమునకు సిద్ధించిన జయము కలుగకపోయి యుండినగాని లేదా కొలది దినములు ఆలస్యము జరిగియుండినగాని తీవ్రమైన పెద్ద తిరుగుబాటు బయలుదేరి దానిని అణచుటకు మనకు ఉత్తర హిందుస్థానమునందలి అన్ని పరగణాలలోను గల సైన్యముల నన్నిటిని గూడ ఉపయోగింపవలసి వచ్చెడిదే. మన అధికారము విచ్ఛిన్నమై పోయెడిదే.

ఆ సమయములో ప్రభుత్వము వారికిని వివిధ మండలములలోని అధికారులకును జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములను నేను చూచియున్నాను. సహరాన్‌పూర్ నుండి వచ్చిన ఒక జాబునందిట్లు వ్రాయబడెను. 'దోపిడిగాండ్ర గుంపొకటి ముందుగా లూటీ చేయుటకొరకు బయలుదేరెను. వారికి కొంత జయము చేకూరగనే ఇతర గ్రామస్థులు కూడ ఆ గుంపులో చేరిరి. అంతట మరికొన్ని దోపిళ్లు జరిగెను. ఆ జిల్లాలోని ప్రధాన భూస్వామి యీ దోపిడిగాండ్రతో చేరినాడు. వీరిని తన కోటలోని కాహ్వానించి బహిరంగముగనే ప్రభుత్వమును ధిక్కరించినాడు. ఈ పితూరీదారులలో నొకడే రాజబిరుదమును వహించెను. ఆ సమయముననే ఆంగ్లేయప్రభుత్వ సైన్య మొకటి వచ్చి వీరిని తారసిల్లెను. ఇంకొక్కదినము ఆలస్యము జరిగియుండినచో ఈ పితూరీలో మూడు వేలమంది చేరియుందురు. అప్పటికే పితూరీ చేరుటకొరకు ప్రజలు ఏబదిమంది మొదలు మూడు వందలమందివరకును గల ముఠాలుగా నేర్పడిరని బయల్పడెను. మన



సైన్యములకు మొదటి తాకిడిలో అపజయము కలిగియున్నచోనెంత భీభతసము జరిగియుండునో చెప్పుటకు శక్యముకాదు. ఈ ఉత్తరములోని సంగతులను ప్రభుత్వమువారు కాదనలేదు. పైగా నిజమేయని యంగీకరించియున్నారు. ఈ కల్లోలమునందు శ్రమ పడినవారిని మెచ్చుకొన్నారు.

ఓరిమిగల వంగదేశీయులకన్న శూరత్వముగల ఉత్తర పరగణాలవారిలో మాత్రమే ఈ భావము లున్న వనుకొనుట పొరబాటు. దిగువ దక్షిణ పరగణాలలో కూడా తిరుగుబాటు సూచనలు పొడచూపియుండెను. వారన్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగ నుండగా 1781లో ఆయనకును కాశీరాజైన చైతుసింగుకున తగవులు కలిగిన సమయములో నొకమారు వారన్‌హేస్టింగ్సు శత్రువులకూ జిక్కిపోయినాడని పుకారు పుట్టెను. అంతట వంగరాష్ట్రమునందు అనేక మండలములలో ముఖ్యముగా రాజషాయి, భీర్‌భూమ్ జిల్లాలలో కల్లోలములు బయలుదేరెను. రివెన్యూ వసూలు చాలరోజులవరకును ఆగిపోయెను. ఆ సమయములో అక్కడ ఆంగ్లేయోద్యోగుల అధికారము ఎందుకు పనికిరాకుండపోయెను. (Notes on Indian Affiars. Hon. Fredric John Shane Vol. 1 pp 158-167). వారన్ హేస్టింగ్సు తొందరపడి చైతుసింగును పట్టుకొనుటకు ప్రయత్నించగా అతడు పంపిన చిన్న సైన్యమును దేశీయ సైన్యములు ఓడించెను. చైతుసింగు దొరకలేదు. వారన్‌హేస్టింగ్సుకు ప్రాణభయము కలిగెను. అతబు బూగారు కోటకు పారిపోవలసివచ్చెను. ఈలోపుగా వారన్‌హేస్టింగ్సును చంపివేసిరనువార్త ప్రాకిపోయెను. పట్నా నగరమునందలి ఆంగ్లేయులు ఊరువిడిచి పోసాగిరి. అప్పుడు గంగానదిపైన వివిధ జిల్లాలలోని న్యాయస్థానములను చూడపోవుచుండిన కలకత్తా సుప్రీము న్యాయాధిపతి ఇంపే, అప్పటి పరిస్థితులు వర్ణించినారు. సిపాయిలు పటాలములు విడిచి పోవసాగిరి. చుట్టుపట్ల జమీందార్లు చైతుసింగుకు అభినందనములంపిరి. అయోధ్యరాజు బీగములు అతనికి ధనమును సైనిక బలములు పంపి సాయము చేసిరి. లక్నోలో అలజడి కలిగెను. మూర్షిదాబాదులో సిపాయిలు తిరుగబడిరి. (The Great Procouncul S.C. Grier p.302).

## 1839 లో తిరుగుబాటు ప్రయత్నము

1838 వ సంవత్సరములో ఇంగ్లీషు వారు ఆఫ్ఘనిస్థానముమీదికి దండయాత్ర చేయుటకు సైన్యములు పంపినప్పుడు హిందూదేశ మందంతటను గల మహమ్మదీయ ప్రజలలో ఉద్రేకము కలిగినట్లు స్పష్టముగా కనబడెను. అయోధ్య రాష్ట్రములోనుండి

అరబీ–దూతలు బయలుదేరి దేశములో నలుమూలలకునుపోయి తిరుగుబాటులేదని ప్రచారముచేసిరి. కాఫరులైన ఫరంగీలపైన 'జిహాద్' అనుమత యుద్ధమును చేయవలసినదని అర్థమిచ్చు మాటలను ఖురానులోనుండితీసి రక్షరేకులద్వారమునను తాయిత్తుల ద్వారమునను ప్రచురించిరి. ఇటువంటి అరబ్బీ దూతలను కొంతమంది చెన్నపట్టణము దగ్గర కూడా పట్టుబడిరి.

ఆఫ్ఘనిస్థానములో ఇంగ్లీషు సైన్యములకు జయమే కలుగునో అపజయమే కలుగునో అను సంధిగ్ధావస్థలోనున్న సమయమున అనగా 1839వ సంవత్సరము వేసంగిలో నిజాముగారి సోదరుడు కర్నూలు నవాబు గారికి వ్రాసిన రహస్యపు లేఖ యొకటి ఒక ముదుసలి స్త్రీ రక్షరేకులో కనబడెను. దానినిబట్టి విచారించగా ఆఫ్ఘనిస్థాన యుద్ధమునందు ఇంగ్లీషువారోడి పోవుదురనుకొని ఈ దేశములోనున్న మహమ్మదీయులందరును ఏకమై తిరుగుబాటు చేయుటకు కుట్రచేసినట్లును దానికి కర్నూలు నగరమొక కేంద్రమైనట్లును బయల్పడెను. కర్నూలు నవాబు గారి కోటయుగోడలమధ్య నేలసొరంగములలో ఫిరంగులు, ఫిరంగిబళ్లు ఫిరంగిగుళ్ళు తూటాలు తుపాకులు మందుగుండు సామానులు ఫిరంగులు చేయు కొలుములును కనబడినవి. కర్నూలు నవాబుగారిని ఖైదుచేసిరి. ఆ సమయములో భగవంతుని సహాయ మింగ్లీషు వారికి కలిగినందువలన గాని లేనియెడల హిందూ దేశమునందు వారి రాజ్యము భగ్నమై పోయి యుండెడిదే. కనీసము తెల్లవారు చాలమంది ఈ విప్లవాగ్నికి ఆహుతి యైపోయేడివారు అని యొక మిషనరీ వ్రాసినాడు.

## భారతీయులింగ్లీషు ప్రభుత్వమును హర్షించరా!

ఇంగ్లీషు విద్యావిధానము స్థాపించినందువలనను స్వాతంత్ర్యభావములను వెదజల్లు ఆంగ్లసాహిత్య గ్రంథములను చదువుటవలనను మనదేశ ప్రజలలో దేశాభిమానము కలిగినదనియు, స్వధర్మరక్షణకొరకు దేశోద్ధరణకొరకు, దేశస్వాతంత్ర్యము పాటుపడుటయు ప్రారంభమైనదనియు ఆంగ్లేయ చరిత్రకారులు వ్రాయుచుందురు. ఇవి నిజమేనని మనవారు కూడ కొందరు చెప్పుచుందురు. అయితే ఇది కేవలము పొరబాటు మాటయని సుప్రసిద్ధ చరిత్రకారుడైన ఎడ్వర్డు థాంప్సన్‌గారు తమ హిందూదేశచరిత్రలో వ్రాసియున్నారు.

దేశాభిమానము – జాతీయ తన చైతన్యతననగా విదేశీ పరిపాలనము నంగీకరింపక దేశీయులు తమ అసమ్మతిని చూపుటయే యని మన మంగీకరించునెడల – అది యెటువంటి విద్యాభివృద్ధితోను నిమ్తిములేని ఆత్మగౌరవమునకు సంబంధించిన గుణమని తేలుచున్నది. హిందూదేశమున విద్యాగంధమావంతయైన లేనికాలమున గూడ



భారతీయులీ విజాతీయ పరిపాలనమున తమకు జరుగుచున్న అన్యాయములను సహింపక ఆ పరిపాలనపట్ల తమ అసమ్మతిని కనబరచిన నిదర్శనము లనేకములు కనబడుతున్నవి. ఈ దేశమున ఇంగ్లీషు ప్రభుత్వము స్థాపించుటకు మనదేశీయు లిష్టపడి యంగీకరింపలేదు. భారతీయులు తమ స్వధర్మమును స్వాతంత్ర్యమును రక్షించుకొనుటకు మొదటి నుండియు పోరాడుచునే యున్నారు. మన వారు మరల తలయెత్తలేకుండా అణచివేయుట కింగ్లీషు వారి కొకవంద సంవత్సరములు పట్టినది "1757లో జరిగిన ప్లాసీయుద్ధము మొదలుకొని 1857లో జరిగిన స్వాతంత్ర్య యుద్ధము విఫలమగువరకును స్వాతంత్ర్యము కొరకును స్వధర్మసంరక్షణము కొరకును భారతీయులు పోరాడని కాలమేలేదు. ఇతర విజాతీయులను ప్రతిఘటించుటకు ఏకముగాని వివిధజాతులవారును వివిధ మతములవారును ఆంగ్లేయుల చేతులలో నుండి బయటపడుట కొరకేకమై తీవ్రముగా పోరాడినారు." అని ఎడ్వర్డు తాంప్సన్‌గారు వ్రాసినారు.

## 1857 సం॥ మ్యూటినీకి పూర్వం పాతికేళ్ల క్రిందట

భారతదేశ స్థితిగతులను గూర్చియు ఇంగ్లీషు పరిపాలనము నందుగల లోపము గూర్చియు అనుభవజ్ఞులైన ఆంగ్ల ఉద్యోగులును అనుద్యోగులునుగూడ నిర్భయముగా చర్చించవచ్చునని 1828–35 మధ్య హిందూదేశమునకు గవర్నరు జనరలుగా నుండిన విలియం బెంటింగుగారు చెప్పి అవకాశమిచ్చినందువలన ఆకాలములలో మన దేశమునందు ఉద్యోగములు చేయుచుండిన దొరలు కొందరు తమ అభిప్రాయము లను స్వేచ్ఛగా వెల్లడించిరి.

ఉత్తర హిందూస్థానమున పదునేడేండ్లు న్యాయాధిపతిగా పనిచేసిన ఫ్రెడరిక్ జాన్‌షోర్‌గారు భారతదేశ స్థితిగతులను గూర్చి 1832–35 మధ్య కలకత్తాలో ప్రకటింపబడు 'ఇండియా గెజెట్ అను పత్రికలో వ్రాసిన గొప్ప వ్యాసములు 1837 లో 'Notes on Indian Affairs' అను పేరుతో పదునైదు వందల పుటలు గల రెండు సంపుటముల గ్రంథముగా ప్రకటింపబడినవి. కంపెనీవారి పరిపాలనమునందుగల లోపములు అందు జరుగుచుండిన అన్యాయములు, అక్రమములందు నిర్భయముగా వెల్లడింపబడినవి. ప్రజల బాధలను కన్నులకు గట్టినట్లుగా వర్ణించినారు. 1857వ సంవత్సరమునకు పూర్వము పాతికేండ్లనుండికూడా హిందూదేశ ప్రజలలో ఆంగ్లేయ ప్రభుత్వము పట్ల తీవ్రమైన అసంతృప్తి వ్యాపించియుండెననియు దేశమునందశాంతి ప్రబలియుండెననియు వీలైనచో నీ ప్రభుత్వమును ధిక్కరించవలెనని తిరగదోడవలయుననియు ప్రజలాలోచించుచు,

కుట్రలు చేయుచుండిరనియు చెప్పి, అందుకు కొన్ని యుదాహరణములను జూపి, ఆ లోపములను వెంటనే సవరించని యెడల ఫ్రెంచి ప్రజావిప్లవమునందా దేశ పరిపాలకులకు పట్టిన గతియె ఇక్కడి వారికికూడా తటస్థించగలదనియు షోర్‌గారు స్పష్టముగా వ్రాసిరి.

## కోల్‌జాతుల పితూరి

ప్రతి తిరుగుబాటునకును కల్లోలమునకును ఏదోయొక బలవత్తరమైన కారణముండితీరును. నిజమైన అసంతృప్తిలేకయె వచ్చిన విప్లవములరుదు. ఇటీవల జరిగిన కోల్‌జాతి తిరుగుబాటులో చాలా మాన ప్రాణములు నష్టమైనవి. ప్రభుత్వమునకు చాలా సొమ్ము ఖర్చు అయినది. అప్రియమైన సంగతులను ఎంతకప్పిపుచ్చినను, ఎందరు ఏదన్నను, ఈ తిరుగుబాటుకు నిజమైన కారణము కంపెనీ ప్రభుత్వాధికారులు చేసిన ప్రజాపీడనము, దోపిడియునని బయటపడినది." ఈ యుద్యోగులు లంచము పుచ్చుకొని తమ యధికారమును దుర్వినియోగము జేసి కొందరికి మద్దతుచేసిరి. ఈ కోల్‌జాతివారు వంగరాష్ట్రమునకును బీహారు రాష్ట్రమునకును పడమర ప్రక్కనుండి అలహాబాదుకు క్రిందుగా మీర్జాపురము దగ్గర వింధ్య పర్వతములుదాకను వ్యాపించియున్న అరణ్య ప్రదేశములలో నివసించు ఆదిమవాసులు . ఈ కోల్‌జాతుల తిరుగుబాటు మన గోదావరి మన్యములో జరిగిన రంప పితూరి వంటిదే. అల్లూరి సీతారామరాజుగారి పితూరి యెంత తీవ్రముగా జరిగినదో అందరికి తెలిసిన విషయమే.

– *ఆంధ్రపత్రిక, 23.2.1947, 2.3.1947*







## "అధర్మానికి వెనుదియ్యనివారు"

ఫ్రెంచివారూ ఇంగ్లీషువారూ తగాదాలు పడడంలో ఫ్రెంచివారి పుదుచేరిని ఇంగ్లీషు వారు దోచుకోవడమూ ఇంగ్లీషువారి చెన్నపట్నాన్ని ఫ్రెంచివారు కొల్లగొట్టడమూ జరిగింది. ఇంగ్లీషువారు 1778లోపుదుచేరీ పట్టుకున్న తరవాత మైసూరురాజ్యంలో చేరిన మాహీ అనే చిన్న గ్రామాన్ని కొల్లపెట్టారు. అంతట మైసూరు సుల్తాను హైదరాలీ వీరిని మందలించాడు గాని వీరు వినిపించుకోలేదు. అందువల్ల హైదరాలీ వీరికి బుద్ధి చెప్పడానికి కర్నాటకంలో ఇంగ్లీషువారికున్న రాజ్యభాగాలపైకి దండెత్తి వచ్చాడు. అప్పు డక్కడి ప్రజలు హైదరాలీ తమ్ము నాశనం చెయ్యడానికి వచ్చిన శత్రువును చూచినట్లుచూడక కేవలమూ తమ్ము రక్షించడానికి వచ్చిన మహానుభావుణ్ని చూసినట్లు చూశారని ఆంగ్ల చరిత్రకారుడైన మిల్లు వ్రాశాడు! ఆ సమయంలో ఇంగ్లీషు సేనలను నడిపిన సేనానికూడా "ఈ హైదరాలీ దేశప్రజల అనురాగానికి పాత్రుడుగా వున్నాడని" వ్రాశాడు. హైదరాలీ ఆర్కాటును, పేటను పట్టుకున్నప్పుడు ప్రజలను చాలాదయతో కాపాడినాడనిన్నీ తన సైనికులెవ్వరూ లూటీలు, దోపిళ్లూ, చేయకుండాను, విచ్చలవిడిగా సంచరించకుండాను కట్టడిచేశాడనిన్నీ ప్రజలు నిర్భయంగా సుఖజీవనం చెయ్యడానికి వీలైనదనిన్నీ ఇంగ్లీషు ఉద్యోగులకు భోజనానికి కావలసిన భత్యాలిచ్చి కాపాడేవాడనిన్నీ టారెన్సు అనే పార్లమెంటు మెంబరు వ్రాశాడు.

హైదరాలీ చనిపోయిన తరవాత ఇంగ్లీషు వారు టిప్పుసుల్తాను మంత్రితో కుట్రచేసి శ్రీరంగపట్నంకోటను పట్టుకొన్నప్పుడు తమ మామూలుకు భిన్నం లేకుండా తెల్ల సైనికులను పట్నంపైన పడి దోచుకోవడానికి ఉషారీ యిచ్చారు. అప్పుడు జరిగిన దోపిడి ఘోరకృత్యాలు వర్ణనాతీతములు. బహిరంగంగా పంచుకున్న సొమ్ము 25 లక్షల కరుకు వరహాలకు పైబడింది. రహస్యంగా దొరికింది ఎవరికివారు జేబులో వేసుకున్నారు. ఖజానాలో ఉన్న ధనరాసులలోను జవాహిరీలోనూ కొంత కుంఫినీ ఖజానాలోనికి చేర్చారు. కొంత హరించారు. ఈ బీభత్సాన్ని గురించి కొందరు చరిత్రకారులు వర్ణించారు.

అయితే పై సంగతులు మన పిల్లలు చదివే హిందూదేశచరిత్రలో వుండవు. మన రాజులు, నవాబులు దుర్మార్గులనిన్నీ, క్రూరులనిన్నీ, ఎన్ని అన్యాయాలు చేసినా,

దొరలందరూ దేవత లనిన్నీ చిత్రించే చరిత్రలే మన విశ్వవిద్యాలయాలలో వుపయోగిస్తారు. ఆంగ్ల ప్రభుభక్తిని బోధించే చరిత్రలను రచించడంలో అగ్రగణ్యుడైన విన్సెంటు స్మిత్తుగారి గ్రంథమే అధికారులకు ప్రమాణ గ్రంథం. హైదరాలీని గురించి ఈ స్మిత్తుగారు ఏమి వ్రాశారో మచ్చుకోసం కాస్త చూస్తారా?

"దక్షిణదేశమున హైదాలీయున్నూ, ఉత్తరాన (శిక్కుల రాజైన) రణజితసింగున్నూ 18 వ శతాబ్దపు కల్లోలంలో పైకి వచ్చిన క్రూరులైన దళారీలు (Adventurers) ఇద్దరూ నిరక్షరకుక్షులు, అధర్మానికి వెనుదియ్యనివారు. హైదరాలీకి మతములేదు, నీతిలేదు, జాలిలేదు. ప్రతివిషయమూ అతిశ్రద్ధగా స్వయంగా నిర్వహించడము, కిరాతకపు దారుణకృత్యాలు జరిగించడము తమ పరిపాలనలో అవలంబించే పద్ధతులు అని స్మిత్తుగారు వ్రాశారు (Oxford History p.544). ఇది నిజమైనా కాకపోయినా ఆంగ్లేయులుకూడా ఆకల్లోలంలో పైకివచ్చిన దళారీలేనిన్నీ వారు చేసిన చర్యలలో కూడా చాలా అన్యాయయాలు ఘోరాలు వున్నాయనిన్నీ స్మిత్తుగారు ఎరగకపోలేదు. తాను వ్రాస్తూ వున్నది జాతీయచరిత్ర కాదనిన్నీ పాలితులకోసం పాలకజాతివాడు వ్రాస్తూవున్న ప్రభు భక్తిపాఠాలు బోధించే ప్రచారకగ్రంథమనిన్నీ ఎరిగివుండే బుద్ధిపూర్వకంగానే వ్రాసిన వ్రాత లిపి. మిల్లు వ్రాసిన సంగతులూ, టారెన్సు వ్రాసిన అంశాలూ ఆయనకు తెలియకపోలేదు. అవి ఎవరో నలుగురు చదవవచ్చును. ఇంగ్లీషు ప్రభుత్వంకింద పనిచేసే బడిపంతుళ్లూ, దొరల నాశ్రయించి తిరిగే విశ్వవిద్యాలయాధికారులు తన పుస్తకాన్నే పిల్లలచేత చదివిస్తారని స్మిత్తుగారి ధైర్యం. స్మిత్తుగారు దేశచరిత్ర రచనలో అధర్మానికి వెనుదియ్యనివారు. స్మిత్తుగారి అసత్యపు వ్రాతలు చదివిచదివి పట్టలేక ఒకమాటు నామిత్రులు బౌద్ధమహాయుగ గ్రంథకర్త యశఃకాయులు శ్రీ వేలూరి సత్యనారాయణగారు నాతో ఇలాగ అన్నారు. "ఈస్మిత్తు మనకు ఒక మహోపకారంచేశాడు. యథార్థ చరిత్రరచనకు సులభమైన మార్గం చూపించాడు. దీని కీలకం ఇది : ఇతడు వ్రాసిన అంశాలన్నీ మనం గ్రహించడమూ, ఇతడు అవునన్నది కాదనడమూ కాదన్నది అవుననడమూ-ఇంతే; సత్యచరిత్ర వ్రాసినట్లవుతుంది." ఈ సూత్రాన్ని అనుసరించి ముఖ్యంగా ఆంగ్లేయులను గురించి భారతీయులను గురించీ స్మిత్తువ్రాసిన వ్రాతలను సవరిస్తే తప్పకుండా యదార్థచరిత్ర తేలుతుందని నాకుకూడా తోచినది. కావలిస్తే మీరు కూడా చూడండి.

– *ఆంధ్రపత్రిక, 30.5.1943*



# క్షామదేవత ప్రళయతాండవం

**1943** స్వభానుసంవత్సరం నందన ధాతు నామసంవత్సరాలను తలదన్నింది. వంగదేశంలోను ఓఢ్రదేశంలోను, రాయలసీమలోను కని విని యెరగనట్టి ఘోరమైన దుర్భిక్షం ప్రారంభించింది. పాడిపంటలతో తులతూగుతూ బంగారుభూమియని ప్రసిద్ధిచెందిన గంగా బ్రహ్మపుత్రానదీ ముఖముల మధ్య ప్రదేశమే క్షామదేవత ప్రళయతాండవానికి ప్రధానరంగస్థలమై మహాశ్మశాన మైపోయింది. పంటలు మంట గలసినవి. పశువులు నశించినవి. ప్రజలు అన్నవస్త్రాలు లేక నిరాధారులైనారు. స్త్రీలు పురుషులు బాలురు బాలికలు ఆకటికమాడి జవసత్వాలు హరించి అస్థిపంజరాలై పక్షులలాగ రాలిపోతున్నారు. రాజాధిరాజులూ ప్రభుత్వాధికారులూ సంపన్నులూ వాసంచేసే కలకత్తా మహానగరానికి పోతే తాగడానికి గంజి అయినా దొరుకుతుందేమో అనే ఆశతో దురదృష్టవంతులైన రైతులు తమ ఆలుబిడ్డలతో కలకత్తామార్గం పట్టి పోవడం ప్రారంభించారు. దారిలో కొందరు జబ్బుపడి మరణించారు. కలకత్తాలో ధర్మాత్ములు కొందరు అన్నంపెట్టి గంజిపోసి ఈదిక్కులేని పక్షుల ప్రాణాలను కొన్నాళ్లు కాపాడారుగాని ఇలాగవచ్చే నిరాధారులసంఖ్య అమితమైపోయింది.

ఈ దుర్భిక్షంలో ఆకలిబాధవల్ల గ్రామాలలో రైతుకుటుంబాలు విచ్ఛిన్నం అయిపోయినవి. తల్లిదండ్రులు అన్నదమ్ములు అక్కచెల్లెళ్లు ఆలుబిడ్డలు అనే వివక్షతలేక ఒకరినొకరు విడనాడి ఎవరికి వారే యమునాతీరే అన్నట్లు ఎవరి ప్రాణాలు వారు కాపాడుకోవడానికి ప్రయత్నిస్తూ తిరుగుతున్నారు. ఇలాగ లెక్క లేనంతమంది దిక్కులేనివాళ్లు కలకత్తా చేరి నిలువనీడలేక తిన తిండిలేక ఆకలి బాధకు అల్లాడిపోతూ స్మృతి తప్పి పడిపోయేవరకూ తిరుగుతూ కలకత్తావీథులలో దుర్మరణాలు పొందడం ప్రారంభమైంది. ఈజనాన్ని గురించి ప్రభుత్వం వారు మొదట శ్రద్ధ పుచ్చుకోలేదు. దుర్మదరణాలసంఖ్య మితిమీరి కలకత్తా వీథులు చచ్చేవాళ్లతోనూ చచ్చినవాళ్లతోనూ నిండడం ప్రారంభమైన తరవాత కొన్ని కట్టుబాట్లు చెయ్యడానికి ప్రయత్నించారు. అప్పటికే పరిస్థితులు దుర్భరము లైపోయినవి. వ్యవహారం శ్రుతిదప్పి రాగాన్న పడింది. రాజబాటల ప్రక్క చచ్చిపడివున్న

శవాలను తీయించే కార్యమే ఒక పెద్దసమస్య అయిపోయింది. బాటల ప్రక్క స్మృతి తప్పి పడి చావడానికి సిద్ధంగా వున్నవాళ్లను ఆసుపత్రులకు చేర్చడం ప్రారంభించారు. కొన్ని చోట్ల గంజిసత్రాలు పెట్టించారు. మహాసముద్రంలో కాకిరెట్టలాగ ఈ ప్రయత్నాలు ఏమూలకి చాలుతాయి? వందలకొద్ది దుర్మరణాలు పొందుతున్నారు. అంతట ఈ జనాన్ని పట్టుకొని ఎవరి గ్రామాలకువవారిని పంపివేసేపద్ధతిని ప్రారంభించారు. కలకత్తాలో చచ్చేవాళ్ల సంఖ్యతగ్గినట్లు కనపడినా అసలు దుర్మరణాల సంఖ్య ఎలా తగ్గుతుంది? ఆకలిబాదకు అంటు జాడ్యాలు తోడై దేశాన్ని తుడిచిపెడుతున్నాయి. దేశమంతా మహాశ్మశానంగా మారిపోయింది. ఐదునెలలో పదిలక్షలమంది చచ్చిపోయారని ఇండియారాజ్యాంగ కార్యదర్శియైన ఆ మెరీగారే ఆఖరికి చెప్పారు. ఇది కాకులలెక్కను బట్టి చెప్పినమాట. 1943 అంతమునాటికి 20 లక్షలమందికి పైగా చనిపోయారని లివర్‌హోమ్ పత్రిక 1944 ఏప్రిల్‌లో ప్రచురించారు. 30 లక్షల మంది మరణించినట్లు ఇంగ్లీషు పత్రికలు వ్రాసినవి. ఇంకా ఎక్కువమందే చనిపోయినట్లు కనబడుతున్నది. ఈ విశాల దేశములో మామూలు రోజులలోనే ఏ మూల ఏమి జరుగుతూవుందో తెలియడం కష్టం. అందులో ఈ మహాసంక్షోభంలో మారుమూల గ్రామాలలో ఎంతమంది ప్రజలు ఎన్నివిధాలుగా బాధలుపడి దుర్మరణాలు పొందుతున్నారో తెలియడం అసలేకష్టం. రాజకీయాలతో సంబంధం లేకుండా కేవలమూ ప్రజాసేవకోసమే తమజీవితాలు ధారపోస్తూవున్న ధర్మాత్ములు కొందరు వంగదేశానికి పోయి అక్కడి పరిస్థితులు చూసి దేశంలోపలి భాగంలోగ్రామాలలోని దుఃస్థితి వర్ణనాతీతంగా ఉన్నదని గుండెలు బాదుకొని చెప్పారు.

## అటు యుద్ధమూ - ఇటు కఱువూ

విరాట్‌పురుషుని దంష్ట్రలలో చిక్కుకుని నశిస్తూవున్న మహా అక్షౌహిణులలాగ ఈదుర్భిక్షంలో చిక్కుకుని అనేక విధాలుగా బాధరలుపడుతూ దుర్మరణాలు పొందుతూ వున్న ఈ దిక్కులేని జనాన్ని రక్షించాలంటే వారికి ఎన్నో విధాలైన సహాయాలు చెయ్యాలి. వాళ్లకు ఆరోగ్యం కలిగించాలంటే దేశంలో వున్న మందులన్నీ వాళ్లకోసం వినియోగించాలి. దేశంలో వున్న వైద్యులందరూ వాళ్లచికిత్సకోసం పాటుపడాలి. దేశంలో వున్న అన్నవస్త్రాలన్నీ వాళ్లకోసం వినియోగించాలి. ప్రజలూ ప్రభుత్వముకూడా ఇందుకోసం నడుముగట్టి తమ సర్వశక్తులూ ఇందుకోసం ఉపయోగించాలి. ఇందుకోసం అమితమైన ధనము సాధనసామగ్రి చాలామంది సేవకపరివారము కావాలి. కఱవులో అధికమాసం అన్నట్లు



మన దురదృష్టవశంవల్ల అటు యుద్ధమూ ఇటు కఱువూను. అన్ని చిక్కులూ ఒక్కమాటే వచ్చిపడ్డాయి. దేశంలో వున్న ధనము సాధన సామగ్రి సేవకపరివారము యావత్తూ ఇప్పుడు జరుగుతూవున్న యుద్ధానికే కావలసి వచ్చింది. దేశంలో మామూలుగా వచ్చే చలిజ్వరాల నివారించడానికే క్వైనా చాలటంలేదు. సామాన్యసంసారులకే అన్నవస్త్రాలకు లోపమైంది. ఇంక ఈ మహాదుర్భిక్షంలో ఆకలిబాధకు రోగాలకు లోనైన అసంఖ్యాకమైన దరిద్రనారాయణుని స్వరూపాలకు ఎక్కడనుంచి వస్తాయి ఈసదుపాయాలన్నీ?

## మనకిది కొత్తకాదు

వంగరాష్ట్రప్రజలను పీల్చిపిప్పిచేస్తూ వున్న యీఘోరమైన దుర్భిక్షంయొక్క స్వరూపస్వభావాలు బయటి ప్రజలకింకా పూర్తిగా తెలిసే అవకాశాలు కలగలేదు. ఈక్షామదేవత నోట్లోనించి దేశమెప్పుడు వెలువడుతుందో చెప్పడానికి వీలులేదు. వంగదేశప్రజలు రాజకీయ పరిజ్ఞానము కలవారైనందువల్ల వార్తాపత్రికలద్వారానూ ప్రజానాయకుల ద్వారానూ అక్కడి పరిస్థితులు కొంతవరకైనా లోకానికి తెలియడానికి అవకాశం కలిగింది గాని ఓఢ్రదేశంలో ప్రజలు నోరు లేనివారైనందువల్ల వారు పడే బాధలను గురించి ప్రపంచానికి చాలాకాలంవరకూ తెలియనేలేదు. ఇటీవల అఖిల భారత హరిజన సేవాసంఘ కార్యదర్శియైన శ్రీతక్కరు బాబాగారు మొదలైన దేశనాయకులు కార్యాంతరంమీద ఓఢ్రదేశంలో సంచారం చేసినందువల్ల అక్కడి ఘోరమైన పరిస్థితులు బయల్పడడానికి అవకాశం కలిగింది. ఉత్కలరాష్ట్రంలో ప్రజలు కఱవులో పడుతూవున్న బాధలు వంగరాష్ట్రం ప్రజలబాధల కేవిధంగానూ తీసికట్టుగా లేవనే సంగతి మెల్లమెల్లగా తెలుస్తూవుంది. ఇక రాయలసీమలో కరవులో చిక్కుకున్న ఆంధ్రప్రజల బాధలను గురించికూడా ఇటీవల మనంకొద్దికొద్దిగా తెలుసుకో గలిగినాము.

భారతదేశానికి క్షామ దేవత ప్రళయ తాండవం కొత్తకాదు. దేశంలో సకల సంపదలూ కలిగివున్నా జనసామాన్యము గర్భదరిద్రులుగా వుండి అన్నవస్త్రాలులేక ఆకలితో సదాబాధపడుతూనే వుంటారు. దేశంలో అప్పుడప్పుడు దుర్భిక్షం కలుగుతూనేవుంటుంది. ఒక్కొక్కప్పుడు పెద్దకాటకము సంభవిస్తూ అసంఖ్యాకమైన జనులు పక్షులలాగ రాలిపోతూనే వుంటారు. ఇది మనదేశంలో సర్వసాధారణమైపోయింది. అందువల్ల ప్రభుత్వానికీ ప్రజలకుకూడా గుండెలు రాయిగా మారి దుర్భిక్షంలో సంతర్పణలు సమారాధనలు అల్పాహారవిందులు సాగుతూనేవుంటవి.

## నందన సంవత్సరం కఱవులోకూడా ఇదే వరస

మన తెలుగు జిల్లాలలో మొన్నమొన్నటి వరకూ పెద్దవాళ్లందరూ తమవయస్సు చెప్పవచ్చినా మరేసంగతి చెప్పవలసివచ్చినా నందననామసంవత్సరం కరువుకి ఇన్నేళ్లని గాని దాని కింతకాలానికి పూర్వమనిగాని తరవాత అనిగానిచెప్తూవుండేవారు. ఆ తరంవాళ్లు చాలామట్టుకు చనిపోయారు. మనదేశంలో ఇంత పెద్దకాటకం ఎన్నడూ రాలేదని పెద్దలంటారు. అందువల్లనే దీనిని "పెద్దకఱవు" అని కూడా అంటారు అప్పట్లో గుంటూరు జిల్లాలో చేరిన ఒంగోలు నుంచి మచిలీబందరు దాకా మార్గమంతా పీనుగుల పెంటతోను, ఎముకలపోగులతోనూ నిండిపోయింది. గోదావరిజిల్లానుంచి చెన్నపట్నం దాకా రాజబాటకూడా శవాలతోనిండింది. దీనికి "గుంటూరు కఱవు" అనికూడా పేరు వచ్చింది.

ఇది ఉత్తరసర్కారు జిల్లాలలోనూ, ముఖ్యంగా గుంటూరు జిల్లలోనూ అతి దారుణంగా వుండి చెన్నపట్నానికి కూడా వ్యాపించింది. 38 వేల చతురపు మైళ్లలో 50 లక్షల జనము ఈ కరవులో చిక్కుకుని దుర్భరమైన బాధలను అనుభవించారు. ఇటీవల వంగరాష్ట్రం కరువులోలాగనే అప్పుడుకూడా ఆ కఱవుయొక్క తీవ్రస్వభావాన్ని తూర్పు ఇండియా కంపెనీ ప్రభుత్వంవారు మొదట గ్రహించలేకపోయారు. అందువల్ల వెంటనే దీనిని నివారించడానికి తగిన ప్రయత్నాలు జరపలేదు. చివరకు మేలుకునేటప్పటికి దానిని ఆపడానికి అశక్యమైపోయింది. అసంఖ్యాకమైన జనం మరణించారు. గ్రామాలజన మంతా పట్నాలకు చేరారు. అక్కడ వీళ్లకు అన్నము పెట్టడమూ గంజి పోయడమే కష్టసాధ్యమైపోయింది. వాళ్లకు నిలువ నీడగాని కట్టగుడ్డగాని రోగనివారణకు ఔషధాలుగాని ఇచ్చి బాధనివర్తి చెయ్యడానికి శక్యమైంది కాదు. ఈపనులను ఆ ప్రభుత్వం చెయ్యలేక పోయింది. ఒక్క గుంటూరుజిల్లలోనే ఐదులక్షలమంది జనసంఖ్యలో రెండులక్షల మంది చచ్చిపోయారు. ఈదుర్భిక్షం చెన్నపట్నం రాజధానికి దగ్గిరగా వున్న బొంబాయిరాష్ట్ర భాగాలకూ, మైసూరు హైదరాబాదు రాష్ట్రాలకూ కూడా తగిలింది.

క్రీ.శ. 1833వ సంవత్సరములో వచ్చిన నందనామ సంవత్సరానికి పూర్వంకొన్ని యేళ్లనుంచీ మనదేశంలో పంటలు సరిగ్గా పండడంలేదు. 1831లో అపరిమితమైన వర్షాలు కురిసి దేశానికి అతివృష్టి దోషం కలిగి పంటలు పోయినవి. 1832 మే నెలలో ఒక గొప్ప ఉప్పెన గాలివచ్చి పాడిపంటలను నాశనంచేసింది. ఆ సమయంలోనష్టమైన పశువులకు లెక్కలేదు. దక్షిణాపథంలో పడమటిభాగంలో వర్షాలు లేక కృష్ణాగోదావరులలో నీరురాలేదు. ప్రారంభంలో కాస్త కొత్తనీరు తగిలేటప్పటికి రైతులు ఆశపడి సాగు ప్రారంభించారుగాని మళ్లీ నీరురానందువల్ల పైర్లు ఎండిపోయినవి. 1833వసంవత్సరం ప్రారంభంనుంచీ దేశంలో దుర్భిక్షం క్రమక్రమంగా వృద్ధి అయింది. బీదజనులూ కూలీజనమూ తిండిలేక అల్లాడిపోతున్నారు. ఇది చూసి సంపన్నులు అన్నదానం చెయ్యడం ప్రారంభించారుగాని ఎన్నాళ్లు చెయ్యలుగుతారు?



ఈకాటకం అంతతీవ్రంగా లేనిగోదవరి జిల్లాలోని సంగతులు చూస్తేనే ఇది ఎంత ఘోరమైన క్షామమో తెలుస్తుంది. దేశంలో దుర్భిక్షం ప్రబలుఉతూవుండగా ధర్మాత్ములైన సంపన్నులు చేసిన సహాయంవల్ల కలెక్టరు క్రాలీదొర మార్చినెలనుంచి జూలైనెలదాకా రోజుకు ఐదువేల మంది బీదవాళ్లకి అన్నం పెట్టించగలిగాడు గాని పరిస్థితులు దుర్భరము లైపోయినవి. ఆడవాళ్లకూ పిల్లలకూ తగిన సహాయం లేక దుర్మరణాలు హెచ్చినవి. ప్రభుత్వంవారి సహాయం అడగకుండానే ఇంతవరకూ జరుపుకువచ్చినామనిన్నీ, ఇంక ఇది జరగడం దుస్తరమనిన్నీ ఆడవాళ్లకూ, పిల్లలకూ సహాయం చెయ్యడానికి ఆరువందల రూపాయిలుగాని ఎనిమిదివందల రూపాయిలుగాని మంజూరుచేస్తేనేగాని వీలు లేదనిన్నీ ప్రభుత్వంవారికి వ్రాశాడు.

## చెన్నపట్నానికి వలస

ప్రజలు ఈ కాటకంలో బాధలు పడలేక మెల్లిమెల్లిగా ఒక జిల్లానుంచి ఇంకొక జిల్లాకు పోవడానికి తమ బిడ్డపాపలను, ముసలివాళ్లని వెంటపెట్టుకొని మోయగలిగిన సామానుతీసుకొని బైలుదేరారు. ఇంగ్లీషు ప్రభుత్వం వారి రాజధానియైన చెన్నపట్నంలో అన్నం దొరుకుతుందనే ఆశతో రాజబాటను పడిపోవడం ప్రారంభించారు. దారిలో తిండిలేక మాడుతూ సొమ్మసిల్లి కొందరూ, రోగాలు వచ్చి కొందరూ బాటమీదనే స్మృతితప్పి పడిపోయేవారు. చాలామంది మరణించారు. ఆ రాజబాటమీద పడివున్న అస్థిపంజరాలలో జీవచ్ఛవా లెన్నో శవాలెన్నో గుర్తించడం కూడా కష్టమైపోయింది. చచ్చిన శవాలను ఆబాటపక్కనే పూడ్చేవారు. కొన్ని శవాలను పూడ్చేదిక్కు లేక కుళ్లి దుర్గంధం కొడుతూవుండేవి. చెప్పపట్నందాకా ఆరాజబాట అంతా ఒక మహాశ్మశాన మైపోయింది. ఈ దుఃస్థితిలో హైదరాబాదునుంచి కొందరు వ్యాపారులు వచ్చి ఈ దిక్కులేనివారి ఆడపిల్లలను డబ్బిచ్చి కొనుక్కునిపోయేవారు.

## క్షామ నివారణకోసం కూలిపని

ఈ కఱవులో ప్రభుత్వంవారివల్ల సహాయం పొందగోరినవారు క్షామనివారణకోసం ప్రభుత్వంవారు తలపెట్టిన చెరువులు తవ్వడము మొదలైనపనులు చెయ్యాలనే ఒకనిబంధన

అమలులో పెట్టారు. ఇలాంటి కూలీపని చెయ్యడం ఉన్నతకులాలవారికి అలవాటులేదు. పైగా ఇది పరువుతక్కువ. అందువల్ల ఈకూలిపనిచేసేదానికంటె తిండిలేక మాడి చచ్చిపోవడమే మెరుగని కొంతమంది ఈ పనులు చెయ్యడానికి అంగీకరించలేదు. కొందరు ప్రాణాలమీద తీపివల్ల ఈ హైన్యానికిలోబడ్డారు. గొప్పయింటి పురుషులూ, ఎన్నడూ ఇల్లు వెడలియెరుగని సుకుమారలగు స్త్రీలుకూడా తట్టనెత్తినపెట్టుకుని కూలీమేస్త్రీల అజమాయిషీకింద చెర్వులు తవ్వడం మొదలైన మోటుపనులలో కష్టపడుతూ వుండే విపరీతస్థితి తటస్థించింది. కొందరీ నీచానికి ఒడంబడక ఆకలికి మాడుతూ చచ్చిపోయేవారు.

## జీవిత పద్ధతిలో మార్పులు

ఆకలిబాధవల్ల ప్రజలు ధర్మాధర్మాలు విడనాడి ఇది నాసొత్తు, ఇది పరుని సొత్తు అనే విచక్షణలేక ప్రవర్తించారు. ఒక చోటినుంచి ఇంకొకచోటికి ధాన్యం రవాణా చెయ్యవలసివస్తే ఆయుధపాణులైన శిపాయీలనకూడా పంపవలసివచ్చేది. ధాన్యవర్తకులు వస్తూన్నారనే వార్తతెలియగానే గ్రామస్థులు దాన్ని లాక్కునిపోవాలని వచ్చిపడేవారు. సిపాయీలను చూసి గుటకలు మ్రింగేవారు. గ్రామాలలో సామాన్య నిత్యజీవన విధానముగూడా మారిపోయింది. మొగవాళ్లందరూ పగలల్లా తినడానికి కేమైనా దొరుకుతుందేమోనని బాటలవెంట తిరుగుతూ ఎంత అపరిశుద్ధమైన పదార్థం దొరికినా ఏరుకుని తినేవారు. రాత్రిళ్లు ఆడవాళ్లు గ్రామభావికి వెళ్లి ఎంతో కష్టపడి ఒక్కొక్క చుక్క చొప్పున నీరు పట్టుకుని వచ్చేవారు.

ఈ దుస్థితినంతా చూసిన ఒక పాశ్చాత్యుడు ఇలాగ వ్రాశాడు. "ఇంతకాలం ఇంతటి ఓర్పుతోను నెమ్మదితోనూ ఇలాంటి ఘోరమైన విపత్తను ఈ ప్రజలు అనుభవించడము చాలా ఆశ్చర్యకరమైన సంగతి. నానాటికి జవసత్వాలను హరించి శుష్కింపజేసే ఘోరక్షామములో దుర్భరమైన ఆకలిబాధ సహిస్తూ నీరు, మేత లేక తమపశువులన్నీ పొలాలలో చచ్చిపోతూవుంటే తమ తాతముత్తాతలనాటినుంచీ ప్రాణప్రదంగా దాచుకున్న చిల్లరమల్లర వెండిబంగారు వస్తువుల నమ్ముకుని నిరాధారులై, తిండిలేక అల్లాడుతూవున్న పిల్లలయేడ్పులు వింటూకూడా ఈప్రజలు దొరతనమువారిమీద తిరగుబాటు చెయ్యక వారినే నమ్ముకుని వుండడము అత్యంతాశ్చర్యకరమైన విషయము." అని 1874వ సంవత్సరము జనవరి నెలలో లండన్ టైమ్సు పత్రికలో ఒక జాబును వ్రాశాడు.

(A Descriptive and Historical Account of Godavari District by Henry Morris (1878) pp 288-290)





## మద్రాస్ ప్రెసిడెన్సీ

1653లో చెన్నపట్నం ఏజెన్సీని బాంటం ప్రెసిడెన్సీ కిందనుంచి విడదీసి ప్రెసిడెన్సీ అనే ఒక స్వతంత్రవర్తక స్థానంగా చేశారు. ఈ వర్తకస్థానం వ్యవహారాలను చక్కబెట్టడానికి ఒక కార్యలోచన సంఘమునూ దానికి ప్రెసిడెంటు అనే అధ్యక్షుణ్ణి ఒకడినిన్నీ నియమించారు. ఈ ప్రెసిడెంటూ ఈ కార్యాలోచనసంఘమూ కలిసి ఈ ప్రెసిడెన్సీ అనే వర్తకస్థానం యొక్క వ్యవహారాలను చక్కబెట్టడం ప్రారంభించారు. 1654లో చెన్నపట్నం రాజధాని సిబ్బందిని ఇద్దరు ఫ్యాక్టర్లనే తెల్లగుమస్తాలు, పదిమంది తెల్లసైనికులు మాత్రం వుండేటట్లు తగ్గించవలసిన దని కంపెనీవారు ఉత్తర్వుచేశారు. 1670 వరకూ చెన్నపట్నం వ్యాపార వ్యవహారాలు అంతబాగాలేవు. తరువాత ఈ ప్రాంతాలవ్యాపారం బాగా అభివృద్ధి అయింది. చెన్నపట్నంలో ఇంగ్లీషువారు కట్టినకోటకు వర్తకస్థానానికీ కలిపి సాలుకు రు1200 వరహాల చొప్పున గోలకొండ నవాబుగారి కిచ్చేటట్లు ఇంగ్లీషువర్తక సంఘంవారు ఏర్పాటు చేసుకున్నారు. కవున్సిలు అనే ఆలోచన సభలో గవర్నరుగాక ముగ్గురు సభ్యులు. అందులో గవర్నరే మొదటి సభ్యుడు.

గవర్నరు సాలుకు 300 పౌనులు (నవరసులు) జీతం.

రెండవసభ్యుడికి సాలుకు 100 పౌనులు.

మూడవసభ్యుడికి సాలుకు 70 పౌనులు.

నాలుగవ సభ్యుడికి సాలుకు 50 పౌనులు.

వీళ్లను "మర్చెంటు్సు" అనేవారు వీళ్లకింద "ఫ్యాక్టరు" లుండేవారు. వీరికి సాలుకు 20 మొదలు 40 పౌనులు జీతం. రైటర్లు అనే గుమస్తాలకు పదిపౌనులు. 'అప్రెంటీసు' అనే ఉమేదువారులకు సాలుకు 5 పౌనులు పదిమంది తెల్లసౌనికులు. 20 మంది నేటీవులు అనే దేశీయసిపాయీలు వుండేవారు. తరవాత ఈనేటీవు కాపలాజవానులు పెద్ద నాయకుడికింద పనిచేసేవారు.

## చెన్నపట్నం చుట్టుపట్ల గ్రామాలు

ఔరంగజేబు చక్రవర్తి 1687లో గోలకొండరాజ్యాన్ని జయించి కర్నాటకాన్ని జయించడానికి తనసేనాధిపతి అయిన జుల్ ఫికరుఖానుకు పంపించాడు. అంతట చెన్నపట్నం పరిసరాలన్నీ మొగలాయీ చక్రవర్తి గారి రాజ్యంలో చేరినాయి. ఔరంగజేబు జుల్ఫికరుఖానుకు కర్నాటకనవాబు అనే బిరుదాన్ని 1692లో ప్రసాదించాడు. ఇంగ్లీషువారు

మెల్లగా జుల్ఫికరుకానునీ, చక్రవర్తిగారి వజీరునూ, ఆశ్రయించి తమ వర్తకస్థానానికి మళ్లీ పట్టాపొందారు. అంతే గాక చెన్నపట్నానికి అంటివున్న ఎగ్మూరు, పొరశవాకము, తండయారువేడు, తిరువలిక్కేణి అనే గ్రామాలకుకూడా 1693లో పట్టాపొందారు. కార్నటకనవాబుకు లంచములిచ్చి నజరానా లిచ్చి, ఇంకా కొన్ని సౌకర్యాలు సంపాదించారు.

చెన్నపట్నం దగ్గిర వున్న తిరువత్తియ్యూరు కత్తివాకము నుంగంబాకము వ్యాపార్పడి నత్తెనగాడు అనే ఆ అయిదు గ్రామాలనుకడా సంపాదిస్తే తమ వ్యాపారానికి చాలా వీలుగా వుంటుందని తోచి వాటిని కౌలుకిప్పించవలసిందని కంపెనీవారు దరఖాస్తు పెట్టుకున్నారు అంతలో ఔరంగజేబుచక్రవర్తి 1707లో మరణించాడు. చెన్నపట్టణము చుట్టునున్న చిన్నచిన్న గ్రామములే పేటలుగా మారినవి. అందులో తెలుగువారే ప్రముఖులుగా నుండేవారు. ఎలిఫెంట్ గేటును ఏనుగు గేటని అనుచుండిరి. అందులో జనపసెట్టులు, గొల్లవారు కాపురముండిరి. పోరశవాకములో కమ్మవారుండిరి. వ్యాపరపాడులో కొల్లవారు, నీలంవారు, పరచూరు వారి కుటుంబములుండెను. కీలుపాకలు ఎళంబూరులో 'తెలుగు నాయళ్ళు' కుటుంబాల వారుండిరి. సత్రపాలము వారికి చాల భూములుండెను. నుంగంబాకం అసలుపేరు లింగలపాకము. ఇందులో కాసీసెట్టివారి కుటుంబాములుండెను. తెలుగు బ్రాహ్మణుల కుటుంబములైన దొడ్లవారు, నోరి వారుండిరి. చెట్‌పేట్ చేతిపెట్టు అనుచుండిరి.

## మద్రాసు గవర్నరు మొగలాయీ చక్రవర్తిగారి మంత్రికి వ్రాసుకున్న మనవి

చెన్నపట్నం వర్తకస్థానానికి గవర్నరు గా వచ్చిన తామస్ పిట్టుగారు ఆ ప్రాంతాల పరిపాలకుడైన కర్నాటక నవాబుగారికి నజరులు చెల్లించి మెప్పించలేక ఆఖరికి చక్రవర్తిగారి దర్బారులోని అధికారులనే ఆశ్రయిస్తే లాభం కలుగుతుందని ఆలోచించి షాఅలం చక్రవర్తిగారి రాజనగరు వ్యవహారాలను చూసే (Lord High Steward of the House-Hold) అంతరంగిక మంత్రియైన "జూడీ ఖాన్' గారికి అతినమ్రతతోను భయభక్తులతోను 1708వ సం॥ జనవరు 5వ తేదీన ఒక వుత్తరం వ్రాసుకున్నాడు. అందులో మొగలాయీ ప్రభువుల గొప్పదనాన్ని ఆకాశాన్ని అంటేటట్లు పొగడి ఇంగ్లీషు వర్తకం కంపెనీవారి దైన్యస్థితినిగురించి విన్నవించుకుని తమ కిప్పించవలసిందని దరఖాస్తు పెట్టుకున్న గ్రామాలకు పట్టాయిప్పిస్తేనే గాని తాము బ్రదకలేమని మనవిచేసుకున్నాడు.

పైసంగతులు వ్రాసుకున్న తరవాత జూడీఖాన్ గారిని ఉబ్బించడానికి యీకింది



విధముగా వ్రాశాడు. "ఏతినవారు గోలకొండకు దయచేసినప్పుడు తమ రూపపటాన్ని నాకుపంపించవలసినదని మరిమరీ వేడుకుంటున్నాను. దానిని నేను సీమకు పంపించి ప్రపంచంలోకల్లా అతిచతురుడైన చిత్రకారునిచేత వ్రాయించి తెప్పించుకుంటాను. ఇంతేగాక తమ విగ్రహాన్ని చలువరాతితో తయారు చేయించి ఈ ప్రాంతాలలో ప్రజలందరూ సుఖంగా జీవించడానికి కారణభుతులైన తమఖ్యాతి ప్రపంచానికంతా తెలిసేటట్లు మీచరిత్రను దానికింద చెక్కిస్తాను."అంతట కంపెనీవారు కోరిన గ్రామాలను కౌలుకివ్వడానికి అంగీకరిస్తూ 1708లో నజీరుగారే స్వయంగా జవాబు వ్రాశారు. మొగలాయీ చక్రవర్తి గారి దర్బారువారికి కంపెనీ వారింకా నజరులు చెల్లించలేదనే సంగతిని నజీరుగారు పిట్టుగారికి జ్ఞాపకంచేస్తూ తమ కిష్టమైన బహుమతుల జాబితానుకూడా ఆవుత్తరంతో జతపరిచారు. అందుకు జవాబుగా పిట్టుగారిలాగ విన్నవించుకున్నారు. "దర్బారులో రాజకుమారులందరికిన్నీ ఇంకా గొప్పగొప్ప ఉమ్రావులకున్నూ కూడా బహుమతులు పంపించాలని ప్రభువులవారు వ్రాయించినారు. వారివారి గొప్పదనాన్ని బట్టి పంపాలంటే మాకంపెనీవారి ఆస్తిఅంతా అముకున్నా అది సాధ్యంకాదు. మా కంపెనీవారు సామాన్యవర్తకులనిన్నీ ఏదో కాస్త లాభంకోసం చాలా తెగింపు చేస్తూ లాభాలు రాకపోగా నష్టాలు కూడా అనుభవిస్తుంటారనిన్నీ తమరు ఎరుగని విషయం కాదు. కాబట్టి మేము సమర్పించు కోదలచిన బహుమతులు తమ దర్జానుబట్టి గాక మాతాహతును బట్టి యిచ్చు కుంటామని చక్రవర్తిగారి దివ్యచిత్తానికి తేవలెను. చక్రవర్తిగారున్నూ రాజకుమారులున్నూ మాయందు దయ యుంచి వాటిని అదృష్టితోనే స్వీకరిస్తారని నమ్ముతున్నాను" అని చాలావినయంతో వ్రాశాడు. (దీనివివరములకు వజ్రాల పిట్టు అనే శీర్షికతో ఆంధ్రవారపత్రిక 26-9-43 తేదీలగాయతూ మూడు సంచికలలో ప్రకటింపబడిన కథను చూడవచ్చును.)

1806-1807 సంవత్సరాలలో చెన్నపట్నంలోనూ చుట్టుపట్ల జిల్లాలలోనూ గింజకఱవు వచ్చినప్పుడు చెన్నపట్నంలో నల్లవారు కాపురం వుండే ప్రసుతతం జార్జి టవును అని పిలువబడే బ్లాక్‌టవును (నల్లవారిబస్తీ)లో బీదలు, సామాన్యసంసారులూ తిండిలేక మాడిపోవడంచూసి బీదలకు అన్నవస్త్రాలిచ్చి కాపాడడానికి ప్రజలు చందాలు వేసుకుని 'మణేగారు' సత్రం అనే ఒక ధర్మసత్రాన్ని స్థాపించారు. దీనికి 11 మంది దొరలనూ, 9 మంది దేశీయులనూ ధర్మకర్తలుగా నియమించారు. దీనికి ఇంగ్లీషుకంపెనీ గవర్నమెంటువారు కూడా సహాయంచేశారు. అందులో రోజుకు 4050 మందికిఅన్న ప్రదానం చేసేవారు. "నేటీవ్‌పూర్ ఫండ్ కమిటీ" అనే సంఘం ఒకటి యేర్పడి క్షామనివారణకోసం చందాలు వసూలు చేయడం ప్రారంభించారు. దీనికి అప్పట్లో

చెన్నపట్నం గవర్నరుగా వున్న విలియం డెంటింకుగారు ప్రాపకుడు (పేట్రన్)గా వున్నారు. చెన్నపట్నంలో ఉచితంగా అన్నం దొరుకుతుందని ఇతర జిల్లాలలనుంచి గ్రామజనులు శరపరంపరలుగా రావడం ప్రారంభించారు. ఇది ఒక పెద్దసమస్య అయిపోయింది. దీనికి పరిష్కరించడం ఎలాగా అని ఆలోచించారు. కొంద రీజనంచేత ఏదో పని చేయించి అన్నం పెట్టమని సలహా యిచ్చారు[1,2]. ధాన్యానికి కంట్రోలు పెట్టారు. ఈ కాటకంలో ప్రజలు చాలా బాధలుపడ్డారు. 1824-1825 మధ్య మళ్లి దారుణమైన ఖరవు వచ్చింది. ఇది చాలా చోట్లకి వ్యాపించింది. చెన్నపట్నంలోకూడా దుర్భిక్షం దుర్భరమైంది. ధాన్యం కరవై పోగా ధాన్యపుకొట్లను కొందరు ఆతతాయులు లూటీచేశారు. అప్పుడు జరగిన ల్లరులను అణచడానికి పోలీసు వారు తుపాకీలు కాల్చవలసివచ్చింది. కఱవులో బాధపడి మరణించినవారి సంఖ్య ఎక్కువ అయింది. అంతట మణేగారు సత్రాధికారుల కమిటీవారు గవర్నమెంటువారి సహాయంతో నాలుగు 'డిపోలు' తెరచి వేలకొద్ది ప్రజలకు అన్నప్రదానం చేశారు.

నందనామసంవత్సరం (1833)లో వచ్చిన పెద్దకఱవులో చెన్నపట్నంలో క్షామనివారణకోసం జరిగిన ప్రయత్నంలో మణేగారుసత్రం కమిటీవారు చేసిన సేవచాలా గొప్పది. అధర్మకర్తలకమిటీలో వెంబాకం రాఘవాచార్యులుగారు, కోమలేశ్వరపురం శ్రీనివాసిపిళ్లగారు మొదలైన పురప్రముఖులుండేవారు.

## నందనసంవత్సరపు క్షామనివారణ ప్రయత్నాలు

ఈ నందననామ సంవత్సరపు కఱవులో చెన్నపట్నం మణేగారుసత్రంలో రోజుకు పదిహేనువందల మందికి అన్నప్రదానం చేసేవారు. 1833వ సంవత్సరం మే నెలాఖరునాటికి ఇలాగ అన్నానికి వచ్చేవారి సంఖ్య రోజుకు పన్నెండు వేలకు పెరిగింది. జూన్ నెలలో 33వేల మంది అన్నంకోసం అల్లాడుతూ వుండేవారు. అంతట సత్రం కమిటీవారు ఏమిచేద్దామా అని ఆలోచించి 17 వేలమందికి పనిచెప్పి అన్నం పెడుతూ వచ్చారు. క్షామం అతితీవ్రం కాగా ఆగష్టు 19వ తేదీన చెన్నపట్నం బస్తీలోధాన్యం కొట్లులూటీ జరిగింది. చెన్నపట్నంలో అన్నం పెడుతున్నారనే సంగతి తెలిసి చుట్టుపట్ల వూళ్లనుంచీ, దూరపుకిల్లాలనుంచీ కూడా లెక్కలేనంతమంది చెన్నపట్నానికి వచ్చారు. దుఃస్థితి హెచ్చిపోయింది. ఉత్తర జిల్లాలనుంచీ ఇలాగ వచ్చిన జనాన్ని మళ్లీ వాళ్లవూళ్లకు పంపడం చాలా కష్టమైపోయింది. చెన్నపట్నం సుప్రీముకోర్టులో ఇంటర్ ప్రిటరుగా వుండిన ఏనుగుల వీరాస్వామయ్యగారు ఆ సమయంలో చేసిన సేవనుగురించి వారి జీవితచరిత్రను



వ్రాసిన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారు ఇలాగ వ్రాశారు. "నందనసంవత్సరపు క్షామంలో నేను కొంత ధాన్యసంగ్రహము చేసివుంచడము మేలని చెప్పినందుకు అయ్యవారు 'మనము ధాన్యము సంగ్రహించి మనము మట్టుకు భుజించి అన్నాతురులై దుఃఖపడే పేదలను చూచుచు జీవించుట నిష్ప్రయోజనము గనుక తన ప్రయోజనమునకు గాను విస్తరించి జాగ్రత్తపెట్టుకొనరాదని చెప్పి ఆదుర్భిక్షములో శక్తివంచనలేకుండాతాను అన్నప్రదానము చేయుచు యితరులను స్వప్రయోజనమునకు అనుసరించేలాగు అనుసరించి వారినిన్నీ పేదలపోషణవిషయమై ప్రవర్తింపజేయుచు, ఆలాగు ప్రవర్తించిన వారిని తాను మిక్కిలీ కొనియాడి సంతోషపెట్టుచు వచ్చిరి. అందువల్ల మరికొందరున్ను అన్నదానమందు ప్రవర్తింపుచూ వచ్చిరి. మరిన్నీ 'గంజిదొడ్డి" యనే అన్నసత్రములో గవర్నమెంటువారు అపారధనమును బీదల అన్న ప్రదానము విషయమై ఖర్చుచేసినప్పుడు అయ్యవారు ఆధర్మవిచారణ ప్రభువులలో తాను నొక్కడుగానుండి పేదలకు సకాలములో విమర్శగా అన్నమును అందజేసేకొరకై పడిన శ్రమ చెప్పశక్యముకాదు. అది యేలాగంటే 1000, 2000 తూములు బియ్యమును ప్రతిదినమునున పాకముచేయించి తన దృష్టిపథములో పేదలను శ్రమపడనీయకుండా రెండుజాములకు లోగానే అన్నమంతయు వినియోగపరచుచు వచ్చిరి. మరిన్నీ తన బుద్ధిశక్తిని యావత్తున్ను రాత్రిన్ని పగులున్ను ఆకార్యము విషయమై వాడుచు వచ్చిరి." అని శ్రీకోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారు ఏనుగుల వీరాస్వామయ్యగారి జీవితములో వ్రాసియున్నారు. (చూడు : ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్ర (1838) మూడవముద్రణము పుటలు 6-7).

– ఆంధ్రపత్రిక – ***12.3.1944, 19.3.1944***



1. Mannual of Administrative in the Presidency of Madras by C.D.Maclean Vol.I, p 299.

2. Article on Famines in the city of Madras by Dr. B.V.Narayanaswami Naidu. The Madras Tercentinans Commemoration Volume.

# ఇంగ్లీషు దొరతనము యొక్క ప్రత్యక్ష ఫలితాలు

దేశమంటే మట్టికాదోయ్, మనుష్యులోయ్" అన్నాడు నవ్యాంధ్రసాహిత్య వాగనుశాసనుడు. దేశచరిత్ర విషయంలోకూడా యీ సంగతి వర్తిస్తుంది. దేశచరిత్ర అంటే రాజులయుద్ధాల చరిత్ర కాదోయ్, మనుష్యుల చరిత్రోయ్ అని చెప్పవచ్చు.

హిందూ దేశచరిత్ర అనుపేరు కనబడే ఏ పుస్తకమైనా విప్పి చూడండి. అందులో ఏమి కనబడుతుందో చూడండి. రాజులు, వారి యుద్ధాలు వాటిఫలితాలు బాగా కనబడతాయి గాని, దేశములోని స్త్రీపురుషులు, వారి వేషభాషలు, కష్టసుఖాలుమాత్రం కనబడవు. ఈ చరిత్ర ఆర్యయవన మ్లేచ్ఛ పాశ్చాత్యదండయాత్రలలో యుద్ధభూమిపైన సేనానాయకులు చిందులుతొక్కడంతో దేశీయరాజుల నవాబుల అక్రమాలతో ప్రారంభమై, దేశం అరాజకమున పడియుండగా ఇంగ్లీషువారు దేవలోకంనుంచి వచ్చి, రాక్షసులవంటి రాజులను నవాబులను అణచి, మనదేశంలో శాంతిభద్రతలు కలిగించి, రోడ్లు రైళ్లు నిర్మించి, ప్రజలకు మహోపకారముచేసిన కథావస్తువు వన్నెచిన్నెలతో వర్ణింపబడుతుంది. బ్రిటిష్ పరిపాలన వలని లాభాలు చమత్కరింపబడడంతో చరిత్రపూర్తి అవుతుంది. అంతేనేగాని, యీ దేశంలో యీ దండయాత్రలలో యీ అరాజకంలో ప్రజలంటూ వున్నారా? వీరెలాగ జీవించేవారు? వారి ఆచారవ్యవహారాలెలా వుండేవి? వీరికి నాగరికత విజ్ఞానము వుండేవా? లేక, ఎల్లప్పుడు ఇప్పటిలాగనే అజ్ఞానంలోను దారిద్ర్యంలోను పారతంత్ర్యములోను పడివుండే వారా? ఈ రాజరికముల మార్పులో పాత కొత్తలసందున ప్రజల స్థితిగతులలో ఎలాటి మార్పులు కలిగినాయి? అనే సంగతులు కనబడవు. ఈ అంశాలే నిజమైన దేశచరిత్రలో నుండవలసిన సంగతులు. ఈ విషయాలను గురించి పెక్కుమంది ఇంగ్లీషు గ్రంథకర్తలే వ్రాసియున్నారు గాని, మన చరిత్రలలోకి మాత్రం యివి యింకా యెక్కలేదు. కారణం అందరూ ఎరిగినదే. ప్రభువుల కిష్టమైన పద్ధతిలో గాక, కొత్తపద్ధతిలో వ్రాస్తే ప్రభువుల అనుగ్రహం తప్పుతుందనే!!



## ఆంగ్లయుగంలో కలిగిన మార్పులు

ప్రంచమునందువలెనే భారతదేశమునందును అనేక సామ్రాజ్యములుద్భవించి విస్తరించి యంతరించినవి. అనేక సభ్యతలు వర్ధిల్లి మాటు మణిగినవి. హిందూ బౌద్ధ సామ్రాజ్యములు గ్రీక్కుపఠాను మొగలు సామ్రాజ్యములు ఇసుక లోని బొమ్మరిళ్లవలె పెరిగి పాడు పడినవి.

భారతదేశ చరిత్రలో మొగలాయి సామ్రాజ్యముయొక్క ప్రభుత్వపు కట్టుబాట్లు విచ్ఛిన్నమై, మొగలు సభ్యతయొక్క పునాదులు విడిపోయి యింగ్లీషు పరిపాలనా సౌధములు నిర్మింపబడువరకు అనగా క్రీ.శ. 1707 మొదలు 1807 వరకు గల మార్పుదలకాలము భారతదేశ దురదృష్టముల కన్నిటికిని కారణమైనదని చెప్పవచ్చును. 1707లో ఔరంగజేబు చనిపోయినపిదప రాజకీయముగ మొగలుచక్రవర్తి నామమాత్రావశిష్టుడయి, ఆయన సుబేదారులు స్వతంత్రనవాబులయి, రాజ్యములకొరకు పెనుగులాడుచుండుటయు దేశములోని ఇతరహిందూ రాజులు, నాయకులు, రాజ్యాధికారము చేజిక్కించుకొనుటకు ప్రయత్నించుచుండుటయు, మరాటిదండులు విజృంభించు చుండుటయు విదేశీయవర్తకులు ధన సంపాదనకొరకు రాజ్యసంపాదనకొరకు ప్రాకులాడు చుండుటయు దేశములో కల్లోలములకు కారణము లయ్యెను. మనరాజులు నవాబులు రాజ్యకాంక్షచే ఫ్రెంచి యింగ్లీషు వర్తకసంఘముల కుతంత్రములకు లోనయి యుద్ధములందు దిగి బలహీనులయి వారి చేతులలో కీలుబొమ్మలవలె ఆడుచుండిరి. దేశములో పన్నులు వసూలుచేయు అధికారము వేలము వేయబడుచు దళారీల చేతులలో నుండెను. వారు చేయు పీడనకు మితిలేదు. ఇది యొక వ్యాపారముగ జరుగుచుండెను. ఇంగ్లీషు వర్తకు లీవ్యాపారముపైన కన్నువేసి, మొగలు చక్రవర్తి వలన దివాన్‌గిరీని సంపాదించి, అమితధనమును సంపాదింపసాగిరి. తరువాత దేశాక్రమణమును చేయమొదలిడిరి.

మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిన్నమై దేశములో రాజకీయపరివర్తనములు కలిగి వివిధ ప్రదేశములందు కల్లోలముగ నున్నను పదునెనిమిదవ శతాబ్దమునాటి కింకను భారతదేశమునందు కృషిసంపదమాత్రమేగాక, పారిశ్రామికాభివృద్ధియు చక్కగానే యుండెను. ఆసియా ఐరోపాదేశముల కెల్ల భారతదేశపు జిలుగువలువలు ఎగుమతి చేయబడుచు దేశములోనికి అమిత ధనము వచ్చుచుండెను. ఇక్కడకు వ్యాపారము చేయవచ్చిన పాశ్చాత్యవర్తకులైన ఇంగ్లీషువారును ఇతరులును తమ సరకుల నిక్కడ అమ్ముకొనుటకు రాలేదు. ఇక్కడి అతిసున్నితములైన వస్తువులు కొని హెచ్చుధరలకు ఐరోపాలో నమ్ముకొనుటకే వచ్చియుండిరి.

హిందూదేశపు నూలుబట్టలు ఉన్ని సరుకులు పట్టువస్త్రములు బుటేదారి పనుల సరకుల లోను తూర్పు ఇండియా సంఘము వ్యాపారము చేయుచుండెను.

మూర్షిదాబాదు లండనుగనరమంత వైశాల్యమును జనసంఖ్యయు కలిగియుండుటయేగాక, ఇచ్చట లండనులో కన్న అధికధనవంతులున్నారని 1757లో క్లైవు వ్రాసియున్నాడు. డక్కామజలీనులు పాశ్చాత్యదేశములందెల్ల ప్రసిద్ధికెక్కినవి.

పట్టణములందు నూరుమందిగాని, అంతకెక్కువమందిగాని పారిశ్రామికులు శిల్పులు చేరి చిన్నచిన్నకర్మాగారములందు సమిష్టిగా కృషిచేయుచు సరకులుత్పత్తి చేయుచుండిరి. ఈ సరకులవలన తమ కమితలాభములు వచ్చు చున్నందున కుంఫిణీవారు ఈ పరిశ్రమలను ప్రోత్సహించిరి. ఈసరకుల విలువ వెండి బంగారులలోనే దేశములోనికి వచ్చుచుండెను. మనవారు బంగారు తప్ప విదేశవస్తువులు మార్పిడిగా పుచ్చుకొనువారు కారు. ఆనాడు మనదేశములోని వస్త్రనిర్మాణ పరిశ్రమ కొన్నాళ్లవరకు ఇంగ్లీషు యంత్రముల పోటీనికూడా ప్రతిఘటింపగలిగెను.

ఇంగ్లీషువారి యంత్రముల యజమానులు భారతీయ నేతగాండ్రతో పోటీచేయలేక తమ ప్రభుత్వమును ప్రార్థించి భారతదేశమునుండి ఇంగ్లాండుకు దిగుమతియగు సరకులపైన హెచ్చు సుంకములు విధింపచేసి, కొన్ని వస్తువుల దిగుమతి నిషేధించి, అట్టిసరుకులను కొన్నవారిని అమ్మినవారిని శిక్షింపజేసియు తమ పరిశ్రమలను కాపాడుకొనిరి. మన వస్త్రములపైన నూటికి 80 వంతుల చొప్పున సుంకము విధింపజేసిరి.

1813లో తూర్పు ఇండియా కంపెనీకి హిందూదేశమున వర్తకముచేయుట కిరువది సంవత్సరములవరకు కొత్తపట్టా జారీ చేయునప్పుడు పార్లమెంటుసభలో చర్చరాగా భారతదేశములో నిర్మాణమగు వస్తువులు తయారగు చున్నంతకాలము ఇంగ్లీషు సరకు లచ్చట చెలామణికావని అనుభవజ్ఞులగు వర్తకులు ఉద్యోగులునిర్మొగమాటముగా చెప్పివైచిరి.

ఆనాటికి ఇంగ్లీషువారు భారతదేశములో పలుభాగములకు ప్రభువులై యున్నందున తమ రాజ్యాధికారముల నుపయోగించి భారతదేశపరిశ్రమల నణచివేయుటకు నిశ్చయించిరి. భారతదేశ గృహపరిశ్రమలు చేతిపనులు ఇంగ్లీషు వారి యంత్రములతో నెక్కువకాలము పోటీ చేయలేకపోయెను. క్రొత్తగా వచ్చుచున్న ఆర్థికపరిస్థితులకు భారతీయులు అలవాటుపడలేకపోయిరి. ఇట్లు పరిస్థితులు తారుమారుకాగా, ఇంగ్లీషువారు తమ సరుకులను మనకు విక్రయింపసాగిరి.

మొగలు సామ్రాజ్యమునాటి రాజ్యాంగ కట్టుబాట్లు ఆర్థిక పద్ధతులు కీలుతప్పెను.



శాంతిభద్రతలు తగ్గిపోయెను. పన్నులధికమయ్యెను. తరతరములనుండి కృషివలన గృహ పరిశ్రమలవలన జీవించుకర్షకులు కార్మికులు దళారీల వలలలో చిక్కి పీడింపబడుచుండిరి. దేశములోని వాణిజ్యపరిశ్రమలకు వృత్తులకు భంగము కలుగుచుండెను. దేశములో దళారీలు దారిదోపిడి గాండ్రు చెలరేగుచుండిరి. ప్రజలు ఈ పీడలకు భయపడి, వృత్తులు మానుకొని, భూములు వదిలివేసి, యింగ్లీషు దండు ప్రదేశములకు పట్టణములకు పోయి కూలినాలి చేసికొను పద్ధతిలో దిగసాగిరి.

హిందూ మహమ్మదీయ రాజులు నవాబులు పూర్వమువేసిన రాజబాటలు మరమ్మత్తులు లేక శిథిలములగుచుండెను. రాకపోకలుకష్టములయ్యెను. దారులలో దొంగలు దోచుకొనుచుండిరి. పల్లపునీటి వనరులకొరకు పూర్వపు రాజాధిరాజులు నిర్మించిన కాలువలు తటాకములు బావులు మరమ్మత్తులు లేక పాడగుచుండెను. అందుకొరకు యకరమున కింతయని నిర్ణయింపబడిన చిల్లరశిస్తులు వసూలుచేసి, వానిని మరమ్మత్తులు చేయువారు లేరైరి. రాకపోకలు కష్టసాధ్యములగుచుండెను. క్రొత్తగా దేశము నాక్రమించుకొనుచున్న ఇంగ్లీషు కుంఫిణీవారికి వారిసైన్యముల రాకపోకలకు వీలైన దండుబాటలు చాలును. అనగా దారి కడ్డము వచ్చినచెట్లు నరికి రుప్పలు తీసి మనుష్యులు గుఱ్ఱములు ఎడ్లుత్రొక్కిన కాలిరాపిడివలన తయారైన బాటలున్న చాలును. గనుక దేశ ప్రజలురాకపోకల సౌకర్యముల సంగతి నీటి వనరుల సంగతి వారికి పట్టలేదు. క్రమక్రమముగా దేశములోని వివిధ భాగములు ఇంగ్లీషు కుంఫిణీవారి వశమగుచుండెను. అట్లు వారి వశమైన ప్రాంతములందీ దుఃస్థితి మతింత హెచ్చసాగెను. కారణమేమనగా దేశీయరాజులు నవాబులు ఎంత వేడినను ప్రజలవలన వసూలుచేసిన ధనములో కొంతయైనను ప్రజాసౌకర్యములకొరకు ఖర్చుపెట్టుచు, గ్రామకట్టుబాటులను పాడుచేయక గ్రామపరిపాలనతో జోక్యము కలిగించుకొనక దొరతనముచేయుటవలన ఆ దేశీయ రాజుల పరిపాలన క్రిందనున్న ప్రదేశములలో పైన చెప్పబడిన ప్రజాసౌకర్యములు కొంత వరకయినను నిలిచియుండెనుగాని, కేవలము వర్తకమువలన లాభము సంపాదించుటకే ఈ దేశమునకు వచ్చిన ఈ విదేశీయ కుంఫిణీ పరిపాలకులు ఈ దేశములో వసూలుచేసిన సుంకములు పన్నులు శిస్తులు వర్తకమువలన సంపాదించిన లాభములతో పాటు ఇంగ్లండులోనున్న కుంఫిణీ డైరక్టరులకు రవాణాచేయవలసి యున్నందున ప్రజాసౌకర్యముల కొరకు గాని ప్రజల వ్యవసాయ పరిశ్రమల యభివృద్ధికొరకుగాని విద్యాభివృద్ధి కొరకుగాని ఎట్టి సొమ్మును వ్యయము చేయకుండిరి.

భారతదేశమునకు మహమ్మదీయులు చాలాకాలము క్రిందటనే వచ్చినందున

యిచ్చటి ముసల్మానులలో చాలమంది యిక్కడి వారఅయినందున దేశప్రజల ఆచార వ్యవహారములందును మహమ్మదీయ మతమునందు నుగూడ గొప్ప మార్పును గలిగించెను. అరేబియా దేశపు మహమ్మదీయ మతమువలె గాక, హిందూదేశము నందలి యిస్లాము, హిందూదేవతల ఆరాధనము వంటి పీరులపండుగలతోను దర్గాలతోను ఇతర విధములైన ఉత్సవములతోను నిండి, ఒక దేశీయ మతముగా మార్పుచెందినది. అందులో షీయా మతము సూఫీమతము కేవలము హిందూ మతాచారములకు ధర్మములకు సిద్ధాంతములకు చాలదగ్గరగా నుండినవి. ఒక మతమువారు రెండవమతము వారితో స్నేహభావము కలిగియుండిరి. ఉభయ మతములవారిలో దేవతలకు పీరులకు మ్రొక్కువారు పుష్పములతో పూజించువారు, ఉత్సవములు చేయువారు ఎక్కువగానుండిరి. గ్రామము లందు హిందూమహమ్మదీయులు బంధువుల వలెనే ప్రవర్తింపసాగిరి. ఇట్టి స్థితిలో ఈ రెండు మతములకును భిన్నమై క్రొత్తగా దేశమునాక్రమించుచున్న జాతివారిమత మగుటవలన రాజసమ్మానమును పొందుచున్న క్రైస్తవమతము క్రైస్తవమతాచార్యులకు దేశపరిపాలనమునందు పలుకుబడి కలిగించుచుండెను. క్రైస్తవ మతము దేశములోకి ప్రాకి, హిందూ మహమ్మదీయమతములందు జీవనము గడువక దారిద్ర్యమనుభవించు వారిని అస్పృశ్యత మొదలగు క్రూరాచారములవలన బాధలనుభవించు వారిని ఆకర్షింపసాగెను.

ఈ దేశమున ఇంగ్లీషు కుంఫిణీవారి ప్రభుత్వము వచ్చువరకు భారతదేశము హిందువు లేలినను తురకలె యేలినను ఎందరు రాజులు పోయికొత్తవారు వచ్చినను రాజనగరునందును దర్బారులోను ముఖ్యపట్టణములలోను మాత్రమే క్రొత్త ప్రభుత్వపు చిహ్నములు మార్పులు కలుగుచుండినవేగాని, భారతదేశపు కర్షకులు కార్మికులు సుఖజీవనముచేయు ఏడులక్షల గ్రామములందును ఎట్టి మార్పును కలుగుటలేదు.

హిందూమహమ్మదీయ పరిపాలనములందు కేవలము ఒక మతమునకు చెందినవారికి మాత్రమే గాక, తక్కినవారికిగూడ పెద్ద యుద్యోగములు జాగీరులు అధికారములు ధారాళముగ నొసగబడుచుండెను. తురకలపరిపాలనమును హిందువులు సర్వసేనానులుగను మంత్రులుగను గొప్ప భూఖామందులుగ నుండిన యుదాహరణము లనేకములు గలవు.

మొగలు సామ్రాజ్యమునందుకూడా గ్రామపరిపాలనము ఆయాగ్రామములందు గల కులపెద్దలు పెత్తనదార్లుగల గ్రామపంచాయతీలవల్లనే నిర్వహింపబడుచుండెను. గ్రామమొత్తముమీద ప్రభుత్వమునకు వసూలు కావలసిన శిస్తును పంటరూపమున



గ్రామపంచాయతీలే వసూలుచేసి, రాజుకు చెందవలసిన భాగమును మాత్రము రాజప్రతినిధులకు స్థానికోద్యోగులకిచ్చి, మిగిలిన గ్రామపరిపాలనకొరకు కేర్పడిన వంతుపంటను గ్రామముయొక్క క్షేమలాభముల నిమిత్తము ఖర్చుపెట్టుచుండును. గ్రామములోని భూముల అమరకము పల్లపునీటి సాగువనరుల మరమ్మత్తు గ్రామరక్షణ గ్రామపంచాయతీలే జరిగించును.

గ్రామతగవులు పంచాయతీలవలననే పరిష్కరింపబడుచుండెనుగాని, అవి యెన్నడును గ్రామపు పొలిమేరలు దాటి దూరపు అధికారుల రచ్చకెక్కి యెరుగవు. దేశములో నెవ్వరికైన అన్యాయము జరిగినచో, అన్యాయముచేసిన వారెంతటిగొప్ప అధికారులయినను ప్రజలు స్వయముగా చక్రవర్తి దగ్గరకు గాని రాజు దగ్గరకు గాని పోయి, ఖుద్దున ఫిర్యాదు చేసికొని న్యాయము పొందవచ్చును. హిందూరాజులు కాలమునను అక్బరు చక్రవర్తి కాలమునను తుదకు ఆంగ్ల చరిత్రలందు హిందూమతద్వేషిగా చిత్రింపబడడిన ఔరంగజేబు కాలమునకు కొట్టకొనకు సుఖలోలురై బలహీనులైన ఔరంగజేబు సంతతి వారి పరిపాలనకాలమున గూడా యీ గ్రామకట్టుబాటులట్లే జరిగెను.

ఇంగ్లీషు కుంఫిణీ పరిపాలన స్థాపింపబడగనే గవర్నరు జనరలుగ నియమింపబడిన కారన్ వాలిసు ప్రభువుచేసిన ఘనకార్యములలో మొదటిది వంగరాష్ట్రపు రయితులను జమీందారుల చేతులలోని కప్పగించిన శాశ్వత భూమిపైసలా పద్ధతి యొకటి గ్రామ కట్టుబాటులను నాశనముచేసి, దేశమును జిల్లాలుగా విభజించి, పన్నుల వసూలును న్యాయవిచారణను చేయుటకు ఇంగ్లీషు కలెక్టర్లను జడ్జీలను నియిమించుచు చేసిన క్రొత్త నిబందన యొకటి, ఇది 1793లో జరిగెను. భారతదేశ ప్రభుత్వము నందు నాడు మొదలు క్రొత్తపద్ధతి ప్రారంభమై దేశపరిస్థితులు తారుమారగుటకు కారణములైన వని నిస్సందేహముగ జెప్పవచ్చును.

దేశపరిపాలనమునందు చిరకాలమునుండి ఉద్యోగములు చేయుచున్న హిందూ మహమ్మదీయోద్యోగులు తొలగింపబడి, అన్ని వ్యవహారములు జాతివారివలన జరుపబడు విధానము ప్రారంభింపబడెను. ఉద్యోగుల కొసగబడిన యీనాములు గ్రామ సౌకర్యములకొరకు కివ్వబడిన యీనాములు తీసివేయబడెను. గ్రామ పంచాయతీలు తమ అధికారములను గోల్పోయెను. గ్రామసంస్థలు వానితో పాటు నాశనమయ్యెను. భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము నిర్మించిన యీ అధికారచక్రము దేశములో శాంతిని క్రమపద్ధతిని మాత్రము తూచా తప్పకుండా స్థాపించుచున్నది.

ఇంగ్లీషు న్యాయశాస్త్రవిధులనేకములు శాసింపబడి, ఆశాసనములను

మీరనంతవరకు ప్రజలు తమ తమ పనులు చేసికొనవచ్చుననిరి. అవి మీరినవారికి కష్టములు తప్పవు. ఇది తప్ప ప్రజలస్థితిని బాగుచేయుట తమ విధియని ఆంగ్లేయాధికారులు ఎన్నడును తలచినవారుకారు. దేశములో ప్రవేశపెట్టబడిన ఆంగ్ల న్యాయశాస్త్ర సిద్ధాంతములు వాణిజ్యవ్యాపార పద్ధతులు దేశ ప్రజలయందు పెక్కుమార్పులను కలిగించెను. ప్రజలవలన ధాన్యరూపముగా శిస్తులను వసూలు చేయుపద్ధతి తీసివేసి, రొక్కరూపమున నియమిత మయిన తేదీలలో ఖచితముగా పన్నులు వసూలుచేయుట ప్రారంభించి నందువలన పైకి సులభముగా కనపడినను, శిస్తుకొరకు అప్పుచేయవలసిన అవసరము రయితుకు కలిగెను. షాహుకారులవద్ద రయితులు బదులు పుచ్చుకొనుటయు, క్రొత్త న్యాయశాస్త్ర ప్రకారము షాహుకారులు వ్యాజ్యములు వేసి రయితుల భూముల నమ్మించుటయు ప్రారంభమై, గ్రామభూస్వామిత్వమునందు ఆర్థికజీవనమునం దనేక మార్పులు కలిగింపసాగెను.

కుంఫిణీవారు ప్రారంభదినములలో దేశములోని జిలుగు వలువలను ఇతరమైన తయారు వస్తువులను ఇంగ్లాండుకు ఎగుమతి చేయుచుండిరి. ఆ కాలమున గ్రామముల నుండి భారతీయ పారిశ్రామికులు సరకులు తెచ్చి, కాశీ మొదలగు ముఖ్యపట్టణముల ద్వారా వాణిజ్యము చేయుచుండిరి.

అందువలన గ్రామములకు పూర్వముండిన బాటలు శిథిలమైనను కుంఫిణీవారు బాగుచేయ లేదు. తరువాత ఇంగ్లండులోని యంత్రపరిశ్రమలు వృద్ధికాగా, భారతదేశ పరిశ్రమలను కుంఫిణీవారు మెల్లగా అణచివేసి, తమ దేశపు సరకుల నిక్కడికి దెచ్చి బలవంతముగా విక్రయించుటయు,నీదేశపు ముడిపదార్థములను తమ దేశమునకెగుమతి చేయుటయు ప్రారంభించిరి. అందువలన రాజబాట లవసరమయ్యెను. తమ సైన్యములకొరకు గూడ కొన్ని రాజబాట లవసరమయ్యెను. అంతేగాని, ఇవి ప్రజల రాకపోకల కేర్పడినవిగావు.

ఈ క్రొత్త వ్యాపార ఎగుమతి దిగుమతులకు కుంఫిణీ వారేర్పరచిన కేంద్ర స్థానములు కొన్ని క్రొత్తనగరములుగా తయారయ్యెను.

ఈ క్రొత్తనగరములు కేవలము ముడిసరుకులను చేర్చుట కేర్పడినవేగాని, పారిశ్రామికుల నగరములు కావు. యిటీవల బొంబాయి మొదలగుచోట్ల వర్ధిల్లిన ఫ్యాక్టరీలు ఇంగ్లీషు దొరతనమువారి ప్రమేయము లేకుండనే బయలుదేరినవి. భారతదేశ గృహపరిశ్రమలు నాశనము చేయబడిన పిదప ఇంగ్లాండులో యంత్ర పరిశ్రమల స్థాపనానంతరము వచ్చిన ఆర్థిక విప్లవమునందు గృహపరిశ్రమలచేయువారి జీవనమునలు పడిపోయినప్పుడు, ఆదేశము క్రొత్త యంత్రాగారములను నిర్మించివారికి జీవనాధారము



కల్పించి నట్లుగా నీదేశమున గూడ ఫ్యాక్టరీలు నిర్మింపనందున చేతి పరిశ్రమలు నాశనమగుటచే నిరాధారులయిన కోట్లకొలది పారిశ్రామికులు తిండిలేక మలమల మాడ జొచ్చిరి.

వేరు జీవనాధారములేక భూమినే నమ్ముకొన వలసివచ్చినందున భూమిపైన రయితుల ఒత్తిడి అధికమయ్యెను. భూముల ఖరీదున్ను హెచ్చెను గాని, వ్యవసాయము మాత్రము లాభసాటి గాకుండెను. పల్లపుసాగు చేయబడుభూమి అనాది సిద్ధమయినది. అందువలనను సారవిహీన మయి పోయినది. ఎరువుకు పనికివచ్చుపేడ, వంట చెరుకుగా నుపయోగించుట ప్రజల కలవాటు. పందిపెంట, అమేధ్యము, ఎరువులుగ నుపయోగించుట ఆచారవిరుద్ధము. అందువల్ల పంటలు తగ్గెను.

భారతదేశములో క్రమక్రమముగా జన సంఖ్య హెచ్చుచునే యుండెను. అన్ని వృత్తుల లోను పోటీ అధికమయ్యెను. విక్రయములవలనను, సమష్టికుటుంబములు వేరుపడుటవలనను వారసత్వములవలనను చీలి, భూవసతి చిన్న చిన్న మడులుగ విభాగింపబడినందున శిస్తుల కొరకు అప్పులవసరమైనందున అప్పులిచ్చు సాహుకారులు ధాన్యవ్యాపారముకూడ చేయుచు లాభమునందుచున్నందునను క్రొత్తగా స్థాపింపబడిన యింగ్లీషు కోర్టులలో రుణగ్రస్తుని పట్టుకొని బందికానాలో నుంచి నిర్బంధించుటకు చరాస్తిని జప్తు చేయుటకు అవకాశములు కల్పింపబడినందునను, ఈ అధికారములను పురస్కరించుకొని ధనము బలముగల సాహుకారులు జమీందారులు రయితులను రచ్చకీడ్చి, పొలముబుత్రలు అమ్మించి, పీడింప ప్రారంభించిరి. ఇట్లు కుంఫిణీ ప్రభుత్వమువచ్చిన పిదప రాజకీయములందువలెనే, సాంఘిక ఆర్థిక విషయములందు గూడ దేశప్రజలందు పెక్కుమార్పులుకలిగి, దేశదారిద్య్య మధికమైవిద్య వైద్య సహాయము లేక, ప్రజలు బాధలననుభవించుట గ్రామములు దుస్థితిలో నుండుటయు తటస్థించినది.

పారషీభాషకు బదులుగా ఇంగ్లీషుభాషను రాజభాషగా చేయుటకు విలియం బెంటింకు 1833లో నిశ్చయించినాడు. పాశ్చాత్య విజ్ఞానమును బోధించు ఇంగ్లీషు పాఠశాలలు స్థాపించుటకు 1835లో నిశ్చయించినాడు. ఈ యింగ్లీషు పాఠశాలలో పరీక్షలం దుత్తీర్ణులైనవారికే ఉద్యోగము లిచ్చుటకు హార్డింజిగారు 1844లో నిశ్చయించుటతో దేశములో గొప్ప మార్పుగలిగినది. అంతవరకు దేశములో ఉద్యోగములు పలుకుబడియు కలిగియుండిన పూర్వకాలము నాటి మహమ్మదీయులు తమ అధికారము గౌవరము సంపదలను గోల్పోయి దురిద్రులైరి. ఒక గొప్ప సాంఘిక విప్లవము ప్రారంభమయ్యెను. ఆంగ్లేయులతో స్నేహము, వారి వేషభాషల ననుకరించుటకు గారణములయ్యెను.

ఇంగ్లీషు చదువులవల్లను క్రైస్తవమతబోధకుల ప్రచారము వలనను ప్రకృతి శాస్త్రపాఠముల వలనను హిందువులు నమ్ము అనేకసంగతులు నిరాధారములని తేలుటవలన హిందూ యువకులకు మతధర్మములయందు విశ్వాసము పోయి, ఒకవిధమైన శుష్కవేదాంతము వ్యాపింపసాగెను. క్రైస్తవ మతమున గలిసినను కలియకపోయినను మన మతముపట్లను ధర్మముపట్ల గౌరవముమాత్రము పోయి, ఆహారవిహారములందు స్వేచ్ఛావిహారులైరి. ఇంగ్లీషువేష భాషలతో భోగ్యవస్తువులుపయోగించుట ప్రారంభమయ్యెను.

## ప్రాతక్రొత్తల సందున భారతీయులస్థితి

భారతదేశమున నెక్కడజూచినను యుద్ధములు విప్లవములు దోపిడులు జరుగుచు దేశము సంక్షుభిత మైపోవుచుండగా భారత దేశీయ ప్రజాజీవనము ఎట్టి సంచలనమును లేక పూర్వమువలెనే స్థబ్ధమై యథా ప్రకారముగా కాలవాహినిలో నడుచుచుండెను. ఆ కాలమున దక్షిణదేశమున పాండుచేరిలో ఫ్రెంచివారి నాయకుడగు డూప్లేదగ్గర దుభాషిగా నుండిన ఆనందరంగపిళ్లగారు రచియించిన దినచర్యలోను, ఉత్తరమున సియర్ ముతాఖెరిన్ (Seir Mutaqherin) అను గ్రంథమును రచియించిన గులాం హుసేనుఖాన్‌గారును ఆస్థితిగతులను వర్ణించి యుండుటవలన నాకాలమునాటి పరిస్థితులు మనము తెలిసికొనవచ్చును. వీరి గ్రంథములు దేశచరిత్ర కాధార గ్రంథములుగ నున్నవి. పూర్వాచార వ్యవహారములు సడలిపోయి క్రొత్త ఆచార వ్యవహారములు ధర్మములు నీతినియమములు దేశములో తలలెత్తుచుండెను. పరాజయమనునది కనపడని భీమబలముగల ఈ (ఆంగ్లేయ) విజాతీయుల పద్దతులు మనవారికి తెలిసిన నీతి ధర్మములనుబట్టి అర్థముచేసికొనుట అతికష్టముగ నుండెను. ఆకాలమున జీవించిన గ్రంథకర్తలలో చరిత్రలను రచియింపక సామాన్య గ్రంథములను రచయించినవారి పుస్తకములందుకూడా ఆనాటి పరిస్థితులు వర్ణింపబడియున్నవి. రామప్రసాదసేనుడనుకవి సురాజద్దౌలా క్లైవుల సమకాలికుడు. ఇతడు 1718లో (నద్యా) నడయాజిల్లాలో జన్మించెను. అది మహమ్మదీయులకు పూర్వమునుండియు స్వతంత్ర వంగదేశీయరాజ్యముగ నుండెను. గనుక అక్కడి దేశీయ ఆచార వ్యవహారములు కేవలము హైందవ సంప్రదాయమునకు జెందినవై యుండెను. అతడు చాలా బీదవాడు. క్రిష్ణగరుజమీందారుల ఆస్థానకవి, దేశము దుస్థితిలో మునిగియున్న ఆకాలమున కాళికాశక్తియారాధన విజృంభించెను. ఈశక్తి కొందరికి బలము ధనము ప్రసాదించును. కొందరికి దారిద్ర్యము దుఃఖము ననుభవింపుమని శాసించును.



తన చుట్టు కనపడుచున్న దుస్థితిని జూచి రాను ప్రసాదుసేను డిట్లు విలపించెనుట: తల్లీ నీవు కొందరికి సకల సంపదలను గుఱ్ఱములను ఏనుగులను రథములను ప్రసాదించి దిగ్విజయము నొసగుచున్నావు; మరికొందరిని పొలములో పాటుపడి చెమ్మట నూర్చుచు వరియన్నము కాయగూరలు దినుచుండుమని శాసించినావు. కొందరు రాజనగరులందు భోగములనుభవింతురు. నాకు నట్టియాస కలదు. ఓ తల్లీ, యీ యదృష్టవంతులు నీకు పితామహులైరా నేను బందుగుడను కాకపోయితినా?.. కొందరు పల్లకులందు సవారీచేయుదురు. నే నాసవారిదండెను మోయవలసిన దౌర్భాగ్యమనుభవించుచున్నాను!!" అనినాడు. ఈ కవిరచనలందు దేశప్రజలనుభవించు బాధలు కనపడుచున్నవి. ఎల్లప్పుడు దోపిడులందు బాధలనందుచు పీడింప బడు జనసామాన్యముయొక్క జీవనము కలవర్ణన లందు కనబడుచున్నది. అరిషడ్వర్గములును, ఏకాదశేంద్రియములును, అతనిని కొట్టికూల్చు దండధరులవలె నున్నవి. మరమ్మత్తు లేక పాడుపడిన ఇంటిలో నతని కాపురము. తన యింటిలోనికి దొంగలవలె రాత్రిళ్లు చొరబడు నా యరిషడ్వర్గమునుజూచి యితడు గడగడ వడకును. ఇతనిరచనములోనే వంగభాషలో మొదటి ఇంగ్లీషుమాట మనకుకనబడుచున్నది. దేశమిట్లుండగా ఉపేక్షించుచు నూరకున్న ఈ కాళికాదేవిమీద తాను న్యాయస్థానమున వ్యాజ్యము వేసి గెలిచి "డిక్రీ" పొందగలనని అతడువ్రాసినాడు. ఇంతటితో మనము వారన్ హేస్టింగ్సు కాలమునాటికి వత్తుము. ప్రజాపీడనమునందు బాధల నందుచు, మంచిదినముల కొరకు వేచియుండు దీనజనుల ధైర్యస్థైర్యములు విలాపములు నీకవిపద్యములందు ప్రకటింపబడియున్నవి.

ఇతడు 1775లో కాళికాదేవి యుత్సవమున ఆమె మంటివిగ్రహమును గంగానదిలో గలుపు సమయమున సమాధిలోమునిగి ఒడలెరుగక గంగాప్రవాహమున మునిగి స్వర్గస్థుడయ్యెను. అతడు రచియించిన తుదికవనమని చెప్పుకొనునది, తా నారాధించిన తామస శక్తి నిట్లుద్బోధించుచున్నది. "తారా! నీకింకేమైన జ్ఞాపకమున్నదా? తల్లీ! నాజీవితమున నింతవరకు ననుభవించిన యానందము ఇటుపైన కూడా యుండునా? ..నా కింకొక యాశ్రయమున్నచో నేను నిన్నిట్లు ప్రార్థించియుండను. తల్లీ! నీవు నాకొక యడియాసను కల్పించి నా బంధములను త్రెంచి వృక్షాగ్రమునకు లేవనెత్తితివి–" "నా మనస్సు దృఢమై యున్నది పూజారి కివ్వవలసిన దక్షిణ నిచ్చివేసినాను, తల్లీ! నా తల్లీ– నా పని పూర్తియైనది నా యాహుతిని సమర్పించితిని" అని రామప్రసాదు పలికినాడు. *

# ఆంగ్ల నాగరికతా ప్రభావము - ప్రజల రుచులలో మార్పు

ఇంగ్లీషువారీ దేశమునకు వచ్చిన తరువాత ప్రజలలో వచ్చిన మార్పును గురించి బిషప్‌హెబరుగారు 1823 డిసెంబరు నెలలో కలకత్తానుండి ఇంగ్లాండుకు వ్రాసిన లేఖయందిట్లు చెప్పిరి :-

ఈ దేశీయుల సామాన్యజీవనమునందు గృహములందు నిప్పుడు కనపడుచున్న ఆచార వ్యవహారములలో సగముపాలు తమ్ము జయించిన మహమ్మదీయ ప్రభువుల ఆచారవ్యవహారముల నుండి ప్రజలలో సంక్రమించినవే యని వ్యవహారజ్ఞానముగల దేశీయులు కొందరు నాకు నచ్చచెప్పియున్నారు. ఇప్పుడు ప్రభుత్వము చేయుచున్న ఇంగ్లీషువారి ననేక విషయములందు అనుకరించు సూచనలు స్పష్టముగా కనబడుచున్నవి. దీనివలన నప్పుడే ప్రజలలో చాలా మార్పులు వచ్చినవి, ఇంకా ముఖ్యమైన మార్పులు కలగునని తోచుచున్నది. ధనవంతులగు దేశీయులు తమయిండ్లను కొరింతియన్ స్తంభములతో నలంకరించుచున్నారు. ఇండ్లలో ఇంగ్లీషు బల్లలు కుర్చీలు కర్రసామానులు అమర్చుచున్నారు. కలకత్తాలో దొరుకు అందమైన గుఱ్ఱపుబండ్ల నెక్కి తిరుగుచున్నారు. చాలా మంది ఇంగ్లీషు గబగబ మాట్లాడగలరు. ఇంగ్లీషు వాఙ్మయమును కొంతవరకు చదివియున్నారు. మా మిత్రులలో నొకరిపిల్ల వానికి ఇంగ్లీషు జాకెట్టును, ఇజారును తొడిగి కాలికిమేజోడు, బూట్సు వేసి, తలపైన దొరటోపియు పెట్టి ముస్తాబు చేయుట నేను చూచినాను. వంగభాషలో రెండు మూడు వార్తాపత్రిక లున్నవి. ఇంగ్లాండులోని ఉదార రాజనీతిజ్ఞులగు విగ్గు పక్షమువారి రాజకీయాభిప్రాయములనే ఈ వార్తాపత్రికలు అభిమానించుచున్నట్లు నేను తెలిసికొన్నాను. ఈ దేశీయులలో నొక ప్రముఖుడు (రామమోహనరాయలు) స్పెయిను దేశమున జరిగిన ప్రజావిప్లవమునకు సంతోషమును కొల్పుచు నొక విందు చేసినాడు. దేశములోని కింది తరగతులందు వర్ణాశ్రమ ధర్మములను కుల మర్యాదలను క్రమక్రమముగా ఉపేక్షించుభావములు కనబడుచున్నవి.

(బిషప్ హెబరు జర్నలు 3-వ సంపుటము పుట 252-253)

"తమ పిల్లలను మన క్రైస్తవ పాఠశాలల కంపుటకు వారు ఇష్టపడుటయేగాక అట్లు పంపుటకు చాల ఆత్రత చూపుచున్నారు. ఇంగ్లీషు నేర్చుకొనుటకు మాట్లాడుటకు చాలా కుతూహలులైయున్నారు. ఈకోరికలను సరిగా ప్రోత్సహించినచో ఏబదియేండ్లలో మనభాష నేడీదేశమున ఉర్దూ హిందూస్థానీభాష లాక్రమించిన ప్రధాన స్థానము వహింపగల దని నాదృఢనమ్మకము." 1824 జనేవరి 10వ తేదీన వ్రాసిన మరియొక లేఖలో నాయన



మరల నిట్లు చెప్పెను. "మొత్తముమీద ఈ దేశప్రజలు తెలివైనవారు, ఉత్సాహవంతులు, గమనింపదగిన యోగ్యతలు గలవారు పైతరగతుల ప్రజలలో చాలా మంది (large proportion) మనభాషనునేర్చుకొనుచున్నారు; మన పుస్తకములు చదువుచున్నారు; మన వార్తాపత్రికలు చదువుచున్నారు; మన సాంగత్యము చేయగోరుచున్నారు. గ్రామ జనులు (peasants) కూడా ఇంగ్లీషునేర్చుకొనుటకు కుతూహలులైయున్నారు" అని వ్రాసినాడు.*

బిషప్ హెబరుగారు 1824 సం॥ జూలై 13వ తేదీన దక్కానుండి వ్రాసిన లేఖలో నిట్లుచెప్పిరి. ఇంగ్లీషువారి ననుకరింపజూచువారు గొప్ప వారు మాత్రము కాదు; మనభాషను నేర్చుకొను కుతూహల మీ ప్రాంతములందలి ప్రజలందరికిని కలదు. (పాడుపడిన దక్కానగరము యొక్క) బజారులలోను పూరిపాకలలోను గూడ కనబడు ముస్తాబు చేసుకొనుట కుపయోగించు ఇంగ్లీషు బొట్టుపెట్టెలు (Dressing Boxes) వ్రాత బల్లలు (writing cases) ఇంగ్లీషుకత్తులు కత్తెరలలోనగు ఇనుపసామానులు చీటిగుడ్డలు (chintz) పిస్తోళ్లు తుపాకీలు చెక్కుడు చిత్రములు (Engraving) ఇతర ఇంగ్లీషు వస్తువులను ఇంగ్లీషు వస్తువులయనుకరణములును ఈ దేశముయొక్క మధ్యతరగతులయొక్క జనులును ఇంకను తక్కువ తరగతులలో నుండు జనసామాన్యమున వస్తువులందెంత ప్రీతిగలిగియున్నారో చూపుచున్నది"*

ఇంగ్లీషు వారీదేశము నాక్రమింపక పూర్వము మహమ్మదీయులు అత్యున్నతమైన స్థితిలో నుండిరి. పరిపాలక జాతికి గల భావముల నన్నిటిని వా రనుభవించుచుండిరి. దేశమునేలు చక్రవర్తియు నాయన క్రింది రాజప్రతినిధులును మహమ్మదీయులు, ఇట్లే దేశములోని గొప్ప భూస్వాములును ఉద్యోగులును తురకలే. అధికారము పలుకుబడియు పెద్దజీతముగల స్థానములన్ని యు తురకలజన్మహక్కుగ నుండెను, హిందువులుకూడా కొన్ని గొప్ప అధికారములు వహించియుండిరి గాని అవి తురకల యిష్టముపై నాధారపడియుండెను.

విధిగీచిన ఒక్కగీటువలననే దేశములో నొక గొప్ప మార్పు వచ్చెను. తురకలు పూర్వము తామా క్రమించిన యున్నతపదవులనుండి భ్రష్టులై తమతోడి ప్రజలగు హిందువుల స్థితికి దిగిపోయిరి. తురక లిట్లొక మెట్టుదిగగా వారిక్రింద భయభక్తులతో మెలిగిన హిందువువల ప్రయత్నముగా నిట్లొకమెట్టు పైకెక్కిరి. పూర్వపు భయభక్తులు పోవుటతో వారిపట్ల వీరు చూపుమర్యాదకూడ తగ్గిపోయినది.

ఆత్మగౌరవముగల ముసల్మానులు అట్లు తమ్మవమానించు ప్రజలతోగాని దీనికి కారణ భూతులైన ఇంగ్లీషువారితోగాని కలిసిమెలసి తిరుగక తప్పుకొని తిరుగసాగిరి.

ఇంతలో నీదేశముననాంగ్లేయులు స్థాపించిన ఇంగ్లీషు విద్య ఈ పరిస్థితుల నన్నిటిని తారుమారుచేసెను.

ఈచిత్రమైన పరివర్తనమునుగూర్చి సుప్రసిద్ధచరిత్రకారులైన డబ్లియు, డబ్లియు. హంటరుగారిట్లు వర్ణించియున్నారు.

"క్రిందటి శతాబ్దిలో వంగరాష్ట్రమున ముసల్మాను కలెక్టరులే కుంఫిణీ వారిశిస్తులను పన్నులను వసూలు చేయుచుండిరి. మహమ్మదీయ ఫౌజుదారులు ఘట్వారీలు వారి పోలీసు సిబ్బందిని నడుపుచుండిరి. మూర్షిదాబాదులో నవాబు నాజీం రాజనగరులో ముఖ్యకార్య స్థానముగల ఒక గొప్ప తురకప్రభుత్వ కచ్చేరియు దాని క్రింద దక్షిణ (Lower) వంగరాష్ట్రమున వివిధజిల్లాలపైన నధికారము వహించు తురక ఉద్యోగులును దేశములో నేరములను విచారణ చేయుచుండిరి. ఉత్తరహిందూస్థానము నందలి చెరసాలలకు తురక యధికారులే ప్రధానోద్యోగులు (వార్డరులు)గ నుండిరి. దేశములోని సివిలు దావాలు విచారించు న్యాయస్థానములలో మహమ్మదీయ ధర్మశాస్త్రవేత్తలగు ఖాజీలే పరివేష్టించి వ్యవహారములను పరిష్కరించుచుండిరి. ఇంగ్లీషు వారి వశమైన రాజ్యములలో నాంగ్లేయ న్యాయాధిపతుల వలననే న్యాయవిచారణ చేయదలచినప్పుడు గూడ మహమ్మదీయ ధర్మశాస్త్రవేత్తల న్యాయస్థానము లందు పరివేష్టించి ఆ న్యాయాధిపతులకు విచారణీయాంశములను గూర్చి సలహాల నొసగుచుండిరి. చాలవిషయములలో మహమ్మదీయ ధర్మశాస్త్రమే దేశములో అమలు జరుపబడుచుండెను. కుంఫిణీ ప్రభుత్వమువారి క్రింద పనిచేయు తాబేదారీ పరిపాలకోద్యోగములు గుమాస్తాగిరీలు చాలాకాలమువరకును తురకలే వంశపారం పర్యముగా అనుభవించు చుండిరి. పారషీభాషకు బదులుగా (1833)లో నింగ్లీషుభాష ప్రభుత్వశాఖలందు ప్రవేశపెట్టబడి 1835లో ఆంగ్లేయ విద్యావిధానము స్థాపింపబడిన తోడనే ప్రభుత్వములోని అన్ని యుద్యోగములందును హిందువులు శరంవరలుగా వచ్చి ప్రవేశించిరి. 1844లో ఇంగ్లీషు పాఠశాల లందు పరీక్షలలో తేలిన వారికే యుద్యోగము లీయబడునట్లు నిశ్చయించుటయు, 1854లో కుంఫిణీ డైరెక్టరులు జారీ చేసిన తాఖీదు. డెస్పాచి ప్రకారము స్థాపింపబడిన సామాన్యవిద్యావిధాన మీ పరివర్తనమును సంపూర్ణము గావించినది. తురకల విద్యాపద్ధతి నశించినది. మశీదులందు కూడా చదువు చెప్పుటపోయినది. తురకలకు స్థానముపోయినది. ఈ పాశ్చాత్యవిద్యావిధానము ఉద్యోగములను క్రొత్తవారి కిచ్చుటయేగాక దేశములో జాతుల స్థితినే తారుమారుచేసిన దని స్పష్టపడినది.

విదేశభాషల నేర్చుకొనుటకు గొప్ప పరిశ్రమకావలెను, కష్టపడవలెను. తురకల



క్రింద పరభాషయైన పారషీ నేర్చుకొనుటకు హిందువులలవాటుపడిరి. తురకల కిది కష్టసాధ్యమైనపని. వీరికి రాజకీయాధికారము పోవుటతోడనే క్రమక్రమ ముగా వీరి భూములు నుద్యోగములును వీరి చేతులలో నుండి పోవసాగెను. హిందువులతో సాంగత్యము కలిగించు విద్య మొదలగు విషయముల నుండి వీరు తొలగిపోయిరి. త్వరలోనే వీరు విద్యావిహీనులుగను దరిద్రులుగను అధోగతిలోనికి దిగిరి."

ఈ మార్పు కలుగక పూర్వము 1824లో ఉత్తర హిందూస్థానమున పర్యటనము చేసిన బిషప్ హెబరుగారిట్లు వ్రాసిరి :

"ఈ దేశప్రజలలో తురకలందు హిందువుల కన్న ఉత్తమజాతిలక్షణములు కాన్పించుచున్నవి. హిందువులకన్న మహమ్మదీయులందు విద్యాభివృద్ధి యధికముగా నున్నది. వీరి మతముకూడ హిందూమతముకన్న శ్రేష్ఠమైనది గనుక మొత్తంమీద వీరు శ్రేష్ఠమైన ప్రజలని నాయభిప్రాయము. అయితేవీరు గర్విష్ఠులుగ నున్నారు. దేశాధిపత్యమునందు తమ్ము త్రోసి రా జనినారని ఇంగ్లీషువారిని జూచిన వీరికి విరోదము. విగ్రహారాధకులైన హిందువులతోడి వ్యవహారములందు వీరింకను అధికారము వహించియున్న చోటులలో నెల్ల వీరు ధనాశాపరులై ప్రజలను పీడించుచున్నారు. మహమ్మదీయులలో నొకరితో నొకరు వ్యవహారములు జరుపుకొనుపట్లమాత్రము వీరున్యాయముగనే ప్రవర్తింతురనియు వీరికి ధర్మబుద్ధి కలిగి దానధర్మములు చేయుదురనియు వినియున్నాను. బైబిలు చదువుటకు వీరికెట్టి అభ్యంతరమును లేదు, గాని ఇప్పట్లోవీరిలో నెవ్వరును క్రైస్తవులగు సూచనలు లేవు. ఈ విషయమున వీరును హిందువులవలె పూర్వాచారపరులుగనున్నారు. అరబ్బీ దేశీయులకును తురష్కస్థాన ప్రజలకును హేయముగాతోచి, వీరిని మతమునుండి వెలివేయగల కులాచారములను విగ్రహారాధన పద్ధతులను ఈ హిందూదేశపు మహమ్మదీయులు అవలంబించుచున్నారు. ఇంకను చిత్ర మేమనగా హిందూమతమును తమమతమును గూడ నిషేధించు మద్యపాన వ్యసనమునకు వీరు దాసులుగా నున్నారు," అని బిషప్ హెబరుగారు 1824 సం. జనేవరి 10వ తేదీన నొక లేఖలో వ్రాసిరి.

(చూడు బిషప్ హేబరు జనరల్‌సంపుటము 3. పుటలు. 266-267)

బిషప్ హెబరుగారు 1824వ సంవత్సరము జూలై 15వ తేదీన డక్కా నగరమునుండి యిట్లు వ్రాసిరి :

"ఈ విశాలమైన డక్కానగరము మూడింట రెండువంతులు శిథిలావస్థలో నున్నది. కొన్ని ప్రదేశములు పూర్తిగా పాడుపడి అడివి పెరిగి యున్నవి. ఈ శిథిలములందే

మొగలాయి చక్రవర్తి యగు షాజహానుయొక్కయు ఆయన ననుసరించిన ప్రభువల యొక్కయు వంశీయులగు ముసల్మాను లింకను తమ జీవనములు గడుపుచున్నారు. ఇక్కడి మూడులక్షల జనసంఖ్యలో నాలుగింట మూడువంతలు ముసల్మానులే. చాలామంది యీ శిథిలములైన పురాతనకట్టడములలోనే నివసించుచున్నారు కొందరాపాడుపడిన ఆరామములలో పాకలువేసికొని కాపురములున్నారు. నాకు గనబడినగొప్ప ముసల్మానులు స్ఫురద్రూపులుగ నున్నారు. వీరి హావభావచేష్టలు, ముఖ్యముగా గుఱ్ఱములపై నెక్కినప్పుడెంతో యొయ్యారముగను ఠీవిగను మర్యాదగ నుండును. వీరు కంటికి చాలా డాబుగా కనబడు దుస్తులను ధరింతురు. తమ మీసముల నొడవేసి మెలిపెట్టి శౌర్యమును బ్రకటింతురు. వీరి పరివారజనమును హిందువులవారికన్న నెక్కుడు కలకలముచేయుచు వీరి ప్రాముఖ్యతను చాటుచుందురు.

భారతదేశ ప్రజలందరిలోను మన (ఆంగ్లేయు) లను చూచి సహింపకపోవుటకు బలవత్తరమైన కారణములుగల యీ మహమ్మదీయులందు సైతము మన ఇంగ్లీషు భాష నేర్చుకొను వాంఛయు, ఆంగ్లేయాచారవ్యవహారములను షోకులను అనుకరించుటయు క్రమక్రమముగా బలమై వృద్ధిజెందుచున్నవి.

పెద్దకుటుంబములలోని ముసల్మాను యువకులకు సైన్యమునగాని ప్రభుత్వమున గాని పెద్ద యుద్యోగములు చేయుట కవకాశములు లేనందున వీరిలో చాలమంది నిరుద్యోగులై సోమరిపోతుల స్థితిలోనికి దిగినారు. కొందరు పితూరీదారులుగను దోపిడిగాండ్రుగను మారుచున్నారు.

ఆంగ్లేయుల ననుకరించునదీ డక్కానగరము లోని గొప్పవారుమాత్రమే కాదు. మనభాషను నేర్చుకొనువాంఛ యిక్కడి ప్రజలలో సర్వేసర్వత్ర వ్యాపించి యున్నది. ఇక్కడ శిథిలములైన బజారులలోను పాకలలోను నాకు తలవని తలంపుగా ఇంగ్లీషు ముస్తాబు పెట్టెలు (Dressing cases) వ్రాతసామానుపెట్టెలు, కత్తులు, చీటీగుడ్డలు, పిస్తోళ్లు, తుపాకులు, చిత్రపుప్రతులు, ఇతర ఇంగ్లీషు సామానులు, అనుకరణములు నాకు గనబడి యీ ప్రాంతములందలి సామాన్యజనులు బీదవారుకూడ ఈ వస్తువులయందెంత వ్యామోహపరులైయున్నారో తెలిసినది" (Bishop Heber's Journal Vol.III. pp.297-298).

* Rise and Fulfilment of British Rule in India. Edward Thompson and G.T. Garratt pp 114-115.



## దేశీయులు దొరలు

భారత దేశమున నాంగ్లేయ పరిపాలన స్థాపింపబడిన పిదపగూడ ఇంగ్లీషువారి ముఖములుచూడని మారుమూల గ్రామములు, మంచిచెడుగు లెరుగని బీదరైతులు కొండ జాతులవారు ననేకు లుండిరి. కుంఫిణీవారి పరిపాలనమునగూడ పూర్వమువలెనే తమ్ముపీడించు గ్రామాధికారులు లంచములు పుచ్చుకొను ఉద్యోగులు మాత్రమే వీరికి కనబడుచుండిరి. పన్నులధికములై రైతులు బాధలు పడుచునే యుండిరి.

ఈ విశాల భారతమున పూర్వకాలమునాటి మహానగరములు పాడుపడి, ఆ శిథిలముల మధ్య జీవించుబీదజను లనేకులుండిరి. వీరా చలువ రాతిమొండిగోడలమధ్య గుడిసెలు వేసికొని పాడుపడిన మహాసౌధములు, తటాకములు, రాజనగరులు, దేవాలయములు, మశీదులు చూచియు చూడనట్లే చరింతురు. మధ్యమధ్య నొకబురుజు, గాలిగోపురము తన బంగారు మలాముచేశిన శిఖరము చూపరుల నాకర్షించును. ఈ చిత్రములను జూచుటకు ఐరోపాస్త్రీ పురుషులప్పుడప్పుడు వచ్చుచుందురు. ఏమహారాజు గాని ఏ నవాబుగాని తమ్మాహ్వానింపగా, నీ దారిని బోవుచు వీనినిజూతురు.

ఈ పాడుపడిన మహానగరములందు దిబ్బల మధ్యమున జీవించు ప్రజల విధానము చాలా చిత్రముగా నుండెను. 1857 నాటికి ప్రజల మతాచారవ్యవహారములు కలగలపుగ నుండెను. అచ్చటి ముసల్మాను ప్రజలు కురాను నిషేధించు పుష్పములను, ఇతర పూజా ద్రవ్యములను నుపయోగించుచుండిరి. పవిత్రమైనచోట దేవుని పూజించుటయె ప్రధానము గాని, అది గుడియైన నేమి మశీదు అయిననే మనుభావముతో బీదహిందవులు మశీదులలో దేవు నర్చించుటయు కానవచ్చుచుండెను. కొన్నిచోటుల ప్రజలు అజ్ఞానమువలన అపవిత్రపుపనులు చేయుచుండిరి. దేశములోని మతాచార వ్యవహారములన్నియు నిట్లు కలగాపులగముగ నున్నస్థితిలో, విదేశీయ ప్రభువు లీప్రజలయొక్క అంతర్యములను భావములను బాగుగా గ్రహించి పరిపాలించుట చాలా కష్టమైన పనిగ నుండెను. పరిపాలింపబడు జనసామాన్యముయొక్క రాజకీయ సాంఘిక మతవ్యవస్థలు ఒకదానిలో నొకటి మిళిత మైపోవుచున్నస్థితిలో నాగరికత యున్న సమయమున నెన్ని చిక్కులైన తటస్థింపవచ్చును. ప్రపంచమున నన్ని జాతుల చరిత్రలయందును మతాచార్యులే పరిపాలకులును, వీరులును, స్మృతికర్తలును, వైద్యులును, పండితులునై యుండుస్థితి యొకటి కనబడుచుండును. అట్టి స్థితిలో ఆ ప్రజల రాజ్యాంగ వ్యవస్థలోనే భాగమును కదలించినను తీగ కదలించినయంతటనే డొంకయంతయు కదలునట్లే తక్కిన

భాగములన్నియు కదలిపోవును. అట్టి సమయములందు ఎంత మంచి యుద్దేశ్యముతో చేసిన కార్యమైనను ప్రజల అపోహలకు అనుమానమునకు గురియై, ప్రభువులపట్ల ప్రజలకు విరోధభావము కలుగుటకు కారణమగును. లేదా అసమ్మతి తెలుపుటకు ప్రశస్తమైన ప్రజల హృదయములు పగులగొట్టి వారియందు విషాదభావము కలిగించును. కొంటెతనమునకు కొందరింగ్లీషు సైనికులొక బ్రాహ్మణునిచేత బలవంతముగ నొక పిసరు గొడ్డుమాంసమును దినిపించగా, దీనికి కుంపినీ ప్రభుత్వమువా రెంత పశ్చాత్తాపము చూపినను ఎంత పరిహారము చేసినను గూడ నాబ్రాహ్మణుని నరకకూపమునుండి రక్షింపజాలరను భావము దేశప్రజలలో పాదుకొనియున్నది. ఇట్లే ఇతరవిధములగు అకృత్యములవలన ప్రజలయందు కలుగు విషాదభావము నటులుండనిచ్చి, కుంపినీ ప్రభుత్వమువారు దేశప్రజల యొక్క మతాచార వ్యవహారములకు భంగము కలిగించు క్రొత్త శాసన ధర్మములను చేసినప్పుడుగూడ ప్రజలలో గొప్పసంచలనము కలుగును. అనాది సిద్ధముగానున్న వారసత్వ పద్ధతిని మార్చునట్టి క్రొత్త శాసనములును ప్రజల మేలుకొరకే ఇంగ్లీషువారి ధర్మశాస్త్ర ప్రకారము న్యాయములు ధర్మములునని తోచు ఇతర ఏర్పాటులు చేసినప్పుడు ప్రజలు వాని ప్రాశస్త్యమును గ్రహింపక బాధపడుదురు. ఇది గమనింపక ఇంగ్లీషువారు వారసత్వధర్మములం దనేకమైన మార్పులు చేసిరి. క్రైస్తవులైనవారికి హిందూ కుటుంబమునందు ఆస్తిహక్కులు పోవను శాసనము ప్రజలలో చాలా బాధకలిగించెను. దత్తస్వీకారము చేసికొనిన రాజకుమారులకు రాజ్యమివ్వక నిరాకరించుట, అశాంతికి కారణమయ్యెను. ప్రజల కుటుంబములందు దేవాలయములందు గుసగుసలు వినవచ్చుచుండెను. ఆంగ్లేయులు పాలకులు, భారతీయులు పాలితులు దారిద్ర్యమున అజ్ఞానమున మునిగియున్న భారతదేశ కర్షకుల కార్మికుల సంగతి యటులుండనిచ్చి, ఈ యాంగ్లేయ పరిపాలనమున ఇంగ్లీషు నేర్చుకొని కొన్ని వృత్తులందు, కొన్ని వ్యాపారములందు, కొంత ధనము సంపాదించిన పైతరగతులవారిని ఆంగ్లేయోద్యోగులకు ఇంగ్లీషు వర్తకులకు గూడ సలాముచేసి, వారిని గౌరవించు చుండిరి. మొదట ఇంగ్లీషుపరిపాలన పాదుకొనకపూర్వము ఇంగ్లీషువారుధనవంతులగు జాగీరుదారులను రాజులక్రింద నవాబులక్రింద పనిచేయు ఉద్యోగులను గౌరవముగనే చూచుచుండిరి. కాని, ఇప్పుడు తామే దేశపరిపాలకులైనందున వీరిని నీచముగ జూచుచుండిరి. పూర్వమువలె వారితో కలిసి మెలసి తిరుగుట మానిరి. వారింగ్లీషు నేర్చుకొని తమతో సమానముగ మెలగుట కిచ్చగింపకపోయిరి. క్రమక్రమముగా నొక జాత్యహంకారము వర్ధిల్లెను. దేశములో నింగ్లీషుపాఠశాలలు వృద్ధియై, ప్రజలలింగ్లీషుభాష



నభ్యసించి, ఆంగ్ల సాహిత్యమును జదివి, కొన్ని పెద్ద యుద్యోగములు చేయుచున్న కొలదియు దేశములో రాకపోకలు అభివృద్ధిజెంది వర్తాపత్రికలు వ్యాపించినకొలదియు, నింగ్లీషుజాతివారికిని భారతీయ జాతియులకును మధ్యగల తారతమ్యము వృద్ధియైనది.

ఆంగ్లేయులు దేశీయుల అగౌరవపరచుటయధికమై, విరోధభావమును వృద్ధిచేసినది.

## ఆంగ్లేయుల జీవితవిధానము

హిందూదేశములోని తెల్లవారెట్లు జీవించుచుండిరో చూతము : నీలిమందు చెఱకు ప్రత్తితోటలు వేయుచు దేశములోనే స్థిరపడినవారు ఉత్తరమున హిమాలయ ప్రాంతముల నుండిరి. గంగానది పొడుగునను దక్షిణమున కావేరివరకుగల నదులకు ఆనకట్టలు కళింగలు లాకులు నిర్మించిన ఇంజనీర్లు పబ్లికువర్క్సు మేనేజర్లు మొదలగువారు దేశములో స్థిరముగా కాపురముండు ఐరోపాజాతివారు నుండిరి. వీరు దూరదూరముగా కట్టుకున్న ఇండ్లలో జీవించుచుండిరి. ఈ యిండ్లకు విశాలమైన వరండాలు (వసారాలు) చూరులు నుండెను. పైన దట్టముగా గడ్డికప్పి యుందురు. చుట్టును నీడనిచ్చు వివిధ వృక్షములు పుష్పజాతులు పెంచుచుందురు. కష్టపడి కొన్ని ఇంగ్లీషుపూలచెట్లుకూడ వేసి పెంచుచుందురు. ఉత్తరపుకొనను తేయాకుతోటలున్నవి. వీనిచుట్టు కంచెగా గులాబీ చెట్లనే దట్టముగా వేయుచుండిరి. వంతెనలు వేయవలసిన చిన్న చిన్న నదుల ప్రక్కను ద్రాక్షతీగెలు పెరిగికోతుల కిచకిచలు రామచిలుకలకిలకిల రావములు దయ్యపు సీతాకోకచిలుకలు పెద్దపులులు అడవిజాతులుగల అడవిప్రదేశముల మధ్యను ఐరోపావారు తమ యిండ్లను గట్టుకొనుచుండిరి.

సివిలు ఉద్యోగములుగాని సైనికోద్యోగములుగాని చేయునీ ఇంగ్లీషువారందఱును పెట్టి పుట్టిన మహారాజులుగ పరిగణింపబడుచుండిరి. వీరెక్కడికయిన ప్రయాణము చేయుచున్నప్పుడు వారి సవారీలను మోయు బోయీలు "లోపల ప్రభువుగారున్నారు తొలగిపొండు" అని దారిలో పోవువారిని హెచ్చరించుచుందురు.

ఒకవేళ నీదొరలు సర్వ సామాన్యమైన మోటబండ్లలో ప్రయాణము చేయుచుండినను గూడ దారినిపోవు సిపాయిలు తటాలున వెనుకకుతిరిగి మిలిటరీవారు చేయు సలాము చేయుదురు. గ్రామరైతులు రోడ్డుపైన సాష్టాంగముగా సాగిలిపడి మ్రొక్కుదురు.

పట్టణములో నీదొరలు పోవునప్పుడు క్రిక్కిరిసియున్న బజారులలో జనులను తొలగించి వీరికొరకు దారిచేయుదురు. ఇక దేశములో వీరి సౌకర్యముకొరకందరును

తొలగువారే! ఆంగ్లేయ కుంఫినీవారి సామాన్య సివిలు ఉద్యోగుల జీవిత పద్ధతికూడ తక్కినవారి జీవితవిధానమువలెనే యుండెను. గాని, వీరికి ప్రొద్దుపోవుటకు ఇతరజాతవారి సాంగత్యముండెను. సొసైటీలు క్లబ్బులు మొదలైన కొన్ని సాంఘిక సంస్థలు నుండెను. జాతివారి ప్రజాసంఘము చేరు చర్చి యొక్కటితప్పకయుండెను. అయితే కొత్తగా వచ్చిన సివిలు ఉద్యోగి కొన్నాళ్లపాటు ఇట్టి సౌకర్యములు లేని మారుమూల ప్రదేశములో పనిచేయవలసి యుండెను. ఈ యాంగ్లేయయువకులు రివిన్యూశిస్తులు వసూలు చేయుచు చిన్న వ్యవహారములందు న్యాయపరిపాలన చేయుచు, మనస్సున కాహ్లాదమును కలిగించు ఇంద్రియ వ్యాపారములు లేకపోవుటవలని బాధను దేశముయొక్క వేడిమివలని బాధను భరించుచు ఒంటరిగ జీవించుచుండిరి. వీరిలో తెలివైనవారు కొందరు, దేశప్రజలభాషను నేర్చికొని, వారి ఆచార వ్యవహారములను గురించియు, ఇతర విషయములను గూర్చియు తెలిసికొని తాము చేయబోవు పెద్దఉద్యోగములకు వలసిన శక్తి సామర్థ్యముల నలవరచుకొనుచుండిరి. వీరిలో ప్రతిభాశాలులైన కొందరు యువకులు, దుష్టశిక్షణమును, శిష్టరక్షణమును చేయుచు ప్రజల గౌరవమునకు పాత్రులగుచుండిరి. మనోదౌర్బల్యము గలవారు బెంగపెట్టుకొని బాధనందు చుండిరి. దుర్వ్యసనములకు వశులగువారు లెక్కలేనన్ని పొగచుట్టలు కాల్చుచు, దేశముయొక్క ఉష్ణోగ్రత తమ ఆరోగ్యమును పీల్చివేయుట కవకాశమిచ్చుచుండిరి. రసికులైనవారు తమ స్వీయ చరిత్రలతోను పద్యములతోను లెక్కలేనన్ని కాగితములను నలుపుచేయుచుండిరి. బుద్ధిస్థిరము లేనివారు తమ కాలమును, అవకాశములను ఆరోగ్యమును తమ స్వల్పపుటాదాయమును వృధచేయుచుండిరి.

దేశములో నుండిన సైన్యముల కంటోన్మెంటు దండు ప్రదేశములలోని స్థితిగతులు ఇంగ్లీషు బొమ్మలలోను పుస్తకములలోను చిత్రింపబడినవి. ఆగ్రా (కంటోన్మెంటు) దండులోని సివిలు మిలటరీ లైనులు ఆ మహానగరము 5 మైళ్ల పొడుగు 2 మైళ్ల వెడల్పుగల భాగము నాక్రమించియుండును. వానిలో విశాలమైన తిన్నని నున్నని రాజవీదులు ఒక ఉద్యానవనము పార్కు ఒక చర్చియు వాణిజ్యకార్యాలయము కొరకు ప్రభుత్వ కార్యాలయములకొరకు కట్టబడిన పెద్ద సౌధములు నుండెను. మీరతులో తక్కిన కంటోన్మెంటులలో నున్న సామాన్య సౌకర్యములన్నియు నుండుటయు గాక, మంచి నీటివసతి యుండుటవలన చక్కగా పెరిగిన పూలతోట లున్నవి. కాన్పూరులో విడివిడిగా కట్టిన బంగాళాల ముందునుండియె గంగానది ప్రవహించు చున్నందున ఆ యిండ్ల తోటలు చాల సౌఖ్యముగ నుండెను. ఆ చెట్లనీడలోనుండి పుష్పముల సుగంధము నాఘ్రాణించుచు, చిక్కగా నున్న క్రొత్తనీరు ప్రవహించి కిటకిటలాడుచు వచ్చుచు పోవు



నౌకలను ఆవలి యొడ్డున తెల్లని యిసుకతిప్పను దాచి, యివతల పచ్చని పైరులతో నిండిన బయిళ్లను పొలములను వేడిలో పొగలు గ్రమ్మి, దృష్టికి బాగుగా కనబడని భూములను జూచి ఆనందించుచుండిరి. ఈ కంటోన్మెంటులలో జాతివారి స్త్రీలు పిల్లలు నుండి రని అందరెఱిగిన విషయమే. ముఖ్యమైన ప్రదేశములలో అమెరికా ఐరోపా దేశములనుండి వచ్చిన (మిషనరీలు) క్రైస్తవ మతప్రచారకులుకూడ నుండిరి. ఇక్కడ క్రైస్తవ పాఠశాలలు క్రైస్తవ దేవాలయములు నుండెను. ఈఐరోపాజాతి మొగవారు సివిలు ఉద్యోగములందు, సైనికోద్యోగములందు ప్రతిదినము కొన్ని నియమితకాలములందు తమతమ ఉద్యోగపుపనులు చేయవలసి యుండిరి. వీరి భార్యలు ఇరుగుపొరుగిండ్లకు పోయి, పెత్తనముల చేయుచుందురు. ప్రాతఃకాలమునను సాయంత్రమును గాలికొరకు గుఱ్ఱపు బండ్లలో పోయి విహరింతురు. ఈ పట్టణముల మార్గమున బోవు ఆంగ్లేయ బాటసారులకు వీరాతిథ్య మిచ్చి యాదరించుచుందురు. ఇట్లే పెద్ద దండు ప్రదేశములందు వసించు ఐరోపావారిలో గూడ నొకవిధమైన పరస్పరస్పర్థ యుండెను. ఆనాడు ప్రధానములుగ నుండిన మద్రాసు బొంబాయి వంగరాష్ట్రములను మూడురాజధానులకు వేరువేరు పరిపాలనవర్గము లుండెను. ఆయీ రాజధానులకు చెందినవారికి రెండవ రాజధానివారిని జూచిన కొంత అసహనముండెను. వంగరాష్ట్రములోని జాతివారు ప్రొద్దున మొదలుసాయంకాలమువరకు "కీ.హీ." అని తమ నేటి వుపరిచారికులపై నాధారపడి యుందురని చెన్నపురిజాతివారు పరహసింపగా, వీరందరు, "మొళఘుతణ్ణి" మనుష్యులని వారు పరిహసించుచుండిరి. ఈ రెండు రాజధానులవారును బొంబాయివారిని తక్కువగ జూచుచుండిరి.

ఇక కలకత్తాలోని ఆంగ్లేయుల జీవితవిధానము పరికింతము. హుగ్గీలీనదినుండి కలకత్తాకు పోవు మార్గము చాల సుందరమైనదని జాగ్రత్ప్రసిద్ధము. ఆదారిలో కనపడు దృశ్యములు క్రిందతోటలు పైన మనోహరములైన గొప్ప సౌధములు చూపరుల నాకర్షించుచుండెను. ఇది యావద్భారతదేశమునగల బ్రిటిషు ప్రభుత్వముయొక్క ముఖ్య పట్టణము.

ఈ కేంద్రప్రభుత్వముయొక్క కార్యాలయములకొరకు గొప్ప సౌధములు నిర్మింప బడెను. ఈ కలకత్తాలోని జాతివారి వినోదములు ఆహార విహారములు చూడముచ్చటగ నుండెను. చాలా విలువ గలిగి బల్లలు కృంగునంతబరువు గల ఆహారపదార్థములు పుష్కలముగా గల విందులు, ఈ స్త్రీ పురుష శరీరముల ఆవిరియై హరించిపోవేమి? యని ఆశ్చర్యము కలిగించు అతి మనోహరమైన "బాల్సు" అనబడు నృత్య వాద్య వినోద

క్రీడలు (నేటివు విదేశీయు లనేకులు చూచి తమకు తోచినట్లు అనుకొనుచుండగా) జాతివారు భూమిపైనను నీటిపైనను చేయు వినోదక్రీడలు నీ కలకత్తాలో జాతివారి విలాసములు తమ దేశాచారమున ఇటువంటి సల్లాపములు కనివిని యెరుగని నేటివు ప్రజలీ ఐరోపావారిని గూర్చి పలువిధములుగ తలంచుచుండిరి.

భారతదేశమున జీవనము చేయుఐరోపా జాతివారి వేషభాషలను, ఆచార వ్యవహారములను జాగ్రత్తగా కనిపట్టి చూచుదేశీయ ప్రజలలో నింకొక తరగతివారు బయలుదేరిరి. ఇంగ్లీషువారీ దేశమునకు వచ్చిన తరువాత వీరిభాష నభ్యసించి, వీరి సాహిత్య గ్రంథములు పఠించి, వీరి పాఠశాలలందు చదివి, వీరి సభ్యతను గమనించి అనేక విషయములందు వీరి ననుకరించు ఆంగ్ల విద్యాధికులకు భారతీయు లొక క్రొత్తతరమువారు బయలుదేరిరి. వీరికి తమ దేశపు వర్ణాశ్రమ ధర్మమునందలి నమ్మకము పోగా, మూఢవిశ్వాసములు, పూర్వాచారములను విసర్జించి సనాతనధర్మపరులగు తమ దేశీయులకు భిన్నమైన ప్రకృతి కలవారైనారు. అయితే పరిపాలకుల జాతిలో వీరు లీనము కాలేదు. అందువలన వీరిది ఒక పెద్ద సమస్యగా పరిణమించెను. దేశ ప్రజలకీ దొరలయందు భక్తి విశ్వాసము లుండెననియే చాలమందిదృఢవిశ్వాసము. ఆ కాలమున క్రైస్తవ మత ప్రచారము చేయుటకు ప్రయివేటు క్రైస్తవమతప్రచారకు లనేకులీదేశమునకు వచ్చి పనిచేయుచుండిరి. కుంఫిణీ ప్రభుత్వము తమ క్రైస్తవోద్యోగులకొరకు కొందరు క్రైస్తవ ప్రచారికులను ఆచార్యులను పోషించుచుండెను. దీని లాభమెవరైన పొందదలచినచో వారి కభ్యంతరము లేదుగాని, అధికారరీత్యా దేశప్రజలలో క్రైస్తవమతప్రచారము చేయుటకు మాత్రము చాలా కాలము వరకు కుంఫిణీ ప్రభుత్వము అంగీకరింపలేదు. ఇది వారి ప్రధానసిద్ధాంతముగ నుండినందున వారి కొలువులో నుండిన సివిలు మిలటరీ యుద్యోగు లెవ్వరును క్రైస్తవమత ప్రచారము చేసి ప్రజలను క్రైస్తవులుగ చేయకూడదని కట్టడి చేసిరి - అయిన నాకాలమున దేశప్రజలలో కొందరు క్రైస్తవులుగా చేయబడిరి. వీరు నిజముగా వారు క్రైస్తవమతధర్మములను అర్థము చేసికొని, హృదయపూర్వకముగాక్రైస్తవులైరో, ఉద్యోగముల నాశించి యట్లు చేసిరో పైయధికారుల ప్రాపకము గోరి యట్లుచేసిరో మాత్రము చెప్పుటకు వీలు లేకుండెను.

## ఆంగ్లేయులు-ఆంగ్లో ఇండియనులు

పందొమ్మిదవ శతాబ్ధియారంభమునాటికీ దేశమున నుండిన ఆంగ్లేయుల జీవిత విధాన మెట్లుండునో 1823-1826 మధ్య కలకత్తా బిషప్పు(ప్రధాన క్రైస్తవమతాచార్యుడు)గ



నుండిన బిషప్ హెబరుగారు తమ దినచర్యలోను, లేఖలలోను చక్కగా వర్ణించియున్నారు.

"ఉత్తర హిందూస్థానమున వివిధ రాష్ట్రములలో ఇంగ్లీషువా రక్కడక్కడ కాపురము చేయుచున్నారు. నేను మొదట అనుకొనినంత కన్న ఎక్కువ ఆంగ్లేయు జనసంఖ్యయే యున్నది. అయితే, వీరిలో చాలామంది సివిలు ఉద్యోగములో సైనికోద్యోగములో చేయు ప్రభుత్వోద్యోగులేగాని, స్వతంత్రజీవనము చేయువారు తక్కువ. నీలిమందుతోటలు వేసి పెంచు ఐరోపావారందరును వంగ రాష్ట్రముననే కాపురమున్నారు. వీరందరు నెల్లప్పుడు నేటివులతో పోరాడుచు, వారిని అనేకవిధములుగా బాధలపెట్టుచుందురు. వీరు జీవించు జిల్లాలలో వీరు చేయు ఆకృత్యములవలన ఇంగ్లీషువారి పేరు నేటివులదృష్టిలో నీచస్థితికి దిగిపోయినది. ఈ దేశమున నున్న సామాన్యతరగతి ఆంగ్లేయుల ప్రవర్తన మిట్లే యుండి, ఇట్టివారిక్కడ నుండుట యెంతప్రమాదకరమో తెలుపుచున్నది."

ఉత్తర హిందూస్థానముననున్న ఆంగ్లేయులు కలకత్తాలోని వారివలెనే వివిధ తరగతులకు జెందియున్నారు. రాజధానిలో పనిచేయు నియమింపబడుటకు పూర్వము దేశములోని వివిధప్రాంతములలో నుద్యోగముచేయువారు ముఖ్యులు : ప్రభుత్వముయొక్క సివిలు పరిపాలన జరుపుప్రతి జిల్లా ముఖ్యపట్టణమునకును అచ్చట పనిచేయు న్యాయాధికారి (జడ్జి), కలెక్టరు, రిజిస్ట్రారు, సివిలు సర్జను (వైద్యాధికారి), తపాలాకచ్చేరి అధికారి పోస్టుమాస్టరు నాంగ్లేయులుగ నుండి, ఒక ప్రత్యేకసంఘముగ నుందురు. మిలటరీ స్టేషనులు నిజముగా తాత్కాలికముగా నిలుపు దండు ప్రదేశములు. అక్కడ సిపాయిలకొరకు వేసిన పూరిపాకలును, అధికారులకొరకు విడిగా వేసిన పూరి ఇండ్లును వరుసగా లైనులలో నుండును. ఆసుపత్రియొకటి, ఒక్కొకచోట నొకచర్చియు దానికి చాప్లిను అను ఉద్యోగియునుందురు. ఈ సివిలు ఉద్యోగులుగాని, మిలటరీ యుద్యోగులు గాని నేటివు ప్రజలతో నెట్టి స్నేహమును చేయరు. ఈ ఆంగ్లేయోద్యోగులకును ఒకతరగతి మేజస్ట్రేటులకును గొప్పస్థితిలో నున్న నేటివులకును ఒక్కొకరిని దర్శించు మర్యాద మాత్రముండును. కలకత్తాలో నున్నట్లు దేశములోని సివిలు మిలిటరీ యుద్యోగులును ఇంగ్లీషు దేశపు సాంఘిక మర్యాదలు గలిగిన ఆంగ్లేయజనసంఘముగా నేర్పడియుందురు. అనగా, ఒకరిని పరిచయము చేసినగాని మాట్లాడకపోవుట మొదలగు సాంఘిక నిబంధనలు పాటింపక, ఒండొరులతో సేనహితులై అన్యోన్యముగా మెలగుదురు. పశ్చిమోత్తరపరగణాల దగ్గరకు పశ్చిమ సరిహద్దు దగ్గరకు పోయినకొలదియు ఈస్నేహభావము ఈనిరాడంబర పద్ధతి యభివృద్ధియగును. వన సంతర్పణములందు వినోదములకొరు చేయు ప్రమాణము లందు కనపడు అన్యోన్యభావమే ఈ (camp) తాత్కాలిక కాపురస్థలములందు కనబడును.

సివిలు ఆంగ్లేయోద్యోగులు చాల నాగరికత గలిగి జీవింతురు. గుఱ్ఱపురౌతులు, బంట్రోతులు పరివారజనము వీరివెంట నుందురు. గవర్నమెంటు హవుసు దగ్గరకు వచ్చునప్పుడు మాత్రము ఈ ఉల్లాసము స్నేహభావము పోయి, మౌనమును ఠీవియు అధికమగును. ఈయుద్యోగులు తెలివి తేటలు కలవారైనట్లుగనే తనకు తోచినదనియు, అందులో కొందరుపింఛను పుచ్చుకొన్న పూర్వపుటుద్యోగులు కలకత్తాయొక్క సౌఖ్యముల కాశపడక దేశప్రజలకు మేలు చేయుటకు యత్నింపుచున్నారనియు, అట్టివారిలో బెరెల్లీ లోని హకిన్సుదొర, ఆల్మోరాలోని ట్రయిలుదొరయు, కాశీలో నున్న బ్రూకు దొరయు ముఖ్యలని హెబరుగారు వ్రాసిరి. (చూడు బిషప్‌హెబరుగారు ప్రతాప్‌ఘరునుండి 1825 మార్చి 1వ తేదీన వ్రాసినలేఖ, బిషప్ హెబర్సు జర్నల్ 3వ సంపుటము. 332-341 పుటలు).

బిషప్ హెబరుగారు 1825వ సం. మే నెల 12వ తేదీన బొంబాయినుండి, ఇంగ్లండుకు వ్రాసిన లేఖలో, ఆకాలమున ఈ దేశములో నున్న ఆంగ్లేయయువకులకు గల దుర్వ్యసనములను గూర్చి కొంత వ్రాసియున్నారు. ఆంగ్లేయోద్యోగులకు తమ దేశమును బంధువులను విడిచి ఇక్కడ చాలకాలము ప్రవాసముండుటయె పెద్దకష్టముగనుండెను. ఇప్పుడుకుంఫినీ వారు కొన్నాళ్లుకొలువుచేసిన యుద్యోగులకు పింఛనుల నిచ్చుటకును శలవు లిచ్చుటకును అవకాశము కలిగించినందున ఈ కష్టము తీరుననిరి.

ఈదేశముయొక్క అత్యుష్ణస్థితిని బట్టి మద్య పానవ్యసనమును జిక్కినవారి యారోగ్యములు చెడిపోవుచున్నందున, మర్యాదస్థు లీవ్యసనమున జిక్కినవారిని గౌరవింప రనియు, అందువలన త్రాగుడువలన పాడైనవారు యెక్కువ మందిలేరనియు చెప్పినాడు. పూర్వ కాలమున నీదేశమున పనిచేయవచ్చిన ఆంగ్లేయులు నేటివుస్త్రీల నుంచు కొనుచుండిరి.

ఇప్పుడు సివిలు మిలిటరీ యుద్యోగములు చేయుయువకులం దీవ్యసన మొకగొప్పగా నెంచబడుటలేదు. ఇట్లే పూర్వపుటుద్యోగుల కలవాటైన గుఱ్ఱపు పందెముల (Turf) జూదము నీకాలమువారిలో చాలా తగ్గినది. ఈ వ్యసనములందు తిరుగువారికి పూర్వముండిన మర్యాద యిప్పుడు లేదు. ఈ దేశమున నుద్యోగముచేయవచ్చువారు ముఖ్యముగా కలకత్తాలో డాబుదర్పములకొరకు అమితధనము వ్యయము చేయవలసియుండి, అప్పులలో దిగుదురు.అన్నిటి కన్నను భయంకరమైన విషయము వీరు క్రైస్తవ మతమందు భక్తిని గోల్పోయి, నాస్తికులుగా ప్రవర్తించుటయే. ఇది పరిసరముల ప్రభావము వలన కలగుచున్నది. ఇటీవల చిన్నచిన్నయువకులు పెండ్లిండ్లు చేసికొని,



భార్యలతో నీదేశమున కాపురముండుటవలన వీరిసంపారములు, స్త్రీలు వీరికిని వీరి స్నేహితులకును మంచి మర్యాదను నీతినియమములను కలిగించుచున్నారు. (బిషప్ హెబర్సుజర్నల్, 3వ సంపుటము 372-375 పుటలు).

## సంకరజాతి

భారతదేశమునకు మొదట వచ్చిన పోర్చుగీసు వారీదేశపు క్రిందిజాతుల స్త్రీలతో సంబంధములు కలిగియుండినందున, నొకసంకరజాతి యేర్పడినది. వీరు మతమున కాతలికు క్రైస్తవులు. తరువాత వచ్చిన ఇంగ్లీషువర్తకులు సివిలు మిలిటరీ యుద్యోగులకును పెండ్లిండ్లు లేనందునను, మంచిదొరసానులీ దూరదేశమునకు రానందనను తల్లిదండ్రులులేని జాతిపిల్లలను కొందరను వివాహమాడిరి. మరికొంద రీదేశపు భోగపు వాండ్రనుంచుకొనిరి. ఇంకను కొందరీదేశపు క్రింది కులముల స్త్రీలతో సంబంధములు కలిగియుండిరి. దీనివలన నొక సంకరజాతి బయలుదేరినది. వీరిని "యూరేషియను" లనియు, "ఆంగ్లోయిండియను" లనియు వ్యవహరింపసాగిరి. ఈ సంకరజాతివారు భారతదేశములో వివిధ ప్రాంతములందు జీవించుచున్నారు. కొందరు నీలిమందు తోటలలోను కొందరాయారాజ్య భాగములందు కుంఫిణీవారేర్పాటుచేసిన మంచి జాతియెడ్లను తయారుచేయు పనిలోను, ప్రదర్శనము కొరకు స్థాపించిన వ్యవసాయపు మడులలోను,పట్టుపురుగుల పెంపకములోను పనిచేయుచుండిరి. వీరంద రింగ్లీషు ప్రోటేస్టెంటు క్రైస్తవులుగనుండిరి.

ఇటువంటివారు గంగా యమునానదుల మధ్య ఎటావా మైనాపూరులలో సామాన్యమైన జీవనము గడుపుకొనుచుండిరి. వీరు పెండ్లిచేసి కొన దలచినచో, తన యింటికి 70 మైళ్లదూరమున ఆగ్రాలో నున్న చాప్లినుదగ్గరకు పోవలసి యుండెను. ఇందువలన చాలాబాధ కలుగుచుండెను. (బిషప్‌హెబరు జర్నల్ 3వ సంపుటము 424 పుట) ఈ సంకరజాతివారికి చాలా కష్టములుండెను. వారు వేషభాషలలో ఆచారములలో ఆంగ్లేయుల ననుకరించుచు, దారిద్ర్యమున దుఃఖము లనుభవించుచుండిరి. ఎంతస్ఫుర్రూపులుగ నున్నను ఈ స్త్రీలను అసలు ఐరోపాజాతి స్త్రీలు తమ సంఘమునందు కలియనీయకుండిరి. వీరికి అవమానములు, అగౌరవములు తటస్థించుచుండెను. (ఇట్లు పరిపాలకజాతి సంతతి వార మని చెప్పుకొనుచు నేటివులను నీచముగ జూచువీరు, ఉభయులవలన నీచముగ చూడబడుచుండిరి.)

# దేశీయక్రైస్తవులు

ఆంగ్లేయ మిషనరీలు ఉద్యోగులు విదేశీయులను క్రైస్తవమతమున గలుపుకొనుటకు చేసిన విశ్వప్రయత్నముల ఫలితముగా కొన్నాళ్లకు భారతదేశమున కొంత క్రైస్తవ జనసంఘమేర్పడెను. దేశీయులలో క్రైస్తవులైనవారు తమ పూర్వవాసనలను పోగొట్టుకొనజాలక, కులభేదములతో నొండొరులతో భోజన వివాహములు చేయకుండిరి. హిందూ సంఘమునందలి వర్ణభేదములన్ని యువీరియందు స్థిరముగా నుండెను. ఇది దక్షిణ హిందూదేశము నందును సింహళమునందును అతితీవ్రమై, కులకుక్షలకు గారణముగ నుండెను. కులమర్యాదలను మిషనరీలు హర్షించుచుండిరి. దీనిని గూర్చి విచారణలు పరిష్కారములు జరుగుచుండెను - (బిషప్ హెబరు జర్నల్ 3వ సంపుటము పుట 207-208) 1826 సం॥ మార్చి 21వ తేదీన బరంపురము నుండి వ్రాసినలేఖలో బిషపు హెబరుగారు ఆ ప్రాంతములందీకులభేదములు క్రైస్తవులందతి తీవ్రముగ నుండుటయు పూర్వపు మిషనరీలీభేదములు క్రమక్రమముగా విద్యాభివృద్ధియైనచో పోవుననియెంచి, అవి వంశపారంపర్యపు హక్కులుగా, అనగా మతమునకు సంబంధించని సివిలుహక్కులుగా పరిగణించుచుండుటయు, ఈభేదము లట్లు పోక స్థిరపడుచున్నవని వ్రాసినాడు. అనేకులు తమ పెండ్లిండ్లలోను ఇతర పండుగలందు పూర్వాచారముల నవలంబించు చుండి రనియు,క్రొత్తగా వచ్చిన ఆంగ్లేయజర్మను యువకులగు మిషనరీలు దీనిని నిషేధించుచున్నారనియు దీనినిగూర్చి క్రైస్తవులు తనకు అర్జీలు పెట్టుకొనిరనియు వ్రాసినాడు.

(బిషప్ హెబరుగారి జర్నల్ మూడవ సంపుటము పుటలు 444-445) ఇట్లెన్నో కష్టములు పడి క్రైస్తవమతమును గలుపుకొనిన భారతీయులసంఖ్య యిప్పటికి తొమ్మిదిలక్షలైనది. క్రైస్తవులైన భారతీయులు బ్రిటిష్ పరిపాలనకు పట్టుగొమ్మలుగ నుందురనియాంగ్లేయులు మొదట తలచియుండిరి. దేశీయ క్రైస్తవులను తాము జీవించు దేశములోని ఇతర ప్రజలతో నన్యోన్యముగా నుండక, ఆంగ్లేయపరిపాలకులనే యాశ్రయించిరి గాని త్వరలోనే ఆంగ్లేయులలో స్వజాత్యభిమాన మభివృద్ధియై దేశీయక్రైస్తవులను నీచముగా చూచుట ప్రారంభించిరి. ఈ జాతిభేదములు వర్ణభేదములు క్రైస్తవమత సంఘమునందు సంస్థలందుకూడ వ్యాపించి, తారతమ్యములు విచక్షణలు పక్షపాతములు వర్ధిల్లెను. అంతట దేశీయ క్రైస్తవులలో జాతీయచైతన్యము కలిగినది.



# ఆంగ్లేయుల ప్రవర్తన - మర్యాదలలో మార్పు

భారతదేశమునకు వచ్చిన మొదటి ఆంగ్లేయులు తమ జీవితవిధానమునందు ఎట్టి హద్దుపద్దులుగాని, నీతి నియమములుగాని లేక ప్రవర్తించిరి. వీరు నాస్తికులవలె వామాచారుల వలె వర్తించిరి. వీరిమతము కేవలము ఇతరులపైన పగసాధించు క్రూరమతముగ, ధనాశాపరులమతముగ అక్రమలాభములను పొందువారి మతముగ తోచునట్లు జీవించుచుండిరి. ఈ మనుష్యుల ఇంద్రియసుఖా పేక్షకు హద్దులేదు. వీరిమాటలు అపభ్రంశములైనవిగ నుండెను. వీరి కృత్యములు అపవిత్రములుగ నుండెను. వీరిమతము కేవలము అహంకారమునకు స్త్రీలోలత్వమునకు ఐహిక వాంఛలను అనుభవించుటకు ఏర్పడిన మతముగా హిందువులకు తోచుచుండెను. అని కాంబెల్‌గారు బ్రిటిష్ ఇండియా అనుపుస్తకమున వ్రాసిరి. (చూడు పుటలు 166.168) తరువాత వచ్చిన ఉద్యోగులను గురించి కారీ అను మిషనరీ జీవితమున డాక్టరు కారీగా రిట్లు వ్రాసిరి. వీరిలో ఇంద్రియ లోలత్వము అరిషడ్వర్గములు విజృంభించుటకు ఎట్టి ఆటంకము లేకుండెను. వీరికి నీతిని బోధించు మతాచార్యులు దేశమునం దానాటికి లేరు. ఆదివారమునాడైన ఈశ్వరుని దలువరు. సాంఘికవ్యవస్థ కాధారభూతమైన శీలమును స్త్రీల మానమునుగూడ వీరు మన్నింపరు. ముండలనుంచుకొనుటయు, దానివలన కలుగు అధర్మసంతానమును సర్వసామాన్యమయ్యెను. వీరి చర్యలు క్రైస్తవమతమునకు విరుద్ధములుగ నుండెను. వీరికి దేహములుగాని, ఆత్మలుగా గాని పరిశుద్ధముగ లేకుండెను. తాము చేసినపాపములకు గల శిక్షలు కనబడునేమోయను భయమున వీరు బైబిలును చదువుటగూడ మానుకొనిరి. ఈస్థితినుండి దగ్గరమెట్టుగానున్న బైబిలు చెప్పుమాటలు నిజమై యుండవనితలచు నాస్తికవాదములోనికి దిగుచుండిరి. (కారీగారి జీవితము పుట 352) హిందూదేశములో నీతినియమములులేక చరించువారు తమ చర్యలనుజూచి హిందువులేమనుకుందురో, వారు తమను జూచి అసహ్యించుకొని నీచముగ జూతురని జంకుకొంకుల నైన లేకుండ సిగ్గుబిడియములు విడిచియున్నారు. అని లండన్ క్వార్టర్లీలో 1857లో నొకరు వ్రాసిరి. లువార్డు (Mr Luard) అను బొంబాయి సివిలు ఉద్యోగి యిట్లు వ్రాసినాడు. "భారతదేశమున మన మర్యాదను గౌరవమును కూలద్రోసినది పందికొవ్వుగొడ్డుకొవ్వు పూసిన తోటాలు కావు; స్వదేశసంస్థనములను ఆక్రమించుటయుగాదు, ప్రజలను క్రైస్తవమతమున గలుపుకొనుటయుగాదు. ఆదేశమున చిరకాలమునుండి, మనవారు చేయుచున్న నీతిలేని అక్రమ చర్యలు, బాధ్యతలేని నిరంకుశమైన దుష్పరిపాలనము. నేనాదేశమున చూచినన్ని

అన్యాయపు హత్యలు న్యాయస్థాపన పేరున జరుగుదోపిడులు, బుద్ధిపూర్వకముగా జరుగు లంచగొండితనము నితరులుకూడా జూచియున్నచో, నీభారతీయులట్లు తిరుగుబడుటలో నాశ్చర్యము లేదని గ్రహింతురు," అనినాడు. సూరతుజిల్లా జడ్జిపనిచేసిన సదర్లాండుగారు, 1836 సంవత్సరం సెప్టెంబరులో నొకలేఖవ్రాయుచూ "ఆంగ్లేయు లీదేశమున ఘోరమైన దుర్మార్గములు అవినీతి కరమైన కృత్యములు తమ యధికార బలమునుబట్టి చేయుచున్నారు. ఈ ప్రదేశములో కొందరు దుర్మార్గులుచేరి నిర్భయముగను, బహిరంగముగను ధర్మపరిపాలనమునునిష్ప్రయోజనముచేసి, ప్రజల నీతికిని ఆస్తిహక్కులకు భంగము కలిగించుచున్నారు". ఆవిరి సదర్లాండుగారు దీనినిగూర్చి చర్యతీసుకొనక పూర్వమే ఆయనను బదిలీ చేసిరి. లంచగొండియగు న్యాయాధిపతిని అక్కడకు బంపిరని ఆయనయే వ్రాసినారు. "1843లో నన్ను సూరతు జడ్జిగను మేజస్ట్రేటుగను నియమించినప్పుడు అక్కడి పరిస్థితులు మరింత యధోగతి నుండుటను జూచితిని. బలహీనులు నసహాయులునగు వారిని పోలీసువారు బహిరంగముగనే కొల్లగొనుచుండుటయు, ఐరోపాజాతి ఉద్యోగులు దీనిలో పాలుపంచుకొనుటయును నేను స్వయముగా జూచితిని. తమ అధికారములను పురస్కరించుకొని ఇట్లీ మోసములను దోపిడిని చేయుచున్నారని కొందరధికారులను నేను బహిరంగముగా నిందించితినను కారణమున "నన్ను పనిలో నుండి తీసివేసిరి అని వ్రాసినాడు. (చూడు. బి.డబ్లియు. నోయిల్ గారి ఇంగ్లాండు అండ్. ఇండియా పుటలు 18.22) "భారతదేశమున అబద్ధములాడు దుర్మార్గుడుకూడ మన ఆంగ్లేయులలోని గొప్ప వారితో సమానగౌరవమును పొందుచుండును. నీతిలేనివాడు, స్త్రీలను జెఱచినావాడు, జూదరి, మోసగాడు, లంచగొండి, దుర్మార్గుడును సంఘమున మంచిగౌరవము మర్యాదయుగలవారితో సరిసమానముగా తలయెత్తుకొని తిరుగు గలుగుచున్నారు. లంచము లిచ్చిపనులు చేయించుటకు, ప్రభుత్వధనము నపహరించుటకు, అబద్ధములాడుటకు మన ఆంగ్లేయ నాయకులు వెనుదీయుటలేదు. తమ చేతులలో అధికారముగలవారెల్లరు దానిని దుర్వినియోగము చేయుచున్నారు. ఇట్లు చేయుటవలన తమ్మెవ్వరునేమియు జేయలేరను ధైర్యము వీరికిగలదు. అని 1852వ సంవత్సరము ఫిబ్రేవరి 23వ తేదీన బొంబాయి టైమ్సు పత్రిక కూడా ఇది నిజమేననియు, గొప్ప యుద్యోగులందు అధికారులందును నీదుర్బుద్ధులు దుర్మార్గము లంచగొండితనము అవినీతివర్తనము గలవని వ్రాసినది. (చూడు పుట 15) ఈ వివిధ గ్రంథకర్తలు పత్రికలు వ్రాసిన సంగతులనుబట్టి ఈ యన్యాయములు చేయు ఆంగ్లేయజనుల క్రైస్తవ మతమును గూర్చి హిందువులతి నీచమైన యభి ప్రాయములు కలిగియుండుటలోన నాశ్చర్యము



లేదనియు క్రైస్తవులని తామనుకొనువారు జూదములాడుట చీటికి మాటికి దేవునిపేరుతో ఒట్లుబెట్టుకొనుట, త్రాగుట, తప్పత్రాగి వీధులలో దొరలుచుండుట, అప్పులలో మునిగియుండుట, నీతినియమములు లేక ప్రవర్తించుట, అసభ్యము లైన బూతు మాటలాడుట, ఆదివారమునాడైన దేవు నారాధింపకపోవుట తా మెరిగినంతవరకు నీతిలేని నాస్తికులుగా నుండుటను జూచుచున్నాను. అందువలన తమశీలమువలన సత్ప్రవర్తనవలన హిందువులకు ఆదర్శప్రాయులై క్రైస్తవమతమునకు వన్నెతెచ్చుటకు బదులుగా, దానిని అధోగతిలో ముంచుచున్నారు." అని బి.డబ్లియునోయిల్ గారు 1859లో రచియించిన ఇంగ్లాండ్ ఇండియా అను గ్రంథమున 211, 215 పుటలలో వ్రాసియున్నారు.

ఉత్తర హిందూస్థానమున జిల్లాజడ్జిచేసి గౌరవనీయులైన జాన్ ఫెడరిక్ షోర్ అనుదొర గారు ఇండియాగెజెట్ అనుపత్రికకు 1832వ సంవత్సరము మొదలు 1835 వరకు భారతదేశ స్థితిగతులనుగూర్చి వ్రాసినలేఖలన్నియు "నోట్సు ఆన్ ఇండియన్ ఎఫెయిర్సు" అనేపేరుతో 1838లో రెండు సంపుటములుగా ప్రకటింపబడి యున్నది. దీనిలో 1832వ సంవత్సరము మార్చి 16వ తేదిన వ్రాసినలేఖలో భారతీయులపట్ల ఆంగ్లేయు లెట్లు ప్రవర్తించుచుండిరో చక్కగా వర్ణించియున్నారు. "ఆంగ్లేయులలో చాలమంది (నేటీవు) భారతదేశీయులపట్ల చాలాపొగరుబోతుతనముతోను, అహంకార భావముతోను, స్వాతిశయముతోను, తృణీకారభావముతోను ప్రవర్తించుచున్నారు...."

"ఈ నల్లవానిని తన్నిన బాగుండుననియనేకులనుచుండగా,నేను వినియున్నాను."

"భారతీయులు సలాముచేసినప్పుడాంగ్లేయుడు మరల సలాముచేయడు. నేటివులతో మర్యాదగ మాటనైన నాడడు. ఒక నౌకరేదైన చిన్నతప్పిదమొనరించినచో వానిని సాధారణముగా కొట్టును లేదా నోటవచ్చింపరాని బూతులు తిట్టును. బట్లర్లును నౌకరులను గుమస్తాలను గూడ ఇట్లే బూతులు తిట్టుచుందురు. సాధారణముగా నౌకరులను కొట్టి, జీతమివ్వక గెంటివేయుచుందురు.

"ఈ యాంగ్లేయుల చర్య లొక్కకప్పుడతినీచముగా నుండును.

పూర్వము భారతీయు లొక ఆంగ్లేయుని చూచినప్పుడు సలాము చేయకపోరు గాని ఈ ఆంగ్లేయులు వీరి సలాములను స్వీకరించి ప్రతి సలామును చేయకపోవుట చూచి, ఈమర్యాదలు చేయుట క్రమక్రమముగా మానివేయుచున్నా" రని షోరుగారు 1832 ఆగస్టు 25వ తేదీన వ్రాసిరి. ఆయన యింక నీక్రిందిసంగతులు వ్రాసిరి.

"ఈ రోజులలో నొక యాంగ్లేయుడు భారతీయుని సామాన్య మర్యాదతో జూచిననుగూడ, నదియొక అశ్చర్యకరమైన సంగతిగా పరిగణింపబడుచున్నది. ఇది

యింతకఱవై యుండుటవలన నీ యాంగ్లేయునిగూర్చి పెక్కు మైళ్లదూరమున గూడ మంచిగా చెప్పుకొందురు."

"ఆంగ్లేయులు చాలా సంవత్సరములనుండి యిట్టి విపరీత ప్రవర్తనలో దిగియున్నందున నేటివులు గూడ వీరియందు వినయ విధేయతలు మాని, వీరిని జూచి అసహ్యించుకొనుట ప్రారంభించినారు.

ఒక యాంగ్లేయుడు వేటకుబోవుచు, తాను పోవుదారిలో తానుముక్కు మొగమెరుగని ఒక భారతీయునిదగ్గర నొక ఏనుగును ఎరువు పుచ్చుకొనును. తరువాత నీ భారతీయు డీయాంగ్లేయుడుద్యోగము చేయుపట్టణమునకు వచ్చినప్పుడితడాయనను దర్శింపబోగా నీయాంగ్లేయు డతనిపట్ల చూపు అగౌరవము పైన చెప్పిన విధముగా నుండును.

భారతీయు లేమనుకొందురో యని ఏయాంగ్లేయుడును జంకడు. అతడు బుద్ధిపూర్వకముగనే భారతీయుల నవమానించును. వారిపట్ల అన్యాయము చేయును. ఈ తలవంపులనెల్ల నారెట్లు సహించుచున్నారాయనునది ఆశ్చర్యమైన సంగతి. ఒక మశీదులోనికి గాని హిందూ దేవాలయములోనికి గాని ఆంగ్లేయుడు తనజోడు తీయకుండా పోవుట సర్వసామాన్యముగ జరుగుచుండును. అక్కడనుండు పూజారిగాని ముతావలీగాని ఏమైన ననినచో, వీడువారిని తిట్టుట కొట్టుటయు గూడ సర్వసామాన్యముగనే జరుగుచుండును. పరదేశీయులు పవిత్రముగ నెంచు స్థలములలోనికి బోవునప్పుడు సర్వమానవులును తమకు సములేయని ప్రగల్భములు పలుకు ఆంగ్లేయులు మర్యాదకొరకు తమజోడు తీసిలోనికి బోయిన నెంతబాగుండును!

చాలాప్రదేశములందు ఒకగుంటలోనో లేదా యొకయేటిలో నొకభాగముననో గల చేపలను పవిత్రముగా నెంచి బ్రాహ్మణులు వానికాహార మిడుచుందురు. ఈ ప్రదేశముల ప్రక్కనుండి పోవు పెద్దమనుష్యులగు ఆంగ్లేయు లిక్కడ చేపలు పుష్కలముగ నుండుట చూచి వానిని గాలములు వేసి పట్టుచు వినోదింతురు. అక్కడి బ్రాహ్మణులు వలదని మొరపెట్టినచో వారిని దూషించి కొట్టి దౌర్జన్యము చేయుదురు. పెద్ద మనుష్యులగు నాంగ్లేయులు డప్పులువేయు తమ పరివారముతో నీటిపక్షులను వేటాడుటకు వచ్చి, పచ్చగా పండి కోతకు సిద్ధమైన వరిపైరును త్రొక్కి పాడుచేసి రౌతులకు చాలనష్టము కలిగింతురు. ఇట్లు త్రొక్కగా రాలి మంటగలిసిన గింజల నొక్కక్కదానినే ఏరలేక బాధపడుచుండిన బీదరైతుల దురవస్థను నేను స్వయముగా చూచియున్నాను."

తాము దేశములోపల ప్రయాణము చేయునప్పుడు పల్లకీబోయీలు, సామాను మోయు కూలివారు దొరుకుట లేదనియు ప్రజలు సాయము చేయురనియు కొంద



రాంగ్లేయులు పలుకుచుందురు. పూర్వమిట్టి యిబ్బంది యెన్నడును లేక, ఇప్పుడిది యెందుకు తటస్థించుచున్నది? అని షోరుగారు వ్రాసి, ఈబోయీలను కూలివాండ్రను నియోగించుదొరలు వీరికి సరిగా కూలి యివ్వకుండుటయు, వీరిని నానాబాధలు పెట్టుటయు దీనికి కాణమని నేటివులు చెప్పుచున్నారు. ఇది నిజమే యని షోరుగారు తమ యభిప్రాయము గనబరచిరి.

భారతీయుల భావములందును మార్పుగలిగి, ఆంగ్లేయులపట్ల వీరు చూపు మర్యాదలందు మార్పులు గానవచ్చుచున్నవని షోరుగారు 1832 అక్టోబరు 10వ తేదీన వ్రాసిన లేఖలోనుదాహరించిరి. ఆంగ్లేయులు తమ జాత్యహంకార గర్వములను పురస్కరించుకొని, భారతీయుల నవమానించుట వలన వారి కాంగ్లేయులనుజూచిన రోత కలిగి, వారియందు అసహ్యభావము నానాటికి వృద్ధియగుచున్నది.

తక్కుజాతి మాలమాదిగలను నౌకరులుగ పెట్టుకొనుట, తాము భోజనముచేయుచు అపరిశుభ్రములైన బూట్సుకాళ్లను బల్లపైన పెట్టుకొను దురాచారము, హిందువులు మహమ్మదీయులు తమతో మాట్లాడుచున్నప్పుడుకూడా తమ భోజనపుబల్లపైన వారికి రోతకలిగించు గొడ్డుమాంసము పందిమాంసము వడ్డనచేయించుట మొదలగు కార్యములు నేటివుల కసహ్యము కలిగించుచుండెను.

భారతీయుల నమ్మకమున సామాన్యమైన మర్యాదనుగూడ పాటింపకపోవుటయు నీచమైన హిందూస్థానిభాషను మాట్లాడుటయు పరిపాటి యైపోయినది.

ప్రారంభదశలో మహమ్మదీయులకు పాశ్చాత్యులతో భుజించుట కభ్యంతరము లేకుండెను. గాని, క్రమక్రమముగా ముప్పదేండ్లలోనే వారీ యాంగ్లేయులతో విందు లారగించుటకు నిరాకరించిరి. దీనికి కారణము వారేమనుకొందురో యను జంకుగొంకులు లేక, దొరలు ప్రవర్తించుటయే. హిందువులైనను మహమ్మదీయులైనను నేటివు లందరకు నాంగ్లేయులపట్ల గౌరవము తగ్గి పోవుటకుగల ముఖ్యమైన ఇతరకారణములలో నొకటి యాంగ్లేయులు తమ మతధర్మములను గూడ పాటింపకపోవుట."

ఈ యాంగ్లేయు లీదేశమున స్థిరపరిపాలన మేర్పరచుకొన్న పిదప తమ కేమతమును లేనట్లు గనే వీరు స్వేచ్ఛావిహారులై ప్రవర్తించిరి. ఈ యాంగ్లేయ నవాబు లీదేశమున నిట్లు నాస్తికులై ఇంగ్లాండుకు వచ్చిన తరువాతనైన తమ ప్రవర్తన మార్చుకొన లేకుండిరి. వీరు భాతరదేశమునకు బోవునప్పుడు తమమతమును దారిలో దిక్షిణాఫ్రికా అగ్రమున విడిచి మరల భారతీయుదేశమున తమ యుద్యోగాంతమున నింటికి బోవునప్పుడు దానిని తెచ్చుకొనుట మరచుచుండిరని వీరిని గూర్చిన యొక పరిహాసవాక్య మింగ్లాండులో

పరిపాటియైనది" (Noteson Indian Affairs Vol II P. 456) ఆంగ్లేయు లీదేశమున దేశీయ ఉంపుడు కత్తెల నుంచుకొనుచుండిరి. వీరీ స్త్రీల వలలలో జిక్కి తమ స్వంత వ్యవహారములందును, ఉద్యోగ నిర్వహణము నందును గూడ వీరిమాట చెల్లుచుండి నందుకు నిదర్శనములు కలవు. వీరుంచుకొనిన స్త్రీలలో చాలమంది సామాన్య వారవనితలేయని షోరుగారు, రెండవ సంపుటము 503వ పుటలో ఫుట్‌నోటులో వ్రాసియున్నారు –

తమ్ము దర్శించిన భారతీయుల పట్ల ఆంగ్లేయులెట్లు ప్రవర్తింపవలె ననునది యొకగొప్ప సమస్యగా నుండెను. వారికి కుర్చీయివ్వవలెనా? ఈ ఘనుడగు వంగరాష్ట్రీయో ద్యోగి సమక్షమున నీ భారతీయులు అసలు కూర్చుండవచ్చునా? అను సమప్య చాలమందికి పరిష్కరించుటకు కష్టమైన సమస్యగా వుండెను. చూడవచ్చిన భారతీయులను ఆంగ్లేయులు చాలా రీవితో ముభావమున సంభాషితురు.

క్రొత్తగా వచ్చిన ఆంగ్లేయోద్యోగి యొకడు తాను పోవుదారిలో కనబడినవా రెల్లరు తనకు సలాము చేయవలెనను వింత భావముతో వర్తించుట నేనెరుగుదును. గుఱ్ఱముపైనగాని బండిపైన గాని పోవునేటివులు దిగి తనకు సలాముచేసి మర్యాద చేయవలెనని, అట్లు చేయనివారిని దండించిన మేజిస్ట్రేటును నేనెరుగుదును. (Ibid Vol II.వ పుట. 10) ఆంగ్లేయు లింత గర్వపోతులై యుండినను, ధనముగల నేటివులవలన తమ కేమైన లాభము కలుగునని తోచినప్పుడు మాత్రము వారిదగ్గర నక్కవినయములు చూపుచు నీచముగా ప్రవర్తించుచుందురు. (Ibid Vol II 522)

పూర్వకాలమున ఇంగ్లాండునుంచి భారతదేశమును వచ్చుట కారునెలలు, ఒక సంవత్సరముకూడ పట్టుచుండినందున, ఇక్కడకు వచ్చిన ఇంగ్లీషు ఉద్యోగులు తమ ఉద్యోగకాలము పూర్తియగువరకు దేశమునకు పోకుండ నిక్కడనే యుండినందున, నిది రెండవజన్మభూమిగా నెంచి, ఈదేశ ప్రజలపట్ల కొంత సానుభూతికలిగియుండిరి. వారికి ప్రొద్దుపోవుటకొరకే దేశీయులతో కొంతస్నేహము చేయుచుండిరి. తరువాత రాకపోకలు సులభమై తమ భార్యలను తెచ్చు కొని ఇక్కడ వేరింటికాపురములుండట ప్రారంభముకాగా, వీరు భారతీయులతో సాంగత్యము చేయుటమాని "ఈ నేటివుల" తో మాట్లాడుటయే పరువు తక్కువగా నెంచసాగిరి. నలుగురింగ్లీషు స్త్రీ పురుషులు చేరినచోట నల్లవారిని "నీగ్రోల"ని నిందించుచు హీనముగా చూచుచు వారిని దూషించుటయు నొక అలవాటైనది. ఎవ్వడోయొక మహానుభావుడైన ఆంగ్లేయ ఉద్యోగి భారతీయులను దయతో జూచుచున్నను, సర్వసామాన్యముగా నింగ్లీషు అధికారు లెల్లరును వీరినినీచముగనే జూచుచు వీరిపట్ల



క్రూరముగా ప్రవర్తించుచుండిరి. భారతీయులలో కొందరు విద్యాభివృద్ధికలిగి, వారాంగ్లేయులతో సమానమైన హక్కులు గౌరవములు కోరసాగినకొలదియు, వీరియందు జాతీయ చైతన్యముతో కలిగి స్వధర్మరక్షణకొరకు రాజ్యాంగ సంస్కరణములకొరకు సంఘములు స్థాపించి, సభలుచేసి, మహజరులంపి తమయన్యాయములను గూర్చి పైవారికి చెప్పుకొనుట హెచ్చెక్కినకొలదియు ఆంగ్లేయులకు వీరిపట్ల ద్వేషము హెచ్చుసాగెను. ఈ సంగతిని భారతదేశమునకు 1867లో కలెక్టరుగా వచ్చి చాలా పెద్ద యుద్యోగములు చేసి 1902లో ఉపకారవేతన మందిన సర్ హెన్నీకాటనుగారు తమ "న్యూ ఇండియా; ఇండియన్ అండ్‌హోం మెమొరీస్" అను గ్రంథములందు చెప్పినారు.

ఇంగ్లాండునుండి క్రొత్తగా వచ్చిన ఆంగ్లేయ యువకున కీ దేశప్రజలందు జాలియు దయయు నుండునుగాని, త్వరలోనే ఇక్కడి నిరంకుశసంప్రదాయములందు పెరిగిన ఆంగ్లేయోద్యోగుల ప్రభావమువలన నితడు విదేశీయులను నీచముగా జూచి, వీరి నవమానించుట ప్రారంభించును. జాత్యంహారము సర్వత్ర కనపడుచున్నది. చీటికిమాటికి తనక్రింది యుద్యోగులను తిట్టుట, నౌకరులను కొట్టుట ప్రారంభించును. కొందరు దేశములోని గౌరవముగల పెద్దమనుష్యులు తమ్ము జూచి గుఱ్ఱము దిగలేదనియో, ఇంకొక కారణముననో కొట్టుచుందురు. (న్యూఇండియా పుటలు, 41-42) "పంజాబు చీఫ్‌కమిషనరుపని చేసి తరువాత గవర్నరు జనరలైన సర్‌జాన్ లారెన్సు లాహోరులో తన గుఱ్ఱపువానిని కమిచీతోకొట్టి వింతను చూచుటకు చాలమంది నిరీక్షించుచుండిరట ఇంతగొప్పవారే ఇట్టి దౌర్జన్యములు చేయుచుండగా, సామాన్యులమాట చెప్పవలెనా? నేనీదేశమున నుద్యోగము చేసినన్ని నాళ్లు భారతీయులను కొట్టి అన్యాయములు జరుగుచునే యుండెను. ఏదో చెప్పుకొనుటకు వచ్చి దారికడ్డముగా సాష్టాంగపడినవారిని తన కర్రతో కొట్టిన ఒక గొప్పయధికారిని నేను జూచి నాను" అని ఇండియన్ అండ్ హోం మెమొరీస్ 62పుటలో కాటనుగారు వ్రాసినారు.

రైళ్ళలో రాజవీధులలో ఇతరచోటుల భారతీయులను కొట్టుట యిప్పటికిని జరుగుచునే యున్నది. ఆంగ్లేయయజమానుడు తన బూట్సు కాలితో తన్నగా చనిపోయిన నౌకరుల కేసులనేకములు ప్రకటింపబడినవి. ఇట్టి సమయములం దాదురదృష్టవంతున కేదో కార్జములో జబ్బుండినదని మేజిస్ట్రేటు చెప్పి, ఆంగ్లేయ నేరగానిని విడిచిపుచ్చును. లేదా, కొద్దిజుల్మానాను విధించును.

ఈ భారతదేశమును పరిపాలించు ఆంగ్లేయోద్యోగులు మీసములైన రానిబాలురని చెప్పవచ్చును. వారికి సాంఘీక జీవనము లేదు, ప్రజల పట్ల సానుభూతి లేదు. ప్రజలతో

కలిసిమెలసి తిరుగరు, మాటలాడరు. సాధ్యమైనంత త్వరలో అమితసంపద లార్జించుటకు తప్ప వీరు ప్రజలతో నెట్టి వ్యవహారములును జరుపరు. ధనకాంక్షతో యవ్వనగర్వముతో సంచరించుచు దేశము నుండి ధనము తలరించుకొని పోవుచున్నారు. అధికారమును చలాయించుటకు శక్తి సామర్థ్యమును సంపాదింపకపూర్వమే, అమితమైన అధికారములు వీరి కివ్వబడుచున్నందునను, వీరికి ప్రపంచానుభవము కలుగకుండగనే అమితధనము చేజిక్కుచున్నందునను, వీరు తమ యధికారములను ఇష్టము వచ్చినట్లు దుర్వినియోగము చేయుచున్నను అడుగువారు లేనందునను, ఈ అన్యాయపు పద్ధతుల కంతము లేకున్నదని బర్కుమహాశయుడు 1793లో పార్లమెంటులో చెప్పియున్నాడు. "కుంఫిణీ యుద్యోగులు దేశ వ్యవహారములను తెలిసికొనుటకు ముందుగానే ఉద్యోగవిధానములు నేర్చుకొందురు. తనకొలువు కూటమున చూపవలసిన మర్యాదలను గురించి ఇతనికి తెలియునుగాని, ప్రజల కష్టసుఖములు తెలియవు. ప్రజలపైన నెంతో ఎత్తున ఇతని నుంచుటయు ఉద్యోగరీత్యా కచ్చేరీలయందును న్యాయస్థానములందును అక్కడకు వచ్చు కార్యార్థులను తన్నాశ్రయించి తిరుగు ఉద్యోగులను ముక్త్యారున్యాయవాదులను మాత్రమే చూచును గాని, జనసామాన్యముయొక్క జీవితవిధానమును చూచుటకే ఇతని కవకాశములుండవు.

ప్రజల సంసారజీవనముగాని వారి నీతి నియమములు మర్యాదలుగాని సద్గుణములుగాని చూచుట కవకాశము లుండక, వారిలోపములు దుర్గుణములు అతితీవ్రమైన పరిస్థితులతో చూచును. తగవులలో నొకరిపైన నొకరు కత్తిగట్టి పోరాడుచున్న వాదిప్రతివాదులుగను నేరములు చేసివచ్చిన ముద్దాయిలుగను వారితనికి కనపడుచుందురు.

ప్రజల వ్యవహారములు విమర్శించుటలో విచక్షణజ్ఞానము జాగ్రత్త క్రమపద్ధతి లక్ష్యము లితనికి అలవడునుగాని, ఇది కేవలము ఏకవిషయ మునకు సంబంధించినదై యుండును. ఇతని కార్యనిర్వహణము కాలహరణముతో కూడి కాలనియమమును పాటింపడు. ఒక వ్యవహారమునుండి యింకొక వ్యవహారమునకు శీఘ్రముగా బుద్ధిమరల్చు ప్రాపంచిక జ్ఞానముండదు, (అనగా ఇతనిమనస్సు యంత్రమువలెనుండి యితనిదృష్టి సంకుచితమై యుండును.)" అని సర్‌థామస్ మన్రో వ్రాసినాడు.

ఇతడు నలుబదేండ్లు దేశమున పెద్దయుద్యోగములు చేసి మద్రాసు గవర్నరై 1827లో మరణించిన అనుభవజ్ఞుడు. (Life and letters of Sir Thomas Munro, Vol PP 279-280).

– *ఆంధ్రసచిత్ర వారపత్రిక,* ***11.6.1941-09.07.1941***





# ఉత్తర సర్కారుల చరిత్ర

ఇప్పుడు ఉత్తరసర్కారులని పిలువబడే ప్రాంతాలలో చాలాభాగం 13వ శతాబ్దానికి పూర్వం కాకతీయ చక్రవర్తియైన ఓరుగంటి ప్రతాపరుద్రుడి సామ్రాజ్యభాగాలుగా వుండేవి. కాకతీయ సామ్రాజ్యం విచ్ఛిన్నం అయిన తరువాత ఆ చక్రవర్తి కొలువులో నున్న రెడ్డిరాజులే ఈ ప్రాంతాల నన్నింటినీ కొంతకాలం పరిపాలించారు. రాజమహేంద్రవరానికి ఉత్తరభాగము కళింగరాజులైన గజపతుల వశమైంది. విజయనగరచక్రవర్తియైన కృష్ణరాయలవారు గజపతి నోడించగా కటకంవరకూ విజయనగరసామ్రాజ్యానికి లోబడింది. తరువాత మళ్లీ ఒక వంక గజపతులు, ఇంకొక వంక గోలకొండ నవాబులు ఈప్రాంతాల నాక్రమించారు.

## గోలకొండ నవాబులు

1471 ఆ ప్రాంతాలకు కళింగరాజు చనిపోగా ఆరాజ్యంకోసం దత్తుడికీ, వారసుడికీ తగాదా రాగా వారసు బహమనీ సుల్తానైన మహమ్మదుషా సహాయం కోరాడు. అంతట ఆరాజు తనకు లోబడి రాజ్యమేలే పద్ధతిని 1480లో కొండపల్లి, ఏలూరు, రాజమహేంద్రవరం సీమలను అప్పటికి విజయనగర సామ్రాజ్యంలో చేరివున్న గుంటూరు, మచిలీపట్నం సీమలనూకూడా జయించి అతని కిచ్చాడు. 1513లో బహమనీ రాజ్యం ఐదురాజ్యాలుగా చీలినప్పుడు ఉత్తర సర్కారులు గోలకొండ కుతుబుశాహివారి వాటాకువచ్చినవి. వారి రాజధాని హైదరాబాదు దగ్గరనున్న గోల్కొండ, గోదావరికి దక్షిణానవున్న భాగాలన్నీ సులభంగా గోలకొండ నవాబులకు లోబడినవి గాని రాజమహేంద్రవరం, చికాకోలు రాజ్యభాగాలు – కళింగరాజు చాలా బలవంతుడైనందువల్ల – 1571 వరకూ లోబడలేదు. ఆసమయంలో కళింగరాజుదగ్గర నుంచి పెద్దాపురం ప్రాంతాలను ఇజారా పొందిన వత్సవాయి జమీందారుల పూర్వికుడు గోలకొండనవాబుల ప్రోత్సాహంతో తిరుగుబాటుచేశాడు.

# మొగలాయి రాజప్రతినిధియైన నిజాం

మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు గోలకొండను జయించి ఆరాజ్యాలన్నీ మొగలు సామ్రాజ్యంలో చేర్చినాడు. అయితే ఔరంగజేబు దక్షిణ హిందూదేశపు పీఠభూమిలో మొగలు ప్రభుత్వం స్థాపించడంలో నిమగ్నుడైనందున ఈ తూర్పు సముద్రతీరపు రాజ్యాలవైపుకు దృష్టి మరల్చి ఇక్కడ మొగలాయి పరిపాలన స్థాపించలేదు. 1707లో ఔరంగజేబు చనిపోయిన తరువాత క్రీ.శ. 1713లో హైదరాబాదులో చక్రవర్తి ప్రతినిధియైన నిజాము ఉల్‌ముల్కును దక్షిణ హిందూ దేశానికంతా సుబేదారుడిగా నియమించగా అతడు కళింగరాజ్యములో మొగలాయి ప్రభుత్వం స్థాపించడానికి పూనుకుని తరువాత కర్ణాటక నవాబుగా ప్రసిద్ధిచెందిన అన్వరుద్దీనుఖానును చికాకోలు సర్కారు పరిపాలనకు నియోగించాడు. అన్వరుద్దీను క్రింద రుస్తుంఖాను అనే యతడిని రాజమహేంద్ర వరం సర్కారుకు, దానికి దక్షిణానవున్న సర్కారులకు పరిపాలకుడుగా నియమించాడు. అప్పుడు శిస్తువసూలుచేసే యీజారాదారులు దేశానికిప్రభువులై యుంటూవుండే వారు. ప్రభుత్వాన్ని మోసంచేసి పరిపాలనలో అక్రమాలు జరిపి ప్రజలను పీడించిన జమీందారులను రుస్తుంఖాను కఠినంగా దండించేవాడు. అలాంటి వారి తలలు తీయించి ఆపుర్రెలతో రాజమహేంద్రవరంలో ఒక స్తంభమున్నూ బందరులో ఒక స్తంభమున్నూ కట్టించాడు. శిస్తుల వసూలుకు పూర్వం నియమింపబడిన హిందువులైన జమీందార్లను తీసివేసి ముస్లిం 'అమాను'లను ఏర్పరచి చూశాడుగాని అదికుదరనందున మళ్లీ పూర్వపుహిందూ యీజారాదారులనే యేర్పాటుచేశాడు. వారికి కొన్ని ప్రత్యేకసౌకర్యాలు దర్జాలువుండి అవి వంశపారంపర్యముగా అనుభవించడంవల్ల ఒక జమీందారీ కులం బైలుదేరింది.

నిజాముగారి కిందనున్నప్పుడీరాజ్యమంతా 1. గుంటూరు మూర్తిజానగరు లేక కొండవీడు, 2. కొండపల్లిలేక ముస్తఫానగరు, 3. ఏలూరు, 4. రాజమహేంద్రనగరం, 5. చిక్కాకోలు సర్కారులని ఐదురాష్ట్రాలుగా విభజింపబడి పరిపాలింబడేది. గుంటూరు సర్కారుకు ఉత్తరమున పడమట కృష్ణానది సరిహద్దు దక్షిణానకడప ఒంగోలు, సరిహద్దు: ఉత్తరాన ఏలూరు పట్నం. కొల్లేరుసరస్సు దక్షిణం కృష్ణానదికి మధ్యవుండేభాగం కొండపల్లి సర్కారులో చేరినది. ఇదేతరువాత కంపెనీవారి కాలంలో మచిలీబందరు జిల్లాలో ఒక భాగమైనది. కొండపల్లిదగ్గరనుంచి నర్సాపురం దగ్గర సముద్రంలో కలిసే గోదావరి దక్షిణపు పాయదాకా ఏలూరురాజ్యభాగం. రాజమహేంద్రవరంవరకూ రాజమహేంద్రవరం సర్కారు దానికి వుత్తరానవున్న పెద్దరాజ్యభాగమంతా చిక్కాకోలు సర్కారులో చేరివుండేది. ఇదిగాక



మోటుపల్లి దగ్గరనుంచి గోదావరి (పాయింటు) వరకూగల ఒక పీలికను 'మచిలీపట్నం హవేలీ' అనేవారు. ఈ హవేలీ భూములు ప్రభుత్వం చేసే అధికారుల స్వంతభూములు. ఇవి ప్రత్యేకంగా ఒక పరిపాలకుడికింద వుండేవి. ఉప్పుమళ్లున్నూ, నిజాంపట్నం మొదలైన రేవుల ఎగుమతి దిగుమతి సుంకాల వసూలున్నూ కూడా అపరిపాలకుడికిందనే వుండేవి. ఆరోజుల్లో ఉత్తరసర్కారులకంతా ప్రధాన రాజధానినగరము, కోట, మచిలీబందరే.

# ఫ్రెంచిసేనాని బుస్సీప్రభుత్వం

ఫ్రెంచి వర్తక కంపెనీవారి ప్రధానాధికారియైన డూప్లే సహాయంతో ముజఫరు జంగు 1750లో దక్షిణహిందూ దేశానికి సుబేదారుడైనాడు. ఆ కృతజ్ఞతవల్ల అతడు మచిలీపట్నాన్నీ దానిద్గరవున్న రాజ్యభాగాన్నీ ఫ్రెంచివారి కిచ్చాడు. ముజఫరు జంగుతరువాత సుబేదారుడైన సలాబతుజంగుకికూడా ఫ్రెంచివారు సహాయం చేశారు. అందువల్ల అతడు 1752లో ఉత్తరసర్కారులను వారికిచ్చాడు. ఫ్రెంచి సేనాని బుస్సీదొర యథేచ్ఛగా పరిపాలన జరపడం ప్రారంభించాడు. దేశాదాయంలో మూడవవంతు చెల్లించి ఫ్రెంచివారికి లోబడితేనే తప్ప జమీందారీలను అంగీకరించనన్నాడు. పెద్దపెద్ద ప్రభువులున్న చిక్కాకోలు సర్కారులో అతనికి చిక్కులు కలిగినవి. అక్కడి ప్రభువుల కుటుంబాలలో తగాదాలు, ఇతర వ్యవహారాలు చక్కబెట్టడానికి ప్రత్యేకంగా ఒక పెద్దను నియమించడం అవసరమని తోచి విజయనగరం జమీందారుడైన విజయరామరాజుగారిని అందుకు నియమించాడు.

ఫ్రెంచిసేనాని యైన బుస్సీదొరగారు రాజమహేంద్రవర శ్రీకాకుళ సర్కారులను విజయనగర సంస్థానాధీశుడైన విజయ రామరాజుగారికి కౌలుకిస్తున్నాడనే సంగతి తెలియగానే ఉత్తర సర్కారుల జమీందార్ల గుండెలలో రాయిపడింది. దీనివల్ల విజయరామరాజుగారు ఫ్రెంచివారి సమాయంతో తమపైన నిరంకుశాధికారాలు చెలాయించి తమ్ము బాధించి అవమానించగలడని భయంకలిగింది. ముఖ్యంగా బొబ్బిలి సంస్థానాధిపతియైన రంగారావుగారి కిదిదుస్సహమైంది. దీని నెలాగైనా ప్రతిఘటించాలని తక్కిన జమీందార్లతో కలిసి ఆలోచన చేశాడు. అప్పట్లో శ్రీకాకుళపు నవాబైన జాఫరల్లీ ఖాను నిజాముగారి తాబేదారుడైనా ఆయనకూడా రంగారావుగారి ఉద్యమానికి సహాయభూతుడుగా నున్నాడు. జమీందార్లందరూ ఇలాగు తిరుగబడి కుట్ర చేస్తున్నారనే సంగతిని విజయరామరాజు గారు బుస్సీ దొరగారికి తెలియచేయగా తిరుగబడిన జమీందార్లను అణచి కప్పం వసూలు చెయ్యడానికి బుస్సీ దొరగారు 1756 సంవత్సరం నవంబరు నెల 16వ తేదీన 500 తెల్ల సైనికులతోను, 4000 దేశీయ సిపాయిలతోను

హైదరాబాదునుంచి బయలుదేరి డిశంబరు 19వ తేదీన రాజమహేంద్రవరం వచ్చిచేరాడు. విజయరామరాజుగారు పదివేల సైన్యంతోను ఇతర జమీందార్లతోను వచ్చి బుస్సీగారిని కలుసుకున్నాడు. బొబ్బిలి రైతులు విజయనగరం రాజ్యంలోకి పారుతూవున్న ఒక కొండవాగును మళ్లించి తమ పొలాలకు నీళ్లు పెట్టుకుంటూ ఉన్నందున బొబ్బిలివారి సంస్థానం దేశస్వభావమును బట్టి సాధించడానికి దుర్గమ మైనందువల్ల విజయరామరాజు గారు బొబ్బిలి రంగారావుగారిమీద ద్వేషం వహించి బుస్సీగారితో ఉన్నవి లేనివి కల్పించి రంగారావు గారిమీద కోపం కలిగించాడు. అంతట బొబ్బిలి రాజ్యం వదలివేయవలసిన దనిన్ని దానికి బదులుగా ఎక్కువ వైశాల్యము విలువ గల దేశమిస్తామనిన్నీ బుస్సీగారు రంగారావుగారికి కబురంపారు. రంగారావుగారు తమ పితృపితామహాగతమైన రాజ్యాన్ని వదలడానికి అంగీకరించక బుస్సీ గారిని దర్శించడానికి రాజమహేంద్రవరం రాలేదు. అంతట విజయరామరాజుగారి ప్రోత్సాహంతో బుస్సీగారు బొబ్బిలికోటను ముట్టడించారు. ఇదే సుప్రసిద్ధమైన బొబ్బిలి యుద్ధము. దీనిని మహాభారత యుద్ధముతో పోల్చి వర్ణిస్తూదిట్టకవి నారాయణకవి తన రంగాయ చరిత్రను రచించాడు. ఈ యుద్ధములో బొబ్బిలి వీరులు చూపిన శౌర్యధైర్యములకు బుస్సీగా రాశ్చర్యపడి వారందరూ నిహతులైనందుకు చాలా విచారించారు. యుద్ధములో చావక మిగిలిన బాలుడైన రంగారావుగారి కుమారుణ్ణి బుస్సీగా రాదరించి బొబ్బిలి రాజ్యానికి అభిషిక్తుణ్ని చేశారు.

రాజమహేంద్రవరములో బుస్సీదొరగారిని బొబ్బిలిరంగారావుగారు తప్పతక్కిన జమీందార్లందరూ దర్శించిన ఘట్టమును నారాయణకవి ఇలాగ వర్ణించాడు :-

ఉ॥ రాజమహేంద్రపట్టణ వి
　　రాజద దూరతలంబునన్ సము
త్తేజితమైన గౌతమన
　　దీతీరసీమను గోటిలింగవి
భ్రాజితమైన యొక్క నవ
　　పాదపమంజుల నిష్కుటస్థిలిన్
రాజితలీలఁ జేరి శిబి
　　రంబువడిన్విడియించె వేడుకన్॥

ఉ॥ కారుణికత్వ మేర్పడసి
　　కాకుళపున్సరకారులో జమీం
దారుల రామరాజ వసు
　　ధావలయేశ్వరముఖ్యుల న్ముదం
బారఁగఁబిల్వఁబంపు మని
　　హైదరుజంగున కానతీయఁద
చ్చారు వచఃక్రమంబునను
　　సత్వరుఁడై పిలిపించె వారలన్.

ఉ॥ పాయని వేడ్క విద్విషద
　　పాయక రాయత బాహుశౌర్యులా
పాయకరాయఁడుం గిమిడి
　　పట్టణపుం బృథివీశ్వరుండు నా
రాయణదేవుఁడున్ నరస
　　రాజు మతిం గొలుగొండమన్నెపున్
రాయఁడు నాదిగాఁ గల ధ
　　రావరులందరు వచ్చి రత్తఱిన్.

గీ॥ ఉద్ధతుల ముల్కు సందర్శనోత్సుకత్వ
మాత్మఁ జిట్టాడ నాడాడ నలరు మన్నె
దొరలు వచ్చి రమానుషదోఃప్రసంగ
కలితుఁడగురంగరాయఁ డొక్కరుఁడుఁ దక్క.
(చూ. ఆంధ్రకవుల చరిత్ర 3వ భాగం. పుటలు 110-111)

విజయరామరాజుగారు ఫ్రెంచివారి సహాయముతో బొబ్బిలి సంస్థానాధీశులను ఇతర జమీందార్లను అణచినాడు. బుస్సీ సాధారణంగా హైదరాబాదులో సుబేదారుడి దగ్గర వుండవలసి రావడంవల్ల తన పరిపాలనా పద్ధతులు అమలు జరుపడానికి అవకాశం లేక పోయింది.

## ఆంగ్లేయులకు ఆనందరాజు ఆహ్వానం

విజయరామరాజుగారి తదనంతరం ఆనందరాజుగారు రాజైనారు. బుస్సీ ఆయనకు సహాయముచేయలేదు. ఫ్రెంచివారు ఇంగ్లీషు రాజధానియైన చెన్నపట్నం ముట్టడించడానికి

బుస్సీని రమ్మని పాండిచేరిలో ఫ్రెంచిగవర్నరైన లాలీ ఉత్తర్వుచేశాడు. ఆ సమయంలో ఆనందరాజుగారు ఇంగ్లీషు వారిని ఉత్తర సర్కారు లాక్రమించుకోవలసినదనిన్నీ తాను సహాయము చేస్తాననిన్నీ చెన్నపట్నానికి కబురుచేశాడు. చెన్నపట్నం కంపెనీ ప్రభుత్వంవారు ఒప్పుకోలేదు. అంతట ఆనందరాజుగారు 1758లో వంగరాష్ట్రంలోని ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వాన్ని కోరినారు. అప్పుడు అక్కడ సేనాధిపతిగా నున్న క్లైవు తన క్రింది సేనాధిపతియైన "ఫోర్డు"ను కొంత సైన్యమిచ్చి ఆనందరాజుగారికి సహాయం చెయ్యవలసిందని పంపించాడు. అతడుబుస్సీ తరువాత సేనాధిపతిగా వచ్చిన (Conflance) "కాన్ఫాన్సు'ను పెద్దాపురం దగ్గర ఓడించాడు. ఫ్రెంచి సేనాధిపతి మచిలీబందరుకు వెనుదిరిగిపోయి హైదరాబాదునవాబైన సలాబతుజంగును సహాయం చేయవలసిందని ప్రార్థించాడు. ఆనవాబుగారు బైలుదేరి వస్తున్నారని తెలియగానే ఆనందరాజుగారు వెనుకకు మరలిపోయారు. (Memory of Col Forde)

అయితే ఫోర్డుమాత్రం తన దండయాత్ర సాగించి సలాబతుజంగుగారు వచ్చేలోపలనే 1759 ఏప్రెలునెలలో మచిలీపట్నం ముట్టడించి స్వాధీనపర్చుకున్నాడు. ఈలోపుగా ఫ్రెంచివారు చెన్నపట్నం ముట్టడిని విరమించుకున్నారు.

## ఇంగ్లీషువారికి నిజాముకు రాజీ ఏర్పాట్లు

అంతట ఇంగ్లీషువారికీ సలాబతుజంగు గారికీ 1759లో రాజీ జరిగింది. 20 మైళ్ల వెడల్పుగల తూర్పు సముద్రతీరపు రాజ్యాన్ని నవాబుగారు ఇంగ్లీషు కంపెనీవారికిచ్చారు. అందులో మచిలీబందరు నిజాంపట్నం గుడివాడ కొండపల్లి సర్కారులో కొంతభాగమున్నూ వున్నవి. ఉత్తరసర్కారులలోని మిగతాభాగం పేరుకుమాత్రం నిజాముగారి అధికారంకింద వున్నది. సలాబతుజంగు సోదరులైన బసాలతుజంగు నిజాము అలీలు రాజ్యకాంక్షతో కుట్రలు చేస్తూవున్నందు వల్లను పడమటనుంచి మహారాష్ట్రులు దండయాత్రలు చేస్తూ వున్నందు వల్లను నిజాముగారి అధికారం నామమాత్రా వశిష్టమైనది.

1761లో నిజాము ఆలీ తన సోదరుడైన సలాబతుజంగును త్రోసిరాజన్నాడు. రెండేళ్లు నిర్బంధంలో వుంచి తరువాత అతనిని వధింపజేశాడు. మొగలాయిచక్రవర్తి నిజామల్లీని దక్షిణ హిందూదేశానికి సుబేదారుడిగా అంగీకరించాడు. ఇంగ్లీషు కంపెనీవారు తనకు సైనిక సహాయంచేసేపద్ధతిని తన సోదరుడైన బసాలతుజంగు స్వాధీనంలో నున్న గుంటూరు సర్కారు తప్ప మిగతా నాలుగు సర్కారులున్నూ ఇంగ్లీషు కంపెనీవారి కిస్తానని 1762లో నిజాముగారు అన్నప్పటికీ కంపెనీవారు సైనిక సహాయం చేయలేక పుచ్చుకోలేదు.



అంతట ఆ సర్కారులను హుస్సేనల్లి అధికారంకింద వుంచాడు. ఆసందర్భంలో సర్కారులవల్ల హుస్సేనల్లీకి వచ్చే ఆదాయంలో సగంవంతు కంపెనీవారిచ్చేపద్ధతిని అతడువీరికి పట్టాయిచ్చాడు. ఇది నిజాముకు యిష్టంలేకపోయింది. అంతట ఆపట్టాను కంపెనీవారు వదులుకుంటామన్నారుగాని సర్కారులు స్వాధీనంచేసుకున్నందుకైన ఖర్చులు తమకు ముజరారావాలన్నారు. 1763లో నిజాముగారి ఫౌజుదారుడున్నూ బందరురాష్ట్రీయ పరిపాలకుడైన ఫైబసు (Phybus) గారి దుబాషికాండ్రేగుల జోగిపంతులుగారున్నూ కలిసి మాట్లాడగా నిజాముగారు 23700 ఖర్చుల కిందయిచ్చే పద్ధతిని కంపెనీవారీసర్కారులు యిచ్చివేశారు. కాని దేశపరిపాలన చెయ్యడంలో ఫౌజుదారుడు నిగ్రహించలేకపోయాడు. ఇంతలో విజయనగరం రాజుగారు వచ్చి రాజమహేంద్రవరం ఆక్రమించారు. ఫ్రెంచివారు మళ్లీ వచ్చి ఆక్రమించకుండా చెయ్యడం అవసరమని సీమనుంచి తాకీదులు వచ్చినవి. 1764లో నిజాముగారి దగ్గరికి తమ దుబాషీయైన కాండ్రేగుల జోగిపంతులు గారిని రాయబారం పంపారు. కాని అతడు వినిపించుకోలేదు. అంతట ఇంగ్లీషువారు నిజాముగారి తాబేదారు డయిన హుస్సేనల్లీతో మంచిమాట లాడుకున్నారు. ఇంగ్లీషువారి సహాయంతో హుస్సేనల్లీ కొండపల్లి ఏలూరు రాజమహేంద్రవరం సర్కారులను స్వాధీనం చేసుకున్నారు. తనకు సాలియానా కొంతసొమ్ము ఇచ్చేపద్ధతిమీద వాటినెప్పుడు పడితే అప్పుడు కంపెనీవారి కిస్తానని హుస్సేనల్లీ అన్నాడు.

ఈలోపుగా 1765లో క్లైవు మొగలాయి చక్రవర్తివల్ల ఈ సర్కారులకు కూడా కంపెనీవారికి పట్టాసంపాదించాడు. అయితే వెంటనే ఈ రాజ్యాన్ని స్వాధీనపరచుకోవడానికి ప్రయత్నించడం మంచిదికాదని కంపెనీవారు వూరుకున్నారు. మరుసటి సంవత్సరానికి రావలసిన శిస్తులనుకూడా హుస్సేనల్లీ వసూలు చేసుకొని కూర్చున్నాడు. అందువల్ల తాము పొందిన పట్టాను బట్టి వచ్చేలాభం యేమీ లేకపోయినా ఫ్రెంచివారీ రాజ్యంలోకి రాకుండా చేయడమే ఒకముఖ్యమైన కార్యమని ఇంగ్లీషువారు సంతృప్తిజెంది ఈ పట్టా షరుతులను మచిలీపట్నంలో ప్రచురపరచారు. ముందుగా కల్లియాండ్ (Calliand) సేనానికింద కొంతసైన్యాన్ని పంపి కొండపల్లి జిల్లాను స్వాధీపనరచుకున్నారు. దేశాన్ని స్వాధీనపరచుకొని హుస్సేనల్లీ సైనికులను బర్తరఫ్ చేసి జమీందార్లవల్ల తామే శిస్తులను వసూలు పరుచుకోవాలని ఈ కార్యాలోచన సంఘమువారు తీర్మానించారు. దీనికి హైదరాబాదు నిజాము ఆటంకాలు పెట్టకుండా వుండగలందులకు గాను 12-11-1766 తేదీన నిజామల్లీతో ఒకరాజీ ఏర్పాటు చేసుకొన్నారు. ఈసంధిప్రకారము కొంత సైన్యాన్ని సహాయమిచ్చి దేశంలో కల్లోలాలు లేకుండా చేయదానికిన్ని సైన్య సహాయం

యివ్వలేనప్పుడు సాలుకు 9లక్షల రూపాయలు ఆయనకు యిస్తూవుండటట్లున్నూ బసాలతుజంగు జీవితకాలం వరకూ గుంటూరు ఆయన ఆధీనంలో వుండేటట్లున్నూ ఈ సర్కారులలో నున్న వజ్రాలగనుల హక్కులు నిజాముగారికే వుండేటట్లున్నూ, యేర్పాటు జరిగింది. తరువాత నిజాము మైసూరు ప్రభువైన హైదరాలీతో చేరి కంపెనీవారికి ఎదురుతిరిగి విఫలుడైనాడు. అంతట సర్కారులకు మొగలాయి చక్రవర్తి కంపెనీ వారి కిచ్చిన పట్టాను అంగీకరిస్తు 1768 సం॥ మార్చి 1వ తేదీన నిజాము మళ్లీ కొత్త సంధిషరతులకు అంగీకరించాడు. ఆయనకు కంపెనీవారు సాలుకు 5 లక్షల రూపాయి లిచ్చేటట్లున్నూ యుద్ధఖర్చుల క్రింద 25 లక్షలు మినహాయించుకునేటట్లున్నూ ఏర్పాటు జరిగింది. గుంటూరు బసాలతుజంగు స్వాధీనంలోనే వుండనిచ్చారు.

హుస్సేనల్లీ సర్కారులను పొందిన యిజారా కవులు 1769లో అంతమొందినది. అంతట సర్కారులను కంపెనీవారే పరిపాలించడానికి పూనుకున్నారు. ఇట్టిస్థితిలో బసాలతుజంగు కొంతమంది ఫ్రెంచి సైనికులను నియమించాడని తెలిసింది. ఇది యింగ్లీషువారికి కష్టంగా వుండి వారిని పంపించి వేయవలసినదని నిజామల్లీగారితో చెప్పారు. ఆఖరికి బసాలతుజంగు ఫ్రెంచి సైనికులను తీసివేసేటట్లూ, ఇంగ్లీషువారాయనకు సైనిక సహాయం చేసేటట్టూ, బసాలతుజంగు జీవితకాలంవరకూ ఇంగ్లీషు కంపెనీవారు గుంటూరు నాయనవల్ల కవులుపుచ్చుకొని అతని కిందివరకు వచ్చే ఆదాయం యిచ్చేటట్లున్నూ 1778లో ఆయనతో ఏర్పాటు చేసుకొన్నారు.

బసాలతుజంగుకి గుంటూరు గాక కృష్ణానదికి దక్షిణాన ఇంకా ఇతర రాజ్యాభాగాలున్నవి. ఆదోని అతనిరాజధాని. సర్కారులకు మొగలాయి చక్రవర్తివల్ల పట్టాపొందినందువల్ల నిజాముకు తాము పేష్కషు చెల్లించనక్కరలేదని కంపెనీవారన్నారు. 1779లో మళ్లీ నిజాముకూ కంపెనీ వారికీ చెడింది. అంతట అతడు హైదరాలీతో చేరినాడు. హైదరాలీతో యుద్ధం తటస్థిస్తూన్నందువల్ల కంపెనీవారు నిజామును మంచి చేసుకోవలసివచ్చింది. అందువల్ల సర్కారులకు తాము స్వతంత్ర ప్రభువులమని తాము అదివరకు చేసేవాదన మానుకున్నారు. వంగరాష్ట్ర కంపెనీ ప్రభుత్వం వారుకూడా ఈవాదనకు హర్షించలేదు. బసాలతుజంగుతో చేసిన రాజీనామా రద్దు చేసి గుంటూరును మళ్లీ బసాలతుజంగుకివ్వవలసినదని 1780లో వుత్తర్వుచేశారు. బసాలతుజంగు 1782లో చనిపోయినప్పటికీ 1788దాకా గుంటూరు, కంపెనీవారి వశంకాలేదు. అప్పుడైనా దాని మీద సాలుకు 7 లక్షల కప్పం కట్టవలసి వచ్చింది. నిజామల్లీ 1803లో చనిపోయినాడు. ఇలాగు నిజాముకు ప్రతిసాలునా చెల్లించే కప్పానికి బదులు 1823లో 1200లక్షల



రూపాయిలు ఒకమొత్తంగా చెల్లించి సర్కారులను కంపెనీవారు తమ స్వంత రాజ్యంగా చేసుకున్నారు.

(Manual of the Administration of the Madras presidency C.D. Maclean Vol I.pp. 179-180).

## సర్కార్లలో ఇంగ్లీషు ప్రభుత్వం

1765లో ఇంగ్లీషువారు మొగలాయి చక్రవర్తులవల్ల దివానిగిరీని పొంది ఉత్తరసర్కారులు పట్టాపొంది 1766లో హైదరాబాదునిజామువల్ల కూడా ఒక పట్టాను పొందినవారు. ఈఅధికారాన్ని పురస్కరించుకుని ఇంగ్లీషు కంపెనీవారు ఉత్తరసర్కారులను స్వాధీన పరచుకోవడానికి పూనుకున్నారు. అంతట ఈ ప్రాంతాల జమీందారు లొక్కరొక్కరే వారికి లోబడ్డారు. ఉత్తర సర్కారులు ఇంగ్లీషు వారి స్వాధీనంలోకి వచ్చేటప్పటికి రాజమహేంద్రవరం, ఏలూరు, కొండపల్లి సర్కారులు హుస్సేనల్లీగారు నిజాము వద్దనుంచి పొందిన యిజారాకవులులో నున్నందువల్ల వెంటనే ఇంగ్లీషు పరిపాలన స్థాపించలేదు. ఆకవులు 1769లో అయిపోగా అప్పుడు ఆ భాగాలన్నీ కంపెనీ నౌకరుల కింది అధికారం కిందనుంచి పరిపాలన జరిగించారు. పూర్వ మీ ప్రాంతాలలో నున్న కంపెనీ వర్తక స్థానములు ఫ్యాక్టరీ ఏజెంట్లకు బదులుగా మచిలీబందరులోను విశాఖపట్టణంలోను గంజాములోను మూడు రాష్ట్రీయ కార్యాలోచన సంఘాలను, వాటికి ముగ్గురుఛీఫు (Chiefs) లనే ప్రధానాధికారులుగా నియమించారు. ఈ రాష్ట్రీయసంఘాలూ, సభాపతులూ చెన్నపట్టణం రాజధాని గవర్నరు అధికారానికి లోబడి దేశపరిపాలన జరిగించేవారు. రాజమహేంద్రవరం, ఏలూరు సర్కారులను మచిలీబందరు రాష్ట్రీయ సభాపతి అధికారంకింద వుంచారు. రాజకీయ సివిలు రివిన్యూ వ్యవహారాలన్నీ ఈ రాష్ట్రీయ సభాపతులే జరిగించేవారు. ఒక పాతికసంవత్సరాలదాకా ఉత్తరసర్కారుల పరిపాలన యీ ప్రకారం జరిగింది.

## 'తెలుగుస్థానాలు' - జమీందారీలు

ఆనాటి కీ ప్రాంతాలలో చాలామంది రాజులమనీ జమీందారుల మనీ పేరు పెట్టుకుని బలవంతులైవున్నారు. వీరిలో ఏకొద్ది మందో తప్ప మిగిలినవారు మహమ్మదీయ పరిపాలనలో శిస్తులు వసూళ్లు చేయడానికి యిజారాలు పొంది వంశపారంపర్యా ఆయా జమీనుల వ్యవహారాలను చక్కబెడుతూ వచ్చిన దళారీలే గాని దేశాన్ని పరిపాలించే నిజమైన

రాజవంశాలవారు కారు. అయితే మహమ్మదీయ ప్రభువులు బలహీనులైనకొద్దీ ఈ జమీన్దార్లు బలవంతులై స్వతంత్రులై ఆయా ప్రాంతాలు తమకు హక్కుగల జమీలుగా అనుభవించడం ప్రారంభించారు. ఈ జమీందారులు కొంత నిర్ణీత మొత్తమును ప్రభుత్వానికి చెల్లించి మిగతా రాబడినంతా తామే తసరపు చేసుకోవడము ప్రారంభించారు. వీరిలో పోలవరం జమీందారు రంపదొరగారు మొదలైనవారు కొందరు దూరంగాను మన్యాలలోను కొండలలోను ఉండేవారు. పెద్దాపురం, పిఠాపురం, కోట రామచంద్రపురం, మొగలితుర్రు జమీందార్లు కొందరు ధనవంతులు బలవంతులై చాలామంది సిబ్బందిని పరివారజనమును పెట్టుకుని రాజలాంఛనాలు వహించి పరువుఫాయాలతో మెలగుతూ చాలా సొమ్ము ఖర్చుపెడుతూ డాబుదర్పాలతో జీవించేవారు. ఈ ప్రాంతాలు ఇంగ్లీషువారి స్వాధీనం అయ్యేటప్పటికి రాజలాంఛనాలు వహించిన పెద్ద జమీందారులు, చిన్న జమీందారులూ చాలామంది కనబడ్డారు. ఈ జీమీందారులకు గల హక్కులను గురించి విచారించడానికి కంపెనీవారికి అవకాశంకూడా లేకపోయింది. జమీందారులవల్ల శిస్తులు వసూలు చెయ్యడానికి సైనిక సహాయం కావలసివచ్చేది.

జమీందారుల స్వాధీనములో వున్న భూములు గాక మిగిలిన భూములను సర్కారువారి “హవేలీ” భూములనేవారు వాటిని ప్రభుత్వాధికారులే అమరకపరిచేవారు. ఈ శిస్తులవసూళ్లలో చాలా హింసలు అక్రమాలు జరుగుతూవుండేవి. దేశాన్ని పరిపాలించడానికికొత్తగా ఏర్పరచబడిన రాష్ట్రీయ సంఘాలూ వాటి సభాపతులూ కంపెనీవారి వ్యవహారాలను కనిపెట్టి చూసన్తూవుండాలి. రివిన్యూవసూలు న్యాయపరిపాలనకూడా జరపాలి.

ఈ ఉద్యోగం చేసే దొరలలో చాలామందికి దేశీయుల ఆచారవ్యవహారాలు, స్వభావాలు తెలియవు. వారి భాష అసలే రాదు. అందువల్ల అన్ని వ్యవహారాలనూ వారి ‘ద్విభాషుల’కు వదలి వారి సలహా ప్రకారం జరిగించేవారు. అందువల్ల వారేమి చెబితే అది సాగేది. ఈ ద్విభాషులు సర్వాధికారులులాగ నటించేవారు. సామాన్య ప్రజలే గాక దొరలతో పనిగల జమీందారులూ, సంస్థానాధిపతులూ కూడా ఈద్విభాషుల నాశ్రయింప వలసివచ్చేది.

“మచిలీబందరుకింద వున్న సర్కారుల లోని జమీందార్లందరూ ఆయా పరగణాల నేలే సంస్థానాధిపతులనే అభిప్రాయంతో వారు వారు చెల్లించవలసినట్లు నిర్ణయించబడే కప్పం చెల్లించేపద్ధతికి లోబడి తమ రాజ్యభాగములలోని ఆదాయము యావత్తుకూ వారే అధికారులుగా నిర్ణయించబడ్డారు. వారు చెల్లించవలసిన కప్పాన్ని నిర్ణయించడంలో విచారణ యేమీ జరిగినట్లు లేదు. కంపెనీవారి ద్విభాషి శిరస్తాదారు హోదాలో ఇచ్చే సలహాపైననే అది



జరిగినట్లు కనబడుతూ వున్నది. 1767 వ సంవత్సరం ఫిబ్రవరి 13వ తేదీ ఆ షుమారున రాజమహేంద్రవరం ప్రాంతాల జమిందారుల వల్ల ఈ ద్విభాషిగారికి గారికి సాలుకు 40వేల వరహాల చొప్పున ఆదాయం వస్తూవుండేది.” ఈ సంగతి 1812లో పార్లమెంటు వారికి పంపబడిన "Fifth Report" అనే నివేదికలో నుదాహరింపబడింది. (చూడు పుట 179)

1778 నాటి పరిస్థితులను గురించి విచారిణచేసి పెద్దాపురం తిమ్మ జగపతిరాజుగారిని గురించీ మొగలితుర్రు తిరుపతిరాజుగారిని గురించీ నూజివీటి అప్పారావుగారిని గురించిన్నీ పిఠాపురం మహీపతిగారిని గురించీ ఇంకా 27 మంది చిన్న జమీందారులను గురించీ వారి రాబడులను గురించీ వారు చేసే స్వంత ఖర్చులను గురించీ విమర్శించి ఈజమీందారులవల్ల కంపెనీవారికి వచ్చేలాభం పోతూ వున్నదని ఆనివేదికలో వ్రాశారు. (చూడు పుట 180-1)

## రంప పితూరి

పోలవరం జమీందారీ విషయంలో ఆ కుటుంబంలో తగాదాలు వచ్చినవి. పోలవరము, గూటాల, కొత్తపల్లి అనే మూడు జమీందారీలనూ పెద్ద అన్నగారైన మంగపతిదేవుగారికింద వుంచారు. దీనిని గురించి తగాదా పెట్టిన ఆయన చిన్నతమ్ముడు విజయగోపాలదేవును విచారణపూర్తి అయ్యేవరకూ మచిలీపట్నంలో నిర్బంధించివుంచారు. ఈస్థితిలో మంగపతిదేవుగారు జమీందారీ లెక్కలను చూపించకుండాను బకాయి చెల్లించకుండాను వుపేక్షించాడు. అందువల్ల మంగపతిదేవును పట్టుకోవలసినదని రివిన్యూ బోర్డువారు వుత్తర్వుచేశారు. మంగపతి దేవుదుశ్చర్యలనుగురించి వ్రాస్తూ జమీందారీలో గూటాల ప్రాంతాన్ని మళ్లీ అతడి తమ్ముడి కివ్వడానికికలెక్టరు పైవారికి వ్రాశాడు గాని డైరెక్టర్లు దీనికి ఒప్పుకోలేదు. రివిన్యూబోర్డువారు మంగపతిదేవు తమ్ముణ్ణి వదలిపెట్టవచ్చు నన్నారుగాని అతణ్ణి పోలవరానికి దూరంలో వుండేటట్లు చూడమన్నారు. అంతట అతన్ని రాజమహేంద్రవరంలో వుండమన్నారు. నెలకి 100 వరహాల పింఛను ఇచ్చారు.

మంగపతిదేవుగారి వ్యవహారం బాగా లేదు. అతడుచేసిన వాగ్దానంప్రకారము బకాయి చెల్లించలేదు. అందువల్ల అతనిని వెంటనే పట్టుకోవలసినదనిన్ని భూములమీద పంటను జప్తుచేయవలసినదనిన్నీ బోర్డువారు కలెక్టరుకు వుత్తర్వుచేశారు. ఈ వుత్తర్వులు రాగానే మంగపతిదేవు తనను వదలి పెడితే 16000 వరహాలు చెల్లించి తాను ఎక్కడికి పారిపోకుండా పూచీకత్తు నిచ్చి బకాయి రెండేళ్లలో చెల్లిస్తానన్నాడు. కంపెనీవారిందుకు ఒప్పుకున్నారు.

ఈ స్థితిలో మంగపతి దేవుగారి తమ్ముడు విజయగోపాలదేవుగారు రాజమహేంద్రవరంనుంచి పరారి అయి మన్యంలో రంపకి పారిపోయి పోలవరానికిపైన గోదావరికి అవతలొడ్డునవున్న లింగారెడ్డీ అనే కొండ రాజ్యంలో దాక్కొన్నారు. విజయగోపాల దేవుగారిని కొందరు గ్రామస్థులు పితూరీ చేయవలసినదని ప్రోత్సహించగా మొదట చెయ్యలేదుగాని లింగారెడ్డిన్ని కలిదిండి తిమ్మరాజుగారున్నూ మెల్లగా అతన్ని ప్రోత్సహించి అందరూ కలసి పోలవరం జమీందారీలో రెండుగ్రామాలను కొల్లగొట్టారు.

అంతట ఈ పితూరీని సాకుగా పెట్టకొని మంగపతిదేవుగారు తన బకాయిని చెల్లించకుండా వుండడానికి ప్రయత్నించాడుగాని కంపెనీవారు కఠినంగా మందలించగా బాకీయిస్తానని పైకి చెప్పుతూనే కాలహరణం చేశాడు. ఈ సందులో 52580 వరహాలు బాకీరద్దు చేయించుకోవాలని అతనివూహ. రాజమహేంద్రవరానికి రాకుండా మొఖంచాటువేశాడు. పితూరీదారులతో చేరుతానని బెదిరించాడు. వెంటనే మంగపతిదేవు కోరినకోరికలు నిరాకరించి నట్లు తెలిపితే అతడు పితూరీదార్లతో చేరుతాడని కలెక్టరు సైనికసహాయం సిద్ధపరచడానికి పూనుకున్నాడు. కంపెనీ సైన్యాలు పోలవరంకోటను పట్టుకున్నవిగాని జమీందారు పారిపోయాడు. కోటను నేలమట్టం చేశారు. ఆయనను పట్టియిచ్చినవారికి 10 వేల రూపాయలిస్తామని ప్రకటించారు.

మంగపతిదేవుగారు నిజామురాజ్యానికి పారిపోయి మళ్లీకొన్నాళ్లకు తిరిగివచ్చారు. 1800 సంవత్సరం ఆగస్టు11వ తేదీన కంపెనీ సైన్యాలు మళ్లీ జమీందారును పట్టుకోవడానికి బైలుదేరినవి. దారిలో లింగారెడ్డిగారి గ్రామాలను నాశనం చేశారు. రంప గ్రామాలవారు తిరుగబడకుండా కొత్త పల్లెలో ఒకసైనికదళం వుంచారు. రంపపితూరీదార్లలో ప్రముఖుడైన "పండుదొర" కంపెనీవారి సైన్యాలమీదికి వచ్చి పోలవరానికి అవతల వారిదారిని అరికట్టాడు. ఈలోపుగా విజయగోపాలదేవుగారు రేక పల్లినుంచి వచ్చి కంపెనీవారికి లోబడ్డారు. మంగపతిదేవుగారు తనతో వుత్తర ప్రత్యుత్తరాలు జరిపి పితూరీకి ప్రోత్సహించినట్లు ఒప్పుకొన్నారు. మంగపతిదేవుగారి యింకొక తమ్ముడైన రెడ్డినరసింహదేవు గారిని కంపెనీ సైన్యాలు పట్టుకున్నవి. అంతట పోలవరం జమీందారీ భూములకు 42698 వరహాలకు శిస్తు నిర్ణయించేశారు. ఎస్టేటును లక్ష్మీనారాయణదేవుగా రనే దూరపు బంధువుకిచ్చారు.

## శాశ్వత ఫైసలా

1802-3 మధ్య శాశ్వత ఫైసలాజరిగి జమీందారులు చెల్లించవలసిన పేష్కషును



నిర్ణయిస్తూ వారికి సన్నదు లివ్వబడినవి. కంపెనీ గవర్నమెంటు భూములనుకూడా 1000-5000 వరహాలు వచ్చే భాగాలుగా విభజించి గుత్తకిచ్చేవారు. శాశ్వత ఫైసలా చేసిన తరువాత 10 సంవత్సరాలదాకా కలెక్టర్ల స్వంత అజమాయిషీ కింద వుండే భూములు లేవుగాని తరువాత యీజారాదార్లు సరిగా సొమ్ము యివ్వనందువల్ల ఆపద్ధతి మానివేసి కంపెనీవారే అమరకం చెయ్యడం ప్రారంభించారు. 1822లో చెన్నపట్నం గవర్నరు మన్రోగారు సర్కారులో పర్యటనంచేసి అక్కడ కనబడే లోపాలను సూచించారు.

అనేక కారణాలవల్ల జిల్లా పరిస్థితులు పాడైనవి. 1832లో పెద్ద కరువు వచ్చింది. 1839లో ఉప్పెన వచ్చింది. మచిలీబందరు జిల్లా రివిన్యూ వసూలు పడిపోయింది. అంతట ఈ జిల్లా వ్యవహారాలను గురించి విచారించడానికి సర్ హెన్రీ మాంటో మెరీగారిని నియమించగా ఆయన 1844లో ఒకనివేదికను వ్రాశారు. ఇలాగే గుంటూరు జిల్లాను గురించి కూడా విచాణచేశారు. అంతట జిల్లా పరిపాలనలో కొన్ని సంస్కరణలు చేయదలచి 1849లో సర్ వాల్టర్ ఎలియట్ గారిని ఉత్తర సర్కారుల కమిషనరుగా నియమించారు.

(Godavari District Manual - Morris.)

## రాజ్యాంగ సంస్కరణలు-జిల్లా కలెక్టర్ల నియామకం

కంపెనీవారి రాష్ట్రీయ సంఘములు (ఛీఫ్‌లు) అధిపతులు వర్తక వ్యవహారాలలో నిమగ్నులై రివిన్యూ పరిపాలన న్యాయపరిపాలన చేయలేకపోయేవారు. వారికిదేశాచారాలు దేశభాషలు తెలియవు. వ్యవహారాలన్నీ దుబాషీలకు వప్పగించినందువల్ల చాలా దుష్పరిపాలన ప్రబలింది.

ఈ సంగతులు సీమలో కంపెనీవారికి తెలియగా 'సర్క్యూటు కమిటీ' అనేవిచారణసంఘాన్ని నియమించారు. జమీందారుల అధికారాలను తీసివెయ్యకుండా దౌర్జన్యం చెయ్యకుండా కంపెనీవారికి కావలసినసొమ్ము రాబట్టవలసిందన్నారు. చెన్నపట్నం గవర్నరైన సర్ తామస్ రంబోల్డుగారు లంచగొండియై కమిటీవారి సూచనలను అమలు జరపక జమీందార్లను చెన్నపట్నానికి రప్పించి వారిని పీడించి సొమ్ము వసూలుచేసేవాడు. అంతట జమీందార్లందరూ తిరుగుబాటు చేశారు. 1785-1790 మధ్య చాలా తిరుగుబాటులు జరిగినవి. ఆకాలంలో పేష్కషు చెల్లించని జమీందారులను శిస్తులు చెల్లించని యీజారాదార్లను భూకామందులనుగాని కంపెనీ అధికారులు పట్టుకొని వారి భూములను లాక్కొని వారిని నిర్బంధంలో వుంచేవారు. సైనిక సిబ్బంది; సహాయంతో బలవంతంగా శిస్తులు వసూలుచేసేవారు. అందువల్ల బాకీపడిన జమీందారులు ప్రాణాలకు

తెగించి తిరుగుబాటు చేసేవారు.

ఉత్తరసర్కారుల రాజకీయ సివిలు రివిన్యూ పరిపాలన యావత్తూ 25 సంవత్సరాలపాటు ఇలాగ మచిలీపట్నం విశాఖపట్నం గంజాములలో స్థాపించబడిన రాష్ట్రీయసంఘములు వాటి అధిపతుల ద్వారాజరిగింది. తరువాత ఈ సంఘాలను అధిపతులను రద్దుచేసి దేశాన్ని జిల్లాలుగా విభజించి ప్రతిజిల్లాకూ ఒక కలెక్టరును నియమించి అకలెక్టర్లు చెన్నపట్నంలో రివిన్యూబోర్డువారికి బాధ్యులై వుండేపద్ధతిని పరిపాలన స్థాపించడానికి నిశ్చయించారు. ఈ కొత్త పద్ధతి 1794 చివరి భాగంలో అమలులోకి వచ్చింది.

## "మచిలీ బందరు జిల్లా"

ఆ సందర్భంలో ఏర్పాటుచేయబడిన మచిలీబందరుజిల్లాలో మూడు డివిజను లుండేవి. పెద్దాపురము, పిఠాపురము జమీందారీ లున్న రాజ్యభాగము, దక్షిణమున గోదావరినది వరకూ మొదటి డివిజనుగా వుండేది. దీన్ని పరిపాలించే కలెక్టరురాజధాని కాకినాడ. ఉండి, తణుకు, నరసాపురమున్నూ పూర్వం మొగలితుర్రు జమీందారీలో చేరివుండిన భాగాలున్నూ ఈ రెండవ డివిజనులో చేర్చారు. దీన్ని పరిపాలించే కలెక్టరురాజధాని మొగలితుర్రు. సెంట్రల్ డెల్టాయున్నూ, రామచంద్రపురము, రాజమహేంద్రవరము, కోరకొండ,కొత్తపల్లి, పోలవరం, గూటాల దగ్గరనున్న గ్రామాలున్నూ గోదావరి నదికి దిగువను రెండు ప్రక్కలా ఉన్నప్రాంతాలున్నూ, నూజివీడుదాకాగల భాగమంత మూడవడివిజనులో చేరీ రాజమహేంద్రవరంలో నున్న కలెక్టరు పరిపాలనకింది నుండేది.

ఈ జిల్లాలలోనున్న జమీందార్లు కంపెనీవారికి చెల్లించవలసిన పేష్కషు సరిగ్గా చెల్లించక బకాయి పెడుతూ వుండేవారు. పైగా పేష్కషు క్రమక్రమంగా అభివృద్ధిచేస్తూ వున్నందువల్ల దానిని చెల్లించలేక యిబ్బందులు పడేవారు. అలా చెల్లించని జమీందారీలను కంపెనీవారు వేలాలు వేసేవారు. ఇలాగ జిల్లా పరిస్థితులు కల్లోలముగా వున్నవి. ఈ పరిస్థితులలో కొంతమంది జమీందార్లు తిరుగుబాటుచేశారు.

## భూపయ్య తిరుగుబాటు

రెండవ డివిజనులో చాలాభాగం భూపయ్య, వెంకటరామరాజు అనే ఇద్దరు ధనవంతులకి గుత్తకిచ్చారు. తాము ఒప్పుకొన్న సిస్తుమొత్తాన్ని వాళ్లు చెల్లించలేదు. వారు చాలామొత్తం వసూలుచేసి హరించినట్లు తేలింది. గుత్తభూమిని వాళ్ల స్వాధీనంలో నుంచి తొలగించి వారి అధికారాలను



తీసివేశారు. అప్పటికీ వాళ్లు బాకీ చెల్లించకపోగా రివిన్యూ బోర్డువారు వాళ్లనుచెన్నపట్నానికి పిలిపించారు. వాళ్లను కాంచీపురంలో నిర్బంధించియుంచడానికి నిశ్చయించగా వాళ్లు చెన్నపట్నం నుంచి తప్పించుకొని నిజామురాజ్యంలోకి పారిపోయారు. భూపయ్య కొంతమందిని చేర్చుకుని 1795 జూలై 15వ తేదీన మొగలితుర్రుమీదికి వచ్చిపడ్డాడు. కొంతమంది సిబ్బందితో కలెక్టరు రికార్డులను కాపలా కాశాడు. చిన్ని సంకుల సమరం జరిగిన తరువాత భూపయ్య రాజీకి వప్పుకొని వెనక్కి వెళ్లాడు.

## కలిదిండి తిమ్మరాజుగారి పితూరీ

మూడవ డివిజనైన రాజమహేంద్రవరంలోకూడా 1795-8 మధ్య కలిదిండి చిన తిమ్మరాజు అనే ఆయన తిరుగుబాటుచేశాడు. ఇతడు కూడా శిస్తువసూలు యిజారా పార్టీ బకాయి పెట్టి భూపయ్యతో నిజామురాజ్యానికి పారిపోయి 200-300 మందితో 1791లో వచ్చి, ఉండిదాకా చొరబడ్డాడు అప్పుడు ఠాణేదారు ముద్దుకృష్ణమొదలియారు తిమ్మరాజుగారి మనుష్యులు దివిటీలతో వచ్చిపడి ఠాణేదారున్ని రమ్మన్నారు. ఠాణేదారుభార్య వచ్చి "అన్నయ్యా! నాకు పసుపూకుంకుమా నిలపవలసిం"దని ప్రార్థించింది. తిమ్మరాజుగారు సరేనని వాగ్దానంచేశాడు. అంతట ఠాణేదారు నిరాయుధుడై బైటికివచ్చి తన్ను రక్షించమని తిమ్మరాజుగారిని కౌగిలించుకుని వేడుకున్నాడు. చూస్తారేమిటని తిమ్మరాజు తన మనుష్యులతో అనేటప్పటికి వాళ్లు ఠాణేదారుని పొడిచి చంపివేశారు. తరువాత రెండు మూడు డివిజనులలో కంపెనీ అధికారులు సిపాయిలను ప్రోగు చేసేటప్పటికి తిమ్మరాజుగారు మళ్లీ నిజామురాజ్యంలోకి పారిపోయాడు. భద్రాచలం రాజ్యంలో ఒక జమీందారుడైన దామెర శాయన్నారావు గారు, తిమ్మరాజు సుబ్బయ్య అనే ముఖ్య పితూరీ దారునున్నూ ఇంకా ముగ్గురు పితూరీ దార్లనూ పట్టుకుని మచిలీపట్నానికి పంపించాడు. ఈ జమీందారుగారితో రాయబారాలు నడిపి కలిదిండి తిమ్మరాజుగారిని కూడా పట్టించాలని కంపెనీ అధికారులు ప్రయత్నించారు గాని సాగలేదు. తరువాత పోలవరంలో మంగపతిదేవుగారు లేవదీసిన పెద్దపితూరీకి తిమ్మరాజుగారు మద్దతు చేశాడు.

*- ఆంధ్రపత్రిక,*

***03.12.1944, 10.12.1944, 17.12.1944, 8.1.1945, 14.1.1945***



# కంపెనీ సర్కారు

వర్తకము చేసుకొనుటకొరకు వచ్చిన ఇంగ్లీషువారు త్వరలోనే భారతదేశమునకు ప్రభువులైనారు. క్రీ.శ. 17, 18 శతాబ్దులలో హిందూదేశములోని వివిధ ప్రాంతములు క్రమక్రమముగా నింగ్లీషు వర్తకకంపెనీ వారిస్వాధీన మగుచురాగా ఆయారాజ్యభాగములను వారు స్వలాభముకొరకు పరిపాలింపసాగిరి.

మొదట కొన్ని సంవత్సరముల వరకును ఈ 'కుంపెనీ సర్కారు' పరిపాలనకుఎట్టి హద్దుపద్దులు లేవు. వారిని అదుపు ఆజ్ఞలలో నుంచు పైయధికారులిక్కడ లేరు. సాధ్యమైనంత త్వరితముగా వీలైనంత సొమ్మును చేజిక్కించుకొని సీమకు తర్లించుకొని పోవుటయే ప్రధాన కర్తవ్యమను సూత్రముపైననే చాలకాల మా ప్రభుత్వము జరిగినది.

వ్యాపారలాభములమాట యటు లుండనిచ్చి ఎగుమతి దిగుమతి సుంకముల ద్వారమునను, ఇజారాల ద్వారమునను ఆక్రమణచేసిన రాజ్యభాగములలో వసూలు చేయు భూమిశిస్తుల ద్వారమునను దేశీయ రాజులు, నవాబులు పోరాడుకొను సందర్భములో ఎవరి ప్రక్కనో ఒకరి ప్రక్కన చేరి అందు క్రింద పుచ్చుకున్న సొమ్ము ద్వారమునను యుద్ధములలోను, దండయాత్రలలోను పట్టణములను దోచుకొనిన బాపతు, ప్రజలను కొల్లపెట్టి పుచ్చుకున్న బాపతు వస్తువాహనములు రొక్కము ద్వారమునను కోట్లకొలది సొమ్ము నీవిధముగా సేకరించి ఇంగ్లాండు దేశమునకు పంపసాగిరి. ఆకాలములో మనదేశమునుండి సీమకు తర్లింపబడిన ధన మొక మహాప్రవాహమువలె నుండెనని ఆంగ్ల చరిత్ర కారులే చెప్పుచున్నారు.

ఇంగ్లాండులో నున్న కంపెనీ యజమానులు హిందూదేశములో తమ తాబేదారులకు 'సొమ్ము పంపుడు. ఇంకను సొమ్ము పంపుడు' అని తాకీదులు పంపించుట తప్ప ఈ సొమ్ము నెట్లు సంపాదించుచున్నారు? అని ఎన్నడును ప్రశ్నించిన పాపమున బోవనందున ఇక్కడి కంపెనీ ఉద్యోగులెన్ని అన్యాయములను జేసియైనను సొమ్ము పంపుటయే ముఖ్య కర్తవ్యముగా ప్రవర్తించుచుండిరి. ఆకాలమున చాలా అన్యాయములు దుర్మార్గములు జరిగినవి. అప్పుడు జరిగిన ప్రజాపీడనమునకు మితిలేదు. తెల్లవాని పేరు చెప్పిననే



ప్రజలు భయపడి పారి పోవుచుండిరి. ఈ సందులో కంపెనీ యుద్యోగము చేయువారలు ఎవరికి దొరి గినది వారు తమ జేబులలో వేసుకొని కుబేరులగుచుండిరి. గవర్నరు మొదలు చిన్న వర్తకుని వరకును సేనాధిపతి మొదలు సిపాయి వరకును ధనార్జనమే ప్రధాన కర్తవ్యముగా నెంచుకొని సంచరించుచుండిరి. ఆంగ్లరాజ్య స్థాపనాచార్యుడని పేరు పొందిన ఒక్క క్లయివు సంపాదించినదే కొన్ని కోట్లరూపాయిల విలువగలిగియుండగా తక్కిన దొరలందరును కలిసి సంపాదించినసొమ్ము ఎన్నికోట్ల విలువగలదై యుండునోఊహించవచ్చును.

దురదృష్టవంతులైన ఈ భారతదేశ ప్రజలను పీల్చి పిప్పిచేసి వసూలుచేసిన పన్నుల సొమ్ములోనుండి కొంత భాగమైనను వారి క్షేమలాభముల కొరకును అభివృద్ధికొరకును ఖర్చుపెట్టుట న్యాయమని ఆనాటి కంపెనీయుద్యోగులకు గాని అధికారులకుగాని తోచలేదు. ప్రజలు దరిద్రులై బాధపడుచున్నను వారి మనస్సులు కరగలేదు.

ఈ కంపెనీ సర్కారుయొక్క దుష్పరిపాలనము మితిమీరినది. దుర్మార్గములు చెలరేగినవి. ఈ అన్యాయముల సంగతి ఇంగ్లాండు ప్రభుత్వమువారికి తెలిసినది. ఇక్కడి నుండి దోచుకొని వచ్చిన సొమ్ముతో భోగములనుభవించుచున్న వారిని చూచి, ఇంగ్లాండులోని వారాశ్చర్యపడసాగిరి. వీరింత స్వల్పకాలములో నింత భాగ్యవంతు లెట్లు అగుచున్నారని అనుమానము కలిగినది. విచారింపగా వీరు చేయుదురన్యాయములసంగతి బయల్పడినది.

భారతదేశప్రజల దుఃఖములకు గూర్చి వెల్లడికాగా ఇంగ్లాండు ప్రజాసభయైన పార్లమెంటులోని సభ్యులలో ధర్మాత్ముడైన ఎడ్మండ్ బర్కు అను మహాపురుషుని మనస్సు కరగినది. భారతదేశమున తన దేశీయులు చేయుచున్న అన్యాయములను చూచి సహించలేక దీనినిగురించి పార్లమెంటులో మొరపెట్టినాడు. ఈతనికృషి వలన భారతదేశ స్థితిగతులను గురించి విచారణ జరిగినది.

ఎట్టకేలకు భారతదేశ పరిపాలనను సంస్కరించుట అవసరమని పార్లమెంటువారు నిశ్చయించి 1773లో రెగ్యులేటింగు అక్టుఅను నొక చట్టమును శాసించిరి. భారతదేశమును పరిపాలించుట కొక గవర్నరు జనరలును అతనికిసలహానిచ్చుట కొక కార్యాలోచన సభను నియమించిరి.

భారతదేశమునకు మొదటి గవర్నరు జనరలుగా పనిచేసిన వారన్ హేస్టింగ్సు ప్రభుత్వమునందు జరిగిన అన్యాయములనుగూర్చి విచారించి అతనిని శిక్షింపవలసినదని బర్కు మహాశయుడు గట్టిగా కోరినమీదట కొన్ని సంవత్సరములు విచారణజరిగినది.

తుదకు వారన్ హేస్టింగ్సును పార్లమెంటువారు విడుదలచేసినను అతడు చేసిన అన్యాయములన్నియు ప్రకటింపబడినవి. పార్లమెంటు వారు కన్నులు తెరచిరి కంపెనీ పరిపాలనను అదుపు ఆజ్ఞలలో నుంచుటకు తగు ఏర్పాట్లు చేసిరి. న్యాయబుద్ధి కలవాడని పేరుపొందిన కారన్‌వాలిస్ ప్రభువును గవర్నరు జనరలుగా జేసి 1786లో పంపిరి. కారన్ వాలిస్ వచ్చిన తరువాత నీ దేశ ప్రభుత్వమునందుకొన్ని మార్పులు జరిగినవి. తరవాత ఇరువదేండ్ల కొకమారు కంపెనీ వారికి మలర రాజ్యాధికార పట్టానిచ్చి నప్పుడెల్ల భారతదేశ స్థితిగతులను గూర్చి పార్లమెంటువారొక విచారణ జరుపసాగిరి. ఈ విచారణల ఫలితముగా నీదేశ పరిపాలనమునందు కొన్ని మార్పులు జరిగెను. ఎన్ని మార్పులు జరిగినను ప్రజల స్థితిమాత్రము బాగుపడలేదు.

## 1793 నాటి పరిస్థితులు

1793వ సంవత్సరము వరకును కంపెనీ పరిపాలన పూర్వకాలమునాటి మొగలాయి పద్ధతుల ప్రకారమే జరిగెను. దేశీయోద్యోగులే అన్ని కార్యములను నిర్వహించుచుండిరి. వీరిపైన దొరలు పైతనిఖీ చేయుచుండిరి. అంతేగాని దొరలే స్వయముగానే కార్యమును చేయువారుకారు. గ్రామపరిపాలనమెల్ల పూర్వము వలెనే గ్రామ పంచాయితులద్వారా ననే జరుగుచుండెను. గ్రామములోని సాగుభూమినెల్ల పంచాయితులే అమరకపరచి శిస్తులను వసూలుచేసి రాజభాగమును స్థానిక రాజోద్యోగికిచ్చుచుండెను. న్యాయ పరిపాలనమును కూడా పంచాయితులే జరిగించుచుండెను. పట్టణములలో మొగలాయి న్యాయస్థానములుండెను. ఈ న్యాయ విచారణలపైన మొగలాయి చక్రవర్తి అప్పీలు అధికారములు కలిగియుండెను. భారతదేశమునందు మొగలాయి ప్రభుత్వమునకు బదులు కంపెనీ ప్రభుత్వమువచ్చినను దేశముయొక్క పరిపాలనా విధానము పూర్వమువలెనే సాగుచుండినందువలన దేశముయొక్క రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థలు కట్టుబాటులు చెక్కుచెదరక ఎప్పటివలెనే యుండెను.

కారన్‌వాలిసు భారతదేశమునకు గవర్నరు జనరలుగా వచ్చినతరువాత అతడు చేసిన మొదటిపని, శాశ్వతఫైసలా అను భూమిశిస్తుల నిర్ణయము. అదివరకు దేశములోని వివిధ ప్రాంతములలో శిస్తులను దళారీలు ఇజారాలుపాడుచుండిరి. కంపెనీవారికి కొంత పేష్కసును శాశ్వతముగా చెల్లించుపద్ధతిని దేశములో రైతుల అధీనమందుండిన భూమికి ఈదళారీ లేహక్కుదారులైయుండ ఒక క్రొత్త జమీందారీపద్ధతిని కారన్ వాలిసు స్థాపించెను అంతట నీ జమీందారులు రైతులను పీడించి, తమ యిచ్చవచ్చినట్లు హెచ్చు శిస్తులు



వసూలు చేయుచు తాముమాత్రము కంపెనీకి నిర్ణీతపు సొమ్మును చెల్లించుచు తాము బాగుపడసాగిరి. వీరు భూములను నీటివనరులను మరమ్మత్తు చేసి బాగుచేయక ఉపేక్షించసాగిరి. భూసారము తగ్గినను ఆదాయము క్షీణించినను శిస్తులు తగ్గించక వసూలు చేయుచుండిరి. శిస్తులు చెల్లించలేని రైతుల మళ్లు మాన్యములు ఇళ్లు వాకిళ్లు పశువులు జప్తుచేసి అమ్మించు అధికారము ఈ ఇంగ్లీషు పరిపాలనలో ఏర్పడినందువలన జమీందారుల నిరంకుశత్వము హెచ్చినది. పేష్కషు చెల్లించలేని జమీందారుల జమీల నమ్మించు హక్కు కంపెనీ వారి కుండినందువలన జమీందారీలుకూడా తలక్రిందగుచుండెను.

కారన్‌వాలిసు దేశమును జిల్లలుగా విభజించి ప్రతిజిల్లాకు నొక పన్నులవసూలు అధికారి నేర్పరచినాడు. ఈ అధికారులకు కలెక్టరులని పేరు. వీరందరు నింగ్లీషు దొరలే - రైత్వారీ భూములను సాలియానా అమరిక పరచి శిస్తువసూలు చేయటమే వీరి ప్రధాన కర్తవ్యము. ఈ పనిని చక్కగా జరుపుటకు కావలసిన నిరంకుశ అధికారము లన్నియు వీరి కొసగబడెను. ధాన్యపు శిస్తు వసూలు పద్ధతి తీసివేసి రొక్కపు శిస్తువసూలు పద్ధతిని స్థాపించిరి. అందువలన శిస్తులను కిస్తీల ప్రకీరము చెల్లించవలసి వచ్చినవి అప్పటికి ధర లేకపోయినను ధాన్యమును అమ్మవలసి వచ్చుచుండెను. అమ్మకపోయినచో అప్పుచేయవలసి వచ్చుచుండెను. అందువలన రైతులను ఋణములు చేయసాగిరి. దీనికి తోడు శిస్తులువసూలు చేయు ఉద్యోగులు, ముఖ్యముగా చిన్న చిన్న ఉద్యోగులందరును లంచగొండులుగా నుండి నిరంకుశులయి రైతులను పీడించుచుండిరి.

న్యాయవిచారణ పద్ధతిలో కూడా చాలా మార్పులు జరిగినవి. ప్రతిజిల్లాలోను ఒక ఇంగ్లీషు జిల్లా జడ్జి, కోర్టు స్థాపించబడెను. అన్ని తగాదాలును అతడే తీర్మానించు నటులు చేసిరి. ఈ జిల్లా న్యాయాధికారి జిల్లా మేజిస్ట్రేటు కూడా అయియుండెను. ఇతడే పోలీసు సిబ్బందికి పయి యధికారి ఈ పోలీసు శాఖకు ప్రతి కేంద్రమునకు ఒక్కొక్క ఠాణాయుండెను ఈ ఠాణా అధికారి "దారోగా" ఇతడు దేశీయోద్యోగి. ఇతనికినెలకు 25-0-0 లు జీతము. ఆ దినములలో దోపిళ్లు దొంగతనములు చాల హెచ్చుగ నుండెను. దారోగాలు లంచగొండులై యుండిరి.

కారన్ వాలిసు ప్రభుత్వములో పెద్ద యుద్యోగము లన్నియు దొరలే చేయునటుల నిర్ణయించిరి. ఈ దొరలకు చాలా పెద్దజీతముల నేర్పాటుచేసిరి. న్యాయవిచారణచేయు, దొరలకు దేశపరిపాలన చేయు దొరలకు దేశభాషలు రానందువల్లను వారికి దేశీయుల ఆచారవ్యవహారములు తెలియనందువల్లనువారు దేశీయోద్యోగుల చేతులలో నుండిరి. వీరు వివాదములను పరిష్కరించలేనందువల్ల తీర్మానముగాక నిలువయుండిన వివాదముల

సంఖ్యాకములుగా నుండెను. కొంత కాలముగడచిన పిదప కలెక్టర్లకే మేజిస్ట్రీటుపనినికూడా ఇచ్చిరి. చెన్నపట్టణము రాజధానిలో మాత్రము మొదటి నుండి జిల్లా కలెక్టరే మేజిస్ట్రేటుగా నుండెను. తరువాత కొన్ని కొన్ని మార్పులు జరిగినను మొత్తము మీద 1793లో కారనువాలీసు చేసిన రాజ్యాంగ సంస్కరణములే తరువాతకంపెనీ పరిపాలనా విధానమున కంతకును పునాదిగ నుండినది.

ఈ మార్పులవలన త్వరలోనే రాజకీయార్థిక సాంఘిక వ్యవస్థలలో విపరీతపు ఫలితములు కలుగుట ప్రారంభమైనది. నేరముల విచారణలో సాక్ష్యబలమే ప్రధానముగ చూచునందువలన అబద్ధపు సాక్ష్యములు వృద్ధియైనది. నేరగాండ్రు తప్పించుకొని పోవుచుండిరి. బలవంతులు జమిందారులు బీదవారిని పీడించగలుగుచుండిరి.

హిందూ దేశమును మరల ఇరువది సంవత్సరములపాటు కంపెనీవారు పరిపాలించుట కధికారమిచ్చిన విషయమై ఇంగ్లీషు పార్లమెంటువారు విచారణ జరుపవలసిన తరుణము 1813లో వచ్చినది. అప్పుడు భారతదేశ స్థితిగతులను గురించియు కంపెనీవారి పరిపాలనమును గూర్చియు భారతీయ ప్రజల కష్టసుఖములను గూర్చియు కొంత విచారణ జరిగినది. అయితే ఇంగ్లీషువారికి ముఖ్యముగా పట్టినసంగతి మనదేశప్రజల కష్టసుఖములుగాక ఇంగ్లాండులో క్రొత్తగా స్థాపింపబడిన యంత్రాగారములలో తయారగుచుండిన సరుకులు హిందూదేశములో నెందుకు విరివిగా చలామణియగుటలేదు? వాటిని చలామణి చేయించుట ఎట్లు? హిందూదేశములో క్రైస్తవమత మెందులకు బాగా వ్యాపించుటలేదు, దానిని వ్యాపింప జేయు టెట్లు? అను విషయములే.

హిందూదేశమున నుద్యోగములు చేసిన అనుభవజ్ఞులైన దొరలను విచారించగా హిందూదేశములోనే మంచి నాణ్యములైన సరుకులు తయారగుచున్నవనియు అందువలన అక్కడి పరిశ్రమలను అణచివేసిననేగాని ఇంగ్లీషు సరుకు లక్కడ చలామణి కావనియు తేలినది. ఇట్లే క్రైస్తవమత ప్రచారకులను దేశములోనికి రానిచ్చినచో దేశమునందు అలజడి కలుగునేమోయను మొగమోటమి పెట్టుకొనక మిషనరీలలను దేశములోనికి రానిచ్చిన గాని మత ప్రచారము బాగుగా కాదనియు తేలినది. అంతటపార్లమెంటువారిందుల కనుగుణములైన తీర్మానములను చేసిరి.

## ఫలితములు

ప్రజల మనోభావములు మారిననేగాని క్రైస్తవమత ప్రచారమువలన భారతీయులు



క్రైస్తవమతములో చేరరని గ్రహించి పాశ్చాత్య విజ్ఞానమును ప్రజలకు బోధించుటకు నిశ్చయించిరి. "హిందూదేశ ప్రజల నైతిక వైజ్ఞానిక అభివృద్ధికొరకు దేశాదాయములో నుండి సాలుకొక లక్షరూపాయిలను వ్యయము చేయవలసినదని పార్లమెంటు వారు శాసించిరి. ఈదేశమునుండి వసులుచేయు సొమ్ములో నుండి ప్రజలకొరకు కొంతసొమ్ము ఖర్చుపెట్టు సూత్రమొకటి స్థిరపడినదిగాని పార్లమెంటువారి తీర్మానము అమలుజరిగి ప్రజలకు లాభముకలుగలేదు.

ఇంతలో కంపెనీ ప్రభుత్వమువలన ప్రజలకు కొత్తకష్టములు వచ్చెను. క్రైస్తవమత ప్రచారకులు వచ్చి అనేక విధములుగా మత ప్రచారముచేసి ప్రజలను క్రైస్తవ మతమున గలియుడని బాధింపసాగిరి. ఇంగ్లాండునుండి దొరలు చాలా మంది ఈ దేశమునకు వచ్చి లాభము నార్జించుటకు నీలిమందు తోటలు, తేయాకుతోటలు మొదలైన వ్యాపారములు చేయసాగిరి.

పార్లమెంటు వారు నిర్ణయించిన లక్షరూపాయిలు ఖర్చుపెట్టి ప్రజలవిద్యాభివృద్ధి చేయుటకు కంపెనీ వారెట్టి ప్రయత్నమును జేయలేదు. ప్రజలెప్పటివలెనే పూర్వకాలమునాటి వీధిబడులలో చదువుకొనుచుండిరి. అవియైనను పోషణలేక క్రమక్రమముగా నశించి పాడైపోవుచుండెను.

ప్రజల క్షేమలాభములకొరకు కంపెనీ వారెట్టి పనులను జేసినవారుకారు. కాలువలు, చెరువులు మొదలైన నీటివనరులు మరమ్మత్తులేక పాడైపోవుచుండెను. వ్యవసాయము అభివృద్ధిలేక దుఃస్థితిలో నుండెను. పూర్వపు ఉద్యోగావకాశముపోయి చాలామంది వ్యవసాయము వంకదిరిగిరి. దేశములో యుద్ధములుకూడా తాత్కాలికముగా ఆగిపోయినందున పనిలేని సిపాయిలుకూడా వ్యవసాయము చేయవలసివచ్చెను. అందరును భూములపై కెగబడినందున వ్యవసాయము లాభకారికాకుండెను. దారిద్ర్యము హెచ్చినది. దొంగతనములు, దోపిళ్లు హెచ్చినవి.

రైతులు చెల్లించవలసిన రొక్కపుశిస్తులత్యధిక ముగనుండెను. శిస్తులు చెల్లించుటకు, వారు అప్పులు చేయవలసివచ్చెను. అప్పులకొరకు రైతులపొలములను అమ్మించుటకు. ఇంగ్లీషు న్యాయశాస్త్ర ప్రకారము వీలున్నందున ఋణదాతలైన సాహుకారులును జమీందార్లును రైతులపొలముల నమ్మించుచుండిరి. రైతులు భూములు పోగొట్టుకొని దరిద్రులై కూలినాలి చేసికొనవలసివచ్చెను. వర్తకవ్యాపారములందు కూడా కంపెనీ వారవలంబించిన క్రొత్త పద్ధతులు ప్రజలకు నష్టమునే కలిగించెను. ఇంగ్లీషు వారి స్వేచ్ఛావ్యాపార పద్ధతివలన వారీదేశము లోనికి దిగుమతిచేయు సరుకులపైన సుంకములు

లేకపోగా ఈదేశములో నొక చోటనుండి ఇంకొక చోటికి రావాణాచేయు సరుకులపైన ఘాటీఅబ్కారీ సుంకములు విధింపబడుచుండెను. ఇంగ్లీషువారి ఇజారాలవలనను అధికారము వలనను దేశీయ పరిశ్రమలు క్రమక్రమముగా నశించెను.

కంపెనీ సర్కారువారీ దేశముండి వీలైనంతసొమ్ము రాబట్టుటకే ప్రయత్నించు చుండిరిగాని ప్రజలవిద్యగాని ఆరోగ్యముగాని ఆర్థికస్థితిగాని అభివృద్ధిచేయుటకు ప్రయత్నింపరైరి. కంపెనీ యుద్యోగులు నిరంకుశులై సివిలు, క్రిమినలు అధికారములను చలాయించి రైతులను హింసించి శిస్తులువసూలు చేయసాగిరి. చాలామంది యుద్యోగులు లంచగొండులుగా నుండి ప్రజలను పీడించుచుండిరి. పోలీసు శాఖలో లంచగొండితనము మితిమీరినందునదేశములో శాంతిభద్రతలు లేక రాజబాటలందుసైతము బందిపోటులు చెలరేగినవి. సాక్ష్యబలము మీదనే వివాదములను తీర్మానించు పద్ధతివలన క్రిమినలు కోర్టులలో నేరగాండ్రు తప్పించుకొనిపోవుటకును నిరపరాధులు శిక్షింపబడుటకును కారణములైనవి. పోలీసువారు అబద్ధపు నేరములు కల్పించి కొందరిని చిత్రహింసలుచేసి యొప్పించినట్లుకూడా అనేక సందర్భములలో బయల్పడెను.సివిలు వ్యవహారములలో బీదలకు న్యాయముదొరకుటయే దుర్లభముగ నుండెను. జమీందారులు సాహుకారులు బీదలను చాల తిప్పలు పెట్టి బాధించగలుగుచుండిరి.

## ఇంగ్లీషు పదవులు

మొగలాయి ప్రభుత్వము పోయి ఇంగ్లీషు పరిపాలన అవతరించిన తరువాత ఇంగ్లీషు నేర్చుకొనిన వారికి సహజముగా కంపెనీకొలువులో నుద్యోగములు దొరుకుటయు దానివలన లాభముకలుగటయు జూచిమన దేశీయులు కొందరు స్వయంకృషి వలన ఇంగ్లీషు నేర్చుకొనసాగిరి. కొంతమంది దొరలుకూడా హిందూ దేశీయులనీ విషయమున బ్రోత్సహింపసాగిరి.

ఇటు ఇంగ్లీషు నేర్చుకొనగోరువారి కొరకు కొన్ని వీధిబడులలో నింగ్లీషుచెప్పు ఉపాధ్యాయులు బయలుదేరిరి. ఇట్లు భారతీయులు ఇంగ్లీషు నేర్చుకొనవలెనని ప్రయత్నించుచున్నను కంపెనీవారు మాత్రము అది నేర్పుటకెట్టి పాఠశాలలును స్థాపించరైరి. స్వయంకృషివలన ఇంగ్లీషు నేర్చుకొనిన వారీ పాశ్చాత్య విద్యవలన లాభములను గ్రహించి దానిని దేశీయులలో వ్యాపింపజేయవలెనని సంకల్పించిరి. అందుకొరకుకొందరు గట్టి కృషికూడా చేసిరి. అట్టివారిలో కలకత్తాలో రాజారామమోహనరాయలు, ద్వారక నాధఠాకూరు, ప్రసన్నకుమార ఠాకూరుగార్లును, దక్షిణమున చెన్నపట్టణములో, వెన్నెలకంటి



సుబ్బారావుగారు, ఏనుగుల వీరాస్వామయ్యగారును, వెంబాకం రాఘవాచార్యులుగారును ఉదాహరణగా చెప్పవచ్చును.

చెన్నపట్టణములోని సదర్ ఆదాలతు కోర్టులో 1815 మొదలు 1829 వరకును ఇంటర్ ప్రిటరుగానుండిన ఆంధ్ర ప్రముఖులగు శ్రీ వెన్నలకంటి సుబ్బారావుగారు ఈ దేశములోని పాఠశాలలను సంస్కరించి ఆంగ్లేయవిద్యను వ్యాపింపజేయవలెనని మద్రాసు స్కూలుబుక్కు సొసైటీవారి కార్యదర్శికి 1820 సం॥ నవంబరు 22 వ తేదీన ఒక దీర్ఘమైన లేఖను వ్రాసిరి. ఇది వారి రికార్డులలో ప్రకటింపబడియున్నది. ఇట్లే ఈదేశమున నాంగ్లేయ విద్యావిధానమును స్థాపింపుడని కోరుచు వంగదేశమునందాకాలమున ప్రముఖులు గానుండిన రాజా రామమోహనరాయలవారు అప్పటి గవర్నరు జనరలైన అమహరెస్టుగారికి 1823 డిశంబరు 12 తేదీన ఒక దీర్ఘమైన లేఖను వ్రాసి కలకత్తా బిషప్పు గానుండిన హెబరుగారి ద్వారమున పంపిరి. ఇది కంపెనీ ప్రభుత్వములో కొంత సంచనలము కలిగించెను. ఇట్లు కంపెనీవారు ఇంగ్లీషు విద్యను స్థాపించుటకు పూనుకొనకముందే మన దేశీయులే అట్టి విద్యను వాంచించి అందుకొరకు కృషిచేసి దానిని స్థాపింపుడని కంపెనీవారిని కోరుట తటస్థించెను.

1820 మొదలు 1827 వరకును చెన్నపట్టణమునకు గవర్నరుగనుండిన సర్ తామస్‌మన్రోగారును ఆకాలంలోనే బొంబయి గవర్నరుగానుండిన మౌంట్ స్టూవార్డు ఎల్‌పిన్‌స్టన్‌గారును ఆంగ్ల రాజ్య స్థాపనకొరకు కృషి చేసిన సామ్రాజ్యాభిమానులైనను ఈ దేశములో విద్యాభివృద్ధి చేయవలయునను ఉదారబుద్ధితో అప్పటికీ దేశ ప్రజలలో విద్యాభివృద్ధి ఎట్లున్నదో తెలిసికొనగోరి కొంత విచారణ జరిపిరి. దీని ఫలితముగా బొంబాయిలో విద్యాభివృద్ధి కొరకుకొంతకృషి జరిగినదిగాని మన్రోగారాకస్మికముగా 1827లో చనిపోయినందున చెన్నపట్టణమున నెట్టి విద్యాసంస్కరణము జరుగలేదు.

– *ఆంధ్రపత్రిక, 12/01, 26/01, 26.6.1947*



# డచ్చివర్తకులు ఢిల్లీ చక్రవర్తి బహదూర్షాను దర్శించుట

హాలెండు దేశపు డచ్చి తూర్పు ఇండియా సంఘమువారు మొగలు చక్రవర్తి నాశ్రయించి వారి సామ్రాజ్యములో గుజరాతు రాష్ట్రమునందలి రేవుపట్టణమైన సూరతులో క్రీ.శ. 1616లో తమ ప్రధాన వర్తకస్థానమును స్థాపించి, దాని క్రింద అహమ్మదాబాదు, బరోడా, ఆగ్రాపట్టణములందు తమ వర్తక శాఖలనునెలకొల్పిరి. తరువాత జావాలోని బటేవియా నగరమునం దీప్రాంతములనేలు గవర్నరు జనరలును నియమించిరి. డచ్చివారు క్రమక్రమముగా అభివృద్ధిగాంచి బలవంతులైరి. సూరతు నగరములోని డచ్చివర్తక కంపెనీ యధికారులకు కొన్ని సౌకర్యములు కావలసి యున్నందున 1710లో నొక రాయబార వర్గమును చక్రవర్తిగారిదగ్గరకు పంపుటకు నిశ్చయించుకొనిరి. అప్పటికి ఔరంగజేబు చక్రవర్తి గారి వారసులు సింహాసనముకొరకు తగవులాడుకొనుచుండిరి. ఇట్టిస్థితిలో మహమ్మదు మౌజం రాజకుమారుడు బహదూర్‌షా యను పేరుతో చక్రవర్తియయ్యెను.

ఆ ప్రకారము బహదూర్‌షా చక్రవర్తిని దర్శించుటకు వెళ్లిన డచ్చి రాయబార వర్గమునకు జొహన్‌జోషువా కెటెలార్ (Johan Joshua Ketelaar) అను నాతడు నాయకత్వము వహించెను. ఆ రాయబారమును గూర్చి వారితో వెళ్లిన గుమాస్తా యొకడు వర్ణించియున్నాడు. అది డచ్చివారి రికార్డులలో నున్నది.

ఆ సమయమున చక్రవర్తిగారి దర్బారు లాహోరు నగరములో నుండెను. ఈ రాయబారవర్గమువారు 10-12-1711వ తేదీన కొన్నిమైళ్ల దూరములో నున్న 'ఖాన్‌ఖానన్' అను పేరుగల సరాయి (ధర్మశాల) చేరికొనిరి. ఆ కాలములో చక్రవర్తిగారి అంతఃపురమునందు "డొన్నాజూలియానా డియాస్ డాకోస్టా" అను నొక పోర్చుగీసు జాతి దొరసాని జనానావారికి విశ్వాస పాత్రురాలైన స్త్రీ యుద్యోగినిగా నుండెను. చక్రవర్తిగారి కొలువులో మాన్సెర్ మార్టిన్ అనునొక ఫ్రెంచిజాతి వైద్యుడుండెను. వారిరువురును, ఇతర పాశ్చాత్య జాతులకు చెందిన ముప్పదిమంది క్రైస్తవులును ఈ



డచ్చి రాయబారవర్గము వారి కెదురేగిరి.

1711 డిశంబరు 13వ తేదీన ఖదీము బేగుగారను నొక మహమ్మదీయ ప్రముఖ్యోద్యోగి 500 గుఱ్ఱపు దళముతోను, 500 కాల్బలముతోను వారికి దారిలో సహాయముగా వచ్చెను. ఆయనకొక యేనుగు కూడా ఉండెను. బంగారు జరీబుటేదారి పనితనముగల తెలుపురంగు ఆకుపచ్చని రంగుల పట్టుజెండాలుగల ధ్వజములను ఆయనతో వచ్చిన కొందఱు పరివారజనము పైకెత్తి పెట్టి పట్టుకొని వచ్చుచుండిరి. ఆయనను డచ్చిరాయబారవర్గము దగ్గరకు తీసుకొని వచ్చి మరల నాయన గుడారము దగ్గఱకు తీసికొనిపోయి దిగబెట్టుటకు డచ్చిరాయబారవర్గమువారొక ప్రతినిధి వర్గమును పంపించిరి. చక్రవర్తిగారి సైనిక శిబిరములో నుండిన ఒక అమెరికా దేశపు బిషప్పుగారును, కొందఱు జెస్యూట్ ఫాదరీలు[1] ను, కూడా ఆ యుద్యోగితో చూపరులుగా వచ్చిరి. డిసెంబరు 14వ తేదీననే వీరందఱు గౌరవ పురస్సరముగా నగర ప్రవేశము చేసిరి.

వీరట్లు పోవుటలో ముందుగా, వీరిని తీసికొనివెళ్ళి చక్రవర్తిగారికి పరిచయము చేయు నుద్యోగి యేనుగుపైనెక్కి పోవుచుండెను. చుట్టును ఎఱ్ఱని అంచు కుట్టిన ఆకుపచ్చని గుడ్డతో చేసిన గవిసెన యొకటి ఆ యేనుగు వీపునుండి వ్రేలాడుచుండెను. ఆ ఏనుగుపైన ఆకుపచ్చనిరంగు తెలుపు రంగుగల పట్టుకేతనములు నిలుపబడి యుండెను. చిన్నచిన్న ఆకుపచ్చరంగు తెలుపు రంగుల జెండాలుకట్టబడిన రాకెట్లు లేక అవాయిచువ్వల గొట్టములవారు దానిచుట్టు నుండిరి. దాని తరువాత చక్రవర్తిగారికి బహుమతిగా నిచ్చుటకు తెచ్చిన పెద్దయేనుగు నడచుచుండెను. దానిమీద బంగారు జరీతో చేసిన గవిసెన వేసియుండెను. దాని తరువాత మరికొన్ని ఏనుగులు, ఆకుపచ్చని గుడ్డ గవిసెనలు, ఎఱ్ఱరంగు గుడ్డ గవిసెనలు వేసినవి వేరుగా నడుచుచుండెను. ఆ యేనుగు లన్నింటిపైనను ఒక్కొక్క 'గ్రెనేడియరు' అను పొడుగుపాటి సైనికుడు కూర్చుండి యుండెను. వీరివెనుక ఏనుగు మావటీల మేస్త్రీ యొకడు గుఱ్ఱముపై నెక్కి వచ్చుచుండెను. దీని తరువాత డచ్చివర్తక సంఘమువారి పెద్దజెండాలు నాలుగును,రాకెట్టు (అవాయిజువ్వల) గొట్టములకు కట్టిన నలుబది చిన్న జెండాలు పుచ్చుకొన్న వారును, ఒక గుఱ్ఱముపైన 'కెటిల్‌డ్రమ్ము' అనబడు డమారా నగరాలును, చక్రవర్తిగారికి బహుమతిగా నిచ్చుటకు తీసికొని వచ్చుచున్న వెండిబంగారు జీనులు వేసియున్న తొమ్మిది గుఱ్ఱములును, అటుపిమ్మట నొక గుఱ్ఱముపైన గుఱ్ఱపువారి మేస్త్రీయు, ఇద్దరు ట్రంపెటీరు లనబడు బాకాలూదువారును, ఉండిరి.

ఎన్‌సైను అను చిన్న సైనికోద్యోగి, గాడ్‌లీచ్ అను పేరుగలవాడు గుఱ్ఱము నెక్కి వచ్చుచుండెను. అతనిక్రింద ఆరుగురు గ్రెనేడియరులను చాల పొడగరు ఎత్తయిన సైనికులు

జతలుగా గుఱ్ఱములనెక్కి వెంట వచ్చుచుండిరి. అటుతర్వాత సబుమర్చెంటు అనబడు సహాయవర్తక ముఖ్యుడు, కార్యదర్శియు, పెద్ద గుమాస్తాయు, అతని సహాయ గుమాస్తాయును, సార్జెంటు, సహాయ సర్జనను శస్త్రచికిత్సకుడు, అందఱును గుఱ్ఱములనెక్కి వచ్చుచుండిరి. అటు తరువాత నలుగురు వెండిబెత్తములవారు (వేత్రధరులు) రెండుగుఱ్ఱముల నడిపించుకొని వచ్చుచుండిరి. డచ్చి రాయబారియొక్క జవానులును, కర్ణాటక తుపాకీలవారును (Match - lock men) వచ్చుచుండిరి. అటు తరువాత డచ్చి కంపెనీవారి రాయబారిగా రొక పల్లకీలో కూర్చుండి పోవుచుండిరి. ఆయనతో, ఆయనను పరిచయము చేయుట కేర్పడిన ఉద్యోగులును మారిన్‌గారును పల్లకీలలో వచ్చుచుండిరి. అటుపిమ్మట రాయబారిగారితో సహాయప్రతినిదులుగా వచ్చిన మొదటి సహాయ రాయబారియైన రోజర్ బి రెండార్డు, రెండవ సహాయరాయబారియైన డక్కు హ్యూసింక్వెల్డు గారున్నూ వచ్చుచుండిరి. వీరందరికీ ముందు మరికొందఱు, ఒక్కొక్క గుఱ్ఱమును కూడా నడిపించి తీసుకొనిపోవుచుండిరి. వారిచుట్టును జవానులును కర్ణాట తుపాకీల వారును నడుచుచుండిరి. వీరితోపాటు డచ్చివారి స్వదేశములో చేసిన నాలుగు చక్రముల బండ్లు సూరుతునుండి తెచ్చినవి వచ్చుచుండెను. అందులో చూపరులుగా వచ్చిన ఆర్మినియన్ బిషప్పుగారును, జెస్సూటు మతబోధకులును కూర్చుండిరి. ఇటు వంటి బండియే మరియొకటి కూడా ఉండెను. దానిలో డచ్చివారి ముఖ్యశస్త్రచికిత్సకుడు (చీఫ్ సర్జెన్) హెచ్. ఎప్పెన్ డార్ఫుగారుండిరి. అటుతరువాత భారతదేశములో చేయబడిన రథముల వంటి నాలుగు బండ్లుండెను. వీనికి ఎఱుపురంగు ఆకుపచ్చరంగు పైకప్పులుండెను. ఇందులో మిగిలిన డచ్చిసైనికులు గుమాస్తాలు కూర్చుండి వచ్చుచుండిరి. వీరందఱు నిట్లొక పెద్ద యూరేగింపు మాదిరిగా పోవుచుండిరి. దీని చివర అశ్వారూఢుడైన కార్పొరల్ అనునొక చిన్న సైనికోద్యోగి సిపాయిల నాయకుడుండెను. సామానులు వేసిన ఒక ఒంటెయు, కెటిల్‌డ్రమ్ము అనబడు పాశ్చాత్య ఢంకా డమారా నగరా వాద్యముల నెక్కించిన యొంటె యొకటియు నుండెను. చిట్టచివరొంటెలమేస్త్రీ యొక్కిన గుర్రము పోవుచుండెను.

మొత్తముమీద నిది దర్శనీయమైన దృశ్యముగా నుండెను. ఈ క్రొత్తవారిని చూచుటకు చాలమంది విరుగబడి ఎదురువచ్చుచుండిరి. వీరు లాహోరు నగరమునకు రెండుమైళ్ల దూరములో నుండగా, ఎఱ్ఱని పట్టుతెరలు కట్టియున్న ఒక నాలుగు చక్రములబండి వీరి కెదురయ్యెను. అందులో డొన్నా జూలియానా దొరసాని గారునూ జనానాలో పనిచేయు నలుగురు ప్రధాన స్త్రీ యుద్యోగినులు నుండిరని వీరికి చెప్పిరి. ఈ యూరేగింపునుగూర్చిన వివరములను తమకు చెప్పుటకొరకు బహదూర్‌షా చక్రవర్తిగారే



వీరిని పంపిరి. చక్రవర్తిగారి దర్బారులో తమ వ్యవహారములు చూచుచుండుట కొఱకు డచ్చికంపెనీవారు నియమించియుండిన ముగ్గురు వకీళ్ళు-అనగా వీరి తరఫున ప్రతినిధులుగా పనిచేయు ఉద్యోగులు వీరి కెదురుగా వచ్చిరి. అందులో నొక డొక యేనుగుపై నెక్కివచ్చెను. మిగిలివారిరువురును పల్లకీ లెక్కి వచ్చిరి. చాలామంది గుఱ్ఱపురౌతులును ఆయుధపాణులైన సేవకులను వీరివెంట నుండిరి. రాయబారిగారిని చూడగానే ఈ వకీళ్లు, తమ వాహనములు దిగి పాదచారులై ఆయనదగ్గఱకువచ్చి, తమ దోసిళ్లతో కొన్ని బంగారు నాణెములను రూపాయిలను పోసికొని నజరుగా సమర్పించుటకై మరద్యాదగా నిలిచిరి. అంతట ఆయన ఆ నజరులను లాంఛనప్రాయముగా గ్రహించినందులకు సూచనగా తన చేతితో వానిని స్పృశించి, వీనిని మీరు మరల తీసికొనడని వారికి సెలవిచ్చిరి. ఆ మధ్యాహ్నము మూడు గంటలకు వీరందరును చక్రవర్తిగారి ఫిరంగులుంచు దిబ్బలు (మోర్జాలు) దగ్గర తమ గుడారములను వేయించిరి. అప్పుడు చాలామంది మొగలు ప్రభువులు వీరిని దర్శించి స్వాగతమిచ్చిరి. చక్రవర్తిగారికి అనుగ్రహము కలిగిన వెంటనే వీరి కందరికి దర్శనమివ్వగలరని డొన్నా జూలియానా దొరసానిగారు వీరికి కబురంపెను. ఇనయతుల్లాఖాను, వజరత్‌ఖాను, ఇస్లాంఖాను అను గొప్ప ఉద్యోగులు వీరితో సంప్రతింపులు జరుపుటకు నియోగింపబడిరి. ఖదీముబేగుఖాను గారు వీరిని చక్రవర్తిగారికి పరిచయము చేయుటకై నియోగింపబడిరి.

## 2

వీరు తెచ్చిన బహుమానములు మూటల నింకను విప్పనందున సందర్శనమును వాయిదావేసిరి. తాము మకాము చేసిన ప్రదేశమున కొంత దుర్వాసనగా నుండి నందున వీరు డిసెంబరు 16, 17 తేదీలలో దగ్గరలోనే అవరణ గోడల మధ్యనున్న తోటలలో విడిసిరి. 20వ తేదీన డొన్నా జూలియానా దొరసాని దర్బారు లోని కొందరు స్త్రీలతో వీరి మకామునకు వచ్చి వీరు తెచ్చిన బహుమతులను పరిశీలించి చూచినది. ఆమె వచ్చుటకు ముందుగా చక్రవర్తిగారి సువారమునుండి యేబది రకముల వంటకములతోడి భోజనములు వీరికి పంపబడెను. భోజనములైన పిదప నామె వీరందరికి గులాబీ అత్తరు పన్నీరు మొదలైన విలువగల సుగంధ ద్రవ్యము లిచ్చి తమలపాకులను వెండి బంగారుపూతగల పోకచెక్కలను వీరికి సమర్పించెను. సామాన్యముగా చక్రవర్తిగారే భుజించునట్టి రకరకముల పిండివంటలు పెట్టినగిన్నెలు, వానిమధ్యలో శాకాహారము లుంచిన ఒకపెద్ద గిన్నెయు, ఒక చిన్న బంగారు మేజాపైన గుంటలలో నమర్చి 21వ తేదీన వీరికి పంపించిరి. ఇది

అంతయు వీరికి శుభసూచకముగ కనబడెను. చక్రవర్తిగారి ప్రముఖోద్యోగి యైన జుల్ఫికరుఖానుగారు వీరికి అనుకూలుడను సంగతి అందరికిని తెలియును. ఇక క్రైస్తవులన్న గిట్టని అజీం ఉష్షాన్ గారి యభిప్రాయమును, ఇతర ప్రభువుల యభిప్రాయమును ఎట్లుండునో యని తప్ప వేరు అనుమానములేదు. అయితే, అజీం ఉష్షాన్ గారి నేదో విధముగా లోబరచుకొనవచ్చునని వీరికి నమ్మకము కలదు.

డిసెంబరు 26వ తేదీన వీరు తెచ్చిన బహుమతులన్నిటిపై ఎఱ్ఱని వస్త్రములను కప్పి ఇరువురు డచ్చివారును, దేశీయవకీళ్ళును వెంటతీసికొనిపోయి చక్రవర్తిగారి గుడారములదగ్గర ఖదీముబేగుగారికి వశపరచిరి. ఆ బహుమతుల స్వరూపస్వభావములను చక్రవర్తిగారు డచ్చివారివలననే తెలిసికొనగోరినందున ఆసహాయకులారాత్రి యక్కడనే ఆగిపోయిరి. బహుమతిగా సమర్పింపబడిన వస్తువుల నొక్కొకదానినే చక్రవర్తిగారు తమ చేతితో తీసిచూచి ఆనందించిరి. అంతట చక్రవర్తిగారి ప్రధమ సందర్శనము ఆ మరునాటికే నిర్ణయమైనట్లు డొన్నా జూలియానాదొరసాని దగ్గరనుండి కబురువచ్చెను. కాని, ఆదినము చలిమబ్బు ఎక్కువగాఉన్నందున వాయిదా వేయుటకు శ్రీవారిష్టపడిరి. (సాధారణముగా ప్రధమసందర్శనము చాలా స్వల్పకాలముమాత్రమే జరుగును. అప్పుడు కుశలప్రశ్నలు తప్ప వ్యవహారముల సంగతిని ఎత్తుట ఆచారముకాదు.)

ఎట్టకేలకు ప్రధమ సందర్శనము 1712 జనేవరి 3వ తేదీన జరిగినది. డచ్చి రాయబారి చక్రవర్తిగారి నివాసపు టావరణమునకు మొదటిదినమున నగరప్రదేశము చేయునప్పటి రీతిగనే బయలుదేరెను. ఒక క్రోశము దూరమువరకు ముయిజ్ ఉద్దీనుగారి శిబిరములో నుండిపోయిరి. అటుపిమ్మట రెండుకోసులు రావీ నదీతీరమున గల చక్రవర్తిగారి శిబిరమున ప్రయాణము చేసిరి. మధ్యాహ్న మగుసరికి వీరు తమకొరకు నాటబడిన గుడారమును చేరిరి. అక్కడ డొన్నా జూలియానాదొరసాని వీరి కాతిథ్యమిచ్చెను. మూడు గంటలకు వీరు చక్రవర్తిగారి గుడారమునకు ముందు వ్రేలాడు తెరలదగ్గరకు వెళ్ళిరి. అక్కడ వీరొకదానిలోపల నొకటిగా ఎడముగా నున్న మూడు గట్టిచిక్కముల యావరణములు దాటి లోపలికి మెల్లగా ప్రవేశించిరి. సింహద్వారముదగ్గర వీరు తమ మందుగుండు ఆయుధములను కావలివారికి వప్పగించిరి. రాయబారి గారును, వారి తోడి ప్రతినిధులును తమ ఖడ్గములను మాత్రము తమ నడుములకుంచుకొనిరి. ఆవరణము వరకును వారిని తమ పల్లకీలతోనూ గుఱ్ఱములతోనూ రానిచ్చిరి. గుమాస్తాలును సైనికులును పాదచారులై వీరితో పోవుచుండిరి. బండ్లను రానివ్వరు, చక్రవర్తిగా రింకను దర్బారు గుడారమునందాసీనులు కాలేదు. అందువలన వీరిని ప్రక్కనున్న మందుగుండు



ఆయుధదళసేనాధిపతియైన ఇస్లాము ఖానుగారు తమ గుడారములోనికి తీసికొని వెళ్ళి వీరితో ఇష్టాగోష్ఠి జరుపసాగెను. అంతట చక్రవర్తిగారు దయచేయుచున్నట్లు తెలుపుచు బాజాలును గంటలును మ్రోగింపబడెను.

వీరు మరల పల్లకీలలో నెక్కి చక్రవర్తిగారి గుడారముదగ్గరనున్న కవాతు (తెర) ల వరకును పోయిరి. ఆ కవాతులమధ్య మూడు ద్వారములుండెను. ఈ కవాతు తెరలు పాత జంబూఖానాలతో చేయబడినని. అవి రమారమి రెండు మైళ్ళ వలయము నావరించియుండెను. వీనిమధ్య పట్టు వెండిబంగారు జరీ జంబుఖానాలతో నిర్మింపబడిన ఒక పెద్ద గుడారముండెను. దానిలో వెనుకప్రక్క మంటితో నిర్మింపబడిన ఒక పెద్ద గుడారముండెను. దానిలో వెనుకప్రక్క మంటితో నిర్మింపబడిన అయిదు అడుగుల యెత్తుగల వేదిక పైన అందమైన బంగారు జలతారు జంబుఖానాలు పరచియుండెను. దాని చుట్టును ఒక చెయ్యి దూరునంత యెడముగా వెండి కటకటాలు అమర్చబడియుండెను. పైన చెప్పిన కవాతులమధ్యనున్న ద్వారము నుండి సరాసరి ఈ పెద్ద గుడారమునకు చిన్నచిన్న ఎఱ్ఱని పట్టుజెండాలతోను, ఐమూలబద్దలతో నిర్మింపబడిన తడికలతోనూ ఒక బాట యేర్పరుపబడియుండెను. రాజద్వారముదగ్గర వీరికి పరిచయోద్యోగియైన ఖదీముబేగుగారు స్వాగతమిచ్చిరి. పాశ్చాత్యు లందరిని లోపలికి ప్రవేశపెట్టుటకు ఆజ్ఞయయ్యెను. వీరి పరిచయోద్యోగి రాయబారి చెయ్యిపట్టుకొని ఆయనను లోనికి తీసికొని వెళ్ళుచుండగా మిగిలిన వారు ఆయన వెనుకనే నడచుచు వీరందరు నొకచో నిలిచి చక్రవర్తిగారికి సలాము చేసిరి. రాయబారిని మొదట కర్రలతో చేసిన కటకటాల లోపలికి తీసికొనిపోయి, వెండికటకటాలదగ్గర, చక్రవర్తిగారికి ఎడమచేతి ప్రక్క కొందరు ప్రభువులున్న గుంపు దగ్గరకు తీసికొని వెళ్ళిరి.ఆయన వెనుకనే ఆయన సహాయ ప్రతినిధులుండిదిరి. మిగిలిన పాశ్చాత్యుల నందరిని కర్రకటకటాల కవతలనే యాపియుంచిరి. డచ్చిరాయబారిగారు దోసిలిలో బంగారు నాణెములను పోసికొని ఆ నాణెములను చక్రవర్తిగారికి నజరుగా సమర్పించి, వానితో డచ్చి తూర్పు ఇండియా వర్తకసంఘమువారి గవర్నరు జనరలుగారి దగ్గరనుండి తెచ్చిన లేఖగల ఒక బంగారు పేటికను చక్రవర్తిగారికి సమర్పించిరి. రాయబారి సహాయ ప్రతినిధులు కూడా తమ నజరులను సమర్పించిరి. డచ్చిరాయబారిగారు సమర్పించిన నజరులను ఖరీముఖాను అందుకొని ఇస్లాము ఖాను కిచ్చెను. వీనిని చక్రవర్తిగారికి చూపగా, స్వీకరించినట్లు వారు తల పంకించిరి. అటుపిమ్మట వీరిని కరీముఖానుగారు వెండి కటకటాలకు ప్రక్క ఒకవైపునుండి సింహాసనము వెనుకకు తీసికొనివెళ్ళెను. అక్కడ ఆయన తన పాశ్చాత్య

దుస్తులపైన బంగారు జలతారు పట్టుతోచేసిన అమూల్యమైన దుస్తులను ధరించి, తన కొసగబడిన ఒక తలపాగాను చుట్టుకొనెను. ఆయన సహాయ ప్రతినిధులుకూడా వారి కొసగబడిన వెండి జలతారు పట్టుదుస్తులను ధరించి తలపాగాలు చుట్టుకొనిరి. ఈ దుస్తులతో వారిని చక్రవర్తిగారి సమక్షమునకు మరల తీసికొనివెళ్ళిరి. అప్పుడు వారునాలుగుసారులు పూర్తిగా నేలమీదికి వంగి తమ కుడిచేతితో భూమిని తాకి మరల లేచి ఆ చేతితో తమ ఫాలమును స్పృశించుచు చక్రవర్తి గారికి నాలుగు సలాములు చేసిరి. అంతట వారిని వెండికటకటాలకు దగ్గరగా తీసికొనివెళ్ళిరి. అయితే ఆ క్షణముననే చక్రవర్తిగారు లేచి, తమ కుడి ప్రక్క కొంచెము తక్కువ యెత్తులో కూర్చుండియున్న జహందరు, జహాన్‌షా అను తమ ఇద్దరుకుమాళ్ళతోను లోపలికి వెళ్ళిపోయిరి. అక్కడ నున్నవారందరును వెనుకకు తిరిగి పోవసాగిరి. ఈ పాశ్చాత్యులకు తాము ఆ యొత్తిడిలో నలిగిపోవుదు మన్నంత భయముకలిగెను. కవాతులకు వెలుపల వీరు మరల తమ పల్లకులను చేరి రాత్రి తొమ్మిది గంటలకు తమ వసతులకు తిరిగివచ్చిరి.

ఆ దినము దర్శనముగునప్పటికి చాలా ప్రొద్దుపోయినందున తాము తెచ్చిన ఏనుగు లనుగాని గుర్రములనుగాని చక్రవర్తిగారికి సమర్పించుకొనుటకు అవకాశము లేక పోయెను. వీనిని జనవరి 3వ తేదీన పంపించిరి. అయితే, ఆచారమునుబట్టి వానిని మరల వెనుకకంపిరి. ఇట్లు పంపుటలోని యుద్దేశము ఇటువంటి బహుమతు లివ్వబడి నట్లు అందరికిని తెలియవలయుననియే, మధ్యాహ్నము సంపూర్ణముగ మొగలాయి పద్ధతిలో తయారుచేయబడిన విందుభోజనమును తీసికొని యొక ఉద్యోగి వీరి దగ్గరకు వచ్చెను. అరగంట యైనపిమ్మట, ఆపిలు, పియరు, దానిమ్మ, నారింజ, మొదలైన ఫలములను తీసికొని మరియొక ఉద్యోగి వచ్చెను. ఈ ప్రకారము చక్రవర్తిగారు దయతో పంపిన పదార్థములను కృతజ్ఞతతో స్వీకరించుచున్నట్లు తెల్పుటకు ఈరాయబారిగారు చక్రవర్తిగారి నివాసప్రదేశము వైపునకు ముఖము త్రిప్పి మూడుసార్లు సలాములు చేసిరి. ఈ ఆచారామును చక్రవర్తిగారి భార్యలును కుమాళ్లును కూడా పాటించు చుందురు. ఇది అప్పటి రాజమర్యాద. ఈ బహుమతులను మోసి తెచ్చిన మనుష్యులకు అత్తరు తాంబూలములు కొంత రొఖము నిచ్చిపంపిరి. ఇట్టి మర్యాద చేయుట నుపేక్షించినచో చాల ప్రమాదము వచ్చును. ఏలన, ఎవరెవరికెంత బహుమతిగా నిచ్చినది చక్రవర్తిగారు స్వయముగా అడిగి తెలిసికొని తామివ్వదలచిన బహుమతుల విలువను నిర్ణయించు చుందురు.

జనవరి 5వ తేదీన దచ్చి రాయబారిగారు తాను బహుమతిగా తెచ్చిన తొమ్మిది



యేనుగులను తొమ్మిది గుఱ్ఱములను చక్రవర్తిగారికి సమర్పించుటకై మరల వెళ్ళెను. గుఱ్ఱములు సమర్పింపబడి స్వీకరింపబడెను గాని, ఏనుగులను సమర్పించుటకు వ్యవధి లేకపోయెను. ఇప్పుడురాయబారికి మంచి రాళ్ళు పొదిగిన షేష్కపు (బాకు) బహుమతిగా నివ్వబడెను. దాని నతడు తన ఖడ్గపు పటకాలో నిమిడ్చి చక్రవర్తిగారికిమూడుసార్లు సలాములు చేసెను.

జనవరి 6వ తేదీన మరల ఏనుగులను తీసికొని వెళ్ళిరి. అప్పుడు చక్రవర్తిగారు సంప్రీతితో వాటిని స్వీకరించిరి. చక్రవర్తిగారి భార్యలు పాశ్చాత్యుల నాలుగు చక్రముల బండిని చూచి మోజుపడిరి. అంతట దచ్చివారు దానికి ఎడ్లను పూర్చి, దానికి సంబంధించిన సామానులన్నిటితోనూ ఆ బండిని వారికి పంపించిరి. ఈ బహుమతివలన బహదూర్ షాగారి జనానాలో వివాదములు పుట్టెను. అది తమకు రావలెనని ఒక్కొక్కరు కోరసాగిరి. తుదకు చక్రవర్తిగారు తమ మిహిర్ పర్‌వార్ అను పేరుగల పట్టమహిషి కిచ్చిరి. ఈ బండిని చూచి ఆమె ఎంతో సంతోషించి దానికి తన ఖొజ్జాలను పూన్చి అనుదినమును కవాతుల ఆవరణలో ఆ బండిలో తిరుగసాగెను. ఈ బహుమతి నిచ్చినందులకు కృతజ్ఞత చూపుట కామె దచ్చిరాయబారికిని, ఆయన సహాయ ప్రతినిధులకును గౌరవార్థముగా అమూల్యాంబరములు దుస్తులు బహుమతిగా నిచ్చిరి.

చక్రవర్తిగారి నలుగురు రాజకుమారులకు బహుమతిగా నిచ్చి వారిని సంతృప్తి పరచుటకుగాను వారి కిష్టమైనవి గ్రహించుటకు దచ్చివారు కొన్ని బహుమతులను సిద్ధపరచిరి. డొన్నా జూలియానా దొరసాని సలహాపై, అజమ్ ఉష్‌షాన్ రాజకుమారునికి అదనముగా మరికొన్ని బహుమతులను ప్రత్యేకించి యుంచిరి. ఏలనగా అతడు స్వభావముచేత అత్యాశాపరుడు, చక్రవర్తిగారి ఉత్తర్వులపైన వేయవలసిన రాజముద్రిక యతని యధీనమున నుండును. ఈ బహుమతులను వారికి పంపగా వారన్నివస్తువులను తీసికొనక అందులో కొన్నిటిని ప్రీతిపూర్వకముగా గ్రహించి మిగిలిన వానిని తిరిగి పంపించివేసిరి ఇది మర్యాద.

జనవరి 12వ తేదీన వజీరు జుల్ఫికరు ఖానుగారికి బహుమతుల నంపిరి. ఆయన తండ్రి అసద్‌ఖాన్‌గారు కంపెనీవారి యొక్క "విశ్వాసపాత్రుడైన మిత్రు"డని పేరుపొంది యుండెను. మూడుదినములైన పిమ్మట, రాష్ట్రముల పైయధికారి యనియు అజీం ఉష్ షాన్ గారికి అంతరంగికుడని యందఱును గౌరవించు ఇనయతుల్లా ఖాను గారికిని బహుమతులంపిరి. ఇనయతుల్లా ఖానుగారు, వారు పంపిన వస్తువులందు మూడుజతల సులోచనములు మాత్రము స్వీకరించిరి.

కొలది దినము లైనపిమ్మట జనవరి 18వ తేదీన డచ్చిరాయబార వర్గమువారు జుల్ ఫికర్ ఖాన్‌గారిని దర్శించుటకు వెళ్ళిరి. తమ దర్శనమునకు వచ్చిన రాయబారిని, వారితో వచ్చిన సహాయ ప్రతినిధులను శ్రీవారు కూర్చుండుమనిరి. 'తమ తండ్రి గారైన అసద్‌ఖానుగారు వజీరుగానున్నప్పుడు మా కంపెనీవారిపట్ల దయ యుంచిన రీతిగానే దర్బారులో తమరుకూడా మాయందు అనుగ్రహమును చూపించి సహాయము చేయుదురని ప్రార్థించుచున్నామని రాయబారి కెటెల్లార్‌గారు మొగలు సామ్రాజ్యములోని రాజభాషయైన పారసీభాషలో కొన్ని ప్రియోక్తులను పలికిన మీదట ననిరి. వజీరుగారు వారికి తాము వీలైనంతవరకు సహాయము చేయుదుమని సెలవిచ్చి సూరతుకు వెలుపల వారు ఫ్యాక్టరీని,నిర్మింజూచుచున్నట్లు తెలియచున్న దనియు దానికి తాము ఇష్టపడమనియు చెప్పిరి. ఎందువలన వారి కిష్టములేదని రాయబారి తెలిసికొనదలచెనుగాని, ప్రథమసందర్శనమందే దీర్ఘసంభాషణము జరుపుట దర్బారుమర్యాద కాదుగనుక అతదూరకొనెను. తనతండ్రినిగూర్చి రాయబారి చేసిన ప్రశంసకు జుల్‌ఫికరు ఖానుగారు సంతోషించి వారు మార్గమునందు ఢిల్లీలో ఆయనదర్శనము చేసినారాయని రాయబారిని అడుగగా, అది యుపవాసములు నెలయైనందున చూడవచ్చిన వారికి దర్శనమిచ్చుట ఆచారము కాదుగనుక ఎవరి దర్శనము చేయలేదని చెప్పిరి. బటేవియానుండి పంపబడిన బహుమానపు సామానులను రవాణా చేయునట్లుసూరతు పరిపాలకునికి ఉత్తరువు దయచేయించవలసినదనికోరగా అట్టి యుత్తర్వు పైన ముద్రను వేయించి యిచ్చిరి. వారి కప్పుడు గౌరవసూచకమైన దుస్తులొసగబడలేదు. వానిని తరువాత పంపుటకుత్తర్వు చేసియుండిరి.

జనేవరి నెల 24వ తేదీన డచ్చిరాయబారి మరల చక్రవర్తిగారి సమక్షమునకు వచ్చిరి. అప్పుడుఅంతకు పూర్వమతనికి బహుమతిగ నొసగబడిన పేష్కబు (బాకు) నకొక బంగారు తొడవు ముత్యములుగల వస్తువును బహుమతిగ నిచ్చిరి. డచ్చి సంగీతవాద్యముల వారిని పంపవలసినదని చక్రవర్తి బహదూర్‌షాగారు వారితో ననిరి. అంతట నారాత్రి ముగ్గురు డచ్చి వాద్యగాండ్రను పంపగా వారు ఫిడేలు, హార్పు, హట్‌బాయ్ అను వాద్యములను చక్రవర్తిగారి రాణులు తెర వెనుక కూర్చుండగా చక్రవర్తిగారి ఎదుట వాయించిరి. దీనికి ప్రతిమర్యాదగా చక్రవర్తి గారు డచ్చి రాయబారిని సుప్రసిద్ధమైన 'షాలిమార్ ఉద్యానవనము' ను వచ్చి చూడుడని ఆహ్వానము చేసిరి. (ఆ యుద్యానవనము నీ లేఖరి వర్ణనచేసి యున్నాడు.) కొలది దినము లైనపిమ్మట రాయబారి పట్టణములో 'అప్సరసల భవనము' అని ప్రసిద్ధికెక్కిన 'ప్యారీ మహల్' అను ప్రదర్శన శాలను చూచెను.



అక్కడ ఏసుక్రీస్తు దివ్యమంగళ విగ్రహము, ఆయనను కొలుచు దేవతా విగ్రహములుకూడా అందు ప్రదర్శింప బడియుండెను.

అటుపిమ్మట డచ్చి రాయబారిగారు రాజకుమారుడైన జహందర్‌షాగారి దర్శనమును చేసెను. అతడుకూడా డచ్చి సంగీత వాద్యగాండ్రను పంపుడని కోరగా నితడట్లు చేసెను. ఎన్‌సైన్ యుద్యోగి నైతార్‌టుగారిక్రింద డచ్చి సైనికులు చేసిన కవాతువిన్యాసములను రాజకుమారుడు వీక్షించెను. అటుపిమ్మట డచ్చిరాయబారికి జబ్బుచేయగా ఫిబ్రేవరి 16వ తేదీన బహదూర్‌షా చక్రవర్తి ఈయన ఆరోగ్యము బాగుపడిన సంగతి తెలిసికొనుటకు దూతను పంపెను. 22వ తేదీన కెటెలార్‌గారు మరల దర్బారుకు పోయిరి. అక్కడ ఆయనకు చేయబడిన మర్యాద వలన తమయందు చక్రవర్తిగారికి చాలా అనుగ్రహము కలిగినదని అనుకొనుటకు అవకాశము కలిగెను. అంతట అనారోగ్యకరమైన ఆ దేశమునుండి సూరతు పట్టణమునకు త్వరలో తిరిగిపోవుటకు వీలుండునని అతడనుకొనెను. కంపెనీవారు చేసికొనిన మనవిలోని కోరికలకు అజీం ఉష్ షానుగారు వ్యతిరేకులుగా నున్నను వారి మనవిని చిత్తగించి, వారి కోరికలలో మొదటి సౌకర్యము అప్పుడే మంజూరు చేయబడినదనియు, ఉద్యోగుల సంతకములు చేయబడి దివాను వజారతు ఖానుగారి ముద్రికకూడా వేయబడినదనియు 27వ తేదీన రాయబారికి తెలియవచ్చెను. డచ్చివారు కోరిన ఇతర సౌకర్యములకు కూడా చక్రవర్తి గా రంగీకరించి నారనియు, త్వరలో ఉత్తరువులు జారీచేయబడుననియు తెలిసెను.

ఈ పరిస్థితులలో తాను తక్షణమే తిరిగి పోవచ్చుననుకొనుచున్న డచ్చిరాయబారి ఆశలన్నియు ఒక్క క్షణములో అడుగంటెను. ఆరాత్రి చక్రవర్తిగారికి చాలా జబ్బుచేసినది. ఆయన బ్రతుకుట దుస్తరమనిరి. రాజకుమారులు తమ సైన్యము లను దరలించుట ప్రారంభించిరి. గ్రామముల నుండి పరారియైపోవు మనుష్యులతోను వారి సామానుల బండ్లతోను లాహోరునుండి పోవుబాటలన్నియు జనసంకీర్ణములై దుర్గమము లయ్యెను. దర్బారులోని ఒక స్నేహితునివలన బహదూర్‌షా చక్రవర్తి 28వ తేదీన మరణించెనని వీరికి తెలిసినది. ఎవ్వరును తమ పైనబడి దోచుకొనకుండా తగిన బందోబస్తులు చేసికొనవలసినదని డొన్నా జూలియానా దొరసాని వీరికి కబురంపెను. అంతట వీరు తమ వస్తువాహనములను సామానులను చుట్టును గట్టిగోడలున్న ఒక తోటలోనికి తీసికొనిపోయి కాపలాకొరకు రెండువందలమంది దేశీయ సిపాయిలను జీతమిచ్చి నియమించిరి.

అంతట మరల క్రొత్త చక్రవర్తిగారు సింహాసన మెక్కువఱకును డచ్చిరాయబారి

వర్గమువారు వేచియుండ వలసివచ్చెను. అప్పటి వఱకును వీరి మొగము చూచిన వారులేరు. ఇందువలన వీరికి చాల కష్టము, నష్టము కలిగెను. చాలా సొమ్ముఖర్చుపడెను. తమ ప్రాణములను ఆస్తిని కాపాడుకొనుటకు వీరు చాలా శ్రమపడవలసివచ్చెను. ఈ పరిస్థితిలో తనకు సైనిక సహాయము చేయవలసినదని జహందరుషా వీరిని కోరెను. ఇది వీరికి మఱింత చిక్కుగా నుండెను. వీరందఱు నాలోచించుకొని ఎటు పోయి యెటువచ్చునో యని తలచి కెటెలారుగారు సుస్తీగా నున్నారను నెపమున జహందరుషాగారు కోరినట్లుచేయక మొగము తప్పించిరి. జహందరుషా వీరు చెప్పిన సాకును అంగీకరించెను. అయితే సింహాసనము నాక్రమించుటకు ప్రయత్నించుచున్న ఇతర రాకుమారులుకూడా తనవలెనే వీరిని సైనిక సహాయము కోరుదురని యెంచి వీరిని నగరములోనికి వచ్చియుండుడని కోరెను. అంతట వీరు లాహోరు నగరమున చుట్టును గోడలుగల మూడు నివేశనస్థలములను అద్దెకు పుచ్చుకొని తమ వస్తువాహనములనెల్ల అందులోనికి చేర్చుకొనిరి. అప్పటికే ఆ పరిసరప్రాంతములందు అరాజకము ప్రబలి దారి దోపిళ్ళు బందిపోట్లు చెలరేగుచుండెను. అయితే వీరేనష్టము లేకుండ తమ వస్తువాహనములను కాపాడుకొనగలిగిరి.

ఏప్రిలు 1వ తేదీ వరకును మరల డచ్చిరాయబారి వర్గమువారు తమ రాయబారములను ప్రారంభించుటకు వీలుపడలేదు. అప్పుడు రాయబారి జహందరుషా చక్రవర్తిగారి క్రింద వజీరుగా నున్న జుల్ఫికరు ఖానుగారి దర్శనము చేయగా తాను సహాయము చేయుదునని ఆయన వీరికి వాగ్దానము చేసెను. తామున్న ప్రదేశములకు అద్దె క్రింద చాలాసొమ్ము ఖర్చుఅగుచుండుట వలన వీరు ఖాళీచేసి మరల ఊరివెలుపల తోటకు వెళ్ళిరి. ఏప్రిలు 7వ తేదీనను 10వ తేదీనను వీరు జహందరుషా చక్రవర్తిగారి దర్శనము చేయుటకు దర్బారుకు వెళ్లిరి. చక్రవర్తిగారి తండ్రియైన బహదూర్‌షా గారు తమకు అనుగ్రహించిన సౌకర్యములను ఖాయపరపవలసినదనివీరొక విన్నపము క్రొత్త చక్రవర్తిగారికి సమర్పించిరి. చక్రవర్తిగారు వారి విన్నపముల నాలకించి ఆ ప్రకారము చేయుటకు అనగ్రహించిరి. ఏప్రిలు 14వ తేదీన జహందరుషా చక్రవర్తిగారు మశీదునుండి పోవుచు డచ్చివారున్న తోట ప్రక్కకు వచ్చిరి. అప్పుడు వీరాయనకు నజరు సమర్పించిరి. చక్రవర్తి ప్రీతితో స్వీకరించెను. చక్రవర్తిగారి ఉంపుడుకత్తె యైన లాల్‌కున్వరు అను నామె 25వ తేదీన అట్లే వారితోట ప్రక్కనుండి పోవు చుండగా వీరామెకు కూడా నజరు సమర్పించగా నామెయు స్వీకరించెను. ఈమెను ఆకాలమున మహారాజ్ఞియని వ్యవహరించు చుండిరి. చక్రవర్తిగారును ఈమెయు వేటనుండి తిరిగి వచ్చుచున్నప్పుడు డచ్చిరాయబారి



వర్గమువారీ ఉభయులకు నజరు సమర్పించిరి. కొలది దినములలోనే జుల్ఫికరు ఖానుగారు వీరి కొసగవలసిన ఉత్తరువులకు సంబంధించిన పత్రము లన్నియు సిద్ధముగ నున్నవనియు వానిపైన సంతకములు చేసి ముద్రలు మాత్రము వేయవలసి యున్నదనియు సెలవిచ్చిరి.

1712 మే 10వ తేదీన జహందరుషా చక్రవర్తిగారు లాహోరు నుండి ఢిల్లీనగరమునకు తరలిపోయిరి. మన రాయబారులు కూడా ఢిల్లీకి బోయి అక్కడ జులై 10వ తేదీన చక్రవర్తిగారి దర్శనము చేసిరి. ఈరాయబారి వర్గమువారందరును సుప్రసిద్ధమైన నెమలి సింహాసనముయొక్క అందమును మణులను అలంకారములను చూచి అత్యంతాశ్చర్యమును పొందిరి. దానిని గూర్చి వీరి దినచర్యయందు చిత్రమైన వర్ణనమున్నది.

వీరందరు మఱల ఆగస్టు 11వ తేదీన దర్బారుకుపోయిరి. తమ పత్రములపైన సంతకము లైనవని వీరికి తెలిసినందున త్వరలో తిరిగిపోవచ్చునని వీరు చాలా ఉత్సాహముగ నుండిరి. వీరు తిరిగిపోవుటకు చక్రవర్తిగారు తమ సమ్మతిని వెల్లడించినారని జుల్ఫికరు ఖానుగారు వీరికి 1 వ తేదీన తెలిపిరి. అయితే ఇది కేవలము నోటి మాటయే యనియు, తామనుదినము పంపుచున్న బహుమతులను వజీరుగారి తాబేదారులు స్వీకరించియు ఇట్లూరక ఆలస్యము చేయుచున్నారనియు నతడు గ్రహించెను.

ఎట్టకేలకు దర్బారు పద్ధతుల ప్రకారము ఐదు ఫర్మానాలు సిద్ధమైనవనియు, వానిని త్వరలోనే జారీ చేయుచున్నామనియు చెప్పిరి. ఆగష్టు 31వ తేదీన తుది బహుమానము లిచ్చుటకు నిర్ణయింపబడెను. డచ్చి తూర్పు ఇండియా గవర్నరు జనరలైన అబ్రహం వాన్ రయిబీకుగారి పేర ఫర్మానా జారీచేయబడెను. దానినొక బంగారు జలతారు సంచీలో నుంచి, కెంపులు పొదిగిన ఒక బాకు (షేష్కంబు) గౌరవార్థ మొసగబడు విలువగల దుస్తులు, ఒక ముఖములుతాను, బంగారులో వజ్రములు నితర రత్నములు పొదిగిన నడుము పటకా, ఏబది తులముల గులాబీ అత్తరు నొసగబడెను. ఇదిగాక, ఎనుబది జతల విలువగల దుస్తులుకూడా తరువాత వీనికి చేర్చబడెను. డచ్చి రాయబారికి బంగారు పట్టీలుగల విలువగల జీనుతో నొక గుఱ్ఱము, విలువగల దుస్తులు, ఒక షేష్కంబు (బాకు) వజ్రములు పొదిగిన ఒక కలికి తురాయి లేక పక్షి ఈకలతో చేసిన తల పాగాకు తగిలించు కుచ్చునిచ్చిరి. రాయబారితో వచ్చిన సహాయ ప్రతినిదులిరువురికి ఒక్కొక్క జత విలువగల దుస్తులను ఒక్కొక పేష్కంబును ఒసగిరి. ఈ సమయమున దర్బారులోని ఫ్రెంచి వైద్యుడైన మాన్సర్ మార్టిన్ దొర సూరతులో ఇటబల్ ఖానుగారి గృహమని పిలువబడు ఒక భవనము

విషయమై అతడొక కట్టకథను లేవదీసి పేచీపెట్టుటకు ప్రయత్నించెను. గాని డొన్నా జూలియానా దొరసాని అతని కుట్ర బయల్పరుపగా జుల్ఫికరు ఖానుగారతనికి శిక్షగా సెప్టెంబరు 21వ తేదీన అతని మన్సబుగిరీలో సగము తీసివేసిరి.

సెప్టెంబరు నెల 11వ తేదీన గులాబీ అత్తరును తెచ్చియిచ్చిరి. 19వ తేదీన దర్బారులో చక్రవర్తిని దర్శించిన సమయమున గవర్నరు జనరలు కొఱకు నిర్ణయింపబడిన బహుమతులు రాయబారికి వప్పగించిరి. సెప్టెంబరు 22వ తేదీన చక్రవర్తి గారిసెలవు పుచ్చుకొనుటకు దర్బారులో దర్శనము చేసిరి. అప్పుడు మరల ఆచారము ప్రకారము వీరికి విలువగల దుస్తులు బహుమతులుగ నిచ్చిరి.

మొగలాయి దర్బారువారు డచ్చిరాయబారి కిచ్చిన గుఱ్ఱము 1200 రిక్సు డాలర్లు విలువ చేయునదని తరువాత దాని విలు కట్టిరి. దానిని చూచినవారు కొందరది వందడాలర్ల కన్న విలువచేయదనిరి. సాధారణముగా దర్బారువా రిచ్చు బహుమతులిట్టివిగనే యుండును.

1712 సెప్టెంబరు 25వ తేదీన వీరు జుల్ఫికరు ఖానుగారివద్దసెలవు తీసికొనిరి. రాయబారిగా రాయన దయకు వందనము లర్పించుచు పారశీ భాషలో నొక లేఖను వారికి సమర్పించెను. హిందుస్థానీ భాషలో కొన్ని మర్యాద మాటలను చెప్పెను. బీరెండార్డుగారు పారశీభాషలో నొక చిన్న యుపన్యాసము చేసిరి. జుల్ఫికరు ఖాను గారు వారికి సహాయము చేయుచుందునని వాగ్దానము చేసిరి. మూడు దినములైన పిమ్మట, మదుసలి నవాబుగారైన అసద్‌ఖాన్ గారిని వారు దర్శనము చేసిరి. ఆయన వీరికెల్లప్పుడు సహాయము చేయుచుందుననెను. ఒక చక్కని చిన్న బంగారు తంజాన్‌లో ఆయనను స్త్రీలే మోయుచు ఉద్యానవనమునందు త్రిప్పుచుందురు. ఇది చూచి డచ్చివారు వింతపడిరి.

వీరు సెప్టెంబరు 29వ తేదీన సూరతులోని ఇటిబల్‌కాను భవనమును డచ్చి వారికి వశము చేయవలసినదని సూరతు క్రొత్తగవర్నరైన మహమ్మదు బేగు గారికి హస్‌బల్ హుకుము అనుఫర్మానాను పొందిరి. అహమ్మదాబాదుకొరకు కూడా ఒక ఫర్మానాను పొందిరి. తరువాత మరికొందరు ప్రభువులవద్ద సెలవుతీసికొనిరి. అక్టోబరు 1వ తేదీన ఖాన్‌జహాన్ కోకల్‌టాష్ గారిని, 3వ తేదీన ఖాన్‌సామాన్ అను అధికారియైన సాదుల్లాఖాన్ ముత్యాఖ్విద్‌గారిని, మందుగుండు ఆయుధ సైనిక దళముల అధికారి రజాకులీఖాన్ గారిని, 6వ తేదీన జుల్ఫికరుఖాన్‌గారి దివానుగా నున్న రాజా సభాచంద్‌గారిని, ఖదీముబేగు ఖానుగారిని దర్శించి సెలవు పుచ్చుకొనిరి. 7వ తేదీన మహారాజ్ఞియైన లాల్‌కున్వర్‌గారివద్ద సెలవు తీసికొనుటకై ఆమె నివసించు అంతఃపురము కిటికీదగ్గర



వారు నాలుగుసార్లు భూమిమీదికి వంగి సలాము చేసిరి. 9వ తేదీన వీరు తమకు స్నేహితురాలుగానున్న డొన్నా జూలియానా దొర సానిదగ్గర సెలవుతీసికొని ఆ దినముననే బరాపుతాకు ప్రయాణమైరి. 13వ తేదీన వారికి చేరవలసిన ఆఖరు ఉత్తర్వు చేరినది.

వీరు 1712 అక్టోబరు 14వ తేదీన బయలుదేరి 20వ తేదీన ఆగ్రానగరము చేరిరి. అటుపిమ్మట ఫరీదాబాదు మధుర మార్గముగా సూరతు చేరిరి. దారిలో దోపిడి దొంగలు విశేషముగా నుండిరి. గాని వీరు క్షేమముగా సూరతు ప్రవేశించిరి. ఇట్లు వీరొక సంవత్సరము కష్టపడి పని సాధించుకొనివచ్చిరి. ఇందుకొఱకు వీరికి 30000 గిల్డరులు వ్యయమైనవి. అయితే ఈ శ్రమయు ఖర్చును అంతయు వృథయైపోయినది. ఏలనగా 1712వ సంవత్సరాంతమున ఫరుక్ షయ్యరు జహందరుషా నోడించి వధించి తానే చక్రవర్తియైనాడు. ఆయన పక్షీయులు దురదృష్టవంతుడైన జహందరుషా చక్రవర్తి యొక్కయు ఆయన వజీరైన జుల్ఫికరుఖానుగారి యొక్కయు శవములను ఢిల్లీవీధులలో నీడ్చి పారవేసి అవమానించిరి. ఈ విప్లవము జరిగిన పిమ్మట జహందరుషా చక్రవర్తిగా రిచ్చిన ఫర్మానాలు చిత్తుకాగితముల విలువయైన చెయ్యలేదు. అతని రాజ్యపాలన చరిత్రము మొగలాయి సామ్రాజ్య చరిత్రలోనుండి కూడా తుడిచివేయబడెను.

*– కృష్ణాపత్రిక, 29.3.1958*



* ఆ కాలమున జెస్యూటులను క్రైస్తవ మిషనరీలు, లేక మతబోధకులు భారత దేశమున మత ప్రచారము చేయుటకు వచ్చి చక్రవర్తిని నవాబులను ఆశ్రయించి బ్రతుకుచుండిరి.

# 'దేవసేను"ని భారతవర్ష యాత్ర

పాల్‌డాయిసెన్ అనే ఆయన జర్మనీ దేశపు విద్వాంసుడు. ఆయన కీల్ విశ్వవిద్యాలయంలో సంస్కృత పండితుడుగా వుండేవాడు. ఈయన గొప్ప తత్వశాస్త్రవేత్త. ఆయనకు వేదశాస్త్ర పురాణేతిహాసాలు, కావ్యాలు కరతలామలకాలు. వేదాంతము ఆయనకు కొట్టినిపిండి. సంస్కృతం ధారాళంగా మాట్లాడేవాడు.

సంస్కృత వాఙ్మయంలోని ప్రకృతి సౌందర్య స్వభావవర్ణనలు చూసి ముగ్ధుడై భారతదేశాన్ని చూడాలని సంకల్పించి ఆయన తన భార్యతో కలిసి 1892 సం॥ అక్టోబరులో బయలుదేరి హిందూదేశానికి వచ్చి, కాశ్మీరం మొదలు కన్యాకుమారివరకూ దేశమంతా ఆరునెలలు తిరిగిచూశాడు. ఇక్కడి పర్వతాలను నదులను చూసి సంస్కృత వాఙ్మయంలోని వర్ణనలు జ్ఞాపకం తెచ్చుకొని పరవశుడయ్యేవాడు. ఇక్కడి పండితులతో సంస్కృతంలో సంభాషించేవాడు. భారతీయుల అతిథిసత్కారమును గుణశీలాలను విజ్ఞాన సంపదను చూసి సంతోషించాడు. ఈయన తన మంచితనమువల్ల ప్రజల ప్రేమకు పాత్రుడైనాడు. విద్వాంసులీయన పూర్వజన్మంలో భారతీయుడే నని విశ్వసించి ఆయన పేరును "దేవసేను"డని సంస్కృతీకరించారు. డాయిసెన్‌గారికి దేశీయులపైన చాలా అభిమానం కలిగింది.

డాయిసెన్ గారు వేదాంతముయొక్క ప్రాశస్త్యాన్ని గురించి కొన్ని గ్రంథాలు వ్రాయడమేగాక, భారతదేశంలో తాము చూసిన సంగతులను గురించి కూడా ఒక గ్రంథాన్ని వ్రాశారు. అది ఇంగ్లీషులోకి అనువదించబడింది. ఆయన గ్రంథంలో సంగతులు కొన్ని చూద్దాము.

## గౌరీశంకర శృంగం

ప్రపంచంలోకెల్లా అత్యున్నతమైన పర్వతశిఖరము హిందూదేశంలో నేపాళ రాజ్యంలో హిమాలయపర్వతాలపైన వున్న గౌరీశంకర శృంగము. ఈ పర్వతాగ్రాన్ని ఇటీవల కొంచె ఎక్కి చూసినవాని పేరిట ఆంగ్లేయులు దీన్ని ఇప్పుడు "మౌంటు ఎవరెస్టు" అంటున్నారు. "ఎవరెస్టు శిఖరం చూశావా" అని ఇంగ్లీషువారు ఒకరి నొకరు ప్రశ్నించుకోవడం విన్నప్పుడు వీళ్ల అజ్ఞానానికి విచారం వేస్తుంది. వైదికమతంలో పరమాత్మ స్వరూపుడుగా నిర్వచింపబడిన శంకరునిబట్టీన్నీ, ఆయన అర్ధాంగి, ఆదిశక్తిస్వరూపిణియైన గౌరీదేవిని బట్టీన్నీ ఈమహోన్నత శృంగానికి గౌరీశంకరమనే పవిత్రనామము అనాదినుంచీ సుప్రసిద్ధంగా వుంది. ఈ ఆదిదంపతుల ప్రణయాన్ని మమాకవి కాళిదాసు కుమారసంభవమనే మనోహరమైన మహాకావ్యంలో రసవంతంగాను రమణీయంగానూ చిత్రించాడు. జంటగా నున్న రెండు శిఖరాలూ కలిసి ఏర్పడి, భారతీయులు భక్తితో స్మరించుపరమపావనములైన నామసంకీర్తనముతో ప్రసిద్ధిచెందిన, ఈ మహోన్నత పర్వతశృంగాని కిప్పుడు ఇంగ్లీషువారు అధికారగర్వంతో ఎవరెష్టుశిఖరమనే పనికిమాలిన క్రొత్తపేరొకటి పెట్టారు!

## "ఇంకా మిగిలివున్నాయి"

డాయిసెన్‌గారు బరోడాకువెళ్లి అ రాజభవనంలో వున్న పాశ్చాత్యనాగరికతకు సంబంధించిన వస్తువాహనాలూ జవాహిరీనీ చూసి చకితులై ఇప్పటివరకూ ఈ దేశాన్నుంచి ఇంగ్లాండుకు ఎంతటి ధనకనకవస్తువాహనాలు తరలించబడియున్నా - ఇంకా ఇప్పటికీ ఇంగ్లీషు గవర్నర్లకూ రెసిడెంట్లకూ, వారికేమైనా కొంచెము సంకోచంవుంటే వాళ్ల దొరసానులకూ బహుమతీలు ఇవ్వడానికి ఇంకాచాలా అమూల్యవస్తువులు మిగిలివున్నాయి" అనివ్రాశారు.

## మహారాజులు

"హిందూదేశంలో రాజకీయబలమంతా ఇంగ్లీషువారి చేతులలో చిక్కినందువల్ల ఈదేశంలో మిగిలిన రాజులందరూ పేరునకు రాజులుగానున్నారు. గాని నిజానికి ధనము గౌరవముగల సామాన్య వ్యక్తులకన్న వీరికే ఆధిక్యత యున్నూ లేదు. చాలామంది భోగలాలసులై విషయలోలురై పాడైనారు. కొందరు మాత్రం మతాభివృద్ధికోసమూ విజ్ఞానాభివృద్ధికోసమూ పాటుపడతారు."

## దొరలసంభాషణ

కలకత్తాలో డాయిసెన్‌గారు బసచేసిన ఒక భోజనశాలలో చేరిన దొరలలో విజ్ఞానముగాని, సంస్కృతిగాని ఆయనకు కనబడలేదు. "ఉష్ణాధిక్యతవల్ల కలిగే ఉద్రేకం

వల్ల కాబోలు-యువకులైన పాశ్చాత్యులు యెల్లప్పుడూ దేశీయులను నీచంగా తిట్టేతిట్లు తీసివేస్తే వాళ్ల సంభాషణలలో గమనించ తగిన దేమీలేదు. ఎంతసేపూ క్రికెట్టు, క్రాకెట్టు, తుపాకీ కాల్చువేట, టెన్నిసు, మాటలు తప్ప వాళ్లు మాట్లాడే మంచి విషయాలేమీ లేవు."

## ప్రజల దుఃఖము

'తమలో ఏవిధంగానూ పోలని విదేశీయ జాతివారైన ఈ ఇంగ్లీషువారు తమ దేశాన్ని ఆక్రమించి ఏలుతూ వుండడాన్ని గురించి వివేకమూ ఆత్మగౌరవముగల భారతీయులందరూ వ్యసనపడుతూ వున్నట్లునాకు గట్టిగా తోచింది.

## మిషనరీల మాటలు నమ్మకూడదు

'హిందూ'దేశాన్ని గురించి క్రైస్తవ మిషనరీలు వ్రాసేసంగతులూ చెప్పుమాటలూ మనం సులభంగా నమ్మకూడదు.'

## ఓడిపోతే 'పితూరీదార్లు' - గెలిస్తే "స్వాతంత్ర్య వీరులు"

"1857లో జరిగిన తిరుగుబాటును ఇంగ్లీషువారు సిపాయిల పితూరీ అని అంటారు. విప్లవదారుల ఉద్దేశాలు నెరవేరివుంటే మనము ఇప్పటికీ స్కెల్లు-స్కారన్ హరస్టు, బ్లూకర్ మొదలైన స్వాతంత్ర్య యుద్ధవీరులను సంస్మరించి గౌరవిస్తూ వున్నట్లే వారి దేశీయులు వాళ్లనుకూడా సంస్మరిస్తూ గౌరవించేవారే. వారు ఓడిపోయి నందువల్లనే వాళ్లని పితూరీదార్లు అని అంటూ వారిచర్యలను నిందిస్తున్నారు. కేవలమూ అదృష్టముపైన ఆధారపడే జయానికి ప్రజలు సులభంగా వశులైపోతారు."

*- ఆంధ్రపత్రిక 25.7.1943*





# 'నల్ల శాసనాలు'

**1833** వ సంవత్సరపు రాజ్యాధికారశాసనం ప్రకారం ఐరోపావారు భారతదేశానికి స్వేచ్ఛగా వచ్చి ఇక్కడ భూములు సంపాదించి స్థిరపడడానికి పార్లిమెంటువారు అవకాశం యిచ్చారు. పత్రికా ప్రకటనస్వాతంత్ర్యంకూడా వారికి యిచ్చారు. దేశీయులకు ఈ తెల్లఅరివల్ల కలిగే అవమానాలనుండి దౌర్జన్యాలనుండి కాపాడడానికి ఎలాంటి జాగ్రత్త తీసుకోలేదు. మనుష్యులను హద్దులో వుంచడానికి తగిన బందోబస్తులూ చెయ్యలేదు.

ఈ తెల్లవారు రాజధానినగరాలకు ఎన్ని వందలమైళ్లదూరంలోనా ఎవరినైనా అవమానించినా ఏ న్యాయస్థానాన్నైనా తిరస్కరించినా ఏమిదౌర్జన్యం చేసినా రాజధాని నగరాలలో నుండే సుప్రీముకోర్టులోనే వారిని విచారించాలిగాని, ఆ ప్రాంతాలలో కుంపినీ వారేర్పరచిన జిల్లాకోర్టులలోను మేజిస్ట్రేటు కోర్టులలోనూ వీరిని విచారించడానికి వీలులేదు. అందువల్ల ఈ తెల్లవారు స్వేచ్ఛగా విచ్చలవిడిగా సంచరిస్తూ డబ్బు పుచ్చుకొని అక్రమాలు కూడా చెయ్యడం ప్రారంభించారు. సివిలువ్యాజ్యాలలో మాత్రం తెల్లవారు సివులుకోర్టుల అధికారానికి లోబడియుండేటట్లు శాసింపబడివున్నది.

అయితే ఈ సివిలు కోర్టు లిచ్చేతీర్పులపైన తెల్లవారు సుప్రీముకోర్టులోనే అప్పీలు చేసుకోవచ్చును.

దేశీయుల విషయంలో జిల్లాకోరుట్వారిచ్చిన తీర్పులపైన కుంపినీవారేర్పరచిన "సదరు అదాలత్తు" కోర్టులకు అప్పీలు చేసుకోవచ్చును. తెల్లవారుమాత్రం పార్లిమెంటు వారు కలకత్తాలో ఏర్పరచిన సుప్రీముకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చును. ఈతారతమ్యం బాగా లేదని తోచి 1834లో హిందూదేశానికి శాసన నిర్మాణసభ్యుడుగా వచ్చిన మెకాలే ఒక చిత్తుచట్టం ప్రవేశపెట్టాడు. దేశంలోపలవున్న ఐరోపావారు కలకత్తాలో సుప్రీముకోర్టుకు అప్పీలు చేసుకునే హక్కు తీసివేశాడు. ఈ శాసనాలకు ఇంగ్లీషువారిష్టపడక వీటిని ప్రతిఘటించారు ఈ చట్టాలను "నల్లశాసనా"లని తెల్లవారు అన్నారు. కంపెనీవారు స్థాపించిన సదరు కోర్టులలో అప్పీళ్లు విచారించే జడ్జీలుకూడా విద్యావంతులైన దొరలే. సుప్రీముకోర్టున్యాయాధిపతులవంటి సమర్థులే, తెలివైన వారే. అసంఖ్యాకులైన దేశీయుల

వ్యాజ్యాలపైన అప్పీళ్లు విచారించేటప్పుడు దొరల వ్యాజ్యాలపైన అప్పీళ్లుమాత్రం ఎందుకు విచారించకూడదని మెకాలేగారు అన్నారు. 1833వ సంవత్సరపు చట్టం ప్రకారము చేయబడిన విచక్షణ బాగా లేదన్నారు. ఐదుకోట్ల మంది భారతీయుల మధ్యవారితో ఎంతమాత్రము సామరస్యంగాని స్నేహం గాని సానుభూతిగాని లేకుండా నివసించే అయిదువందలమంది తెల్లవారు తమయిష్టం వచ్చినట్లు ఈ నల్లవారిపట్ల ప్రవర్తించడానికి అభ్యంతరంకలిగించే ప్రతిశాసనవిధికీ అయిష్టత చూపుతారు. పత్రికలలో ప్రకటించే అభిప్రాయాలన్నీ ఐదువందలమందికీ అనుకూలమైనవే. ఐదుకోట్లమందిమాట తలపెట్టే వారేలేరు!

దీనిని గురించి తెల్లవారు పత్రికలలో అసమ్మతి వుత్తరాలూ వ్యాసాలు వ్రాసి వ్రాసి తుదకొక బహిరంగసభను సమావేశపరిచారు. ఆ సభలో జరిగిన చర్యలు చాలా హాస్యాస్పదంగావుండి సభలో కల్లోలం కలిగి నందువల్ల మరుసటివారానికి వాయిదా వేశారు. ఆమరుసటిసభలో కూడా కొందరు తీవ్రంగా మాట్లాడారు. ఈ చట్టానికి అసమ్మతిని తెలుపుతూ పార్లమెంటువారికి ఇంగ్లాండు ప్రభుత్వానికీ మహజరు పంపడానికి తీర్మానించారు. మహజరులు తయారు చేయడంలో కొన్ని వారాలు గతించాయి. ఈమహజరులు సీమకు తీసుకువెళ్లడానికి ఒక ఏజెంటును నియమించారు.

1838వ సంవత్సరం మార్చి 22వ తేదీన ఒక విచారణ సంఘాన్ని నియమించి ఈ చట్టం ఎలాగ అమలు జరుగుతున్నదీ తెల్పలడానికి పార్లమెంటులో ఒకతీర్మానం ప్రవేశపెట్టారు గాని అది నెగ్గలేదు. హిందూ దేశప్రభుత్వంవారు తాముచేసిన నిర్ణయంలో గట్టిపట్టు పట్టారు. రెండు మూడు వందల మంది తెల్లవారుచేస్తూ ఉన్న ఆందోళనకు నిగ్రహించారు. 1835కు పూర్వం పత్రికా ప్రకటనవిషయములో వుండిన నిర్బంధాలను మెకాలే తొలగించాడు. కలకత్తా పత్రికలన్నీ మెకాలేగారిని నానా దుర్భాషలాడుతూ దుర్మార్గుడనీ, మోసగాడనీ తిడుతూ వుండగాకూడా మెకాలే ఈ పత్రికలపైన గల నిర్బంధాన్ని తీసివేయవలసినదని కుంపినీ డైరెక్టర్లకు 1836వ సంవత్సరం సెప్టెంబరులో వ్రాశాడు. ఆ కాలంలో ఆ పత్రికలలో అతనిని గురించి వ్రాసే నోట వచింపరాని మాటలు తన సోదరి చూస్తుందేమో నని ఒక్కొక్కప్పుడా పత్రికలను దాచివేసేవాడు.

– *ఆంధ్రపత్రిక, 27.6.1943*





# నీలిమందు దొరల దౌర్జన్యగాథలు

బట్టలకు వేయు రంగులలో నీలిమందు చాలా ముఖ్యమైనది. నీలిమందును ఇంగ్లీషు "ఇండిగో" అందురు. ఆ మాట "ఇండికాన్" అను గ్రీకుమాట నుంచి పుట్టినది. ఇండికాన్ అనగా "ఇండియా దేశపు" రంగు అని అర్థము. ప్రత్తి, నూలు అను మాటకుకూడా గ్రీకు భాషలో "భారత దేశపు" అని అర్థముగల "సిందన్" అను మాటనే వాడుచుండిరి. ఇలా నూలును, నీలిమందునుకూడా క్రీస్తుకు పూర్వము చాలా కాలంక్రిందటనే భారతదేశము నుంచి పాశ్చాత్య దేశనాగరికతకు పుట్టినిల్లుగుగ్రీకు దేశమునకెగుమతి అగుచుండెను.

నీలిరంగు పాశ్చాత్య దేశములవారికి చాలా ప్రీతికరమైనదిగనుండెను. వారు చాలా సొమ్మునిచ్చి దీనిని దిగుమతి చేసుకొనుచుండిరి. తురుష్కరాజ్యముల వారి యాటంకము వలన భారత దేశమునుంచి నూలు, నీలిమందు మొదలగు ఎగుమతులు కొన్ని శతాబ్దములపాటు భూమార్గముగా జరుగడం చాలా కష్టతరముగా నుండెను. క్రీ.శ.1497 నుండి ఆఫ్రికా యుగమును చుట్టి సముద్రమార్గమున పాశ్చాత్య వర్తకులు మనదేశమునకు వచ్చుట ప్రారంభముకాగా, పదునైదు పదునారు శతాబ్దములనుంచి మరల మన దేశమునుంచి అక్కడికి ఎగుమతు లభివృద్ధి చెందెను. మొగలు చక్రవర్తుల కాలమున జిలుగువలువలతో పాటు నీలిమందు వ్యాపారమును చాలా లాభకరముగా నుండెను.

మన దేశములో అన్ని రాష్ట్రములందు ఇప్పటికిని పాడుపడిన నీలిమందు తొట్టెలు కనబడుచుండును. యమునానది తీరమునను, మధ్యభారతదేశమునను, ఘూర్జర దేశములోను, వంగరాష్ట్రమునను నీలిమందు విరివిగా తయారగుచుండెను. నీలిమందు మొక్కలనువేసి పెంచి పండించుట. దాని నుంచి నీలిమందు తయారుచేయుట చాలా ధనవ్యయంతో కూడిన పని. పైగా, అది చిక్కులతో కూడినపని. ఒక్కొక్కప్పుడు పంట నాశనమై రైతులకు తినుటకు అన్నము కూడా ఉండదు. అయినను,పండినప్పుడు అమిత లాభము వచ్చుచుండుట వలన ఈ పరిశ్రమయు, వ్యాపారమును చిరకాలము నుంచి జరుగుచుండెను.

మన దేశమున వర్తకము చేయుటకు వచ్చిన ఒళందులను డచ్చివారు, ఇంగ్లీషువారును కూడా నీలిమందు వ్యాపారము చేయుచు రైతులచే నీలిమందు పంట పండించుటకు దానిని తయారు చేయించుటకు అనేక మాయోపాయములు పన్ని చాలా లాభము లార్జింపసాగిరి.

క్రీస్తుశకం పదునెనిమిదవ శతాబ్దమున నీలిమందు ధరలు చాలా పెరిగినందువలన దానిలో కల్తీ కలుపుట ఎక్కువయ్యెను. అందువలన మన సరకు ప్రాశస్త్యము తగ్గినది. ఇంతేగాక ఆ సమయముననే ఇంగ్లీషు వారి వలసరాజ్యమైన అమెరికాలో కృత్రిమపు నీలిమందు తయారుచేయు పద్ధతి కనుగొనిరి. అంతట ఆ నీలిమందు దిగుమతి వ్యాపారామువలన మన పరిశ్రమ నష్టపడి క్రమక్రమముగా క్షీణింపసాగెను.

## అమెరికా నుంచి దిగుమతి

ఇంతలో అమెరికా బ్రిటిష్ ప్రభుత్వమును దిక్కరించి 1735లో స్వతంత్ర మయ్యెను. నీలిమందు పరిశ్రమకన్న పంచదార, కాఫీ పరిశ్రమలు అమెరికావారి కెక్కువ లాభకరములయ్యెను. ఇంతలో అమెరికాలో నీగ్రో బానిసలు తిరుగుబాటుచేయగా అక్కడి పరిశ్రమలను దెబ్బతినెను. ఈ పరిస్థితులలో 1780 మొదలు హిందూదేశంలోని ఇంగ్లీషు వర్తక కంపెనీవారు అమెరికాలోని నీలిమందు తోటల యజమానులను కొందరి నిక్కడికి రప్పించి వంగరాష్ట్రములో వారికి ప్రత్యేక వ్యాపారపు సదుపాయములుకలిగించిరి.

ఇంతేకాక ఇంగ్లీషు కంపెనీ యుద్యోగులను కూడా నీలిమందు వ్యాపారము చేయవచ్చిరి. నీలిమందు వ్యాపారము చేయువాడును కంపెనీవారును నీలిమందు పండించువారిని ప్రోత్సహించి ధనసహాయము చేయదుమనిరి. 1790 నాటికి ఇంగ్లీషు నీలిమందు వర్తకులు బాగా స్థిరపడిరి. అది వంగదేశంనుంచి ఢిల్లీ వరకును ప్రాకినది. గుజరాతు లోని పురాతన పరిశ్రమ కొంతకాలము కొనయూపిరితోనుండి తరువాత నశించినది.

ఇంగ్లీషు దొరలు కొందరు 1780 మొదలు కంపెనీ సర్కారువలన లైసెన్సులను అనుమతి పత్రములను పొంది వంగదేశములోను బీహారు అయోధ్య పరగణాలలోను నెలకొనసాగిరి. అయోధ్యలో వీరు చేయు దుండగములకు హద్దుపద్దులు లేకుండెను. వీరి చర్యల వలన కలుగుచుండిన చిక్కులను గూర్చి 1810 జూలై 13వ తేదీన ఒక తాకీదు జారీ చేయబడెను. వారు చేయు దౌర్జన్యములు ఈ క్రింది విధముగా వర్గీకరింపబడెను.



1. లా ప్రకారం ఖూనీ లేక హత్యగా శిక్షింపవీలులేనట్టివేది యైనను దేశీయుల దుర్మరణములకు కారణములైన దారుణకృత్యములు.
2. దేశీయుల వలన తమకు రావలసిన బాకీలను రాబట్టుకొనుటకని అన్యాయముగా నిర్బంధించి బొండలలో పెట్టి బాధించుట.
3. తమ నీలిమందు కార్ఖానాలోని మనుష్యులను గుంపులుగా చేర్చి ఇతర నీలిమందు తోటలవారిపైన దౌర్జన్యములు చేయుట.
4. బెత్తములతో గాని ఇతర విధముగా గాని దేశీయ పారిశ్రామికులను, ఇతరులను కొట్టి హింసించుట.

నీలిమందు వ్యాపారులు రైతులకు ముందుగా కొంత సొమ్ము నిచ్చి వారొక నిర్ణీత ధరకు ఇంత నీలిమందు సరఫరా చేయవలెనని ఖరారు చేయించుకొందురు. వారితో అలా ఏర్పాటు చేయుటలోను, సరుకు పుచ్చుకొనుటలోను బలవంతము చేయుట, హింసించుట మొదలగు అన్యాయముల వలన రైతులనేక విధములుగా పీడింప బడుచుందురు.

తమ బాధలను గురించి రైతులు కోర్టులలో ఫిర్యాదు చేసికొనుట తప్ప వారికి గత్యంతరములేదు. ఆకోర్టులలో నీలిమందు వర్తకుల పలుకుబడివలన బీదరైతులకు న్యాయం దొరకుట అరుదు.

ఆ కాలమున నీలిమందు వ్యాపారము చాలా లాభకరముగా నుండెను. అందువలన కంపెనీ కొలువులో చేరని దొరలు చాలామంది ఈ వ్యాపారం చేయుచుండిరి. సద్ధర్ముడని పేరుపొందిన "కారీ" అను శ్రీరామపురంలోని క్రైస్తవ మిషనరీ కూడా కొంతకాల మీ వ్యాపారం చేసెను. తక్కిన దొరలవలెగాక అతడు కొంత దయ దాక్షిణ్యములతో ప్రవర్తించుట చూచి గ్రామస్థులాశ్చర్యపడిరి.

## దొరల అక్రమాలు

లక్నోలో మార్టిన్ అను సుప్రసిద్ధుడైన ఇంగ్లీషు దొర నజాఫ్‌గడ్‌లో నీలిమందు ఇజారా పాడెను. ఈ నీలిమందు దొరలు నగరములలోని ఇతర పాశ్చాత్యులతోగాని దేశీయులతోగాని కలసి మెలసి వుండక గ్రామములకు దూరముగా తోటలలో ఒంటరిగా నివసించుచుండుట వలన వారు చేయు దుర్మార్గములు, అక్రమములు బయటపడుట కూడా దుర్లభముగానుండెను. వారి చర్యలు కనిపెట్టువారు లేరు. సాధ్యమైనంత త్వరలో వీలైనంత లాభం. సంపాదించి మూటగట్టి సీమకు పోవుటయే వారి ప్రధాన లక్ష్యముగా నుండెను.

నీలిమందు దొరలపైన 1706లో వచ్చిన అభియోగములవలన నాకాలమునాటి పరిస్థితులు కొన్ని తెలియగలవు. వీరికి సంబంధించిన రికార్డు లిప్పటికి ఇంగ్లండులో నున్నవి.

రిచార్డుజాన్సన్. జాన్ చాన్సన్ అనువారు నీలిమందు వ్యాపారులు. వీరు తమ తోటలలో పనిచేయు ముగ్గురు దేశీయులు దొంగతనము చేసినారని కేసుదాఖలు చేయగా అందులో వచ్చిన సాక్ష్యమువలన వారినీ దొరలు పెట్టుచుండిన క్రూరహింసలు సంగతి బయల్పడెను.

తిర్హూత్ జిల్లా నిజామత్ ఆదాలతు అను క్రిమినలు అప్పీళ్ళ న్యాయస్థానము వారి డిప్యూటీ రెజిస్ అనునదికారియైన జేమ్సు స్టువార్టుగారి ద్వారా కోర్టువారీ క్రింది నివేదికను ప్రభుత్వమువారికి పంపంచిరి.

బోలా అను ముద్దాయిని అతని భార్యయైన ముసమ్మంత్ బుసీయను నామెను ఈ దొరలు అక్రమంగా పట్టుకొని నిర్బంధించి వారికి ఇనుప సంకెలలు వేసి బొండలలో పెట్టిరి. బోలాను చావగొట్టిరి. వారికి ప్రాణభయము కలిగించినారు. తరువాత వారీ దంపతులను గాడిదలపై నెక్కించి తోకల వైపున ముఖముటుండునట్టు కూర్చొండబెట్టి డోలు వాయించుచు చుట్టుపట్ల గ్రామములందూరేగించి యవమానపరచిరి.

## గ్రామస్థుల భీతి

ఈ జాన్సన్ దొరలమీద చర్యతీసుకొనుటకు గ్రామస్థులు భయపడినారు. కాని ఈ ముద్దాయిలపైన దొరలు దాఖలుచేసిన కేసులో మాత్రము పైన చెప్పిన సంగతులన్నిటిని గ్రామస్థులు చెప్పినారు. ఈ కేసు విషయంలో చర్యతీసుకొనుటకు క్రిందికోర్టుకు అధికారం లేదు. సర్క్యూటు కోర్టులో గాని కలకత్తాలోని క్రిమినల్ కోర్టులోగాని దీనిని గూర్చిన అభియోగము దాఖలు కావలెను. అయితే గ్రామస్థులకిది సాధ్యంకాలేదు. ఈ జాన్సన్‌ల నిద్దరిని వారము దినములలో కలకత్తాకు పోవునట్టును, మరల నీతోటలదగ్గరకు రాకుండునట్టును అధికారులుత్తరువు చేసిరి.

రిచర్డు జాన్సన్ దేశీయులపైన దౌర్జన్యాలు చేసినను నేరము నతనిపైనకలకత్తా లోని సుప్రీముకోర్టులో దాఖలు చేయబడగా అతడు 1797 జనవరిలో శిక్షింపబడెను.

విలియం ఓర్బిహంటరు అనునతడు తిర్హూత్ జిల్లలోని మిర్జాపూర్ అను గ్రామమున నొక నీలిమందు తోట యజమాని. ఇతని యుంపుడుకత్తెయైన బీబీ భంగ్యాన కోవర్అను నామె దగ్గర పనిచేయు ముగ్గురుదేశీయ పనికత్తెలను హింసించిన నేరమున కితనిపైన



కేసు దాఖలయ్యెను.

## ముక్కు చెవులు కోసిన ముష్కరుడు

ఆ ముగ్గురు స్త్రీల ముక్కులను, చెవులను. జుట్టును ఇతడు కోసివేసినాడు. వారిలో నొకయామె నాలుకకూడా కోసినాడు. వారి కాళ్ళకు సంకెళ్ళువేసినాడు. వారి రహస్యావయవములను గాయము కలిగించినాడు. వారికి ఘోరములైన ముఖసంకటములను తగిలించినాడు. అందులో నొకతయైన ముస్మమ్మంత్ కినోజీని మేజిస్ట్రేటు కచ్చేరికి మంచముపైనవేసి తెచ్చిరి తరువాత నామె తిర్హూత్ ఆసుపత్రిలో చనిపోయినది. అతడు వారినింక ననేకవిధములుగా హింసించినాడని కూడా వారు మేజస్ట్రేటు నెదుట మొరపెట్టుకొనిరి. ఇది అబద్ధమని యా ముద్దాయి వాదింపలేదు. ఈ నేరమును తాను చేయలేదని, తన ఉంపుడుకత్తె చేసినదని అతడు వాదించినాడు. ఈ క్రూర కృత్యములనెల్ల హంటరు ఉత్తర్వును బట్టియే తాను చేసితినని బీబీయనెను!! గవర్నరు జనరల్‌గారీ సాక్ష్యము నంతయు నమ్మక కలకత్తా కోర్టులో విచారణ చేయుటకు ఉత్తర్వుచేసిరి.

1796 డిసెంబరు నెలలో వారిరువురిపైనను నేరారోపణ గావించబడెను. 1797 జనవరి 10వ తేదీన వారు మొదటి స్త్రీ విషయమున చేసిన నేరమునకు శిక్షించబడిరి. ఈ కేసు వలన తనకు చాలా సొమ్ము ఖర్చు అయినదని. తాను నాశనమై పోవుచున్నానని ఫిర్యాదితో రాజీ చేసికొనుట కనుజ్ఞనిప్పించవలసినదని ఈ హంటరు 1797 జనవరి 16వ తేదీన అర్జీ దాఖలు చేసికొనెను. అంతట ఆ ముగ్గురు స్త్రీలకును అతడు వేయి సిక్కా రూపాయల చొప్పున నష్ట పరిహారముగా నిచ్చునట్టు, దానిని వడ్డీకివేసి వారి వివాహములు జరుగునప్పుడు వారికివ్వబడునట్టు ఏర్పాటు జరిగెను. ఈ నేరములన్ని హంటరే చేసినట్టు రుజువైనవి. అందులో ఒక్క నేరము తప్ప తక్కిన నేరములన్ని బీబీకూడా చేసెనని నిరూపించబడినది. హంటరుకు నూరు రూపాయలు జరిమానా విధించిరి. బీబీకి ఆరునెలల శిక్ష విధించిరి. అందులో అయిదు నెలలు అప్పటికే గతించినవి, ఆమె కొక రూపాయి జరిమానా విధించిరి.

1857 వరకు పరిస్థిఉతులిట్లే యుండెను. అటుతరువాత మరింత అధ్వాన్నముగ నుండెను. అప్పుడు డిప్యూటీ మేజిస్ట్రేటుగ నియమింపబడిన బంకిం చంద్ర ఛటర్జీగారు నేరము చేసిన దొరలను కఠినముగా శిక్షింపనారంభించిరి. అస్సాము పారిపోయినవారని పట్టి తెప్పించి శిక్షించిరి. ఇంగ్లీషు ప్రభుత్వాధికారులకిది గిట్టక ఆయననాపదవినుండి

తప్పించి సహాయ ప్రభుత్వ కార్యదర్శిగా నియమించిరి.

వంగదేశపు రైతులను నీలిమందు దొరలు పెట్టుబాధలు దుర్భరము కాగా వారు 1860లో తమ భూములందు నీలిమందు వేయటకును, దొరలతో వ్యాపార కంట్రాక్టులు వ్రాయుటకును నిరాకరించిరి. అంతట నీ తెల్లదొరలు నిర్బంధచర్యలు దౌర్జన్యములు చేయుట ప్రారంభించిరి. ఈ పరిస్థితులలో నీయన్యాయవ్యాపారపద్ధతులను గూర్చియు రైతుల బాధలను గూర్చియు కలకత్తాలోని హిందూ పేట్రియాట్ పత్రికాధిపతియైన శ్రీహరిశ్చంద్ర ముఖర్జీ తీవ్రముగా విమర్శించుచు వ్యాసములు వ్రాసిరి. దీనిని గూర్చి గొప్ప ఆందోళన బయలుదేరెను. దీని ఫలితముగా దీనిని గూర్చి విచారణచేయుటకొక విచారణ సంఘం నియమించబడెను. ఆ సంఘము వారియెదుట చాలామంది సాక్ష్యములిచ్చిరి. శ్రీహరిశ్చంద్ర ముఖర్జీ కలకత్తాకు వచ్చిన రైతులకన్నవస్త్రములిచ్చి కాపాడుచు, వారిపక్షమున గనేక విన్నపములను వ్రాసి, వారికి చాలా సమాయము చేసెను.

అప్పుడు జరిగిన విచారణలో పూర్వము ఫరీదుపురములో మేజిస్ట్రేటుగా నుండిన ఈ.డబ్లు.ఎల్.టవర్‌గారు సాక్ష్యమిచ్చు చున్నట్లు చెప్పిరి : "ఇంకొక సంగతి వున్నది. భారతదేశము నుంచి ఇంగ్లాండు కెగుమతియగు నీలిమందు పెట్టెలలో రక్తసిక్తముగాని దొక్కటియైన లేనది క్రైస్తవ మిషనరీలు చేసిన విమర్శకు కొందరతిశయోక్తి యనిరి గాని, ఫరీదుపూరు జిల్లాలో మేజిస్ట్రేటుగా నాకుగల అనుభవములను బట్టి ఇది యదార్థమని నేను చెప్పగలను. బల్లెపు పోటులతో నా వద్దకు పంపబడిన దురదృష్టవంతులగు రైతులనేకులను చూచినాను. నీలిమందు వ్యాపారియగు ఫోర్డుగారు తుపాకితో కాల్చిన రైతులను నేను చూచినాను. కొంతమందిని బల్లెములతో పొడిచి వారిని కనపడకుండా దాచివేసియుండుటను గూర్చి నేను రికార్డు చేసినాను. ఇటువంటి నీలిమందు వ్యాపారము "కేవలము రక్తపాతపు వ్యాపారమేయని నా అభిప్రాయము."

## అన్యాయాల పట్టిక

ఆ విచారణ సంఘమువారి నివేదికనుబట్టి ఆవ్యాపారములోని క్రింది అన్యాయములు జరుగుచుండెనని తేలినది.

1. నీలిమందు వర్తకునితో రైతులు చేసికొను ఒడంబడిక రైతులు బుద్ధిపూర్వకముగా యిష్టపడి చేసికొనునది కాదు. బలవంతముగా ఒప్పించబడినది.
2. నీలిమందు పండించుటకని దొరలు కొంత సొమ్మును బలవంతముగా రైతుల కంటగట్టు చుండిరి.



3. ఇతర పంటలు వేసికొని లాభము పొందకుండా రైతులు తమ కాలమునంతయు నీలిమందు వ్యవసాయమునకే ఉపయోగించవలసి వచ్చుచుండెను.
4. రైతులకున్న మంచి పొలములన్నిటిని నీలిమందు పండించుటకు తీసికొనుచుండిరి. ఒక్కొక్కప్పుడు రైతు వేసికొనిన పంటను ధ్వంసముచేసి ఆ భూమిలో నీలిమందు వేయునట్లు నిర్బంధించుచుండిరి.

ఈ విచారణ సంఘమువారి నివేదికలోని ముఖ్యమైన సూచనలను ప్రభుత్వము వారు అమలు జరపవలసి వచ్చెను. అంతట నీలిమందు వ్యాపారముచేయు దొరలకువచ్చు లాభములు నశించెను. అందువలన చాలా మంది ఆ వ్యాపారము మానివేశారు.

ఈ ఆందోళనమునందు ప్రముఖపాత్ర వహించిన శ్రీహరిశ్చంద్రముఖర్జీగారి పైనను ఇతర రైతులపైనను దొరలు సివిలు, క్రిమినలు కేసులు దాఖలుచేసి బాధింపసాగిరి. హరిశ్చంద్ర ముఖర్జీగారు 16-6-1861తేదీన అకస్మికంగా మరణించిరి. ఆయన పైన నష్టపరిహారమునకు దొరలు తెచ్చిన దావాలు కొన్ని డిక్రీకాగా వారాయన ఆస్తిని వేలమువేయించిరి.

బీహారు పరగణాలో చంపరాన్ అను చంపారణ్యము నందుకూడా నీలిమందు వ్యాపారము చేయు దొరలనేక అన్యాయములు చేయుచుండిరి. ఇది చాలాకాలము సాగినది. అక్కడ రైతులకు న్యాయములు లేకపోయినవి. తుదకు గాంధిమహాత్ముడు 1917లో వారికష్టములు మాన్పించుటకు సత్యాగ్రహము ప్రారంభించెను. బాబూ రాజేంద్రప్రసాద్‌గారాయనకు తోడ్పడిరి. తుదకు రైతులకు కొంత మేలుకలిగెను.

***-ఆంధ్రజ్యోతి, 2.1.1966, 9.1.1966***



# ఫ్రెంచి రాజ్యాధిపత్యము - మార్టిన్ దొర

భారతదేశము భాగ్యభోగ్యములతో తులతూగుచున్నదిన పాశ్చాత్యదేశ నావికులు చెప్పుటవలన ఆదేశములవారు మన దేశముతో వర్తక వ్యాపారములు జరిపి లాభమును పొందుటకై వర్తకసంఘములుగా నేర్పడివచ్చిరి. మొదట మన దేశమునకు వచ్చిన పాశ్చాత్యులు పోర్చుగీసువారు, వీరు క్రీ.శ. 1498వ సంవత్సరములోనే మన దేశమునకు వచ్చిరి. వీరినిమనవారు బుడగకీచులనిరి. వీరిక్కడ లాబము లార్జించుట చూచి హాలెండు దేశీయులైన డచ్చివారు వచ్చిరి. వీరిని మనవారు ఒలాందువారనిరి. అటుపిమ్మట నింగ్లీషువారును ఫ్రెంచివారును వచ్చిరి. ఫ్రెంచివారిని మనవారు పరాసువారని వ్యవహరించిరి. ఇంగ్లీషు తూర్పు ఇండియా కంపెనీ మనదేశము నాక్రమించగా ఇంగ్లీషువారిని కుంపినీ దొరలని వ్యవహరించిరి. తెల్లవారి నందరిని దొరలనుట పరిపాటి యైనది.

ఈ పాశ్చాత్యులు "భరతఖండమున వర్తకముచేయుటకొరకు కట్టుకొనిన గిడ్డంగులు కోటలయ్యెను. కోటలు సైనిక నివాసములకాలవాలములగు దుర్గములయ్యెను. సైనిక నిచయములు సామ్రాజ్యసంపాదనకు సాధనములయ్యెను. ఈయారోహణము మెల్లగా అని వార్యముగా జరిగిన రాజ్యతంత్రము యొక్క పరిణామము," అని తూర్పు ఇండియా వర్తక సంఘమువారి కొలువులో పనిచేసిన ఫిలిఫ్ ఫ్రాన్సిస్ అను నతడు 1787లో వ్రాసినాడు.

## సామోపాయం

భారతీయులను భయపెట్టియు మతాంతరులనుచేయుటకు ప్రయత్నించియు బలవంతముగా రాజ్యాక్రమణముచేయుట సులభము కాదనియు, వీరి స్నేహమును సహాయమును పొందవచ్చుననియు, వీరిలో వీరికిగల విరోధములను పురస్కరించుకుని తాము బలవంతులము కావచ్చుననియు, సుశిక్షితములు గాక కేవలము మొగలాయి దర్బారు పద్ధతులలో జనానాపరివారములతో నడుపబడు పెద్ద సేనలను సైతము



క్రమశిక్షణము కలిగి పాశ్చాత్యపద్ధతిపైన తుపాకి ఫిరంగి దళములతో యుద్ధముచేయుదేశీయ సిపాయిలుగల చిన్న సైనికదళములు అవలీలగా నోడింప వచ్చుననియు, రాజ్యతంత్ర ప్రయోగమువలన రాజ్యమును చేజిక్కించుకొని భారతదేశమున పాశ్చాత్య సామ్రాజ్యమును స్థాపింపవచ్చుననియు గ్రహించి కార్యాచరణమునకు మార్గము చూపినవారు ఫ్రెంచివారే. అయితే అనేక కారణములవలన ముఖ్యముగా ఫ్రాన్సుదేశ ప్రభుత్వమువారి అశ్రద్ధవలన వీరి యాధిపత్యము నిలువలేదు. ఈ మార్గములనే యవలంబించి కృతకృత్యులైనవారు ఇంగ్లీషువారు. దౌర్జన్యపద్ధతు లవలంబించి భారతీయులను భయపెట్టి క్రైస్తవమతమున కలిపి బానిసలుగాచేసి బలవంతముగా రాజ్యము చేజిక్కించుకొనుటకు ప్రయత్నించి విఫలులైనవారు పోర్చుగీసువారు. ఈ రెండు పద్ధతులకు మధ్యమ మార్గమున నడచి కొంత కాల మీదేశములో తమ చాకచక్యమును చూపినవారు డచ్చివారు.

## నాగరికతా ప్రభావం

భారతదేశమున పోర్చుగీసువారు చేసిన కృషికి చిహ్నముగా వారి నావికులును సైనికులును మత ప్రచారకులును ఈ దేశములోని తక్కువ కులముల వారి స్త్రీలతో చేసిన సాంగత్యఫలితముగా నుద్భవించిన "టోపాజు" లను సంకరజాతివారును, వారి పోర్చుగీసు వేషభాషలును ఆచారములును శాశ్వతముగా నిలిచియున్నవి. పోర్చుగీసువారీ దేశమున నిర్మించిన రోమను క్యాథలిక్కు క్రైస్తవ దేవాలయములు (చర్చిలు) అందులో భారతదేశ వర్ణాశ్రమధర్మపద్ధతులతో మారిపోయిన క్రైస్తవమతాచారములు నేటికిని నిలిచి యున్నవి.

డచ్చివారీ దేశములో వర్తకము చేసిన దానికి తార్కాణముగా మచిలీపట్టణములోని ఒలాంద పాలెమున్నది. ప్రజలతో వారు కొంచెము కలిసిమెలసియుండి కొన్ని వర్తక స్థానములు స్థాపించిరి. తూర్పు సముద్రతీరములలో వారు స్థాపించిన సామ్రాజ్యమునకు రాజధానియైన జావా ద్వీపములోని బటేవియానుండి తెచ్చిపాలకొల్లు నరసాపురము ప్రాంతములందు వారునాటిన నారింజ జాతిపండ్లు వారిరాజధానిపేరున బత్తాయి నారింజలని ఇప్పటికిని ప్రసిద్ధి వహించి యున్నవి. పంపరపనాసపండ్ల విత్తనములను కూడా వారే తెచ్చినారు. ఒలాందా మల్లెయని వ్యవహరింపబడు గుల్లబువంటి పూలచెట్టు కూడా వీరు తెచ్చినదే. ఆంధ్రదేశములో సముద్రతీరమున గల మచిలీపట్టణము, కాకినాడ, జగన్నాథపురము, నరసాపురము మొదలైన నగరములందలి ఇండ్ల గదులపైన కనబడు టేకుచెక్కల సరంబీ బల్లకూర్పుదప్తతి డచ్చివారు మలయా ద్వీపకల్పమునుండి తెచ్చినదే.

"సరంబీ" అనుమాట కూడా అక్కడినుంచి వచ్చునదే. ఇట్లే మన తెలుగులో కలిసిపోయిన మరి కొన్ని మాటలు డచ్చివారి నాగరికతా చిహ్నములుగా నున్నవి.

ఫ్రెంచివారు మనదేశములో కొలది కాలము మాత్రమే రాజ్యాధిపత్యము వహించినను వీరి నాగరికతా చిహ్నములు చాలా మిగిలినవి. ఫ్రెంచి నగరములైన పాండుచేరి, యానాము, చంద్రనగరము ఫ్రెంచివారి వేషభాషలకు నాగరికతకు ఆటపట్టులై పరాసుదేశపు నాగరీకతను భారతదేశములో కూడా వ్యాపింప జేసినవి. ఆ కాలమున ఐరోపా దేశములోని తెల్లవారందరు ఫ్రెంచి వారి వేషభాషలనె మేలుబంతిగా నెంచుచుండిరి. ఫ్రెంచివారు మన ఉత్తర సర్కారులలో నెనిమిదేండ్లు మాత్రమే రాజ్యము చేసిరి. కాని ఆ కాలమున దక్షిణాపథమున కేలికయగు నిజాముగారి దర్బారులో ఫ్రెంచి నాగరికత, ఫ్రెంచి మర్యాదలు, సైనిక సంప్రదాయములు గౌరవింపబడి దేశములోని గొప్ప వారిచే ననుకరింపబడుచుండెను.

ఫ్రెంచివారు తెల్లవారు-నల్లవారు అనుభేదములేక దేశీయులతో కలిసి మెలసి యుండి నందువలన వారి ఆచార వ్యవహారములు ప్రజల నాకర్షించినవి.

## తెలుగుకవి వర్ణన

ఆకాలములో ఇంగ్లాండు దేశములోని స్త్రీ పురుషులుకూడా ఫ్రాన్సుదేశపు ముఖ్యపట్టణమైన పారీసు నగరములోని వేషభాషలను ఆచార వ్యవహారములును చాలా నాజూకు అయినవని యెంచి అనుకరించు చుండిరన్నచో మన దేశీయుల మాట చెప్పవలసిన పనిలేదు.

ఆకాలమునాటి తెల్లవారి గృహాలంకరణములు, ఆహారములు, దుస్తుల తీరు, జుట్టు కత్తిరింపు, ముస్తాబులు, ఆటపాటల పద్ధతి, సైనిక కవాతులు ఫ్రెంచివారి పద్ధతికి చెందినవే! అందువలన వీని పరిభాషకూడా ఫ్రెంచి వారిదే. తెలుగువారు ధరించు దుస్తులలో కమీజు అనుమాట, విలువగల సకలాతు మొఖమల్ వస్త్రములు, గృహోప కరణములలో అల్మారు, బీరువా, తేనీరు, చీట్లపేకయాటలోని, కుదేలుబెన్తు జాకీమదాం, సైనిక వ్యవహార సంబంధములైన కెప్తాను, జెండ్రాలు, సోల్దారు మయూరు గరండీలు మొదలైన మాటలు తెలుగులో నిప్పటికిని వాడుకలో నున్నవి. దొరలవంటి వారిని "కుంపినీ" వారని మనవారనుచుండిరి. ఈ పదము (Cuissen) అను ఫ్రెంచి పదములోనుండి వచ్చినవే. కునుంద్రము లేక కుముందారు కమాండరు అను అర్థముగల ఫ్రెంచిమాట. ఫ్రెంచి గవర్నరు జనరలైన దూప్లేగారి దుబాషీ ఆనందరంగ పిళ్లకు ఆనందరంగ రాట్చందము నంకితమిచ్చిన కస్తూరిరంగ కవి ఆ గ్రంథమునందా నాగరికతకు చెందిన ఫ్రెంచి మాటల నుపయోగించినాడు. దూప్లే గారిపైన పద్యములు పాటలు వ్రాసినాడు. బొబ్బిలి యుద్ధమును మహాభారత యుద్ధముతో పోల్చుచు దిట్టకవి నారాయణ కవి రచించిన రంగరాయ విజయమునందు ఉత్తర సర్కారుల నేలిన ఫ్రెంచి సేనాధిపతి యగుడీబుస్సీగారి ప్రభుత్వమును, ఆయన వేషభాషలను ఫ్రెంచి సేనలోని విశేషములను వర్ణించుచు ఆనాటికి మన దేశములో వాడుకలో నున్న ఫ్రెంచిమాటలను విరివిగా ప్రయోగించినాడు.

మ॥ సమరుజ్జృంభిత శౌర్యధుర్యులగు, సార్జెంతుల్ మయూరుల్ కుముంద్రములన్ వీరులు; సోలుదారులు సుబేదారుల్ మొదల్గల్గు సైన్యము లాత్మీయులు గొల్వనుద్ధ తులముల్కాఖ్యా మహాఖ్యాతిమ త్సముదగ్రప్రతిభా విభాసియగు మూసాబూసి యుల్లాసియై.

## పుదుచ్చేరిలో స్థావరం

పాండిచేరిలో ఫ్రెంచి ప్రభుత్వమువారు జారీచేయు ఫర్మానాలు, ఫ్రెంచి అరవము పారసీ మరాటీ భాషలలోనేగాక తెలుగులో కూడా ప్రకటింపబడుచుండెను.

భారత దేశమున వర్తకము చేయుటకు వచ్చిన పాశ్చాత్యులందరిలోను ఫ్రెంచివారే భారతీయుల స్నేహమునకు గౌరవమునకును హెచ్చుగా పాత్రులైరి. పాండుచేరీ అని పిలువబడుచున్న పట్టణమున్నచోట పులిచేరియను కుగ్రామముండెను. ఆ ప్రాంతమప్పుడు బిజాపూరు సుల్తానుగారికిలోబడి జంజిపరగణాను పాలించు తంజావూరునేలు మహారాష్ట్రుల రాజ్యములో చేరియుండి షెర్‌ఖాన్‌లోడి అనువానిచే పరిపాలింపబడుచుండెను. 1674 ఏప్రిలులో ఫ్రాన్సిస్ మార్టిన్ అను ఫ్రెంచి ఉద్యోగి ఆ స్థలమునతనివలన సంపాదించెను. అది సెంజి లేక జింజి నది ముఖమున నుండెను. పులిచేరియనుపేరును ఫ్రెంచివారు పాండుచేరియని మార్చి అక్కడ నొక వర్తక స్థానము నేర్పరచుకొనిరి.

ఔరంగజేబు చక్రవర్తి బిజాపూరు రాజ్యమును 1676లో జయించి మొగలాయ సామ్రాజ్యమున గలిపివేసెను. తరువాత పండ్రెండు సంవత్సరములకు ఆయన గోల కొండపైన దండయాత్రచేసి ఆ సుల్తానుగారి రాజ్యమునుకూడా తన సామ్రాజ్యమున గలుపుకొనెను. ఆయన సేనాధిపతులు కర్నాటక రాజ్యమునెల్ల మొగలాయ సామ్రాజ్యమున చేర్చుటకు విశ్వప్రయత్నములు చేయసాగిరి. ఈ పరిస్థితులలో ఫ్రాన్సిస్ మార్టిన్ పాండుచేరికి చుట్టుపట్ల ప్రజలను, ఆ ప్రాంతములను పరిపాలించు రాజులను అధికారులను మొగలాయి సేనాధిపతులనుకూడా మంచి చేసికొని, పాండుచేరికి అపాయము కలుగకుండా

కాపాడుచుత అది దినదినాభివృద్ధి చెందునట్లు కృషిచేయసాగెను. అతడు మనదేశీయులతో చాలా స్నేహముగా నుండి వారి పట్ల మర్యాదతో ప్రవర్తించుచు, తాను వారితో జరుపు వ్యవహారములందు చాలా నీతిగా వ్యవహరించుచుండినందువలన వారి గౌరవమునకు పాత్రుడయ్యెను. అతడు నిగర్వి, అతని కెవ్వరియందును అసూయగాని ద్వేషభావముగాని లేదు. ఎవ్వరిని అతడు తక్కువగా చూడడు. అతనికి ఫ్రాన్సు దేశముపైన అమితమైన భక్తియుండెను. ఆసమయమున నొకసారి పాండుచేరిని డచ్చివారు పట్టుకొనిరి గాని 1697లో జరిగిన సంధినిబట్టి వారు దానిని మరల ఫ్రెంచివారికిచ్చివేసిరి.

## బందోబస్తు

ఫ్రాన్సిస్ మార్టిన్ పాండుచేరికి మంచి రక్షణలను కల్పించి ఏడు ఎనిమిది వందల మంది ఫ్రెంచి జాతివారిని ఎల్లప్పుడు నా పట్టణమందుంచి తగు బందోబస్తుతో నుండెను. ఆ పట్టణమున నలు ప్రక్కలను చక్కని బాటలు వేయించి క్రొత్త యిండ్లను కట్టుకొనువారు వరుసగా నిర్మించునట్లు చేసి పట్టణము అందముగా నుండునట్లు చేసెను. అతడు తన మంచితనమువలన మన దేశీయుల హృదయములను చూరగొని వారి నాకర్షించెను. చాలామంది వచ్చి ఆ పట్టణమున నివసింపసాగిరి.

1706లో అతడు చనిపోవునప్పటికి నలుబదివేలమంది దేశీయులచ్చట స్థిర నివాసము నేర్పరచుకొనిరి. అతడు కీర్తిని మాత్రమే సంపాదించెనుగాని ధనము నార్జింపలేదు. ఆ పట్టణముచాలా అభివృద్ధిలో నుండెను. గవర్నరు నివాసము కొరకు ఇటుకలతో నొక దివ్య భవనము నిర్మింపబడెను. ఇట్లే చాలా యిండ్లను అంగళ్ళను ఇటుకగోడలతోను పెంకుటి కప్పులతోను నిర్మించిరి.

ఆ కాలములో నీ ప్రాంతముల నేలు రాజులయొక్కయు నవాబులయొక్కయు దర్బారులలోను కొలువు కూటములలోను ఫ్రెంచివారన్న మంచి గౌరవ మేర్పడెను. ఫ్రాన్సిస్ మార్టిన్‌గారు వారందరిని చాలా మర్యాదగా చూచి వారి యధికారమును మన్నించి వారి యుత్తరువులను శిరసావహించి వారి అనుగ్రహమును సంపాదించి తనకేగాక తన జాతి కంతకును మంచి పేరు తెచ్చెను. ఆ కాలమున సాధ్యమైనంతవరకు దేశీయుల ఆచార వ్యవహారములను ఫ్రెంచి వారు మన్నించుచు తాముకూడా వారిననుకరించు చుండిరి. ఏ విధముగా ప్రవర్తించినచో వారి విశ్వాసమును పొందవచ్చునో గమనించి ఆ ప్రకారముగానే ప్రవర్తించుచుండిరి.



## మార్టిన్‌దొర లౌక్యం

ఫ్రాన్సిస్ మార్టిన్‌గారు మనదేశీయులతో మంచి స్నేహ సంబంధములు కలిగియున్నందుకు ఫలితముగా మనవారు ఆయన పట్లనే గాక ఫ్రెంచి జాతివారందరి యెడలను నమ్మకమును విశ్వాసమును స్నేహభావమును ప్రదర్శింపసాగిరి. ఆ కాలమున నీ దేశమున సంభవించుచున్న అల్లకల్లోలమందు ఏ చిన్ననవాబైనను ఈ జాతియులను నాశనము చేయుగలుగుననియు అందువలన వారందరితోనూ మంచిగా యుండ వలయుననియు గ్రహించియే మార్టినుగారి స్నేహ ధర్మ పద్ధతిని ప్రారంభించి యుండవచ్చును. ఏది ఎట్లున్నను ఆయన ప్రారంభించిన సౌమ్య విధానము లాయన తరువాత ఫ్రెంచి కంపెనీ వ్యవహారములను నిర్వహించుటకు నియమింపబడిన యుద్యోగులందరును అవలంబించి, భారతదేశమున సుస్థిర మైన ఫ్రెంచి సామ్రాజ్యమును స్థాపించుటకు కారకులైరి. దేశీయుల యిష్టప్రకారము తాము నడుచుచున్నట్లుగా కనబడులాగునను తాము చేయు కార్యములు దేశీయుల క్షేమలాభముల కొఱకే చేయుచున్నట్లు తోచులాగునను, ప్రవర్తించుటయు రాజకీయ వ్యవహారములందు ఇతరులకే మాత్రము నొప్పి కలుగకుండా వ్యవహరించుచు తాము లాభము పొందుటయు మొదలైన చక్కని రాజ్యతంత్ర విధానములను లౌకిక పద్ధతులను ఫ్రెంచివారు అవలంబించుటకు పునాదులు వేసినది మార్టినుగారే.

మార్టినుగారి చాకచక్యము, లౌక్యము వ్యవహారదక్షత - వీనివలననే పాండుచేరీ పట్టణము యొక్క అభివృద్ధి చుట్టుప్రక్కల రాజులకుగాని పరిపాలకులకుగాని కన్నెఱ్ఱగా లేకుండునట్లు చాలా నిదానముగా జరిగెను. పాండుచేరీ కోటబురుజులపైననెలకొల్పిన పిరంగులు దేశీయ ప్రభువుల యధికారమును ధిక్కరించుటకుగాక, ఫ్రెంచివారికి పోటీగా నీ దేశములో విజృంభించుచున్న ఇతర పాశ్చాత్య జాతి శత్రువులనుండి తమను కాపాడుకొనుటకేనెలకొల్పబడినట్లుగా నెంచబడెను. చుట్టుప్రక్కలగల రాజులు గాని నవాబులుగాని పాండుచేరి పట్టణమునుచూచుటకువచ్చినచో ఇతడెందులకు వచ్చెనాయని మొగములు ముడుచుకొని ముభావముగా ప్రవర్తింపక వారి నాహ్వానించి, మర్యాదచేసి అన్ని ప్రక్కలనుగల విశేషములను చూపించి, ఇంకను కొన్నాళ్లుండుడని బలవంతము చేయుచు వారిని గౌరవించి, సాగనంపుచుండిరి. పొరబాటుననైనను ఈ దేశీయులు తమకు విరోధులను భావమును ప్రకటింపక చాలా స్నేహభావమునే ప్రకటించుచుండిరి. ఈ రాజులును నవాబులును ఈ దేశాధీశులనియు, తాము వారికి శిస్తులు పన్నులు

చెల్లించు రహితులమేయనియు ఫ్రెంచివారు చెప్పుచుండిరి. తాము వారి క్షేమమును కోరువారైనట్లుగా చాలా అడకువతో ప్రవర్తించుచుండిరి. ఇట్లెవ్వరికిని అనుమానము కలుగని విధముగా ఫ్రెంచివారు పాండుచేరీలో నభివృద్ధిగాంచుచుండిరి.

## దేశీయుల ఆదరం

చుట్టు ప్రక్కలనున్న బలవంతులైన రాజులును నవాబులును గొప్ప ప్రభువులును తరచుగా పాండుచేరికివచ్చి ఫ్రెంచివారి యాతిథ్యమును పొందుచుండిరి. వీరలలో తమకు తగవులువచ్చినప్పుడు వారు ఫ్రెంచి గవర్నరుగారిని మధ్యవర్తిగా నుంచుకొని ఆయన పరిష్కారము నంగీకరించుచుండుట కూడా కొన్ని సందర్భములలో జరిగెను. ఇట్లు ఫ్రెంచివారి పలుకుబడి క్రమక్రమముగా వృద్ధిచెందెను, దేశీయులు ఫ్రెంచి వారిపట్ల చాలా సహనము, స్నేహభావము కలిగియుండుటయే గాక వారియందు గౌరవభావము కూడా కలిగియుండిరి. భారతదేశమున వ్యాపారము చేసికొనుటకు వచ్చిన పాశ్చాత్యజాతులవారిలో ఫ్రెంచి వారిపైన మాత్రమే మన దేశీయులు నిజమైన సానుభూతిని కలిగియుండిరనుటలో నతిశయోక్తి లేదు. ఇది కేవలము పైపైన ప్రకటించుమర్యాదగాక త్రికరణశుద్ధిగా నేర్పడియున్నదే యని తరువాత జరిగిన చారిత్రక సంఘటనలవలన రుజువైనది. దీని కంతకును కారణము మార్టిన్‌గారువేసిన గట్టి పునాదులే. ఔరంగజేబు చక్రవర్తి క్రీ.శ.1707లో చనిపోవగనే ఉత్తర భారతదేశమందే గాక దక్షిణాపథమునందు కూడా రాజకీయ కల్లోలములు ప్రారంభమయ్యెను. ఢిల్లీ సింహాసనము కొఱకాయన వారసులు తగవులాడుకొనజొచ్చిరి. ఢిల్లీ దర్బారులోని గొప్పప్రభువులు రాజప్రతినిధులుగా తాము పరిపాలించుచుండిన వివిధరాష్ట్రములను తమ స్వంతములుగా చేసికొనుటకు ప్రయత్నింపసాగిరి. దేశములో శాంతిభద్రతలు క్రమపరిపాలనము నశించి అరాజకము ప్రబలెను. అయితే పాండుచేరిలో మాత్రము ప్రశాంతముగానుండి ఫ్రెంచివారును వారి యందను చేరినవారును అభివృద్ధి చెందుచుండిరి.

## నాటి కర్నాటకం

అప్పటికి కర్నాటక ప్రాంతము మొగలాయి చక్రవర్తిగారి రాజప్రతినిధియైన దక్కను సుబేదారునికి లోబడిన పరగణాగా నుండెను. దానిని దావూదుఖాను పరిపాలించుచుండెను. ఢిల్లీ దర్బారు వారాతనిని 1710లో ఉత్తరప్రాంతమునకు పంపి అతని స్థానమున సాదత్‌ఉల్లా ఖాన్ అను నాతనిని నియమించిరి. అతడు 1723 వఱకు



నీ ప్రాంతమును పరిపాలించి చనిపోయెను. అతనికి సంతానము లేదు. అతడు తన తమ్ముని కుమారుడైన దోస్తు ఆలీని దత్తుచేసికొనెను. అప్పటి దక్కను సుబేదారుడైన నిజాముల్‌ముల్కు ఢిల్లీ దర్బారులో చాలా పలుకుబడి కలిగిన ప్రభువుగా నుండెను. తన యధికారము కింద కర్నాటకమును పరిపాలించుచుండిన నవాబు తన అనుమతిని పొందకుండా దత్తతచేసికొనినందుల కాయనకు మనస్సులో కోపముండెను. దానికితోడు నిజాముల్ ముల్కుగారిని ఆశ్రయింపకుండ గనే దోస్తు అలీ తాను కర్నాటక నవాబునని ప్రకటించుకొని ఢిల్లీ దర్బారులోని వజీరులతో తిన్నగా నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నట్లు నిజాముల్‌ముల్కుగారికి తెలియగా ఆయన మండిపడెను. అంతట ఆయన యితనిపైన పగబట్టి అతని పదవిని మొగలాయి చక్రవర్తిగారు ఖాయపరపకుండా చేయుటయేగాక అంతవఱకును తన మొగమాటముచేత తన రాజ్యభాగముగా నెంచి కర్నాటకము పైన దండయాత్రలు చేయ కుండా యున్న మహారాష్ట్రులకు తాను దోస్తు అలీకి వ్యతిరేకుడనను భావము కలిగించుటతో మహారాష్ట్రులు కర్నాటకమును కొల్లగొట్టుట ప్రారంభించిరి. అంతట దోస్తుఅలీ తన రాజ్యమునందు నమ్రతగాను మర్యాదగాను స్నేహపాత్రులుగాను ఉన్న ఫ్రెంచి వారియొక్క సహాయమును పొందుట బ్రారంభించెను.

## 'నవాబ్' బిరుదు పొందిన డ్యూమాస్

మాన్సెర్ (మూసా) డ్యూమాస్ అనునతడు 1735లో పాండుచేరికి గవర్నరయ్యెను. ఆయన ఫ్రాన్సిస్ మార్టిన్‌గారి పద్ధతులతోనే వ్యవహారములన్నియు జరుపసాగెను. కర్నాటక నవాబైన దోస్తుఅలీ డ్యూమాస్‌గారితో చాలా స్నేహముగా నుండెను. మొగలాయి సామ్రాజ్యభాగములలో చలామణియగు నాణెము లన్నియు నాకాలమున ఢిల్లీ చక్రవర్తిపేరుతోనే ముద్రింపబడుచుండెను. ఆ నాణెములను పోతపోసి ముద్రించు టంకశాల ఇజారాను అంతకు ముందు కొంతకాలము క్రిందట ఇంగ్లీషు వర్తక కంపెనీవారు సంపాదించి కొన్నాళ్లు ఆ నాణెములను ముద్రించి ఆదియంత లాభకరముగా లేదని మానివేసిరి. ఆయిజారాను ఫ్రెంచివర్తక కంపెనీవారి కిప్పింపుడని డ్యూమాన్‌గారు కర్నాటక నవాబుగారినికోరి ఆయనద్వారా చక్రవర్తిగారికి దరఖాస్తు పెట్లుకొనిరి. ఆ యిజారాను వీరికే తప్పక ఇప్పించవలసినదని నవాబుగారు శిఫారసు చేసిరి. అంతట చక్రవర్తిగారా ఇజారాను ఫ్రెంచి వారికిచ్చుచు 1736 సంవత్సరాంతమున కర్నాటక నవాబుగారిపేరిట నొక ఫర్మానాను జారీచేసిరి. ఆ ప్రకారము మొగలాయి చక్రవర్తిగారి ముద్రయొక వైపునను రెండవ ప్రక్క ఆ నాణెమును ముద్రించిన ప్రదేశమైన పాండుచేరిపేరును గల వెండి

బంగారు నాణెములను ఫ్రెంచివారు పాండుచేరిలోని టంకసాలలో ముద్రింపసాగిరి. ఫ్రెంచివారు ముద్రించిన వెండిరూపాయి ఇంగ్లీషువారి షిల్లింగు అను నాణెముకన్న పెద్దదిగాను, దళసరిగాను, ఇంగ్లీషువారి దానికన్న నాణ్యముగాను ఉండెను. ఫ్రెంచివారు ముద్రించిన బంగారు వరహా ఇంగ్లీషువారి షిల్లింగులు తొమ్మిదింటికి సమానమైన విలువకలిగియుండెను. నూరువరహాలకు 320 రూపాయిల విలువ స్థిరపరుపబడెను. అందువలన ఫ్రెంచి రూపాయికి రెండు షిల్లింగుల తొమ్మిది పెన్నులు ఇంగ్లీషువారి చెలామణిలో విలువ కట్టుచుండిరి. తమ మిత్రులైన ఫ్రెంచివారు ముద్రించిన నాణెములను మన దేశీయులతి ప్రీతితో వాడుకొనసాగిరి. అందువలన ఆ చెలామణి విరివిగా వ్యాప్తిచెందెను. దాని ఫలితముగా ముద్దబంగారు వ్యాపారమొకటి అభివృద్ధిచెందెను. దీనివలన ఫ్రెంచివారికి చాలా లాభము కలిగెను. ఇంతేగాక సాలుకు ఏబది లేక అరువదిలక్షల రూపాయిల నాణెములు ముద్రింపబడుచుండుటవలన వారికి రెండు లక్షల రూపాయిలు లాభము వచ్చుచుండెను.

## మహారాష్ట్రులతో సంఘర్షణలు

దోస్తు అలీ మహారాష్ట్రులతో యుద్ధము చేయుచు 1739లో మరణించెను. ఆయన కుమారుడైన సఫ్దర్ అలీకి ఫ్రెంచివారితో తన తండ్రికున్నంత గొప్ప స్నేహము లేక పోయినను అతనికి వారియందు చాలా గౌరవముండెను. దోస్తు అలీగారి అల్లుడైన చందాసాహేబు మాత్రము ఫ్రెంచివారికి ప్రాణస్నేహితుడయ్యెను. అతడు తరచుగా పాండుచేరికి పోవుచు వారి యాతిథ్యమును పొంది వారితో చాలా చనవుగా నుండెను, ఫ్రెంచి యధికారులు చాలామంది చందా సాహేబు పట్ల అనురాగము కలిగియుండిరి. మహారాష్ట్రులతో యుద్ధము జరుగుచున్నప్పుడెటుపోయి ఎటుల వచ్చునోయని సఫ్దర్ అలీగారును చందాసాహేబుగారును తమ కుటుంబములను ధనకనక వస్తువాహనములను పాండుచేరికి పంపినచో తమకు క్షేమమని ఆలోచించిరి.

## డ్యూమాస్ కాపుదారీలు

ఫ్రెంచివారికి స్నేమితులను రక్షకులునగు కర్నాటక నవాబులకు మహారాష్ట్రులతో యుద్ధములు తటస్థించినందువలన డ్యూమాస్ తగు జాగ్రత్తలో నుండుట మంచిదనితలచి, పాండుచేరి కోట గోడలను గట్టిచేసి వాని బురుజుల పైన ఫిరంగులను సరియైన స్థితిలో నుంచి తగు బందోబస్తుతో నుండెను. పట్టణము ముట్టడింపబడినచో లోపలి జనమునకు



ఆహార పదార్థములు కొఱత లేకుండునట్లు చేయదలచి దానిని సేకరించి యుంచదలచెను. అంతట పదునైదు దినములు రాత్రింబవళ్లు రకరకముల సరకులతో ఎడ్లబండ్లు పట్టణములోనికి వచ్చుచుండెను. ఆ సమయమున చుట్టుపట్లగల దేశీయ ప్రజలుకూడా తమ మూటముల్లెలను సర్దుకని తమ సామానులతో పట్టణములోనికి వచ్చి తలదాచకొనసాగిరి.

ఇట్టి పరిస్థితులలో పైన చెప్పిన యుద్ధము జరిగిన ఐదు దినములకు ఇంకను పట్టణములోనికి సరుకుల బండ్లుదిగుచుండగానే 1740 మేనెల 25వ తేదీన చనిపోయిన నవాబు దోస్తుఅలీగారి భార్య, ఏనుగులు, ఒంటెలు, బండ్లు పరివార జనముతోను, తన జవాహిరీ ధనకనక వస్తు వాహనముల తోను, పిల్లతోను, ఒక పెద్దయాశ్విక దళమువెంటరాగా, పాండుచేరి పట్టణపు ఆవరణగోడల వెలుపల సరిహద్దు దగ్గరకు వచ్చి తనను లోపలికి రానివ్వవలసినదని ఫ్రెంచి గవర్నరైన డ్యూమాస్ గారికి కబురంపెను.

## ఆశ్రిత రక్షణ

కర్నాటక నవాబుగారి ధనకనక వస్తువాహనములతో ఆమె యిట్లు పాండుచేరికి వచ్చినట్లు తెలిసినచో యుద్ధము చేయుచున్న మహారాష్ట్రులు తమపైకి వచ్చి పడుదురని డ్యూమాస్‌గా రెఱుగుదురు. అయితే ఒక యాడుది అందులో గొప్ప యింటి స్త్రీ వచ్చి తనను రక్షింపుమని శరణు వేడుచున్నప్పుడు తాను సహాయము చేయక నిరాకరించుట వీర పురుషోచితలక్షణము కాదనియు, ఈ సంగతి వెల్లడియైనచో తాను పిరికిపందయని చుట్టు ప్రక్కలవారే గాక హిందూ దేశములోని వారెల్లరు కూడా తనను నిందింతురనియు, ఫ్రెంచివారి యెడల అదివరకుండిన గౌరవము నశించుననియుకూడా ఇతడెఱుగును. ఇంతే గాక కర్నాటక నవాబు దోస్తు అలీగారి కుమారుడైన సఫ్దర్ అలీగారి బలమింకను నశింపలేదు. అతనిని మహారాష్ట్ర లోడింపలేదు. అతడు కర్నాటక నవాబుగానే యున్నాడు. తన తల్లి వచ్చి ప్రాధేయపడి యడిగినను ఫ్రెంచివారు సహాయము చేయలేదని అతనికి తెలిసినచో అతనికి తప్పక కోపము వచ్చును. డ్యూమాస్‌గా రీ విషయములన్నిటిని ఆలోచించిరి. అయితే ఈ గొప్ప బాధ్యతను తానొక్కడే వహించుటకన్న తన కార్యాలోచన సభ్యులతోకూడా ఆలోచించి కర్తవ్యనిర్ణయమును చేసి ఆమెకు సహాయము చేయుటమంచిదని అతడు నిశ్చయించెను. అతడంతట వారికి నచ్చచెప్పగా వారును ఆయన యుద్దేశమున కనుగుణముగా దోస్త అలీగారి భార్యను లోపలికి రానిచ్చి తోడ్పడుటయే యుక్తమని తీర్మానించిరి.

అంతట దోస్తు అలీగారి భార్యను, ఆమె పరివారజనమును పాండుచేరి పట్టణములోనికి గౌరవ పురస్సరముగా ప్రవేశపెట్టిరి. పట్టణములోని ఫ్రెంచి సైనికు లందరును బారులు తీర్చిపట్టణ రక్షణము కొఱకు మధ్యమధ్య ఎత్తుగా నిర్మింపబడిన దిబ్బలు లేక ఫిరంగి మోర్చాలవద్ద తుపాకులు మొదలైన ఆయుధములతో నిలిచిరి.

## స్వాగతసత్కారం

బంగారు జలతారు జాలరులు గల ఒక అందమైన పల్లకీలో గవర్నరు జనరలుగారు కూర్చుండి తన యంగరక్షకుల దళములో జేరిన గుఱ్ఱపు రౌతులును కాల్బలమును వెంట రాగా వల్దావరు ద్వారమువైపునకు ఊరేగింపుతో తరలి వెళ్ళిరి. అప్పుడా ద్వార కవాటములను తెరచిరి. తక్షణమే దోస్తు అలీ నవాబుగారి భార్యను, ఆమె కొమార్తెలును, బంధుజనమును గల ఇరువదిరెండు పల్లకులును, పదునైదువందల యాశ్వికదళమును, ఎనిమిది యేనుగులు, మూడువందల లొట్టిపిట్టలు, రెండువందల ఎడ్లబండ్లు రెండ్రప్రక్కల వ్రేలాడు కంట్ల పెరికములను సంచులజతలతో సరుకులు మోయు రెండు వేల గిత్తలు, కంచరిగాడిదలు మొదలైన జంతువులు ధన కనక వస్తువాహనములు కలిగి యొక మహాప్రవాహమువలె పాండుచేరి నగరమున ప్రవేశించెను. ఇందులో ముఖ్యులైన వారి పల్లకులు లోపలికి ప్రవేశింపగానే వారి గౌరవార్థములు కోట బురుజులపైన నున్న ఫిరంగులను ప్రేల్చిరి. ఫ్రెంచి గవర్నరు జనరలైన డ్యూమాస్‌గారే స్వయముగా నవాబుగారి పట్టమహిషియైన ఆ వితంతువుకు స్వాగతమిచ్చి ఆమె పల్లకిని తీసికొని వారికొరకు ప్రత్యేకముగ సిద్ధపరచిన అందమైన బంగాళాలో దింపించిరి. చందాసాహేబుగారి భార్యయు కుమారుడునుకూడా ఇట్లే పాండుచేరికి రాగా వారికికూడా స్వాగతమిచ్చి తగిన వసతి చూపించిరి.

ఇంతలో మహారాష్ట్రులు అర్కాటును పట్టుకుని చుట్టుపట్ల గ్రామములను కొల్లపెట్టసాగిరి. అంతట సఫ్దర్ అలీగారికిని మహారాష్ట్రులకును సంధిమాటలు జరిగి తుదకు 1740 ఆగస్టునెలలో వారొక సంధి చేసి కొనిరి. దాని షరతులనుబట్టి సఫ్దర్ అలీ గారు మహారాష్ట్రులకు వాయిదాల ప్రకారమొకకోటి రూపాయిల నిచ్చుటకు మహారాష్ట్రులాయనకు కర్నాటక నవాబుగా అంగీకరించుటకును ఏర్పాటు జరిగెను. చందాసాహెబును తొలగించి అతను ఆక్రమించిన తిరుచినాపల్లి రాజ్యమును మఱల హిందూరాజుకిచ్చుటలో సఫ్దర్ అలీగారు మహారాష్ట్రులకు తోడ్పడునట్లు గూడా ఆ సంధిలో ఏర్పాటుచేసికొనిరి.



## వీరోచితవైఖరి

ఇంతలో మహారాష్ట్రులు వచ్చి తమకు కప్పము చెల్లింపుమని డ్యూమాస్‌గారిని కోరిరి. ఆయన అందుకు అంగీకరింపలేదు. చందాసాహేబుగారి భార్యను కొమారుని వారి ధనకనక వస్తువాహనములను తమకు వప్పగింపు డని మహారాష్ట్రులుకోరగా శరణువేడిన వారిని విడువమని కోరుట న్యాయముకాదనియు తనకు అవమాన కరమనియు డ్యూమాస్‌గారు బదులుచెప్పిరి. ఆ సందర్భమున డ్యూమాస్‌గారికిని మహారాష్ట్రుల సేనానాయకుడైన రఘోజీ భాన్‌స్లే గారికిని జరిగిన యుత్తర ప్రత్యుత్తరములు చాలా ఆహ్లాదకరముగా నుండెను. తనను శరణువేడి తలదాచుకున్న వారిని - అందు ముఖ్యముగా స్త్రీలను వారి ధనమును శత్రువులకు అప్పగించుట వీరపురుషలక్షణము కాదని వ్రాసి "నాస్థానమున మీరున్నచో మీరేమి చేయుదురు?" అని డ్యూమాస్ ప్రశ్నించెను.

## దేశీయుల తొలిపటాలం

మహారాష్ట్రులు తన పట్టణమును ముట్టడింతురని నిశ్చయించి డ్యూమాస్‌గారు సర్వసన్నాహములను చేసికొనిరి. ఆయన దగ్గరే 1200 మంది ఫ్రెంచి జాతి సైనికులుండిరి. ఆ పట్టణములోని నాలుగైవందలమంది మహమ్మదీయుల కతడు పాశ్చాత్య పద్ధతి కవాతు నేర్పి తుపాకులిచ్చి ఐరోపాజాతి సైనికులవలె క్రమశిక్షణము నొసగి వారిని సమర్థులగు శిపాయిలుగా తయారుచేసెను. తరవాత భారత దేశమునందు పాశ్చాత్య జాతులవారందరును తయారుచేసిన దేశీయ శిపాయిల పటాలముల కిది మాతృకయని చెప్పవచ్చును. డ్యూమాస్ గారిట్లు యుద్ధ ప్రయత్నములు చేయుచుండగా క్రొత్త కర్నాటక నవాబుగారైన సఫ్దర్ అలీగారు పాండుచేరికి వచ్చిరి. ఆయన తల్లిగారి కుటుంబమునకును ఫ్రెంచివారాశ్రయమిచ్చి సంరక్షించినందులకు తన కృతజ్ఞతను చూపుటకై వచ్చుచున్నానని ఆయన డ్యూమాస్‌గారికి కబురంపిరి. ఆయన తల్లిగారు ఒకసారి వచ్చి చూడవలసినదని ఆయనకు కబురంపియుండెను. అందువలననామెను చూచి డ్యూమాస్గారికి స్వయముగా వందనము లర్పించుటకై యతడిట్లు వచ్చెను. చందాసాహేబుగారి విషయమై సఫ్దర్ అలీ గారు మహారాష్ట్రులతో చేసికొన్న రహస్యసంధి సంగతి చందాసాహేబుగారికి తెలియదు. అందువలన సఫ్దర్ అలీ చందాసాహెబు గార్లు 1740 సంవత్సరము సెప్టెంబరు1వ తేదీ సాయంత్రము పాండుచేరికి వచ్చిరి. ఆ పట్టణము గోడ వెలుపల చక్కగా అలంకరించి, దీపములతో దేదీప్యమానముగా నున్న

ఒక ప్రత్యేక గుడారమునందు ద్యూమాస్‌గారు వారికి స్వయముగా స్వాగతమిచ్చి మర్యాదచేసిరి. అక్కడ కొంచెము సేపు విశ్రాంతి దీసికొనిన పిమ్మట సఫ్దర్ అలీగారిరి పట్టణ ఉద్యానవన మధ్యమందు వారి తల్లిగారును తోడపుట్టినవారును నివసించుచున్న చక్కని ఇంటిదగ్గరకు తీసికొని వెళ్ళి దిగబెట్టిరి. అక్కడ ఆయన రెండు దినములు తన తండ్రిగారు చనిపోయినందులకు దుఃఖసూచకముగా ఏకాంతవాసము చేసిరి. తరువాత సెప్టెంబరు నాలుగవ తేదీన ఆయన తననవాబు హోదాకు ఉచితములైన రాజలాంచనములతో ద్యూమాస్‌గారిని దర్శించుటకు వెళ్లెను. ఆపద సమయమున ఆదుకొని తన తండ్రిగారి కుటుంబముపట్ల గౌరవము చూసి ఆతిథ్య మిచ్చినందులకు ద్యూమాస్‌గారిని మతిమతి పొగడి వందనము లర్పించి, తానీయుపకారము నెన్నటికిని మఱచిపోవననియు కర్నాటక రాజ్యమునందు తనకెంత యధికారమున్నదో ఫ్రెంచివారికి కూడా ఇకముందు అంత యధికార ముండగలదనియు నవాబులకు అనుగ్రహము వచ్చినప్పుడు పలుకు మర్యాద మాటలనాయన చెప్పెను. అయితే తాను ఫ్రెంచివారిపట్ల చూపదలచిన అనుగ్రహమును మాటలతోగాక ప్రత్యక్షముగా నుండుటకు గాను పాండుచేరికి దక్షిణమున అంటియున్న కొంత రాజ్యభాగము - సాలుకు పదివేల నవరసుల ఆదాయము వచ్చునట్టిది, ద్యూమాస్‌గారికి జాగీరుగానిచ్చుచు సఫ్దర్ అలీగారొక పట్టాను ఆయన పేర వ్రాసి యిచ్చెను. కొలది దినములలోనే ఈ పట్టాను ధ్రువపరచుచు ఢిల్లీ దర్బారునుండి యొక ఫర్మానా వచ్చెను.

సఫ్దర్ అలీగారును వారి కుటుంబము వారును కొన్నాళ్లు పాండుచేరిలో సుఖముగా నుండి ఆర్కాటునకు వెడలిపోయిరి. చందాసాహేబుగారు మాత్రము తనకుటుంబమును జవాహిరిని పాండుచేరిలోని యుంచి తాను తిరుచునాపల్లికి తిరిగిపోయెను. తరువాత చందాసాహేబుగారిని మహారాష్ట్రులు పట్టుకుని సాతారాలో ఖైదుచేసి యుంచిరి.

## సాతారాతో రాజీ

మహారాష్ట్రుల సేనాధిపతియైన రఘోజీ, ఆప్రాంతమునెల్ల కొల్లబెట్టుచు పాండుచేరికి పండ్రెండుమైళ్ళ దూరమునగల ఇంగ్లీషువారి వర్తకస్థానమైన గూడలూరును కూడా కొల్లగొట్టెను. అటుపిమ్మట రఘోజీ భాన్‌స్లే పాండుచేరిపైకివచ్చి పట్టణమున కైదుమైళ్ల దూరములో విడిసి ద్యూమాస్‌గారికి బెదిరింపు జాబులను వ్రాయసాగెను. అయితే ద్యూమాస్ గారీ బెదిరింపుల కెంతమాత్రము లొంగక కప్పము చెల్లించుటకు నిరాకరించిరి. అయితే



ఆయన ఒక చిత్రమైన పనిచేసెను. రఘోజీగారి రాయబారికి బహుమానముగా లికర్సు (Liquors) అనబడుఫ్రెంచి సారాయి సీసాలను పదింటి నిచ్చి అవి ద్రాక్షాసవమువంటి మధుర పానీయము లని చెప్పెను. ఆరాయబారి అందులో కొన్ని సీసాలను రఘోజీగారి కివ్వగా నాయన వానిని తనభార్య కొసగెను. ఆమె దానిని రుచి చూచి అవి చాలా బాగున్న వనియు మరికొన్ని సీసాల నేదోవిధముగాను సంపాదించి ఇవ్వవలసిన దనియు భర్తను బాధింప సాగెను. అతడు ఫ్రెంచివారితో జరుపు రాయబారములమధ్య ఈ సంగతి వారికి చూచాయగా తెలుపగా వారాయనకు ముప్పది సీసాలను బహుమానముగా నిచ్చిరి. అప్పుడు రఘోజీ భాన్‌స్లేగారు చందాసాహేబు కుటుంబమును ధనమును తనవశము చేయమనియు తనకు కప్పము చెల్లించవలసిన దనియు అదివరకు చేయుచుండిన ఒత్తిడిని మాని తన సైన్యమును తీసికొని వెనుకకు మరలిపోయెను.

## ద్యూమాస్‌కు బిరుదులు

అంతట దేశములో నన్ని ప్రాంతముల నుండియు ద్యూమాస్ గారికి అభినందనములు రాసాగెను. అతనినెల్లరు నొక మహావీరునిగా నెంచిరి. ఈ సంగతి తెలియగానే దక్కను సుబేదారుడైన నిజాముల్ ముల్కుగారు కూడా ద్యూమాస్‌గారికి చాలా మర్యాద వాచకములతో నొక లేఖను వ్రాసి వందన సమర్పణము చేయుటయే గాక తన అనుగ్రహమును సూచించుటకు విలువగల దుస్తులను బహుమానమంపెను. సఫ్దర్ అలీగారు తనతండ్రి ధరించుచుండిన బంగారు తొడపుగలిగి వజ్రములు పొదిగిన ఒక కవచమును ద్యూమాస్గారికి బహుమతిగా పంపుటయే గాక మూడు ఏనుగులను వజ్రములు పొదిగిన బంగారు పిడులుగల కొన్ని కరవాలములను ఇతర ఆయుధములను బహుమానముగా నిచ్చి గౌరవపురస్సరముగా నొక లేఖను వ్రాసి తన ముఖ్యమంత్రి ద్వారా పంపించెను. ద్యూమాస్‌గారిట్లు మహారాష్ట్రులను ప్రతిఘటించిరను సంగతిని విని ఢిల్లీ చక్రవర్తిగారు ఆయనకు నవాబు అను బిరుదు నొసగి 4500 గుఱ్ఱపుదళమునకు అధికారముగల మన్సబుదారి యుద్యోగము నొసగి, దేశములో యుద్ధములేక శాంతముగా నున్నప్పుడు కూడా ఎట్టి వ్యయమును భరింపనక్కరలేకుండా రెండువేల గుఱ్ఱపుదళము నుంచుకొనునట్లు అనుగ్రహించిరి. ఈ నవాబు బిరుదును మన్సబుదారీ హోదాయును తన తదనంతరము పాండుచేరి గవర్నరుగానుండు ఫ్రెంచి అధికారులకు కూడా ఉండునట్లు అనుగ్రహింపవలసినదని ద్యూమాస్‌గారు వేడుకొనగా చక్రవర్తిగా రట్లేయని అంగీకరించిరి. ఈ గౌరవములను పొందుటకు ముందు కొలది దినముల క్రిందటనే తాను కొలువు

చాలించుకొని తన దేశమునకు మరలిపోవుటకు నిశ్చయించి డ్యూమాస్‌గారు ఫ్రాన్సుదేశములోని కంపెనీ యధికారులకు తెలిపియుండిరి. అంతట వారీయన స్థానమున జోసెఫ్ ఫ్రాన్సిస్ డూప్లే గారిని గవర్నరుగా నియమించిరి. అతడు 1741 అక్టోబరు నెలలో నీక్రొత్తపదవిని, హెూదాలను స్వీకరించెను.

## మార్టిన్ అడుగు జాడలలో

డ్యూమాస్‌గారు గవర్నరు జనరలుగా నుండి పరిపాలించిన ఆరుసంవత్సరములలో పూర్వము ఫ్రాన్సిస్ మార్టిన్‌గారు అవలంబించిన సౌమ్యపద్ధతులనే అవలంబించి దేశీయుల ప్రేమకును గౌరవమునకును పాత్రుడయ్యెను. దేశీయుల స్వభావమును చిత్తవృత్తులను అతడు చక్కగా గ్రహించి వారి కిష్టముగా ప్రవర్తించు మార్గముల నెరిగి దానివలన లాభమును పూర్తిగా పొందగలుగుచుండెను. అతని పరిపాలన కాలమునం దతనితో స్నేహముచేసిన వారి కందరకును అపజయముకలిగినప్పటికిని గూడా ఆ పరిస్థితులలో నెట్టి యన్యాయము చేయకుండగనే ఫ్రెంచివారికి అతడేదో విధముగా కొంత లాభమును సంపాదింప గలుగుచుండెను. అతని బుద్ధికుశలతలోని చిత్రమేమనగా పాండుచేరి దగ్గర చుట్టునుగల దేశము కొంత సంపాదించిన బాగుండునని అతడెంతో ఆత్రము చెందు చుండినను, దాని కొఱకత డెవ్వరిపైనను యుద్ధముచేసి దేశాక్రమణము చేయకుండాను తనకు దాని నివ్వవలసినదని ఎవ్వరిని ప్రాధేయపడి అడుగకుండాను, ఆరాజ్యభాగము నతడు సంపాదింపగలిగెను. పైగా దాని నతడు పరిగ్రహించుటయే యొక మహాభాగ్యముగా నెంచుబడు పరిస్థితులలో దానిని సంపాదింపగలిగెను!

డ్యూమాస్‌గారి హయాములో కోరమండల తీరమునందు ఫ్రెంచివారి రాజ్యము విస్తరించెను. దేశీయుల దృష్టిలో ఫ్రెంచివారి గౌరవము ఇనుమడించెను. తరవాత నీ చరిత్రమును సమీక్షించినారికి కూడా ఆశ్చర్యము కలుగునట్టి విధముగా ఫ్రెంచి వారి గౌరవము అభివృద్ధిచెందెను. డ్యూమాస్ గారు పాండుచేరి వదలి వెళ్ళునప్పటికి ఆయన తరువాత వచ్చిన అధికారి పాండుచేరిని దక్షిణాపథమునందెల్ల బలవంతమైన నగరముగా చేయుటకు డ్యూమాస్‌గారి వలెనే జాగ్రత్తతోను ఒడుపుగాను లౌక్యముగాను ప్రవర్తించుట తప్ప వేరేమియు చేయవలసిన పని లేదని ఆయన జూపిన మార్గమువల్లనే విదితమగుచుండెను. అన్నిటికంటె గొప్ప విశేషము డూమాస్ గారి దేశభక్తియు తనకు వచ్చిన బిరుదులను తరువాత వచ్చిన గవర్నరు జనరల్ గారికి ఇవ్వమని కోరుట.



## డూప్లే

జోసెఫ్ ఫ్రాన్సిస్ డూప్లే ఫ్రాన్సుదేశమున ఫ్లాండర్సు రాష్ట్రములోని లాండ్రెసిన్ అనునొక యూరిలో 1697వ సంవత్సరమున జన్మించెను. అతడు పన్నులు వసూలుచేయు ఒకపెద్ద యుద్యోగి కుమారుడు. అతని తండ్రి ఫ్రెంచి తూర్పుఇండియా వర్తక కంపెనీ డైరక్టర్లలో నొకడు. డూప్లేగారికి చిన్నప్పుడు గణితశాస్త్రమునందును ఇతర విజ్ఞానశాస్త్రములందును అభిరుచి యుండెను. అతని తండ్రిగారి కతనిని వర్తకమునందు ప్రవేశపెట్టవలెనని యుండెను. గాని నతని కది ఇష్టములేదు. అతని తండ్రి అతనినొక యోడపైన అట్లాంటిక్ హిందూ మహాసముద్రముపైన నౌకాయానము చేయుటకు పంపెను. అంతట వర్తకమన్న నతనికి గల రోత కొంత తగ్గెను.

అతని కిరువది మూడేండ్లు వచ్చునప్పటికి హిందూదేశమున ఫ్రెంచివారి నగరమైన పాండుచేరిలో రెండవ యుద్యోగిగా నియమించిరి. పాండుచేరిలోని సుపీరియర్ కౌన్సిలులోని మొదటి సభ్యునికి మిలిటరి కమీషనరని పేరు. డూప్లేగారు 1720లో తన క్రొత్త యుద్యోగమున ప్రవేశించిరి. అతడక్కడ తన యభిప్రాయముల నాచరణలో పెట్టుటకు ప్రయత్నించెను. అక్కడి యుద్యోగులు కేవలము పాండుచేరి నుండి ఐరోపాతో వ్యాపారము చేయుటలోనే నిమగ్నులై యుండిరి. పాండుచేరి నుండి తూర్పు సముద్రతీరమునగల ఇతర ప్రాంత ములతోను, ఇంకను ఇతర దేశములలోని ప్రదేశములతోను వ్యాపారము సాగించినచో చాలా లాభకరముగా ఉండునని డూప్లే యభిప్రాయము. అతడు ఆ ప్రకారము స్వంత వ్యాపారమును ప్రారంభించి చాలా లాభము నార్జించెను. అతని ధైర్యసాహసములను చూచి ఇతరులు నట్లు చేసిరి. ఒక సారి అతనిపైన అధికారు లాగ్రహించి 1726లో అతనిని సస్పెండు చేసిరి. దానిని గురించి అతడు పైవారితో పోరాడిన పిమ్మట నాలుగేండ్ల కా యుత్తరువులు 1730లో రద్దుచేయబడెను. అంతట అతనిని వంగరాష్ట్రములో కలకత్తా దగ్గరనున్న ఫ్రెంచి వారి వర్తకస్థానమగు చంద్ర నగరమునందు "ఇంటెండెంట్"అను నుద్యోగమునందు నియమించిరి. అతడు ముప్పది లేక నలుబది యోడలను తయారుచేసి కోస్తా వర్తకమును ప్రారంభించెను. దీని ఫలితముగా చంద్రనగరమునందు వర్తక మభివృద్ధిచెంది ఆయూ రొక మహానగర మయ్యెను. అతడు చేసిన కృషిఫలితముగా చంద్రనగరమున రెండువేల ఇటుకరాతి భవంతులు నిర్మింపబడెను. అతడు చేసిన వ్యాపారమువలన నతని కమిత ధనము సమకూరెను. పాండు చేరిలో డ్యూమాను పదవిని విరమించుకొనగా అతనిని గవర్నరుగా నియమించిరి. అతడా పదవిని 1741 అక్టోబరులో స్వీకరించెను.

పాండుచేరిలో నుద్యోగములో చేరిన సంవత్సరారంభముననే డూప్లే తన కార్యాలోచన సభలోని సభ్యుడొకడు మరణించగా నాతని వితంతువైన మదాం విన్సియన్ అను నామెను పెండ్లియాడెను. ఆమె కప్పటికే ఆరుగురు పిల్లలుండిరి. అయితే ఆమె చాలా తెలివైనది. ఆమె హిందూదేశముననే పుట్టి పెరిగి విద్యనేర్చిన దగుటవలన నామెకీ దేశభాషలు వచ్చును. డూప్లేవంటి రాజ్య తంత్ర చతురునకు తగిన భార్యయని ఆమె అనిపించుకొన్నది. ఆమెకు దేశభాషలందు గల ప్రావీణ్యమును పురస్కరించుకుని డూప్లేగారు దేశీయప్రభువులతో జరుపు రహస్యపు టుత్తర ప్రత్యుత్తరములందామె సహాయమును పొందుచుండెను. ఆమెకూడా తన పనుల నతి సమర్థతతో నిర్వహించి ఆయన కెంతో సాయపడెను. ఆమె మార్షల్ అల్బర్టు అను నొక ఫ్రెంచి పౌరునికుమార్తె. ఆమె తల్లి డికాన్‌ట్రొ పోర్చుగీసు కుటుంబమువారి యింటి ఆడపడుచు.

పాండుచేరి నగరము చాలా అభివృద్ధి చెందినదనియు ఫ్రెంచివారి అధికార గౌరవముల నితరులు గమనించి అంగీకరించునట్లు చేయవలసిన తరుణ మాసన్నమైనదనియు డూప్లే నిశ్చయించెను. అంతట ఫ్రెంచి గవర్నరుజనరలుగా తనకు ఢిల్లీ చక్రవర్తిచే ప్రసాదింపబడిన బిరుదులను,హోదాలను డాబు దర్పములతో వహించి దర్బారు తీర్చుచు చుట్టుప్రక్కలగల చిన్నచిన్న పాళెగార్లు మొదలగు ప్రభువుల చేత మ్రొక్కించుకొనసాగెను. పాండుచేరిలో ఖర్చులు హెచ్చుగా నుండుటకు కారణములను విచారించి వానిని తగ్గించుటకు చర్యతీసుకొనెను. చిన్న యుద్యోగులందు వ్యాపించియున్న లంచగొండి తనమును నిర్మూలించెను. పాండుచేరి నగరమునకు గల రక్షణల నన్నిటిని చక్కబరచెను. దీనిని గూర్చి కంపెనీవారికి వివరముగా నివేదించెను. ఇట్లు అక్కడ వ్యవహారములను కొంత చక్కచేసి చంద్రనగరమున తననవాబు హోదాను బహిరంగముగా పొందుటకై వంగరాష్ట్రమునకు వెళ్ళెను. అక్కడ అమహోత్సవము నతివైభవముతో జరిగించి, అక్కడ హుగ్లీలో నున్న మొదలాయి గవర్నరును దర్శించుటకు నవాబుగా తనకు గల రాజలాంఛనములతో తరలి వెళ్ళెను. హుగ్లీ గవర్నరు హోదాకన్న డూప్లేగారి నవాబు హోదా గొప్పదని ఆ యధికారి యెఱుగును. అందువలన డూప్లేగారు తనను చూడవచ్చుటకు ముందుగా తానే ఆయనను దర్శించుట యుక్తమని తలచి అట్లు చేసెను. ఆవిధముగా డూప్లేగారి కొసగబడిన గౌరవమును మర్యాదయు అతడు వహించిన రాజలాంఛనములును దేశీయులలో డూప్లేగారి గొప్పతనమును ద్విగుణీకృత మొనరించెను. ఫ్రెంచివారినిన చాలా అనురాగముగల దేశీయుల కతనిపట్ల మఱింత స్నేహభావమును ప్రేమయు వర్ధిల్లెను.



డూప్లేగారు పాండుచేరికి తిరిగి వచ్చిన పిమ్మట పూర్వపు గవర్నరు జనరలు లెవ్వరును చూపని డాబు దర్పములను అతడు ప్రదర్శింపసాగెను. తానుకూడా మొగలాయి చక్రవర్తిగారి గొప్పయుద్యోగి ననియు తన హోదా చక్రవర్తిగారు ప్రసాదించినదనియు తన చుట్టు ప్రక్కల గల దేశీయరాజులును ప్రభువులును అనుకొనునట్లు ప్రవర్తించుట, డూప్లేగారు ప్రయోగించిన రాజ్యతంత్రము నందొక ప్రధానాంశముగ నుండెను. అందు వలన తన హోదాకు సంబంధించిన రాజలాంఛనములందును జరుగవలసిన మర్యాద లందును అవంతయైన లోపముండుట నాతడు సహింపకుండెను. అక్బరు చక్రవర్తి వంశీయులు ఢిల్లీ దర్బారుకు వేలకొలది మైళ్ల దూరమున పాండుచేరిలోనుండి ఆచక్రవర్తుల యధికారిగా దేశీయ ప్రజలవలన పొందతగిన గౌరవమర్యాదలను పొందుచు ఫ్రెంచి గవర్నరు జనరలుగా తన వర్తక వ్యాపారములందుగాని ఫ్రెంచి రాజుపట్ల చూపవలసిన భక్తియందు గాని ఎట్టి లోపమును లేకుండా ప్రవర్తింపగలిగెను. డూప్లే తన స్థానమునం దొక సర్వాధికారిగా నుండెను. తనకు గల బిరుదును, హోదాయు ఆ పదవికి మఱింత బలము చేకూర్చుట కుపయోగించెను. ఆ సమయమునందు ఫ్రెంచి తూర్పు ఇండియా వర్తక సంఘము వారు డూప్లేగారికి వ్యయములో సగము తగ్గించవలసిన దనియు పట్టణ రక్షణ నిర్మాణములకొరకును, కట్టడములకొరకును సొమ్ము వ్యయముచేయవలదనియు తాకీదునంపిరి. నిజముగా నా ప్రకారము జరిపినచో చాలా చిక్కులు కలిగెడివే. డూప్లే తన బుద్ధి కుశలత నుపయోగించి, ఇంగ్లాండుతో ఫ్రాన్స్‌కు యుద్ధము సంభవించు సూచనలు కనబడుచున్నందున నగర రక్షణకు కావలసిన కొన్ని బందోబస్తులను జేసెను. కంపెనీ ప్రభుత్వమునందు కనబడిన కొన్ని లోపలములను సవరించి అవినీతిని అణచెను. జీతములను కొంత తగ్గించెను. అక్కడి యుద్యోగులు తమ జీతములు తగ్గించి నందుల కతనిపైన అలుగక ఫ్రాన్సులోని కంపెనీ యధికారులపైననే గొణుగుకొనిరి.

డూప్లేగారికి 436 ఫ్రెంచిజాతి సైనికబలముండెను. ఫ్రెంచివారికి పోటిగానున్న ఇంగ్లీషువారివలన భయము కలుగునని తోచిన ఈ సమయమునందు పూర్వము దేశీయులపట్ల స్నేహముగా నుండు పద్ధతిని ఫ్రాన్సిస్ మార్టిన్‌గారు ప్రారంభింపగా తరువాత అధికారులు కూడా దానిని అవలంబించినందు వలన లాభము లిప్పుడు కనబడసాగెను. ఫ్రాన్సులోని కంపెనీవారు ఇక్కడ తమ రక్షణకొరకు అవసరమైన వ్యయముల కగు సొమ్మును మంజూరు చేయకపోగా తాము బలహీనులుగా నున్న పరిస్థితిని డూప్లేగారు గమనించి, మద్రాసులో ఇంగ్లీషు కంపెనీవారి గవర్నరైన మోర్సుగారు తమ పైన దండెత్తి రాకుండా కాపాడవలసినదని డూప్లేగారు పాండుచేరి ప్రాంతము నేలు కర్నాటక నవాబుల

స్థానమున 1743లో పరిపాలకుడుగావచ్చి అధికారము చెలాయించు చున్న అప్పటి మొగలాయి ప్రతినిధి యగు అన్వరుద్దీనుగారికి విన్నపము నంపెను. ఆ ప్రాంతములందు ఎవరు రాజ్యము చేయుచున్నను ఎవరు అధికారము వహించినను ఫ్రెంచిజాతి వారిపట్ల స్నేహభావము తోనే యుండిరి. ఇది కేవలము పైకి చూపించు మర్యాద గాక నిజముగా దేశీయుల హృదయమైన అనురాగమేనని తరువాత చాలాసారులురుజువైనది. సఫ్దర్ అలీ అనంతరము దక్కను సుబేదారుగారివలన కార్నటక నవాబు గిరి హెూదాను పొందిన అన్వరుద్దీను గారు పూర్వపు కర్నాటక నవాబుల రక్తసంబంధువు కాకపోయినను వారి రాజమర్యాదలను, పద్ధతులనే అవలంబించి వారివలెనే ఫ్రెంచి వారిపట్ల స్నేహభావమును చూపెను. ఈ అన్వరుద్దీనుగారు అంతకు పూర్వము శ్రీకాకుళముసర్కారులో ఫౌజుదారుగా నుండి ప్రజానురంజకుడయ్యెను. తానధికారము వహించియున్న కర్నాటక రాజ్యమున నున్న ఫ్రెంచివారిపైన దండెత్తుటవలన దేశశాంతికి భంగము కలుగుననియు దానికి తానెంతమాత్రము సహింపననియు ఇంగ్లీషు గవర్నరుగారికి స్పష్టముగా తెలియపరచెను. అంతట ఇంగ్లీషు గవర్నరు తన ప్రయత్నమును విరమించుకొనెను. ఇట్లు పాండుచేరి రక్షింపబడెను. ఇది తరువాత జరిగిన వృత్తాంతము. ఈలోపుగా జరిగిన సంగతి జూతము.

1741 నాటికి కర్నాటక మింకను మహారాష్ట్రుల దండయాత్రవలన కలిగిన నష్టము నుండి తేరుకొనలేదు. దేశములోని పంట భూములు నాశమైనందువలన ప్రజలు కఱవులో మునిగి బాధపడుచుండిరి. చందాసాహెబు సతారాలో ఖైదిగానుండెను. ఆయన బావమరది సఫ్దర్ అలీగారు తమ కివ్వవలసిన శిస్తులబాకీ వెంటనే చెల్లించవలసినదని ఆయనపై యధికారియైన దక్కను సుబేదారుడు ఒత్తిడిచేయుచుండెను. నిజమునకు కర్నాటక నవాబుకన్న అందలి ప్రజలు మతింత బాధపడుచుండిరి. వారి గ్రామములను మహారాష్ట్రులు దోచుకొని ఇండ్లు, వాకిండ్లు తగులబెట్టి పొలములను ధ్వంసము చేసియుండిరి. వారు తిండిలేక మలమల మాడుచుండిరి. సఫ్దర్ అలీ గారన్నో తన ధన కనక వస్తువాహనములను పాండుచేరిలో భద్రపరచుకొనియుండెను. దక్కను సుబేదారుకు చెల్లించవలసిన శిస్తు బాకిని చెల్లించుటకు తన దగ్గర సొమ్ము లేదని సఫ్దర్అలీ గారనుచున్నను ఆయన దగ్గర చాలా ధనముండెను. దక్కను సుబేదారుడును బాకిని చెల్లించవలసినదని కబురులంపుచు, ఒత్తిడి చేయుచుండెనేగాని సేననంపి దానిని బలవంతముగా వసూలుచేయుటకు ప్రయత్నింపలేదు. అందువలననే సఫ్దర్ అలీ గారిట్లు కాలహరణము చేయుచుండిరి. అయితే జాగ్రత్తకొఱకాయన తన ధనమును జవాహిరీని చెన్నపట్టణములో ఇంగ్లీషు వర్తక కంపెనీ వారికోటలో భద్రపరచుకొని తాను రాయచూరులో



మకాముచేసెను.

సఫ్దర్ అలీగారు ఫ్రెంచివారికి బదులు ఇంగ్లీషు వారిని ఆశ్రయించి రక్షణలు కోరుటకు కారణమాయన మంత్రియైన మీర్ అసద్‌గారి సలహా యని ఓర్మ్ అను ఆంగ్లేయ సేనాధిపతి - గ్రంథకర్త వ్రాసినాడు. మిర్ అసద్‌గారు చందాసాహెబుకు విరోధి. చందాసాహేబు ఫ్రెంచివారికి మిత్రుడుగా నున్నందున సఫ్దర్అలీగారి కతడట్లు సలహా నిచ్చెను. ఇంతలో క్లిష్టపరిస్థితులు కలిగెను. సఫ్దర్ అలీగారు వాయిదాల ప్రకారము మహారాష్ట్రుల కిచ్చుట కంగీకరించిన సొమ్మును చెల్లించుటకు సఫ్దర్అలీ తన సామంత ప్రభువులవలన చాలా సొమ్ము వసూలు చేయసాగెను. అందువలన ఆయన సామంతులును దర్బారులోని యుద్యోగులును ఆలోచించి సఫ్దర్ అలీగారి పైన దక్కను సుబేదారుగారికి అనుగ్రహము లేదను సంగతి నెఱిగినవారైనందున అతనిని పదచ్యుతుని చేసినను నిజాముల్ ముల్కు గారేమనరని తలచి వారందఱు నేకమై కుట్రలు చేయసాగిరి. సఫ్దర్ అలీగారి రెండవ బావమరది ముర్తిజాఅలీ కుట్రచేసి ముందుగా సఫ్దర్ అలీగారికి విషము పెట్టించెను. కాని అతడు దానితో చావలేదు. అంతట 1742వ సంవత్సరము సెప్టెంబరు 2వ తేదీన అతనిని పొడిచి చంపించి తానే కర్నాటక నవాబునని ప్రకటించుకొనెను. అంతట సఫ్దర్ అలీగారి అనుచరులు మహారాష్ట్ర సేనానాయకుడును తిరుచునాపల్లి పరిపాలకుడును అగు మురారిరావుగారి కీ అన్యాయమును గూర్చి మొఱపెట్టుకొనిరి. అతడప్పుడు కర్నాటక నవాబులు మహారాష్ట్రులకు చెల్లించవలసిన సొమ్ము తక్షణమే చెల్లింపనిచో దండయాత్ర చేయుదునని ముర్తిజాఅలీకి కబురంపెను. ముర్తిజాఅలీ భయపడి ఆడువేషముతో రాయవేలూరుకోటకు పారిపోయెను. సఫ్దర్ అలీగారి చిన్నపిల్లవాడు సయ్యద్‌మహమ్మదు ఖానుగారును అతని తల్లియు మద్రాసులోని ఇంగ్లీషువారి కోటలో నుండిరి. అప్పుడా కుర్రవానిని కర్నాటక నవాబుగా ప్రకటించిరి.

## చెన్నపురిపై డూప్లే కన్ను

కర్నాటక రాజ్యము రాజకీయకల్లోలమున కుతకుత ఉడుకుచుండెను. దేశములో నెచ్చట చూచినను అశాంతి, అల్లకల్లోలము ప్రబలియుండెను. ప్రతి సామంత ప్రభువును తానొక నవాబునని ప్రకటించుకొనసాగెను. ఈ దుస్థితి తెలిసికొని దక్కను సుబేదారుడైన నిజాముల్ ముల్కుగారు 1743వ సంవత్సరారంభమున ఎనుబదివేల గుఱ్ఱపు దళముతోను రెండులక్షల కాల్బలముతోను కర్నాటకమునకు తరలివచ్చిరి. అతడు రాగానే చేసిన పని చాలా విచిత్రమైనది. నవాబు అనుబిరుదువహించిన వారి నందఱిని కొఱడాలతో

కొట్టించెదనని ప్రకటన చేసెను. అంతట అక్కడి వారందఱును గడగడలాడిరి. నిజాముల్ ముల్కు ముఖ్యోద్యోగులలో నొకడైన ఖోజాఅబ్దుల్లాఖాను గారిని కర్నాటక రాష్ట్రపరిపాలనచేయుటకై నియోగించెను. నిజాముల్ ముల్కు తిరుచునాపల్లికి తరలిపోవగా మహారాష్ట్రు లాదుర్గమును వదలిపెట్టిరి. అంతట నతడు ఖోజాఅబ్దుల్లాఖానును తీసుకొని గోలకొండకు మఱలిపోయెను. అబ్దుల్లా ఖాను మఱల కర్నాటకమునకు బయలుదేరి రావలెనని అనుకొనుచుండగా అతని కెవరో విషప్రయోగముచేసిరి. అతడు తెల్లవారునప్పటికి చచ్చిపడియుండెను. అంతట దక్కను సుబేదారు అబ్దుల్లాకు బదులుగా అన్వరుద్దీన్ గారిని కర్నాటక రాజ్యమునకు తాత్కాలిక పరిపాలకునిగాను సఫ్దర్అలీగారి కుమారునికి సంరక్షకునిగాను నియమించిరి. అయితే కొన్ని నెలలలోనే ఆ బాలునొక వివాహమహోత్సవమునందు జరిగిన కల్లోలములో నెవరో వధించిరి. అప్పుడు అన్వరుద్దీనుగారు స్థిరముగా కర్నాటక నవాబుగా నియమింపబడిరి. ఈ అన్వరుద్దీనుగారినే పాండుచేరి గవర్నరు జనరలైన డూప్లేగారు పైనచెప్పిన విధముగా ఆంగ్లేయుల బారినుండి కాపాడవలసినదని ప్రార్థించినాడు. మొదటినుండియు ఫ్రెంచి వారికిని కర్నాటక నవాబులకును స్నేహముగానుండిన సంగతిని వివరించి మహారాష్ట్రులు కర్నాటకముపైన దండయాత్ర చేసి నప్పుడు నవాబుల కుటుంబములకుఫ్రెంచి వారాశ్రయమిచ్చి రక్షించి యుండిన సంగతిని జ్ఞప్తికిదెచ్చి ఫ్రెంచి వారెల్లప్పుడును అందరి తోను స్నేహముగానుండు వారనియు ఫ్రెంచి వారి గవర్నరు మొగలాయి చక్రవర్తిగారి యుద్యోగిగా కూడా ఉన్నాడనియు, ఫ్రెంచి వారు కర్నాటక నవాబుగారితో స్నేహముగా నున్నారనియు అట్టి వారిపైన ఈ సముద్రతీరమున ఫ్రెంచివారితో పోటీ వ్యాపారము చేయుచున్న ఇతర పాశ్చాత్యజాతి వారు దౌర్జన్యముచేసి నష్టపరుపకుండా రక్షించుట అన్వరుద్దీనుగారికి ధర్మమనియు చెప్పుచు ఫ్రెంచి గవర్నరు ఆయనను ప్రార్థించెను. అతడుచెప్పిన సంగతులను అతని ప్రార్థనమును న్యాయముగానున్నట్లు అన్వరుద్దీను గారికి తోచెను. ఈ తూర్పు సముద్రతీరమున వ్యాపారము చేసికొనుచున్న వివిధ పాశ్చాత్య జాతులవారు ఎవ్వరును ఇంతవరకు అధికారధిక్కారముచేయుటకు ప్రయత్నించియుండలేదు. అప్పటి కింకను దేశీయ సైనికులకన్న పాశ్చాత్య సైనికుల యాధిక్యము ఏ యుద్ధమునందును రుజువు కాలేదు. అందువల్ల అన్వరుద్దీనుగారు తన యధికారము క్రిందనున్న రాజ్యభాగము లందును దానికి లోబడిన ప్రాంతములందును శాంతి భద్రతలను కాపాడుట తన దర్మమని తలచుటలో వింతలేదు. ఇదియుగాక పాండుచేరి పట్టణములోని పాశ్చాత్యవర్తకులు వారి నేలుప్రభువులను తనపట్ల మర్యాదయు స్నేహభావమును చూపుచుండుటయు అతడు



గమనింపక పోలేదు. అందువలన అన్వరుద్దీను గారు తన అధికారము క్రిందనున్న సముద్రతీరమున జీవించుచున్న ఫ్రెంచివారిపైన ఇంగ్లీషువారు దౌర్జన్యముచేయుటను తానెంత మాత్రమును సహింపనని మద్రాసు గవర్నరు కొక రాయబారి ద్వారా కబురంపెను. అయితే ఈ విషయము తానెవరిపట్లనుపక్షపాతము వహింపదలపలేదనియు ఇకముందు ఇంగ్లీషు వారిపైన ఫ్రెంచివారు దౌర్జన్యముచేయ ప్రయత్నించినను కూడా తాను ఇట్లే వారిని నిషేధింతుననియు ఆయన తెలియపరచెను. ఇంగ్లీషు గవర్నరు మారు మాటాడక తన ప్రయత్నమును విరమించుకొనెను. ఫ్రెంచివారు ఆంగ్లేయులపైన దౌర్జన్యము చేయుటకు ప్రయత్నించిన సందర్భముకూడా తరువాత కొలది కాలములోనే తటస్థించెను. ఫ్రాన్సు దేశమునకును ఇంగ్లాండు దేశమునకును యుద్ధము జరుగుచున్న సందర్భములో తూర్పు సముద్రప్రాంతములను ఫ్రెంచి నౌకాదళాధికారిగా నియమింపబడిన మాన్సెర్ డిలా బోర్డినెయిన్గారు 1746లో కొన్ని యోడలతో నాగపట్టణము రేవు దగ్గరకువచ్చి అక్కడనున్న ఇంగ్లీషు నౌకలను అటకాయించి మద్రాసుపైన దండయాత్ర చేయదలచెను. అంతట మద్రాసు గవర్నరైన మోర్సుగారు అన్వరుద్దీనుగారు పూర్వము తమకు చేసిన వాగ్దానము ప్రకారము ఫ్రెంచివారు తమపైన దౌర్జన్యము చేయకుండా కాపాడవలసినదని అన్వరుద్దీనుగారిని కోరెను. అయితే అతడా నవాబుగారి నట్లు కోరుటలో ఈ తూర్పుదేశములందు ఆకాలమున ఆచారముగానున్న మర్యాదలను పాటింపక పాశ్చాత్యపద్ధతి ప్రకారమొక రాయబారిని పంపి వ్యవహారసరళిలో కోరెను. ఈగవర్నరు భారతదేశములో చాలాకాలము నుండియున్నవాడే. ఈ దేశములో నవాబులనుగాని గొప్ప ప్రభువులను గాని దర్శింపబోవువారు రిక్తహస్తములతో పోవరాదనియు వారు ఏవో కొన్ని బహుమానములతో పోయి అడుకువతో దర్శింపవలెననియు ఎఱుగనివాడు కాడు. ఈ ఆచారము నాంగ్లేయులు బాగుగా ఎఱిగియుండి మొన్న మొన్నటివరకును పాటించుచునే యుండిరి. అట్టి స్థితిలో ఆ కాలమున నీ మర్యాదను పాటింపకపోయినచో నది బుద్ధిపూర్వకముగా జరిగించిన అవమానముగా పరిగణింపబడితీరును. అయితే మద్రాసు గవర్నరు మోర్సుగారు తోడిపాశ్చాత్యునితో వ్యవహరించిన రీతిగా ఈ కర్నాటక నవాబుగారి దగ్గర కొక రాయబారిని రిక్తహస్తములతో పంపి అంతకు ముందు ఫ్రెంచివారికి రక్షణము నిచ్చినట్లే తమకు కూడా రక్షణము నొసగవలసినదని కోరెను. అయితే పూర్వ మా సందర్భమున నవాబుగారిని దర్శించిన ఫ్రెంచి రాయబారి ఎన్నో బహుమానములను తీసికొనివెళ్లి భక్తి పూర్వకముగా సమర్పించి అడకువతో ప్రవర్తించియుండెను. ఇప్పుడు మఱల ఇంగ్లీషు వారికన్న ముందుగానే ఫ్రెంచిప్రతినిధి నవాబుగారిని దర్శించి నజరులు

సమర్పించి తమ పోటిదారులైన ఇంగ్లీషు జాతివారు చేసిన అన్యాయములకు వారిని తగినట్లుగా బుద్ధిచెప్పి శిక్షించుట కనుమతింపవలసినదని ప్రార్థించెను. అందువలన ఇంగ్లీషు రాయబారి నవాబుగారిని దర్శించునప్పటి కాయన ఇంకను ఏమియు నిశ్చయించియుండులేదు. ఇంగ్లీషువారికి బుద్ధిచెప్పుటకు ఫ్రెంచివారు మద్రాసుపైన దండయాత్ర చేయదలచినట్లు వారాయనకు మనవిచేయగా అతడు వెంటనే తన అనుమతిని వారికి తెలుపలేదు. అయితే అట్లు చేయవలదని ప్రత్యక్షముగా నిషేధింపనులేదు.

ఇట్టి పరిస్థితులలో లాబొర్డినెయిస్ తన ఓడలతో మద్రాసును ముట్టడించె ననువార్త నవాబుగారికీ తెలిసెను. ఆయన ఆశ్చర్య పడిరి. అతడు ఫ్రెంచివారితో స్నేహముగా నున్నను తమ పోటీదారుల రాజ్యమును వారు ఆక్రమించుట ఆయన కిష్టములేదు. అందువలన నవాబుగారొక రాయబారిని, డూప్లేగారి దగ్గరకుపంపించి ఫ్రెంచివారు మద్రాసుపైన దండయాత్రచేయ తలపెట్టిన విషయము తన కాశ్చర్యము కలిగించిన దనియు ఆ చర్యవెంటనే విరమించవలసిన దనియు లేనిచో తానొక సైన్యమునంపి తన యాజ్ఞ నమలు జరిపెదననియు కబురంపిరి.

డూప్లేగారు భారతదేశ ప్రభువుల చిత్త వృత్తులను చక్కగా గ్రహించిన మేధావి. ఒక వంక మద్రాసుపైన దండయాత్రను చేయుటను విరమించుటయు నతని కిష్టములేదు. ఇంకొక వంక మొగలాయి చక్రవర్తిగారి యధికారియైన నవాబుగారి యాగ్రహమునకు గుతి యగుటయు ఇష్టములేదు. అంతట ఆయన దీర్ఘాలోచనముచేసెను. మదరాసు ఫ్రెంచివారి హస్తగతము గాకపోయినను, ఇంగ్లీషువారికి మాత్రమది లేకుండ చేయుటకై డూప్లే గారొక ఉపాయమునాలోచించిరి. ఆ పథకమున కనుగుణముగా చెన్నపట్టణమును ఇంగ్లీషువారు ఫ్రెంచివారికి వశపరచిన పిమ్మట దానిని నవాబుగారికే తామివ్వదలచితిమని అర్కాటులో నున్న తన ప్రతినిధిచేత నవాబుగారికి చెప్పించెను. డూప్లేగారి నిజోద్దేశము చెన్నపట్టణమును నేలమట్టముచేసి ఆంగ్లేయులకి ప్రాంతమున ఒక్క అంగుళము స్థలమైనలేకుండ చేయవలయుననియే. అందువలననే అతడు మద్రాసు నగరమునట్లు నేలమట్టముచేసిన పిమ్మట దానిని నవాబు కివ్వదలచెను. 21-9-1746వ తేదీన రాత్రి 8 గంటలకు ఒక ప్రత్యేక వార్తా హరుని ద్వారా తనకును నవాబుగారికిని జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములను గూర్చి లాబొర్డినెయిస్‌గారికి తెలియపరచి ఇంగ్లీషు వారు కొంత సొమ్మిచ్చెదమని చెప్పినప్పటికిని మద్రాసును విడిచిపెట్టుటకు అంగీకపింపవద్దని స్పష్టముగా హెచ్చరించెను. అట్లుచేసినచో నవాబుగారిని మోసగించినట్లగుననియు అందువలన అతనికి ఫ్రెంచివారిపైన ఆగ్రహము కలిగి వారి విరోధులతో చేరగలదనియు



కూడా డూప్లేగారు స్పష్టీకరించిరి.

లాబొర్డినెయిస్‌గారు ఇంగ్లీషు వారివలన కొంత లంచముపుచ్చుకొని తాను పట్టుకున్న చెన్నపట్టణమునకు ప్రతిఫలముగా ఫ్రెంచి వారికి కొంతమొత్తము నిచ్చునెడల దానిని వారికి తిరిగిఇచ్చుట కంగీకరించెను. అతనికి డూప్లే పైన అసూయ ప్రబలెను. అందువలననే అతడు డూప్లేతో విరోధించి అతని మాటలు వినకుండా వ్యతిరేకముగా ప్రవర్తింపసాగెను. మద్రాసు ఫ్రెంచివారివశమై అయిదువారములు గడచెను. దానిపైన నింకను ఫ్రెంచి బావుటా ఎగురుచుండెను. లాబొర్డినెయిస్‌గారికిని డూప్లేగారికిని సామరస్యము కురదలేదు. వీరి వాగ్వాదములు కపటనాటకములని నవాబుగారికి తోచెను. ఈ ఫ్రెంచి వారికి బుద్ధి చెప్పవలెనని అతడు నిశ్చయించెను. వారికి నాలుగైదు వందలమంది ఫ్రెంచి జాతి సైనికులును రెండు మూడువేలమంది దేశీయసిపాయిలు నున్నచో దానికి ఇరువది రెట్ల సైన్యమును తాను వారిపైకి పంపగలడు. అందువలన తన కుమారుడైన మఫౌజుకు పదివేల సైన్యమునిచ్చి ముందుగా పంపి మరియొక పెద్దసైన్యమును వారి వెనుకనే పోయి కలిసి కొనునట్లు తాకీదునంపెను. డూప్లేగారు మద్రాసుయొక్క రక్షణలనెల్ల ధ్వంసముచేసి గాని దానిని నవాబుగారి కిచ్చుట కిష్టము లేదు. అయితే మఫౌజుఖాన్‌గారి కండ్లయెదుటనే దాని రక్షణలను నాశనముచేయుట మంచిదికాదు. అందువలన ఫ్రెంచివారి క్షేమమునకు విరుద్ధముగా నవాబుగారికి లోబడి పోవుటకన్న ఆయన ఆగ్రహమునకు గుతియగుటయే మంచిదని తలచి అందులకు సాహసించెను. అందువలన నవాబుగారి సైన్యములను ముందుగా నెదిరింపక మదరాసును వదలక ఏదో విధముగా కాపాడవలసిన దని మద్రాసులోని ఫ్రెంచి సేనానియైన "డెస్ ప్రెనెసిల్"గారికి డూప్లేగారు కబురంపిరి. స్వసంరక్షణ కవసరమైన దానికన్న మఫౌజుగారి సేనపట్ల హెచ్చు ప్రతిఘటనము ప్రదర్శింపవదలనియు కూడా హెచ్చరించెను. అయితే మహౌజుఖానుగారే ముందుగా ఫ్రెంచి సేనలను మార్కొనినందువలన ఆయనతో యుద్ధము చేయవలసివచ్చెను. ఫ్రెంచి సేనాని నాలుగు వందలమందిని రెండు ఫిరంగి బండ్లను ఇచ్చిపంపెను. ఫ్రెంచివారి ఫిరంగి గుండ్ల వర్షమునకు మఫౌజుఖానుగారి దేశీయ సైనికులు నిలువలేకపోయిరి. వారు భయపడి తమ డబ్బా డవాలిలను సామానులను వదలిపెట్టి పారిపోవసాగిరి. వారిలో డెబ్బది మంది మరణించిరి. ఫ్రెంచిసేనలో నెవ్వరును చావలేదు. ఇంతలో మఫౌజుఖాను మద్రాసుపైన చాలా పట్టుదలతోనే దాడిచేయుచున్నట్లు డూప్లేగారు తెలిసికొని పార్డిస్ అను సేనాధిపతి క్రింద రెండువందల ముప్పది మంది ఫ్రెంచిజాతి సైనికులను ఏడువందల మంది దేశీయ సిపాయిలను మద్రాసులోని ఫ్రెంచి సైన్యమునకు సహాయముగా

పంపెను. మఫౌజుఖాను కిదితెలిసి ఆ చిన్న సైన్యమును అడయారు నదివద్ద అడ్డముకొట్టుటకు ప్రయత్నించెను.

అప్పుడు శాంతోముదగ్గర 1746 నవంబరు 5వ తేదీగ జరిగిన యుద్ధమునందు మఱల నవాబుగారి దేశీయసైన్యము ఫ్రెంచి వారి తుపాకిగుండ్ల వర్షము ఎదుట నిలువ లేకపోయెను. ఈ యుద్ధము భారతదేశచరిత్రలో చాలా ప్రాముఖ్యతవహించ తగినదని భారతదేశములోని ఫ్రెంచివారి చరిత్రను రచించిన కర్నల్ మలెసన్‌గారు (Mallesan) వ్రాసినారు. ఏనలగా పాశ్చాత్యవర్తకులు దేశీయ ప్రభువుల పైన తిరుగబడి వారితో యుద్ధము చేయుట కిదియే మొదలు. ఈ యుద్ధవిజయము అందఱికిని గుణపాఠము నేర్పినది. అందఱికిని మార్గదర్శియైనది. ఇదివఱకు కర్నాటక నవాబుగారి రాజ్యాధికారమును ధిక్కరించుట కెవ్వరును సాహసింపలేదు. ఫ్రెంచి వారు మొదటినుండియు వారికి లోబడి ప్రవర్తించుచుండిరే గాని పొరబాటుననైనను వ్యతిరేకించినవారుకారు. మార్టిన్, డ్యూమాస్‌డూప్లే గారందఱు ఇప్పటివఱకు ఇట్లే ప్రవర్తించిరి. తుదకు డూప్లేగారు నవాబుగారి ఆజ్ఞకు వ్యతిరేకముగా ప్రవర్తింప సాహసించినప్పుడు కూడా తుది దనుకనట్లుచేయవలసి వచ్చుననుకొనలేదు. ఈముట్టడి పూర్తియగు లోపుగా నేదో విధముగా నవాబుగారిని శాంత పరచవచ్చునను ఆశతోనే ఆయన అట్లు సాహసించియుండెను. గాని నవాబుగారి సైన్యమును యుద్ధభూమిపైన జయించగలుగుదుమను నాసతోకాదు. అయితే తలువని తలంపుగా నట్టి జయము చేకూరినది. నవాబు గారికి అణిగిమణిగి సేవకులుగా నుండువారొక్క క్షణములో నవాబుగారిని జయించి వారికన్న ఉన్నతస్థాయి లోనికి లేవగలిగిరి. శాంతము యుద్ధము నవాబుగారి యొక్కయు ఫ్రెంచివారి యొక్కయు ప్రభుత్వముల పరిస్థితిని తారుమారుచేసినవి.

## రాజ్యతంత్రం డూప్లే నమిలి ఉమిసిన ఉచ్చిష్టం!

భారతదేశమును పాశ్చాత్య రాజ్యములవారు జయించుట కిది మార్గదర్శియైనది. అప్పటికి డూప్లేగారికి విజయమువలన తాత్కాలికముగా కలిగిన చిక్కులు తీరినవి. ఫ్రెంచి వారిపైన నవాబుగారు నిష్కారణముగా కత్తికట్టి మద్రాసును ముట్టడించినందువలనను, ఫ్రెంచివారి చిన్నసైన్యమును అడ్డుకొట్టుటకు ప్రయత్నించినందువలనను ఫ్రెంచివారు మద్రాసును నవాబుగారికిచ్చి వేయవలసిన బాధ్యత డూప్లేగారికి తప్పిపోయినది. ఇంగ్లీషు వారు ఫ్రెంచివారికి కొంత ప్రతిఫలమిచ్చుపద్ధతిని మద్రాసును తిరిగి యిచ్చివేయుటకు లాబోర్డినెయిస్‌గారు చేసిన ఏర్పాటునకు డూప్లేగా రంగీకరించలేదు. లాబోర్డినెయిస్ గారు



వారితో నట్టియేర్పాటుకు అంగీకరింపనిచో ఎట్టి షరతులును లేకనే ఇంగ్లీషువారొకటి రెండు దినములలో మద్రాసును ఫ్రెంచివారికి వశపరచియుందురు. చెన్నపట్టణము రక్షణకుతగిన బందోబస్తులులేవు. మద్రాసును ఫ్రెంచివారు తమ భుజబలముచే జయించినందున అది తమకు హక్కుకల నగరమని డూప్లేగారు నిశ్చయించిరి.

నవాబుగారి సైన్యమోడిపోయినట్లు డూప్లేగారికి తెలియగానే ఆయన పార్డిన్ సేనాధిపతిని మద్రాసుకు సైనిక గవర్నరుగా నియమించెను. డెస్‌ప్రిమెన్సిల్ సివిలు ఉద్యోగియై నందువలన సైనికులపైన తగిన అధికారమును చెలాయింపజాలడు. మద్రాసు ఫ్రెంచి వారి రాజ్యభాగమని ప్రకటింపవలసినదనియు లాబోర్డినెయిస్‌గారు చేసిన ఏర్పాటులన్నియు రద్దు కాబడినవనియు అతడుత్తరువుచేసెను. ఫ్రెంచివారికి లోబడని ఇంగ్లీషువారు నాలుగు దినములలో నగరము విడిచిపోవచ్చుననిరి. మద్రాసులోని ఇంగ్లీషు వ్యాపారపు సరుకు లును, తిను బండారపు వస్తువులును గుఱ్ఱములు మొదలైన యుద్ధసాధనసామగ్రియు ఫ్రెంచివారి ఆస్తియని ప్రకటించెను. ఇంగ్లీషు జనులయొక్క స్వంత ఆస్తిని అమ్ముకొనవచ్చునుగాని వారు ఫ్రెంచిఆవారికి వ్యతిరేకముగా పనిచేయరాదు. మద్రాసు గవర్నరు మోర్సగారిని ఇతర యుద్యోగులను పాండుచేరికి రాజకీయ ఖైదీలుగా పంపిరి. అయితే వారిని చాలా గౌరవముగాను మర్యాదగాను చూచిరి. పాండుచేరికితెచ్చిన ఇంగ్లీషువారిలో క్లైవు మొదలైనవారు కొందరు పారిపోయి సెంట్‌డేవిడ్‌కోట చేరిరి. ఈ యింగ్లీషువారి నందరిని తూర్పు సముద్రతీరమునుండి తరిమివేయవలెనని డూప్లేగారి యూహ. అందువలన పార్డిస్ సేనాధిపతి ఆధిపత్యముక్రింద కొంత సైన్యము నిచ్చి సెంట్‌డేవిడ్ కోటపైకి పంపిరి. అప్పుడు కొన్ని చిల్లరయుద్ధములు జరిగెను. ఇంతలో ఫ్రెంచివారికి ఓడలనుండి కొంత క్రొత్త సైన్యము సహాయముగా వచ్చెను. అప్పుడు వారు ఆర్కాటువఱకు గల దేశమును కొల్లగొట్టసాగిరి. అంతట ఈ యుద్ధము త్వరలో అంతముకాదనియు దీనివలన లాభములేదనియు తనకు నష్టము కలుగుటయే గాక తన పరువు ప్రతిష్ఠలకు కూడా భంగము కలిగించుననియు అన్వరుద్దీనుగారికి తోచెను. ఇంతేగాక ఇంగ్లీషువారి కింత అవమానము జరుగుచుండగా వారి దేశీయులు వారికి తగిన సహాయముచేయకపోవుట చూడగా వారి కర్మమునకు వారిని వదిలిపెట్టినట్లు ఆయనకుతోచెను. ఇట్టి పరిస్థితిలో ఈ ఇంగ్లీషువారికి జరిగిన పరాభవముకొఱకు తానందులకు బాధపడవలెనని ఆ తరుణమున ఫ్రెంచి గవర్నరు గారు తన దగ్గరకుపంపిన రాయబారములకు అంగీకరించుటయే యుక్తమని ఆయనకు తోచినది. అందువలన అతడు మద్రాసును తనకు వప్పగించవలెనను షరతును నెరవేర్చవలసినదని అడుగుట

మానివేసి, ఫ్రెంచి వారాక్రమించిన ప్రదేశములను వారికి స్థిరపరచుట కంగీకరించెను. ఈ షరతులతో నవాబుగారికిని ఫ్రెంచివారికిని సంధిజరిగెను. 1747 ఫిబ్రవరి నెలాఖరున మఫౌజుఖాన్ గారు స్వయముగా పాండుచేరికి వచ్చిన డూప్లే గారిని దర్శించినప్పుడా సంధిషరతుల కతడు స్వయముగా అంగీకరించి సంతకముచేసెను.

డూప్లేగారు తలచుకొనినచో ఆ సమయమున ఇంగ్లీషువారిని రూపుమాపి యుండవచ్చును గాని ఈశ్వర సంకల్పము వలన ఆపని కాయన పూనుకొనలేదు. దీని ఫలితముగా నీ శత్రుశేషము క్రమక్రమముగా నభివృద్ధిచెంది తుదకు భారతదేశమున ఫ్రెంచి వారిని త్రోసి రాజని బ్రిటిషు సామ్రాజ్యమును స్థాపించుటకు కారణమయ్యెను. అటు తరువాత కొంత కాలమునకే ఇంగ్లీషువారు తేరుకుని పాండుచేరిని ముట్టడించిరి. అప్పుడు డూప్లేగారు చూపిన ధైర్యసాహసములు తెలివి తేటలు అప్రతిమానములగ నుండెను. పాండుచేరిని ఇంగ్లీషువారు పట్టుకొనలేక తుదకు 1748 అక్టోబరు 17వ తేదీన మరలిపోయిరి.

భారతదేశీయుల దృష్టిలో ఫ్రెంచివారి పరువు ప్రతిష్ఠలను పెంపొందించుటకు డూప్లేగారు ప్రతి సందర్భమునందును ప్రయత్నించుచుండిరి. ఇంగ్లీషువారు పాండుచేరి ముట్టడిని మాని వెనుదిరిగి పోయిన వెంటనే డూప్లేగారు దీనినిగూర్చి వన్నె చిన్నెలతో వర్ణించుచు దీని ఫలితములను వివరించుచు ఆర్కాటు నవాబుగారికి, హైదరాబాదులోని సుబేదారుగారికిని, ఢిల్లీ దర్బారు వారికిని కూడా వర్తమానము లంపిరి.

భారతదేశ సముద్రతీరమున దిగిన చాలా బలవంతమైన విజాతీయ శత్రుసైన్యము పాండుచేరి గోడల దగ్గర నిట్లు విచ్ఛిన్నము చేయబడినదని భారతదేశ ప్రభువులకు తెలుపుటవలన లాభమును డూప్లేగారు గ్రహించియే అట్లు చేసిరి – దానికి జవాబుగా ఆయా ప్రభువు లతనికి పంపిన ప్రత్యుత్తరములలో అతనికి చేకూరిన విజయమునకు వారు అతని నభినందించుటవలననే అతని దూరదృష్టి విదితమయ్యెను. ఇంగ్లీషు జాతివారు ఫ్రెంచివారికన్న తక్కువవారని వీరి బలము ఉడిగిపోయినదని దేశీయు లనుకొనసాగిరి. అంతవరకును భారతదేశమున నేపాశ్చాత్యజాతి నాయకునికి లేని గౌరవమును అధికారమును పలుకుబడియు డూప్లేగారికీ సంఘటనమువలన కలిగినది.

ఆంగ్లేయులు విఫల మనోరధులై ఫోర్టుసెంట్ డేవిడుకోటకు వెనుతిరిగి పోయిరి. డూప్లేగారన్నన్నో ఇంగ్లీష/వారిపైన విజృంభించి వారిపైన దండయాత్ర చేయదలచెను. 1749లో డూప్లేగారికి రెండువందలమంది క్రొత్త సైనికులు వచ్చి చేరిరి. ఇంతలో ఇంగ్లీషు వారికిని ఫ్రెంచిఅరికిని ఐరోపాలో ఎయిక్స్‌లా చాపెల్ సంధి పొసగెను. దీని ఫలితముగా



భారతదేశములో ఒకరి నుండి యొకరు లాగికొనిన ప్రదేశములను ఎవరివానిని వారికిచ్చి వేయవలసి వచ్చెను. ఆ ప్రకారము ఫ్రెంచి వారు మద్రాసును 1749 ఆగష్టు నెలలో ఇంగ్లీషు వారికి వదలివేసిరి.

డూప్లేగారు మొదటినుండియు చాలా దూరదృష్టితోను తెలివి తేటలతోను ప్రవర్తించుచుండినందు వలన ఆయనతో మాటలాడిన వారికిని ఆయనతో పరిచయము కలవారికిని ఆయన త్రికరణ శుద్ధిగా నీతిపరుడనియు ఉదారుడనియు, స్నేహ పాత్రుడనియు, తోచుచుండెను.

నిజాముల్ ముల్కు 1748లో చనిపోవగా ఆయన వారసులు దక్కను సుబేదారీ కొరకుతగవులాడుకొనజొచ్చిరి. ఆ సందర్భములో చందాసాహేబుగారి ప్రోత్సాహముతో నిజాముల్ ముల్కుగారి మనుమడైన ముజఫర్ జంగుగారు తాను కర్నాటక నవాబునని ప్రకటించుకొని దక్షిణ దేశమునకు తరలి వచ్చెను.

ముజఫర్ జంగు డూప్లేగారి ఆతిధ్యమును పొందుటకై పాండుచేరికి వచ్చెను. అటువంటి సమయములందు డాబు దర్పములను ప్రదర్శించుటవలన చాలా లాభము కలుగునని భారతదేశ రాజకీయములను దేశీయుల చిత్తవృత్తులను ఎరిగిన డూప్లేగారికి తెలియును. అప్పుడక్కడకు వచ్చిన అతిధుల మనస్సులలో నాటుకొనునట్లుగా డూప్లేగారు వారికి ఘనమైన స్వాగతమునిచ్చి గొప్పసమ్మానము చేసిరి. చాలా విలువగల అలంకారముల తోను రాజలాంఛనముల తోను వాద్యవిశేషములతోను ఆహ్వాన మహోత్సవమును జరిపి గౌరవించినచో తమ కింతటి గౌరవములు చేసిన ఈ విజాతీయులెంతో ధనవంతులును బలవంతులునై యుందురని దాక్షిణాత్య దేశీయ ప్రభువులనుకొని తమపట్ల గౌరవము కలిగియుందురని డూప్లేగారు దూరదృష్టితో నట్లుచేసిరి. త్వరలోనే దానిలాభమును పొందగలిగిరి.

దక్కను సుబేదారుడు నిండు దర్బారులో గౌరవించి కృష్ణానది మొదలు కన్యాకుమారి వఱకును గల విశాలరాజ్యమున కంతకును డూప్లేగారిని సర్వాధికారిగాచేసినను ఆయన తమ సహజమైన ఔదార్యముతో తాను పొందిన రాజ్యములోని విశేషభాగమును త్యజించి కేవలము గౌరవబిరుదులను మాత్రము స్వీకరించి కర్నాటక నవాబు పదవిని రాజ్యాధికారమును తన నాశ్రయించియున్న స్నేహితుడగు చందాసాహేబుగారి కిప్పించుటలోనే ఆయన గొప్పదనము వెల్లడియయ్యెను. దక్కను సుబేదారుడు తానెట్లు చెప్పిన అట్లు చేయుచు అన్ని యధికారములను తనచేతి కిచ్చినను డూప్లేగారు తన యధికారములను నిరంకుశముగా చెలాయింపక తానుకేవలము సలహాదారుగా

మాత్రమేయుండి అధికారనిర్వహణమెల్ల ఎప్పటివలెనే సుబేదారుగారి మంత్రులకును సామంతులకును వదలి పెట్టెను. అవసరమైనప్పుడు తన స్వంత సొమ్ములో వేలకొలది మొత్తములను తనతో స్నేహముచేసిన చందాసాహేబుగారికిచ్చెను. ఇతరులచేత కూడా ఇప్పించెను. ఫ్రెంచివారి ఖజానాలోనుండి కూడాతీసి సొమ్మిచ్చి సహాయముచేసెను.

దక్కను సుబేదారు లితరు లెవ్వరికిని ఒసగని అపూర్వమైన గౌరవబిరుదులనిచ్చి తనకు వశవర్తులైయున్నను డూప్లేగారు చొరవగా ముందుకువచ్చి తన గొప్పదనమును ప్రదర్శింపలేరు. ముజఫర్ జంగుగారు స్వయముగా తనకు చేయూతనొసగి దర్బారులో తనప్రక్కనున్న కుర్చీలో కూర్చుండవలసినదని బలవంతము చేసినగాని కూర్చుండలేదు. తన కింతగౌరవము, అధికారము కలిగినను డూప్లేగారు గర్వములేక అందరితోను ఆప్యాయముగాను స్నేహముగాను మాటలాడుచుండెను. అందరిని ఆదరించుచుండెను. అంతటి మంచివాడు స్నేహపాత్రుడు మఱియొకడు లేడని నవాబులు ప్రభువులు జనులుకూడా అనుకొనునట్లుగా ప్రవర్తించెను. వారందరు ఓహోయని మెచ్చుకొనసాగిరి. నిజమునకు ఆ సమయమున డూప్లేగారు దక్షిణాపథములో కిరీటములేని రాజాధిరాజుగానుండిరి. ఆయన మాటకు తిరుగులేక సర్వత్ర చెల్లుబడి అగుచుండెను. ఫ్రెంచి సైనికదళముతో పోరాడి నాజరుజంగు సైన్యము ఓడిపోయిన ప్రదేశమున డూప్లేగారి విజయము శాశ్వతముగా ప్రజలు తలచుకొనునట్లు "డూప్లే ఫత్తేబాద్"అనునొక పట్టణమును నిర్మించి అక్కడ నొక విజయస్తంభము నెత్తించెను. ఇట్టి విజయచిహ్నముల నుంచుటను గూర్చి ఆంగ్లేయ చరిత్రకారు లాయనను విమర్శించిరి గాని ఆ కాలమునాటి ఆచారమునే యతడి విషయమున పాటించి నాడనియు అత దది కేవలము తన స్వాతిశయమును ప్రకటించుట కొఱకుగాని గర్వోన్నతిని చూపుటకు గాని చేయలేదనియు కర్నల్ మలెసన్‌గారు తమ గ్రంథమున సమర్థించియున్నారు.

1751 నాటికి దక్షిణాపథమునందు ఫ్రెంచి వారి యధికారమును గౌరవమును మహోన్నతస్థితిని చెందినవి. దక్కనుసుబేదారు డైన సలాబతుజంగుఫ్రెంచివారి సహాయము వలననే హైదరాబాదు సింహాసనము నధిష్ఠింపగలిగెను. వారి సహాయముననే దానిని నిలుపుకొనగలగుచుండెను. అందువలన పాండుచేరి గవర్నరు జనరలుగారి నైతికమైన అధికారమును పలుకుబడియు దక్కను సుబేదారుగారి రాజ్యమందెల్ల వ్యాపించియుండెను.

ఒకమారు దక్షిణ హిందూదేశపటమును చూచినచో నిది యెంత వైశాల్యమైనదో తెలియగలదు. వింధ్య పర్వత పంక్తికిని, కృష్ణానది కిని మధ్య తరువాత కాలమున నిజాము రాజ్యమని పిలువబడు విశాలదేశముయొక్క పరిపాలనమెల్ల ఫ్రెంచివరి సేనానాయకుడైన



బుస్సీ దొరగా రెట్లు చెప్పిన యట్లు జరుగుచుండెను. ఫ్రెంచివారి సైనిక దళము దక్కను సుబేదారుని రాజధాని నగరమునందు స్థావరముగా నిలుపబడియుండెను. సుబేదారుగారి కార్యాలోచనమెల్ల ఫ్రెంచివారి సలహాతోనే జరుగుచుండెను. ఇక కృష్ణానదికి దక్షిణమున గల దేశమున కంతటికిని దక్కనుసు బేదారుగారు ఫ్రెంచి గవర్నరనే నవాబుగా చేసిరి. ఇందులో కర్నాటక రాజ్యమంతయు చేరియుండెను. మైసూరురాజ్యము, తంజావూరు, తిరుచునాపల్లి, కొచ్చిను, మధుర, తిరునల్వేలి పరగణాలు ఈ నవాబుగిరీకి లోబడి కప్పము చెల్లించు సామంత రాజ్యములుగా నుండెను. ఫ్రెంచి గవర్నరు జనరలుగారి కిష్టమైనచోనీ రాజ్యమునెల్ల స్వయముగా పరిపాలించుట కెట్టి యాటంకమును లేదు. అయితే తన సర్వాధికారములను అతడు నిగూఢముగా నుంచి దేశీయ ప్రభువులద్వారముననే పరిపాలనము జరుపుట యుక్తమని డూప్లేగారు చాలా దూరదృష్టితో నిర్ణయించి యున్నందున అతడు కర్నాటకమునకు తన స్నేహితుడైన చందా సాహేబుగారిని నవాబుగా నియమింపజేసి తాను కేవలము సలహాదారుగా నుండుటలో తృప్తిచెందియుండెను. అధికారము లెల్ల ఆ నవాబుగారు చెలాయించుచున్నట్లు పైకి కనబడినను నిజమున కవన్నియు డూప్లే గారి యిష్టప్రకారము చెలాయింప బడుచుండెను. అందువలన డూప్లేగారికి ఆరాజ్యపరిపాలన మందెల్ల పలుకుబడి యుండెను.

మొగలాయి సామ్రాజ్యపు కోట గోడలు విచ్ఛిన్నమై బోవుచున్న వనియు భారతదేశరాజకీయములందు ప్రవేశించి నవాబులలో నొకిరతో నొకరికిగల విరోధములను పురస్కరించుకొని వారిలో నొకరికి సహాయము చేయుచు పాశ్చాత్యవర్తకులు భారతదేశము నాక్రమించి సామ్రాజ్యమునే స్థాపింపవచ్చుననియు, క్రమశిక్షణముగల పాశ్చాత్య సైనికుల ముందు దేశీయసైన్యము లెంతమాత్రము నిలువజాలవనియు, దేశీయ సైనికులకు కూడా పాశ్చాత్య పద్ధతులపైన క్రమశిక్షణము నొసగినచో వారు మంచి సైనికులుగా పని చేయుదురనియు కొలదిమంది పాశ్చాత్యులను వారికి జతపరచి క్రమశిక్షణములేని పెద్దపెద్ద సైన్యములను సులభముగానోడింపవచ్చుననియు గ్రహించి భారతదేశమున పాశ్చాత్య సామ్రాజ్యస్థాపన మునకు దారిచూపిన మేధాశాలి డూప్లేగారే. తాము వెనుకనుండి భాగవతమునాడి తుదకు రాజ్యాధిపత్యము వహించుపద్ధతిని కనిపెట్టి నది కూడా డూప్లేగారే. అయితే ఈ మార్గముల ననుసరించి ఫ్రెంచివారు భారతదేశమునకు ప్రభువులు కాలేకపోగా ఆంగ్లేయులాపద్ధతులనే అనుసరించి దేశాధీశులైరి. దీనికి కారణము డూప్లేగారికిని భారతదేశములో పనిచేయు ఫ్రెంచి ఉద్యోగులకును ఫ్రాన్సు లోని అధికారులు తగిన సహాయముచేయక పోవుటయు ఫ్రెంచి రాజకీయనాయకులలోను ఉద్యోగులలోను

ఐకమత్యము లేక ఒండొరుల పైన మాత్సర్యమువహించి కుట్రలు పన్నుటవలన వ్యవహారములు చెడుటయు కారణములు. ఇంగ్లాండు ప్రభుత్వములోని వారట్లు గాక భారతదేశములోని కుంపినీ అధికారులకు ఉద్యోగులకు సేనాధిపతులకు తగిన సహాయముచేసి ప్రోత్సహించిరి. అందువలన త్వరలోనే ఫ్రెంచివారినిత్రోసి రాజని తమ సామ్రాజ్యమును స్థాపింపగలగిరి.

– *కృష్ణాపత్రిక, 13.12.1955, 20, 27, 1955, 3.1.1956*





# న్యాయమూర్తి సర్‌జాన్ పీటర్ గ్రాంటుగారు

గ్రాంటుగారు క్రీ.శ.1774వ సంవత్సరం సెప్టెంబరు21వ తేదీన జన్మించారు. ఆయన చాలా త్వరగానే విద్యాబుద్ధులు నేర్చి 1802లో బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణులైనారు. ఆయన 1812 మొదలు 1826 వరకు ఇంగ్లాండు పార్లమెంటుసభలో సభ్యుడుగా వుండి తెలివైనవాడని పేరుపొందాడు. అప్పుడు బొంబాయి సుప్రీముకోర్టు అనే పరమోన్నత న్యాయస్థానంలో ఒక న్యాయాధిపతి పదవి ఖాళీరాగా ఇంగ్లాండు ప్రభుత్వమంత్రి ఆ వుద్యోగాన్ని గ్రాంటుగారి కిచ్చి, సర్ అనే బిరుదుతో బొంబాయికి పంపించారు. గ్రాంటుగారు వచ్చేటప్పటికి సర్ ఎడ్వర్డు వెస్టుగారు బొంబాయి సుప్రీముకోర్టు ప్రధాన న్యాయమూర్తి. రెండవ న్యాయాధిపతి సర్ హార్కోర్టు ఛేంబర్సుగారు.

## అదాలతు కోర్టులు - సుప్రీంకోర్టు

ఆకాలంలో హిందూదేశం తూర్పు ఇండియా కంపెనీవారి పరిపాలనకింద వుండేది. ఈకంపెనీవారిపైన ఇంగ్లాండు పార్లిమెంటువారికి పై తనకీ అధికారంవుండేది. దేశంలో న్యాయపరిపాలన జరిగించడానికి కంపెనీ వారు జిల్లా కోర్టులను స్థాపించారు. వాటిపైన సివిలు వ్యవహారాలలో సదర్ దివానీ అదాలత్తులనే ఉన్నత న్యాయస్థానాలను, క్రిమినలు వ్యవహారాలలో నైజామత్ ఫౌజుదారీ అదాలత్తు లనే ఉన్నత న్యాయస్థానాలను స్థాపించారు. ఈ కోర్టులలో ఇంగ్లీషు న్యాయాధిపతులు హిందూ పండితులను, మహమ్మదీయ మౌల్వీలను దగ్గర వుంచుకుని దేశీయ ధర్మశాస్త్రాల ప్రకారం న్యాయవిచారణ చేసేవారు. ఈకంపెనీ కోర్టులు అంతతృప్తికరంగా లేవని ఆలోచించి పార్లమెంటు వారు మొదట కలకత్తాలోను తరవాత రాజధాని నగరాలైన బొంబాయి చెన్నపట్నాలలోనూ కూడా సుప్రీముకోర్టులనే పరమోన్నత న్యాయస్థానాలను స్థాపించారు. కలకత్తా కోర్టులో ఒక ప్రధాన న్యాయమూర్తీ ముగ్గురు సామాన్య న్యాయాధిపతులూ వుండేవారు. తక్కినచోట్ల కూడా ఒక్కొక ప్రధాన

న్యాయమూర్తి ఇద్దరు సహాయ న్యాయాధిపతులూ వుండేవారు. ఈ సుప్రీముకోర్టులో ఇంగ్లీషు ధర్మశాస్త్రాల ప్రకారం వ్యవహారాలను తీర్మానించేవారు. రాజధాని నగరాలలోనే వ్యాజ్యకారణం కలిగిన అన్ని వ్యవహారాల పైననూ, దేశంలో ఏమూలను వున్నా తెల్లవారికీ దేశీయులకూ వచ్చే తగాదాలపైననూ ఇంకా ముఖ్యమైన కొన్ని వ్యవహారాలపైననూ ఈ సుప్రీము కోర్టులకే విచారణాధికారం యిచ్చారు.

## జూరీ అనే పంచాయతీ సభ్యులు

పూర్వం ఈ దేశంలో గ్రామపంచాయితీలే సివిలు క్రిమినలు వ్యవహారాలన్నీ పరిష్కరించి న్యాయపరిపాలన చేసేవి. ఈ దేశము ఇంగ్లీషు వర్తకం కంపెనీవారి అధీనం అయిన తరవాత 1793లో ఈ పంచాయితీల అధికారాన్ని తీసివేసి న్యాయపరిపాలనాధికారము ఇంగ్లీషు న్యాయాధిపతుల వశం చేశారు. కంపెనీ వారికి మళ్లీ రాజ్యాధికారపట్టా యిచ్చేటప్పుడు ఇంగ్లీషు పార్లిమెంటువారు పరిపాలనా విధానాన్ని సంస్కరిస్తూ రాజధాని నగరాలలో ఉన్నత న్యాయస్థానాలను స్థాపించి అక్కడ క్రిమినలు నేరాలు విచారించుటప్పుడు న్యాయాధిపతులు ఇంగ్లాండులో లాగనే జూరీ అనే పంచాయితీదార్ల సలహా సహాయముతో విచారించి జూరీవారు దోషనిర్ణయం చేస్తేనే శిక్షలు విధించేటట్టు శాసించారు. ఆ ప్రకారం సుప్రీముకోర్టులలో నేరాలు విచారించేటప్పుడు చాలా కాలం దొరలనే జూరీసభ్యులుగా నియమించేవారు. కొంతకాలమైన తరవాత ఈ గౌరవోద్యోగంలో దేశీయులను నియమిస్తే ఎలాగ నిర్వహిస్తారో చూద్దామని అప్పటి ఇంగ్లీషు ప్రభుత్వంవారు ఆలోచించారు. గ్రాంటుగారు బొంబాయికి వచ్చేటప్పటికి నేరాల విచారణలో దేశీయులను కోర్టులలో పంచాయతీ దార్లుగా నియమించే ఆచారం తాత్కాలికంగా అమలులో వుంచారు. అప్పటి కింకా ఆ పద్ధతిని ఖాయపరచలేదు.

పంచాయతీదార్ల కర్తవ్యాన్ని గురించి న్యాయాధిపతియైన సర్‌జాన్‌పీటర్ గ్రాంట్‌గారు దేశీయ జూరీసభ్యులకు చక్కగా ఉద్బోధిస్తూ వుండేవారు. ఇంగ్లీషు ప్రభుత్వపద్ధతులను హిందూదేశంలో స్థాపించి నందువల్ల ప్రజలకు చాలా మేలు కలుగుతుందనిగ్రాంటు గారి అభిప్రాయం. గ్రాంటుగారు ఉద్యోగం చాలించుకునే ముందు దేశీయుల శక్తిసామర్థ్యాలను గురించి తమకు తోచిన సంగతిని ఇలాగ చెప్పారు.

"నేను హిందూదేశానికి వచ్చేముందే పెటీటు జూరీ యనే పంచాయితీ సభలలో హిందూ దేశీయ పెద్దమనుష్యులను నియమించే పద్ధతిని ఈ బొంబాయిరాష్ట్రంలో ప్రారంభించారు. ఈ దేశీయులు తమ కర్తవ్యాన్నిఎలా నెరవేరుస్తున్నారో గమనించే అవకాశం



నాకు కలిగింది. ఆ గౌరవోద్యోగాన్ని వాళ్లు అతిసమర్థతతో నిర్వహించారనిన్నీ వారి తోడ్పాటువల్ల న్యాయపరిపాలనకు చాలా మేలు కలిగిందనిన్నీ చూసిన వారందరికీ తోచింది. గ్రాండ్ జూరీలనే పెద్ద పంచాయతీ సభలలో కూడా దేశీయులను త్వరలోనే నియమిస్తారని నేను ఆశిస్తున్నాను. శాసననిర్మాణ సభవారు ఈ దేశీయులకు ఎలాంటి బాధ్యతల నిచ్చినా వీళ్లు ఆ బాధ్యతల నన్నింటినీ చాలా బాగా నిర్వహించి దేశానికి మంచి సేవచేసి గౌరవం తెచ్చుకో గలరని నా దృఢవిశ్వాసం. నామటుకు నేను నిర్వహించే కష్టసాధ్యమైన న్యాయ పరిపాలనలో వ్యవహారాలలో దేశీయులకు కృతజ్ఞత చూపించవలసిన సందర్భాలు సదా కలుగుతూనే వచ్చాయి. ముఖ్యంగా నాకు మరపురానంతటి సద్భావమూ గౌరవము కలిగినాయి."

## బొంబాయి పోలీసులు అప్రయోజకత్వం

ఆకాలంలో బొంబాయిలో పోలీసు శాఖ చాలా దుఃస్థితిలో వుండేది. బొంబాయి ద్వీపంలోనే పెద్దపెద్ద బందిపోట్లూ దొంగతనాలూ జరుగుతూవుండేవి. దొంగలగుంపులు చెలరేగి దోపిళ్లు చేస్తూవుండడం సర్వసామాన్యం అయిపోయింది. దేశీయ ప్రజలలో చాలా భయోత్పాతం కలిగింది. ఈ బందిపోట్ల నుంచి ప్రజలను సంరక్షించవలసిందని గౌరవనీయులైన దేశీయు లనేకులు గవర్నరు గారికి విన్నపం పంపించారు. గవర్నరుగారి ఆలోచనసభకూడా ఏమీ చేయడానికి తోచక తల్లడిల్లింది. దీనినిగురించి ఒకకొత్త శాసనాన్ని చేయడానికి ఆలోచించింది. సైనిక శాసనం(మార్షలులా) వంటి నిర్బంధాలతో ఒక ప్రణాళికను ప్రవేశపెట్టవలసిందని కొందరన్నారు. తెల్లవారే సభ్యులుగా వున్న గ్రాండు జూరీవారు సుప్రీముకోర్టు న్యాయాధిపతులకు తమ ఫిర్యాదును విన్నవించారు. ఇదివరకే దేశంలో అమలులో వున్న ధర్మశాస్త్ర విధులు సరిగా అమలు జరిపితే ఈ దౌర్జన్యాలను అణచవచ్చునిన్నీ కొత్త నిర్బంధశాసనాలు అవసరం లేదనిన్నీ గ్రాంటుగారు సెలవిచ్చారు. ఈ విషయంలో వారు చేసిన విమర్శనలు చాలా ప్రసిద్ధికెక్కినాయి.

## బొంబాయిలో న్యాయపరిపాలన

తూర్పు ఇండియా కంపెనీవారున్యాయ పరిపాలన జరపడానికి స్థాపించిన కోర్టులలో అత్యధిక ఖర్చులవల్లనూ అమితమైన ఆలస్యం వల్లనూ లంచగొండితనము వల్లనూ జనసామాన్యానికి న్యాయం సులభసాధ్యంగా లేదనే సంగతిని గ్రాంటుగారికి అవగాహన అయినది. పార్లమెంటువారి శాసనంకింద స్థాపించబడిన బొంబాయి

సుప్రీముకోర్టువారికి చెప్పుకుంటే తమ కష్టాలు తీరుతాయనే భావాన్ని దేశీయులకు కలిగించాలని నిష్పక్ష పాతంగా న్యాయపరిపాలన జరపడానికి ప్రయత్నించారు. కంపెనీ కోర్టులలో సాధారణంగా కంపెనీడైరెక్టర్ల శిఫారసువల్ల నియమింపబడిన దొరలే న్యాయాధికారులుగా వుండేవారు. వారు అంత ఎక్కువ విద్యావంతులు గాని సమర్థులుగాని కారు. పైగా వారు తమ అభివృద్ధికి కంపెనీవారిపైననే ఆధారపడినవారు. అందువల్ల కంపెనీవారికీ ప్రజలకూ వచ్చేతగాదాలలో నిష్పక్షపాతంగా ప్రవర్తించలేకపోయేవారు. గవర్నరుగారి పరిపాలక వర్గంవారి చర్యలకు వ్యతిరేకంగా తీర్పులివ్వడానికి వీరికి ధైర్యం వుండేది కాదు.

సుప్రీముకోర్టు న్యాయాధిపతులు పార్లిమెంటువారి శాసనంకింద నియమింపబడిన వారవడంవల్ల నిర్భయంగానూ ధైర్యంగానూ తీర్పు లిచ్చేవారు. పైగా వీరు చాలా సమర్థులుగా వుండేవారు. చట్టం ప్రకారం సుప్రీముకోర్టు అధికారము బొంబాయి రాజధానినగరానికి మాత్రమే నిర్ణీతమై యున్నా రాష్ట్రంలో ఇతరచోట్ల జరిగే అన్యాయాలను గురించీ అక్రమాలను గురించీ కూడా వీరు విచారించి ప్రజల స్వాతంత్ర్యాన్ని రక్షించడం ప్రారంభించారు.

## గ్రాంటుగారి రాజీనామా

గ్రాంటుగారు బొంబాయికి వచ్చిన ఒక సంవత్సరంలోపలనే బొంబాయి గవర్నమెంటు వారికీ సుప్రీము కోర్టు వారికీ అభిప్రాయ భేదం కలిగిన కేసులు రెండు వచ్చాయి. వాటిలో బప్పోగుణే అనే వ్యవహారం ఒకటి. రెండవది మరో రఘునాథ్ వ్యవహారం. బొంబాయి గవర్నరు మాల్గలం తన అధికారాన్ని చలాయించడానికి ప్రయత్నించాడు. సుప్రీముకోర్టు వారు న్యాయనిర్ణయానికోసం తంటాలు పడ్డారు. ఈ సందర్భంలో గవర్నరు జనరలైన ఎలైన్‌బరో ప్రభువు బొంబాయి గవర్నరు చర్యనే సమర్థించాడు. దీనిఫలితంగా సర్ జాన్ పీటరు గ్రాంటుగారు తమ ఉద్యోగానికి రాజీనామా నివ్వవలసి వచ్చింది. గ్రాంటుగారు పనిమానుకుని కలకత్తాలో బారిస్టరుగా న్యాయవాద వృత్తిలో పని చెయ్యడానికి వెడతార నేసంగతి 1830వ సంవత్సరం జూలై నెలలోనే బొంబాయి ప్రజలకు తెలిసింది.

1830వ సంవత్సరం జూలై 24వ తేదీన గ్రాంటుగారు గ్రాండ్ జూరీకి తన కడపటి ఉద్బోధన చేస్తూ ఇచ్చిన ఉపన్యాసంలో కొన్ని వాక్యాలు పైన వుదాహరింపబడి వున్నాయి. సెప్టెంబరు నెలలో గ్రాంటుగారు పని మానుకున్నారు. ఆనెల 10వ తేదీన



బొంబాయిలో 4500 మంది దేశీయ ప్రజల తరపున ఆయనకు ఒక వినతిపత్రం సమర్పించబడింది. ఆయన నిలువురూపుపటాన్ని చిత్రింపజేసి నెలకొల్పడానికి చందాలు వేశారు. ఆ పటం ఇప్పుడు బొంబాయి సుప్రీము కోర్టుభవనంలో ఉన్నదని తులస్తాము. కొద్ది రోజులలో చాలా ఘరానా పెద్దమనుష్యులు 330 మంది ఒక ప్రత్యేక వినతిపత్రాన్ని ఆయనకు సమర్పించారు. అందులో గ్రాంటుగారి స్వభావాన్ని శీలాన్ని చాలా ప్రశంసిస్తూ వారికి పలహార ఉపకరణాల వెండిపెట్టెను బహూకరిస్తూ బొంబాయిలో ఎక్కడనో ఒక బహిరంగప్రదేశంలో ఆయన రూపపటాన్ని నెలకొల్పడానికి వారి అనుజ్ఞ వేడుకున్నారు.

## బొంబాయి గవర్నరు అసహనము

ఈ సమయంలో బొంబాయి గవర్నరుగారు ఈ క్రింద ప్రకటనను చేసి తన అసహనాన్ని ప్రకటించారు. "సర్ జాన్ పీటర్ గ్రాంటుగారు సుప్రీము కోర్టు న్యాయాధిపతి వుద్యోగానికి రాజీనామా నిచ్చి వెళ్లే సందర్భంలో ఆయనకు బహుకరించిన వినతిపత్రం సమర్పించడానికి దేశీయుల బహిరంగసభ జరుగుతుందని పత్రికలలో పడిన ప్రకటనలవల్ల తెలుస్తున్నది. గ్రాంటు గారు ఉద్యోగం మానుకున్న సందర్భాలు ఈరాష్ట్రంలో దేశీయులకు తెలియగలందులకు గవర్నరుగారు ఈ క్రింది ప్రకటనను జారీచేస్తున్నారు :

గౌరవనీయులైన తూర్పు ఇండియా కంపెనీవారు గ్రాంటు గారిపైన చేసిన ఫిర్యాదునుబట్టి ఇంగ్లాండులో ప్రీవీకవున్సిలు సభాయుతుడైన రాజుగారు గ్రాంటుగారిని బొంబాయినుంచి వెనక్కి రమన్నారు.

కంపెనీవారు స్థాపించిన కోర్టులందు దేశీయులకు విశ్వాసము లేదని గ్రాంటుగారికి సమర్పించిన వినతిపత్రంలో వ్రాయబడిన అంశానికి జవాబుగా గవర్నమెంటువారు ఒకతాకీదును జారీచేశారు. ఆ వినతిపత్రంలో యిలాగ వ్రాసినవారికి సంగతి సందర్భాలు యేమీ తెలియవని సదరు దివానీ ఫౌజుదారీ అదాలతుకోర్టుజడ్జీలు గట్టిగా వ్రాసిన అసమ్మతిని ఈ తాకీదులో వుదాహరించారు.

## వీడ్కోలు

1830వ సంవత్సరం సెప్టెంబరు21వ తేదీన గ్రాంటుగారు "ఎంటర్‌ప్రైస్" అనే స్టీమరుపైన బొంబాయినుంచి కలకత్తాకు పయనమైనారు. అప్పుడు రేవులో ఆయనను సాగనంపడానికి 7000 మందికి పైగా దేశీయులు వచ్చి ఆయనవద్ద సెలవుపుచ్చుకుని తమ అనురాగాన్నీ గౌరవాన్నీ ప్రకటించారు. చాలామంది దేశీయులు పడవలెక్కి

"ఎంటర్‌ప్రైస్"లో ఆయన యెక్కేవరకూ ఆయనను సాగనంపారు.

1830వ సంవత్సరం అక్టోబరు 16వ తేదీన గ్రాంటుగారు కలకత్తాచేరారు. త్వరలోనే ఆయనను మళ్లీ అక్కడ సుప్రీము కోర్టులో న్యాయాధిపతిగా నియమించారు. అక్కడకూడా ఆయన తన వుద్యోగాన్ని అతి సమర్థతతో నిర్వహించి ప్రధానన్యాయమూర్తి పదవిని పొంది 1848లో ఉపకారవేతనం పొంది సీమకు వెడుతూ మే 11వ తేదీన ఓడపైననే కాలధర్మము పొందినారు.

(Annals of India for the year 1848 by George Buist L.L.D FRSL & E.F.GS. Editor, Bombay Times 1839).

– *ఆంధ్రపత్రిక, 10.2.1943, 15.8.1943*



*గ్రాండ్ జూరీ అనేది ఇంగ్లాండులో అమలులో వున్న పద్ధతి ఎవరైనా ఒకనేరం చేశారని ఫిర్యాదు వచ్చినప్పుడు కోర్టువారు విచారణచేయతగిన కారణాలు వున్నాయా లేదాఅని ముందుగా పంచాయతీవారు విచారించి నిర్ణయిస్తారు.



# ప్రభుభక్తి పరాయణుల "నక్క వినయాలు - ఇచ్చకాలు"

**అ**స్తమానూ దొరల నాశ్రయించి తిరుగుతూ ఏ రావుసాహెబు బిరుదో ఏ బెంచి మేజస్ట్రీటు వుద్యోగమో రావడం తోటే మోక్షం సిద్ధించినంత సంతోషం పొందే ప్రభుభక్తి పరాయణులైన దేశీయులనుగురించి ఆదొరలే ఏమనుకుంటారో తెలుస్తే ఆశ్చర్యపోతారు.

1867వ సంవత్సరంలో ఐ.సి.యస్. వుద్యోగిగా వచ్చి చాలాకాలం మనదేశంలో జిల్లాకలెక్టరుగా వుండి వంగరాష్ట్రంలో ప్రధాన ప్రభుత్వ కార్యదర్శిగాను, కేంద్రప్రభుత్వంలో హోంసెక్రటరీగాను, అస్సాము చీఫ్ కమిషనరుగానూ పనిచేసి దేశీయులతో కలిసి మెలిసి తిరుగుతూ మన మంచిచెడ్డలను బాగా గ్రహించి 1904లో కాంగ్రెసు మహాసభకు అధ్యక్షతవహించిన సర్ హెన్రీకాటన్‌గారు తన అనుభవాన్ని గురించి "ఇండియన్ అండు హోం మెమొరీస్" అనే పుస్తకంలో ఇలాగ వ్రాశారు :

"1857 సం॥ మ్యూటినీ జరిగి పది సంవత్సరాలు అయింది. నేను కొత్తగా ఈదేశానికి ఉద్యోగం చెయ్యడానికి వచ్చిన రోజులలో ఈ మ్యూటినీ అందరి మనస్సులలోనూ శల్యంలాగ మెలుగుతూ వుండేది. వృద్ధిలోకి రావలసిన యువకులైన సివిలియను (ఐ.సి.ఎస్) ఆఫీసర్ల మనస్సులను ఈ మ్యూటినీ ఒక పీడకలలాగ ఆవహించేది.

దొరలకు మామూలుగా జరిగే బహిరంగ మర్యాదలలోను చూపబడే గౌరవములోనూ ఆవంత అయినా లోటుపాటులు లేకుండావుండేటట్లు కనిపెట్టివుండడం చాలా అవసరమని నేనీదేశానికి రాగానే వయోవృద్ధులైన దొరలు నాకు నచ్చచెప్పారు. ఈదర్జాను చలాయించడము ఈదేశంలో చాలా సులభమే ఎందువల్లనంటే, తరాలవెంబడిని విదేశీయపరిపాలనకు లోబడి పారతంత్ర్యమునబడియున్న తూర్పుదేశీయులు (భారతీయులు) దొరలకు (అధికారులకు) నక్క వినయాలు చూపడానికీ, వాళ్లదగ్గర చేరి ఇచ్చకాలు ఆడడానికీ బాగా అలవాటుపడ్డారు. నేను చాలా చిన్న దొరను (చోటాసాహెబు) అయినా ఒక జిల్లాకలెక్టరు చేతికింద అసిస్టెంటుగా నియమింపబడి, అధికార

పరంపరానుక్రమ చక్రంపైన వాలిన ఒక యీగలాంటివాడనై యున్నా - సామాన్య ప్రజల దృష్టిలో మాత్రం నేను అధిక బలసంపన్నమైన ఈ మహాప్రభుత్వంయొక్క ప్రతినిధిగానే కనబడి తీరతాననిన్నీ అందువల్ల ఆ దర్జాకు సంబంధించిన ప్రత్యేక అధికారము, గౌరవము చలాయించడానికి నాకు హక్కువున్న దనిన్నీ వాటిని చలాయించడంలో నేను ఏమాత్రమూ లోపం జరిగించకూడ దనిన్నీ చెప్పారు. మేము పనిచేసే వాతావరణంకూడా ఇందుకు అనుగుణమైనదే. దేశీయులకన్న అధికుల మనేభావంతో వాళ్లపైన కటాక్షవీక్షణాలు ప్రసరింపచేసే పద్ధతిని అవలంబించేటట్లు చట్టుపట్ల వాళ్లందరూ మమ్ములను ప్రోత్సహించే వాళ్లు. ప్రభుత్వ నిర్వహణ కార్యంలో చూపవలసిన భావాలకిది చాలా విరుద్ధమైన దన్నమాట నిజమే. హిందూదేశాన్ని పరిపాలించడానికి కంపెనీ వారి హయాములో పంపేకుర్రాళ్లను తర్ఫీదు చేసే హెయిలీబరీ కాలేజీలో చదివి, నిరంకుశ సంప్రదాయాలను అలవర్చుకున్న పూర్వకాలపు సివిలు సర్వీసు అధికారుల మర్యాద లింకా అమలు జరుగుతూనే ఉండేవి. పోటీ పరీక్షలలో ఉత్తీర్ణులై వుద్యోగం సంపాదించిన నావంటి కొత్తవాళ్లకు ఈపాతవాళ్ల పద్ధతులు ఆకర్షణీయంగానే ఉండేవి. అవతల పక్క భారతీయులలో నైనా ఈ విపరీతపు పరిస్థితులను ప్రతిఘటించే శక్తులేమైనా వున్నాయా అంటే - లేవు. పూర్వకాలపు సంప్రదాయాలకు అలవాటుపడిన భారతీయులలో ముఖ్యంగా న్యాయస్థానాలను ఆశ్రయించుకుని తిరిగే దేశయులతోనే మనకు ఎక్కువ పరిచయం. వీళ్ల నక్క వినయాలు, అతినీచమైన వినయవిధేయతలు, ఇచ్చకాలూ, జోహుకుముపద్ధతులు వర్ణించడానికి శక్యం కాదు. ఇది మానవస్వభావాన్ని చెరచివేయగల కుళ్లిపోయిన నరకకూపం. ఈ పరిస్థితులకు నేనుకూడా లోబడిపోయినానని చెప్పుకోవడానికినేను సిగ్గుపడడం లేదు."

## "కాలికింది మట్టి"

ఇంగ్లీషు వారీ దేశాన్ని చేజిక్కించుకున్న తరవాత వారి అధికారం బలపడినకొద్దీ దొరలు భారతీయులను నీచంగా చూడడమూ తిట్టడమూ, హింసించడమూ ఎక్కువ అయిపోయింది. పరోపకారపారీణుడైన జాన్ బ్రైట్‌గారు ఇంగ్లాండులో పార్లిమెంటుసభలో 1858వ సంవత్సరం జూను 24వ తేదీన జరిగిన చర్చలో ఇలాగ అన్నారు.

"హిందూ దేశప్రజలు తమ దేశంలో వున్న ఇంగ్లీషువారిని బట్టి ఇంగ్లాండువారి గుణశీలాలను నిర్ణయిస్తారు. ఇంగ్లాండు దేశప్రజల యొక్క దుష్టస్వభావాలు మాత్రమే



అక్కడ వాళ్లకు కనబడతాయి. ప్రజలతో కలిసి మెలసి సంచరించక ఆకాశపథంలో సంచరించే సివిలు అధికారుల గర్వము- దేశాన్ని లోబరిచియుంచే కొద్దిమంది విదేశీయుల నిరంకుశత్వము మాత్రమే వాళ్లకు కనబడే ఆంగ్ల జాతిలక్షణాలు... గౌరవనీయులైన ఫ్రెడరికుజాన్ షోర్‌గారు ముప్ఫై సంవత్సరాలకిందట తమ గొప్ప గ్రంథంలో వ్రాసిన సంగతులు నాకు బాగా జ్ఞాపకం వున్నాయి. ఆనాటిమనవాళ్లు దేశీయులపట్ల చూపేదయ, ఆదరణ, న్యాయబుద్ధి చాలా క్షీణించి పోయినాయి. 1853లో జరిగిన పార్లిమెంటు ఉపసంఘమువారి విచారణలో పాలకులకూ, పాలితులకూ సామరస్యం లేదనే సంగతి స్పష్టంగా బయటపడింది. ఇప్పుడీసందర్భంలో నేను వింటూవుండగా నలుపక్కల నుంచీ హిందూజాతి నంతా నిందిస్తూ చేసే దూషణలు, తిరస్కారాలు,తృణీకారాలు నేను సహించలేకుండా వున్నాను... లక్షల కొద్దీ ప్రజలకు ప్రభువుగా వున్న ఒక స్వదేశరాజును "నీవు నా కాలికింద మట్టికంటే హీనుడవని జ్ఞాపక ముంచుకో" మని ఒక గవర్నరుజనరలు వ్రాశాడంటే ఇంక నేను చెప్పేది యేముంది? ఇలాంటి సంగతులు పార్లిమెంటువారికి తెలియనియ్యరు".

**– ఆంధ్రపత్రిక, *26.01.1943***



# భారతదేశ పారతంత్ర్యము

# భారతీయుల దేశాభిమానము

ఆంగ్ల ప్రభుభక్తిని బోధించుట కేర్పడిన హిందూదేశచరిత్రలు చదివినచో "ఈ భారతీయులలో దేశాభిమానమే లేదా? ఈ ఇంగ్లీషు పరిపాలనమును కోరి ఏరి తెచ్చికొని బుద్ధిపూర్వకముగనే ఈ పారతంత్ర్యమునకు హర్షించిరా? స్వాతంత్ర్యముకొరకు భారతీయు లెట్టి ప్రయత్నమును చేయక బ్రిటిషు ప్రభుత్వమునకు లోబడియుండిరా?" అని తోచి తీరునుగాని నిక్ష్పక్షపాతులగు ఆంగ్లేయ చరిత్రకారులు వ్రాసిన గ్రంథములు పరిశీలించినచో భారతీయు లెన్నడును పారతంత్ర్యమునకు హర్షింపలేదనియు స్వధర్మముపైన స్వదేశముపైన అభిమానమును వీడలేదనియు తమ స్వాతంత్ర్యమును కాపాడుకొనుటకును మరల స్వాతంత్ర్యమును పొందుటకును మొదటి నుండియు పెనుగులాడుచునే యున్నారని స్పష్టపడి తీరును. అట్టి చరిత్రకారుల రచనలలో కొన్ని ఈ క్రింద నుదాహరింపబడినవి.

ఆంగ్లేయ విద్యావిధానమువలన ఇంగ్లీషు సాహిత్యము చదువటవలన మెకాలే ధర్మమాయని మిల్టను, లాకు, ఎడ్మండుబర్కు మొదలుగవారి రచనలు పఠించినందువలన భారతీయుల ఆశయములందు మార్పులుకలిగి జాతీయ చైతన్య ముదయించినదని చెప్పుట పరిపాటి యైనది. ధర్మాత్ములగు బర్కు మహాశయుని వంటి ఆంగ్లేయులు కొందరు భారతదేశ ప్రజల బాధలను ప్రపంచమునకు వెల్లడించి ఈ దేశము నుద్ధరించుటకు పాటుపడినమాట నిజమే. వారి ఉదారభావములు భారతదేశమున ప్రబోధము కలిగించిన సంగతియు నిజమే గాని స్వధర్మ రక్షణమునుగూర్చి స్వరాజ్యమునుగూర్చి స్వదేశమునుగూర్చి ఈ దేశీయులు పాటుపడుట యనునది దేశమున ఆంగ్లవిద్యాభివృద్ధివలన క్రొత్తగా ఉదయించిన దేశాభిమానమువలనను జాతీయ చైతన్యమువలనను కలిగినది కాదు.

జాతీయ చైతన్య మనగా విదేశపరిపాలనము నంగీకరింపక తమ అసమ్మతిని చూపుటయే యని మనము తలంచినచో నిది ఎట్టి విద్యాభివృద్ధి తోను నిమిత్తములేని ఆత్మగౌరవమునకు సంబంధించిన దేశాభిమానము. భారతదేశమునం దాంగ్ల విద్యాగంధ



మావంతయైన లేనికాలమునగూడ భారతీయులు తమకు జరుగుచుండిన అక్రమములను సహింపక దుష్పరిపాలనముపట్ల తమ అసమ్మతిని గనపరచిన నిదర్శనము లనేకములుకలవు.

ఈ దేశమున నాంగ్లేయప్రభుత్వ స్థాపనమునకు వీరిష్టపడి హర్షించినవారును గాదు. భారతీయులు స్వధర్మమును స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొనుటకు పోరాడుచుండగా వారు మరల తలయెత్తలేకుండ అణచివేయుటకు బ్రిటిషువారి కొకవంద సంవత్సరములు పట్టినది. 1757లో జరిగిన ప్లాసీయుద్ధము మొదలు 1857లో జరిగిన సిపాయిల కలహమని పిలువబడు స్వాతంత్ర్య సమరమువరకును స్వధర్మముకొరకు స్వాతంత్ర్యము కొరకు భారతీయులు పోరాడని కాలమే లేకుండెను.

ఇతర దేశములనుండి భారతదేశముపైకి వచ్చిన ఏవిజాతీయులను ప్రతిఘటించుటకును ఏకముగాని వివిధజాతులవారు తరగతుల వారు ఆంగ్లేయులనుండి వెలువడుటకు 1857లో ఏకమై పోరుసలిపిరి, అని ఎడ్వర్డు థాంప్సనుగారు తమ భారతదేశ చరిత్రలో వ్రాసియున్నారు. అటుపిమ్మటనే భారతదేశమున బ్రిటిష్‌రాజ్యతంత్రము స్థిరముగా స్థాపింపబడినది.

## ఆంగ్లేయ గ్రంథకర్తలు వ్రాసిన సంగతులు

భారతదేశ యథార్థ చరిత్రమును వివరించుచు ఆంగ్లేయులు వ్రాసిన గ్రంథములు చదివినచో నీ క్రింది సంగతులు స్పష్టముగా కనబడును: భారతదేశము నాంగ్లేయులా క్రమించుటలోనే చాలా అన్యాయములు జరిగెను. ఆంగ్లేయ కంపెనీ పరిపాలనమున ప్రజలు చాల బాధల నందిరి. ప్రజలలో చాలా అసంతృప్తి వ్యాపించి యుండెను. ఈ యాంగ్లేయ ప్రభుత్వమునకు ప్రజ లెన్నడును హర్షింపలేదు. ఈ పరిపాలనము నుండి వెలువడుట యెట్లాయనియె భారతీయు లాలోచించుచుండిరి. భారతదేశీయులకు స్వధర్మముపైన స్వదేశముపైన స్వరాజ్యముపైన గాఢమైన అభిమానముండెను. తమ బాధలను మాన్పుకొనుటకును స్వాతంత్ర్యమును పొందుటకును భారతీయులు ఏకీభావము వహించి చాలమార్లు సమ్మెలుకట్టి సాత్వికనిరోధము చేసిరి. చాలమార్లు ఆయుధములను బూని తిరుగుబాటులు గావించిరి. తుదకు 1857లో గొప్పవిప్లవమును లేవదీసిరి గాని దాని నాంగ్లేయ లతిక్రూరముగా అణచివేయగా ప్రజలు చేయునది లేకబ్రిటిష్ ప్రభుత్వమునకు లోబడిరి. ఎంత అసహాయస్థితిలో నున్నను భారతీయు లిప్పటికిని స్వాతంత్ర్యముకొరకు పోరాడుచునే యున్నారు.

భారతదేశమునకు ప్రభువులైన ఆంగ్లేయ వర్తకకంపెనీవారు మిత్రభేదము చేసి మోసము చేసి, దౌర్జన్యము చేసి, భారతదేశము నా క్రమించినా రనియు, కేవలము ధనకాంక్ష చేత నెన్నో యన్యాయములు చేసిరనియు, వారి తాబేదారులును దుష్పరిపాలనము చేసి ప్రజలను పీడించి ధనము లాగుచుండిరనియు, భారతీయుల కన్న తామధికుల మను స్వాతిశయముతోను, అహంకారముతోను మెలగుచు ప్రజలను నీచముగా జూచుచు అవమానించుచుండి రనియు, అందువలన ప్రజలలో విరోధభావము వ్యాపించి ఈ యాంగ్లేయ పరిపాలనమునుండి వెలువడుటకు తరుణముకొరకు వేచియుండిరనియు అకాలమున భారతదేశమున నుద్యోగముచేసిన దొరలలోని కొందరు అనుభవజ్ఞులు వ్రాసియున్నారు. అట్టివారిలో ఫ్రెడరిక్ జాన్‌షోరుగారొకరు. ఈయన ఉత్తర హిందూస్థానమున 17 సంవత్సరములు జిల్లాజడ్జీ యుద్యోగము చేసి, భారతదేశ స్థితిగతులనుగూర్చి 1832–1835 మధ్య ఇండియా గెజెటుపత్రిక కనేక వ్యాసములు వ్రాసిరి. అవి 1837లో "Notes on Indian Affairs అనుపేరును రెండుసంపుటములుగా ప్రకటింపబడినవి.

ఆంగ్ల ప్రభుత్వము పట్ల భారతీయుల భావములనుగూర్చి 1833 సం॥ ఏప్రిలు 6వ తేదీని వారిట్లు వ్రాసిరి :

"భారతదేశ వ్యవహారములను గూర్చి నేను వ్రాయుటలో ఇంగ్లీషు పరిపాలకులపట్ల భారతీయుల భావము లెట్లున్నవను విషయమునుగూర్చి నేను పలుమారు సూచించియున్నాను. పలువురను కొనునట్లే ప్రజలభావములు మన కనుకూలముగా లేవని స్పష్టముగా చెప్పియున్నాను. ఈ విషయమును గూర్చి మనలో ఉన్నంత అజ్ఞానము, పొరపాటు అభిప్రాయములు నింకే విషయమునను లేవు.

ఇంగ్లీషు పరిపాలన ప్రజానురంజకము నున్నదనియు, ఆంగ్లేయులశీలమును గూర్చి భారతీయప్రజలకు చాల మంచి యభిప్రాయము కలదనియు చాటుచుండుటయు, దేశీయరాజుల అక్రమములును వారి నిరంకుశత్వమును ప్రజాపీడనమును గూర్చియు చెప్పి, ఈ తారతమ్యమును జూపి, ప్రశంసించుచుండుటయు ఇంగ్లీషువారికి పరిపాటి యైపోయినది.

"మన ఆంగ్లేయ ప్రభుత్వముపట్ల ప్రజలు అసంతృప్తిని జెందియుండుటకు గల కారణములలో ముఖ్యమైనవానిని కొన్నిటిని సూచించెదను. అన్నిటికన్న ముఖ్యకారణము నేనీ వఱకు వ్రాసినట్లుగా ఆంగ్లేయుల స్వాతిశయము, జాత్యంహకారము : విదేశీయులతో కలిసి మెలసి ప్రవర్తించినచో తమ గౌరవమునకు భంగకరమను దురభిప్రాయముతో



ప్రజలతో సంబంధము లేకుండా తొలగియుండుట. ఈ ప్రవర్తనమే ప్రజల యాంతరంగిక భావములు మనవారికి తెలియక పోవుటకు కారణముగ నున్నది. దేశీయులతో సంబందము లేక మన ప్రపంచములోనే మనము మెలగుచున్నందున మన భావములు ప్రవర్తనమును సంకుచితములై స్వార్థపరత్వము వర్థిల్లి ఇష్టానిష్టములు పెరిగిపోయినవి. కేవలము ధనకాంక్షవలనను లాభము పొందు దురుద్దేశ్యముతోను మనల నాశ్రయించి తిరుగుభారతీయులు కొందరు సర్వదా మనలను స్తుతించుచు మనలోపములకు దుర్గణములకు దోహదము చేయుచుందురు. మానవస్వభావమును గ్రహించుటలో భారతీయులు కడునేర్పరులు. గొప్పవారిపై నాధారపడి జీవించువృత్తి నవలంబించు జోహుకుములవలెను, కాసావారివలెను వీరాంగ్లేయోద్యోగుల నెల్లప్పుడును పొగడుచు ఈ దేశమును గూర్చి వారికిగల దురభిప్రాయములు సరియైనవే యని తాము నమ్ముచున్నట్లు నటించుచు తమ్మునేలు ప్రభువుల ముఖవిన్యాసముల కనుగుణముగా నడుచుచుందురు. మెరమెచ్చులు మొగము మెప్పులు చేసి వారి నుబ్బించుట ఈస్వార్థపరుల కవసరమైనకృత్యమేకదా!

"తమ స్వదేశీయు లీద్రోహుల నేవగించు కొనుచున్నను, ప్రభుత్వమువలన వీరు లాభము పొందుదురు గనుక, ప్రభుత్వముయొక్క అనుగ్రహము పొందుటకు వీరు అవలంబింపని విధానము లుండవు. వీరు సత్యమును తారుమారు చేయుటలో నాశ్చర్యములేదుగాని, ఈవ్యక్తుల నీచత్వమును బాగుగా నెఱిగియుండి వీరిని గర్హించు ఈ ప్రభుత్వమువారు వీరి యభిప్రాయములను తిన్నగా విమర్శించకయే వీనిని స్వీకరించుట మాత్రము ఆశ్చర్యకరముగనే యున్నది. అనుదినము జరుగుచున్న విషయమే యిది.

అధికారగర్వమున మునిగియుండక, ప్రజలతో కొంచెము కలిసిమెలసి చరించినవారికి మాత్రము ప్రజల యాంతర్యము బాగుగా తెలియును. ఈ విషయమును గూర్చి కొంచెము నిష్పక్షపాతముగా యోజించినచో నీ ప్రక్రియ కిట్టి విరోధ భావములు ఉండుట నాశ్చర్యము లేదని తెలియగలదు. ఏలనగా నీబ్రిటీష్ పరిపాలనమున ప్రజలస్థితి యెట్లున్నదో చూడుడు: యుద్ధముయొక్క అదృష్టఫలితములవలననో, లేదా తమ కేవిధముగాను సంబంధములేని రాజకీయమైన ఏర్పాటులను బట్టియో ఈ ప్రజలు మనపరిపాలనక్రిందికి వచ్చినారు. ఇంక మనపరిపాలనావిధాన మన్ననో కేవలము స్వార్థపరత్వముతోను స్వాతిశయముతోను గూడి వారి నేలుచున్నది. ఈ ప్రజల కన్నుల యెదుటనే క్రమక్రమముగా ఆయేటి కాయేడు వీరి యధికారమును గౌరవమును సంపదయు క్షీణించిపోవుచున్నవి. వీరి నేలినదేశీయరాజులు రాజప్రతినిధులు నాశన

మైపోవుచున్నారు. ఆంగ్ల ప్రభుత్వమువారి దురాశవలన దుష్పరిపాలనవలన జనసామాన్యము దరిద్రులుగుచున్నారు. ఇంగ్లీషువానికి ప్రసాదింపవీలుగ ప్రతియుద్యోగము దేశీయులకు లేకుండచేసిరి. ఈ దేశ వ్యవహారములను పూర్వము వంశ పారంపర్యముగ చక్క బెట్టుచుండిన ప్రతిదేశీయ సంస్థయు నాశనము చేయబడినది. పూర్వమీదేశ ప్రజలు తమ వివాదములను పరిష్కరించుకొనుట కేర్పడిన పంచాయతీ ధర్మసభలు తీసివేసి, అసమర్థమును అత్యధికధనవ్యయకారణమునైన యొక కొత్తన్యాయపరిపాలనావిధానమును స్థాపించినారు. న్యాయపరిపాలనమను పేరునుగూడ ఇది సార్థక పరుచుట లేదు. దీనివలన అన్యాయములును ప్రజాపీడనమును దేశములో పెచ్చు పెరిగినవి. ఈ బ్రిటీషు ప్రభుత్వమువలన భారతీయు లనుభవించు సౌఖ్యములివి. ఆంగ్లేయవ్యక్తులవలన వారు పొందు గౌరవాదరణములైన బాగున్నవాయని చూచినచో దేశీయులతోడి సామాన్య సంభాషణలందు గూడా ఈ యాంగ్లేయులు గర్వమును గనబరచుటయు స్వాతిశయ భావములను గనబరచుటయు తమపట్ల మర్యాదగను గౌరవముగను బ్రవర్తించు దేశీయుల నీ యాంగ్లేయులు లెక్కసేయక తృణీకరించుట, నీచముగ జూచి అగౌరవపరచుట, అవమానపరచుట గూడ సర్వసామాన్యముగ జరుగుచున్నవని నే నీవరకే చెప్పియున్నాను. ఈ భారతీయు లెంతో శాంతముగను ఓరిమితోను నీయవమానములను తిరస్కారములను భరించుచున్నారు. ఆంగ్లేయోద్యోగులలో నెవరైన కొందరు ప్రజలపట్ల సానుభూతి గనబరచువారున్నను ఆంగ్లపరిపాలనా విధానమును బట్టి ఉద్యోగులను తరచుగా బదలాయింపులు చేయుచుందురు గనుక అట్టి ఉద్యోగులతో స్నేహభావమును పెంపొందించుకొనుటకు ప్రజల కవకాశములు కలుగవు. ఆంగ్లేయుల ప్రవర్తనను బట్టి చర్యలనుబట్టి వారిపట్ల భారతీయులు స్నేహభావము కలిగి యుండుటకు హెచ్చు అవకాశము లున్నవో లేవో గ్రహించుటకు చరిత్రకారుల రచనలు ముఖ్యముగా జేమ్సుమిల్లుగారి హిందూదేశచరిత్రను చదువవచ్చును.

ఈ భారతీయులు మనలను ద్వేషించునది మనము విజాతీయుల మైనందువల్ల మాత్రమున గాని, వారిని మనము జయించినందున గాని కాదు. జయింపదలచిన దేశములోని ప్రజలను రూపుమాపదలచుకున్న ఘోరమైన సందర్భమున దప్ప ప్రపంచములోని దేశాక్రమణల చరిత్రలో నెచ్చటను కనివిని యెరుగని విధముగ నీ పాలిత ప్రజలను దరిద్రులుగను పతితులుగను జేసినామను కారణముననే వారు మనలను ద్వేషించుచున్నారు. (148) నేననేక దేశీయ స్వతంత్రరాజుల రాజ్యములు తిరిగి జూచితిని. అన్నిటికన్నను ముఖ్యముగా బ్రిటిష్‌వారి యధికారమునకు లోబడుటను వారు హర్షించుట



లేదని నేను గట్టిగా చెప్పగలను. (151) సర్వకాలసర్వావస్థలయందు మన సైన్యము లప్రమత్తత వహించి యున్నందువలననే దేశమున తిరుగుబాటు జరుగకుండ నున్నదను సంగతిని అందరు నంగీకరించుచున్నారు. అవకాశమున్నప్పుడెల్లను అధికారతిరస్కారము కనబడుచునే యున్నదనుట కనేక ఉదాహరణములున్నవి. ప్రతి తిరుగుబాటుకును కల్లోలమునకు నేదో యొక కారణముండితీరునను సంగతి విచారించినవారికి తెలియగలదు. అసంతృప్తికి నిజమైన కారణములు లేని తిరుగుబాటు లరుదుగా నుండును. ఇటీవల 1832లో జరిగిన కోల్ తిరుగబాటులో చాల మానవప్రాణములు నష్టమైనవి. ప్రభుత్వమునకు చాల సొమ్ము వ్యయమైనది. అప్రియమైన సంగతుల నెంతకప్పిపుచ్చినను, ఎందరు దానిని కాదనినను ఈ తిరుగుబాటునకు నిజమైన కారణము రాజోద్యోగులగు దేశీయులుచేసిన ప్రజాపీడనము, దోపిడియునని బయల్పడినది. ఈ యుద్యోగులు లంచములు గ్రహించి, తమ యధికారమును దుర్వినియోగముచేసి కొందరికి మద్దతు చేసిరి.

1824లో ఉత్తర హిందూస్థానములోని (Upper Provinces) బ్రిటిషు రాష్ట్రములన్నిటిలోను కలిగిన కల్లోలములకు గూడ నిదియే నిజమైన కారణము. కొంచెముగనో గొప్పగనో ప్రభుత్వము పట్ల ప్రజలకు విరోధభావము చూపని జిల్లా యొక్కటియైనను లేదని చెప్పవచ్చును. దీనికి కారణములు చూపుటకు కొందరు ప్రయత్నించిన సంగతి నేనెరుగుదును. బర్మాయుద్ధములో మనకు ఆపజయములు కలిగినందున మన సైన్యముల నక్కడికి బంపవలసివచ్చుటయే కారణమనియు తిరుగు బాటుచేసి సాగిన ముఠాలవారు దోపిడి కొరకు తిరుగు యెవరో బందిపోటుగాండ్రేగాని అసంతృప్తిచెందిన ప్రజలులగా రనియు చెప్పజూచిరి. ఇవన్నియుగూడ కారణములే యని యంగీకరింపవచ్చునుగాని మన పరిపాలనమున నీదేశము లంతసౌఖ్యము అనుభవించుచున్నచో మన యధికారమున ధిక్కరించుటలో వీరందరు నంత యుత్సాహముతో నేలనేకీభవించుచున్నారు? ఉత్తర పరగణాలలో నెల్ల ఒక ముఖ్య భూస్వామియైనను ప్రభుత్వమువారికి సాయము చేయరాలేదేమి?

దోపిడిసొమ్ములో కొంత పాలు పొందవచ్చునను నాసతో కొందరు బందుపోటు గాండ్రి తిరుగుబాటులో చేరినమాట నిజమే యని యొప్పుకొందము. అయితే ప్రజల ప్రవర్తన మెట్లున్నది? ఈ దోపిడి దొంగలకు మొదటి గెలుపు కలుగగానే దేశములోని ప్రజలలో పైతరగతులవారు కూడా చాలామంది వారితో కలసిరి. అంతట నీసమూహము యొక్క యుద్దేశ్యము కేవలము దోపిడిగాక ప్రభుత్వాధికార ధిక్కారముగనే పరిణమించినది. దేశమందంతటను అమితోత్సాహముతో "ఈ ఇంగ్లీషువారి రాజరిక మంతరించినది!

ఇంగ్లీషువారు నాశనమై పోవుదురుగాక!! అను కేకలు ప్రతిధ్వనించెను. కల్లోలము నణచుటకు తోడ్పడుపద్ధతి ఈ ప్రజలలో లేదనియు, ఆపనిని మన పోలీసువారికి సైన్యములకే వదలి ప్రజలు తొలగియున్నారనియు చెప్పి, సరిపెట్టుకున్నందువలన లాభములేదు. స్వదేశరాజ్యములలో కల్లోలములు జరిగి నప్పుడు పలుకుబడి కలవారు తమ పరిజనులను, రైతులను ప్రోగుచేసి ప్రభుత్వమునకు బాసటయై నిలిచిన యుదాహరణము లెన్నియైన నీదేశ చరిత్రలో కనబడుచున్నవి. పైన చెప్పిన కల్లోలములసమయమున మాత్రమిందుకు భిన్నముగా జరిగినది. ప్రజలుకేవలము దూరముగా తొలగి యూరకొనిమాత్రమే యుండలేదు. సర్వసాధారణముగా ఇంగ్లీషు మేజస్ట్రేటులచుట్టు తిరుగుచుండు వారుగూడ ఈకల్లోలము ప్రారంభముకాగానే వివిధ మేజస్ట్రేటులను వదలిపెట్టి, తమ ప్రదేశములలో తమ పలుకుబడి నుపయోగించనెపమున తమతమ యిండ్లకు జని అక్కడ మనుష్యులను ప్రోగుచేయసాగిరి.

కాని ఈ మనుష్యుల నెందుకు ప్రోగుచేసిరి? తాము సంసిద్ధులైయుండి తరుణము రాగానే తమ ప్రభుత్వమునకు వ్యతిరేకముగా నుపయోగించుటకే! ఇట్టివారు కొంతమంది యట్లెదురు తిరిగిరి. శాంతి భద్రతలను కాపాడుటకు ఆ సమయమున వెంటనే తగుచర్య తీసికొనకపోయి యుండినను, పితూరి దారులకును, ప్రభుత్వ బలములకును జరిగిన మొదటి పోరులో అదృష్టవశమున ప్రభుత్వమునకు కలిగిన జయము చేకూరకుండినను, లేదా కొలది దినముల ఆలస్యము జరిగియుండిననూ తీవ్రమైన పెద్దతిరుగుబాటు బయలుదేరియుండి దాని నణచుటకు మనకు ఉత్తర పరగణాలలోగల సైన్యములనెల్ల ఉపయోగింపవలసి వచ్చియుండును – మన యధికారము భగ్నమైయుండును. ఆ సమయమున ప్రభుత్వము వారికి వివిధ జిల్లాల యధికారులకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములను నేను జూచియున్నాను. సహరాన్ పూరునుండి వచ్చిన జాబులోనిట్లువ్రాయబడినది. 'దోపిడిగాండ్ల గుంపొకటి ముందుగా లూటీకొరకు బయలుదేరినది. వారికి కొంత జయము చేకూరగనే ఆగుంపులో నితర గ్రామస్థులుచేరిరి. మరికొన్ని దోపిళ్లు జరిగినవి. అంతట కొలదిదినములలో వీరిసంఖ్య 1200 మందికి పెరిగినది. ఆ జిల్లాలలోని ప్రధానభూస్వామి వీరితో చేరినాడు. వీరిని తనకోటలోని కాహ్వానించి బహిరంగముగనే ప్రభుత్వమును ధిక్కరించినాడు. ఈ పితూరీదారులలో నొకడు రాజబిరుదు దాల్చినాడు. ఆసమయమున ఆంగ్లేయ ప్రభుత్వసైన్యము వచ్చి తారసిల్లినది. ఇట్లు జరుగుట కింకొకదిన మాలస్యమైనను పితూరీలో మూడు వేలమంది చేరియుందురు. అప్పటికే పితూరీలో చేరుటకొరకు ఏబదిమంది మొదలు మూడువందల



మందివరకుగల ముఠా లేర్పడి యుండెనని బయల్పడినది. మన సైన్యములకు మొదటి తాకిడిలో నపజయము కలిగియుండినచో, యెంత బీభత్సము జరిగియుండెడిదో చెప్పశక్యముగాదు. ఈపైన చెప్పిన సంగతులు ప్రభుత్వమువారు కాదనలేదు సరికదా, నిజమేయని ఒప్పుకున్నారు. ఈ కల్లోలమున శ్రమపడిన వారిని మెచ్చుకున్నారు. ఇది గొప్పయదృష్టమే. ఏలన స్థానికోద్యోగుల లనవసరముగా తొందరపడినా రనియు అనవసరమైన దానికన్న ఎక్కుడు తీవ్రమైన చర్యలు తీసికొన్నారనియు చెప్పుచుండుట ప్రభుత్వము వారికి అలవాటు. తిరుగుబాటు యొక్క లక్షణములలో నొకటి అనుమానమును పెంపొందించుట. ప్రభుత్వము యొక్క స్థితిగతులంత బాగుగలేవను పుకారు బయలుదేరును.

ఓరిమిగల వంగదేశీయులకన్న శూరత్వము గల ఉత్తర పరగణాలవారిలో మాత్రమే ఈ భావములున్న వనుకొనుట పొరపాటు. దిగువరాష్ట్రములలో గూడ తిరుగుబాటు సూచనలు పొడసూపియే యున్నవి. వారన్ హేస్టింగ్సుకును కాశీరాజుకును తగవులు కలిగినకాలమున ఒక మారు వారన్ హేస్టింగ్సు చనిపోయెనను పుకారు బయలుదేరెను. అంతట వంగరాష్ట్రములో అనేక జిల్లాలలో ముఖ్యముగారాజషాయి, బీర్‌భూమ్ జిల్లాలలో కల్లోలములు బయలుదేరెను. రివిన్యూ వసూలు చాలరోజులవరకును ఆగిపోయెను. ఆంగ్లేయోద్యోగుల యధికారము కొన్నాళ్లు ఎందుకును పనికిరాకపోయెను. (158-161 దీనిని మార్చిన ప్రత్యేక ప్రకరణముల చూడుడు.)*

ఆంగ్లేయులకీ దేశప్రజలలో నేమాత్రపు పలుకుబడి కలదనునది దీనికి దగ్గర సంబంధముగల విషయము. బ్రిటీష్ ప్రభుత్వమువారు అవలంబించిన విధానమువలన ప్రజలపైన సివిలు ఉద్యోగులకు పలుకుబడి యుండట కావకాశములు కనబడుటలేదు.

దేశములోని రాజుల యధికారమును ఆంగ్లేయులు తీసివేసిరి. వారి సంస్థానములు ఎస్టేటులు లాగికొని, వారికి మనువర్తులిచ్చి, మూలకూర్చుండబెట్టిరి. ఏకార్యము చేయుటకు నుత్సాహము లేక ఏసందర్భములోను పైకివచ్చుట కవకాశము లేకుండనున్నారు. పరువు ప్రతిష్ఠలుగల భూస్వాముల పైన అత్యధికశిస్తులు విధించుటవలనను వారసులమధ్య పంపిణీలవలనను వారు దారిద్ర్యమున బడిపోయినారు. విడదీసిపాలించుమను కుటిలరాజ్యనీతి పరిపూర్ణరూపము దాల్చినది. కొలదిమంది వర్తకులు అంగళ్లవారు తప్ప ఉత్తర రాష్ట్రములలో ధనవంతులగు దేశీయులే కరవైరి. ఆంగ్లేయ ప్రభువులు వీరితో సంబంధము లేకుండ వేరుగానుందురు. అందువలన అమెరికా లోని నీగ్రోబానిసలకును వారి తెల్లయజమానికిని గల సంబంధమే యిక్కడి దేశీయులకును ఆంగ్లేయ ప్రభువులమధ్య ఏర్పడినది.

ఇట్టి స్థితిలో నాంగ్లేయుల కీ ప్రజలలో నెట్టి పలుకుబడియుండును? భయమువల్ల

నేర్పడిన భక్తియేగాని ప్రేమవలన నేర్పడిన విశ్వాసములేదు. తమ అధికారమును సంపదను హరించి తమ్మునాశనము చేసిన ఈ ఆంగ్ల ప్రభుత్వము నీ ప్రజలు ప్రేమింతురా? తమ గౌరవమును తీసివేసి, అధోగతిలోనికి దింపినవారిని వీరు మన్నింతురా? ఇట్లు చెడినవారి బంధుగులు స్నేహితులు పరివారజనములు వీరిని జూచి జాలిపడి లోలోపల మనలను తిట్టుకుందురా? పూర్వకాలమున నెన్నడును లేనంత హెచ్చుగా పన్నులు విధింప బడుచుండగా, జనసామాన్యముగూడ వీరందరితోపాటు మనలను జూచి ద్వేషింపకుందురా? ప్రజలకు పరిపాలనమునం దావంత యైన ప్రసక్తి లేకుండ జేయుటయేగాక జనులలో ఉన్నత తరగతుల నీవిధముగా నాశనముచేసి ఈ దేశమున బ్రిటిష్‌పరిపాలనమును స్థాపించుటవలన నిది తప్పనిసరి యైనదని చెప్పజూతురు. కాని, ఆంగ్లేయు లీదేశము నాక్రమించుటవలన నీయకృత్యములు చేయవలసినపని యెంతమాత్రమును లేదు. దేశములోని ఉన్నతతరగతులకును ముఖ్యముగా పెద్ద భూస్వాములకును వారికిదివరకుండిన అధికారములు సందర్భానుసారముగా కొంత మార్పుజేసియైన పరిపాలించుటలో వారి నుపయోగించుకొని యున్నచో మనము వారి ద్వేషమునకు పాత్రులము కాకుండ నుండుటయేగాక, ఆపదసమయమున మనము వారి సహాయముయొక్క లాభమును పలుకుబడి యొక్క లాభమును వారి బంధుగులు స్నేహితులు పరిజనులతోడ్పాటునుగూడ పొందియుందుము. భారతీయునిచేతిలో నెట్టి యధికారముగాని యుండుటను సహింపని పెచ్చుపెరిగి, యిట్టి విపరీతస్థితికి తెచ్చినది. ఒకరాష్ట్రము మనచేతులో పడగనే ఈ దుఃఖస్థితి యెట్టి తారతమ్యములేక అందరికిని దాపురించు చున్నది. మనకు సాయముచేసినవారు మనల నెదిరించినవారుగూడ మనవలన సమానాదరణమునే పొందుచున్నారు. దేశప్రజలందరు నీమాట చెప్పుకొనుట నేను స్వయముగా వినియున్నాను. (162-163)

భారతదేశమున బ్రిటీష్ ప్రభుత్వముయొక్క స్థిరత్వమునుగూర్చి కొన్ని మాటలు చెప్పెదను. ఆంగ్ల పరిపాలన మీదేశమున కదల్చుటకు వీలు లేనంత గట్టిగా స్థిరపడినదని చాలామంది యభిప్రాయము. మన యధికారముపట్ల తిరుగుబాటు కలిగిన కలుగవచ్చునుగాని, అది చాలా దూరపు సంగతి యని తలచి ఆసంగతినే ఆలోచింపరు. దేశీయ ప్రభుత్వములలో నైకమత్యము లేక పోవుటవలనను తగిన బలముగల పరరాజ్య ప్రభుత్వములు లేకపోవుటవలనను మన కేభయమును లేదని యనుచుందురుగాని, కొందరుమాత్రమింకొక విధముగా తలచుచున్నారు. సమర్థులైన గ్రంథకర్తలు చాలామంది అట్టి పరిస్థితి త్వరలోనే కలుగవచ్చుననియు అభిప్రాయపడియున్నారు.* మన సామ్రాజ్యము



ఒక గొప్పవరదలో మేటవేసిన ఇసుకతిప్పవలె నేర్పడినది. స్వతస్సిద్ధముగా దీనిలో స్థిరత్వములేదు. దీనిని స్థిరపరచుటకు వలసిన పనులును మనము చేయలేదు. మనము దీనిచుట్టు గట్లు వేయలేదు. గొప్పవేళ్లు పారిగట్టి చేయగల వృక్షములు నాటలేదు. ఈ సామ్రాజ్యము వైపునకు దృష్టి మరల్చినా వారందరును కేవలము దీనినుండి ఎంతబంగారము తవ్వి ఎత్తుకొనిపోవ వీలుగలదా యని మాత్రమే ఆలోచించినారు. క్రొత్తఇసుక ప్రోగులుపోసి, మరమ్మతు చేయుట కప్పుడప్పుడు కొంద రుద్యోగులను నియమించిరి. ఇది తాత్కాలికముగా కొంత ఉపయోగించినను, ఈ మహానిర్మాణము దాని యొక్క బరువుకే అది కృంగిపోవునట్లున్నది. లేదా, మరియొక మహాప్రవాహ సమయమున కోసుకొనిపోవు నట్లున్నది. హాలెండు దేశములో సముద్రములోనికికట్టిన 'డైకు'లనుగట్టి అడ్డకట్టలలో నొకటి ఒకయెలుకకన్నమువలన పాడైకొట్టుకొని పోయినది. ఈ దేశమునకు వాటిల్లగల ముప్పు దేశీయరాజుల గూడుపుఠాణీవలనగాని ముందుగా ఆలోచించి చేయు తిరుగుబాటువలన గాని కలుగునని నేను తలంపను. మన మెవ్వరము అనుకొనని సమయమున నది తటస్థించును. ఏదో యొక చిన్నకలవరములో నది యుద్భవించును. తమ్ము అణచుటకు పంపబడిన చిన్ని సైన్యమును పితూరీదారు లోడించిన అదృష్టములో నది యుద్భవించును. అంతట అంటుకొనిన అడవివలె భావములు చెలరేగి, ఆర్పుటకు వీలులేదన్నట్లుగా దేశములో నంతటను వ్యాపించును. (165-166)

బ్రిటిష్ పరిపాలనము శ్రేష్ఠమైన దను సంగతియు దానివలన ప్రజలు పొందుచున్నారను లాభములును మనము గోడలపైన చిత్రించు స్వక పోలకల్పితపు సంగతులే గాని, వేరుకావు.ప్రజలు ఘోషించుచున్న బాధలను అన్యాయములను మాన్పగలవారు ముందుగనే ఈ హెచ్చరికను గమనింపవలెను. ఈ దేశాక్రమణమును జేయుటలోనే యన్యాయములున్ననుదీని నిప్పుడు మన చేతులలో నుంచుకొనుటలో మాత్రము పరమార్థము నాలోచింపవలెను. ప్రజల యభీష్టములకు వ్యతిరేకముగా సైనిక బలముచేతగాక, ప్రజానురంజకముగా వారి భక్తి విశ్వాసములను పొందుట మూలముననే మనము వారి నేలవలెను" అని 1833లోనే షోరుగారు వ్రాసియున్నారు.

*– ఆంధ్రపత్రిక, 30.04.1941*



* 1833లో షోర్‌గారు చెప్పిన జోస్యము త్వరలోనే ఫలించినది. 1857లో స్వాతంత్ర్యవిప్లవము జరిగినది. వాల్యూం 1, పేజి.145-165.

# మద్రాసు మహాజనసభ

**1844**లో చెన్నపట్టణమునుండిన దేశాభిమానులైన పురప్రముఖులు కొందరు, ప్రజల కష్టములను గురించి విచారించి దానిని గూర్చి ప్రభుత్వమువారికి విన్నపములను, మహజరులకు పంపుటకొర కొక ప్రజాసంఘముగా నేర్పడిరి. దానికి 'మద్రాసునేటివు అసోసియేషన్' అని పేరు పెట్టుకొనిరి. దానికి అధ్యక్షుడు చెన్నపట్టణములోని తెలుగు వర్తకులలో నొకడైన శ్రీ గాజుల లక్ష్మీనర్సుసెట్టిగారు. ఈయనకు లక్ష్మీనరసింహులు సెట్టిగా రనికూడా పేరు ఈ సంఘమువారు చాలా కష్టపడి ప్రజాసేవచేసిరి. ఆ కాలమున క్రైస్తవ మతబోధకులు చెన్నపట్టణమునందు చాలా పలుకుబడి కలిగి యుండిరి. దేశీయులను తమ మతమునందు కలుపుకొనుటకనేక విధములుగా ప్రయత్నించుచుండిరి. ప్రభుత్వ పాఠశాలలందు తమ మతగ్రంథమైన బైబిలును ప్రవేశపెట్టుటకు పూనుకొనిరి. మద్రాసు దేశీయ ప్రజాసంఘము వారీ మిషనరీల దుష్ప్రయత్నములను ప్రతిఘటించిరి.

హిందువుల స్థితిని బాగుపరచు నుద్దేశ్యముతో లక్ష్మీనర్సు గారు 'క్రెసెంట్' అను ఇంగ్లీషు వార్తాపత్రికను 1844లోనే స్థాపించి యుండిరి. దానికి వేపేరిలో నుండిన హార్లే అనునొక ఆంగ్లేయుని సంపాదకునిగా నియమించిరి. అతడు చాలాసమర్థుడు, నిర్భయుడు, స్వాతంత్ర్యప్రియుడు. పైన చెప్పిన మిషనరీల యక్రమ ప్రయత్నములను గూర్చి తీవ్రముగా విమర్శించుచు ఆ పత్రిక చాలా జయప్రదమైన ఆందోళన జరిపించెను.

ఆకాలములో రైతులవలన శిస్తులు వసూలు చేయుటలో తూర్పు ఇండియా వర్తక కంపెనీ సర్కారువారి యుద్యోగులు చాలా నిరంకుశముగా ప్రవర్తించుచు అనేక చిత్ర హింసలు చేయుచుండిరి. ఈ యన్యాయమును గూర్చి దేశీయ ప్రజాసంఘమువారు 1850 మొదలు ఇంగ్లాండులోని పై యధికారుల కనేక విన్నపములను, మహజరులను పంపించి ఆందోళనము చేసిరి. దీని ఫలితముగా నొక హింసల విచారణసంఘము నియమింప బడెను. దేశీయ ప్రజాసంఘమువారు విన్నవించిన సంగతు లన్నియు నిజములే యని బయల్పడెను. అంతట నీ యక్రమపు పద్ధతులను రద్దుచేయుచు కొన్ని సంస్కరణలు గావించిరి.



ఈ ఆందోళనము నందెల్ల శ్రీలక్ష్మీనర్సు సెట్టిగారికి పి.సోమసుందరం సెట్టిగారు కుడిభుజమువలె పనిచేసిరి. ఆయన మద్రాసు నేటివు అసోసియేషనుకు గౌరవకార్యదర్శిగా నుండి చాలా ఉత్సాహముతో పనిచేసిరి. లక్ష్మీనర్సుసెట్టిగారు 1868లో చనిపోగా ఆయన స్థాపించి నడుపుచున్న దేశీయప్రజాసంఘమును, క్రెసెంటు పత్రికయు నిరాధారములై, బలహీనములై కొంతకాలమునకు అంతరించినవి.

ప్రజలలో మరల కొంత యుత్సాహమును జాతీయచైతన్యమును కలిగింపవలెనని కొందరు ప్రజానాయకులు ప్రయత్నించిరి గాని పదేండ్ల నాటి చెన్నపట్టణములోని రాజకీయజీవనము నిర్జీవముగ స్తబ్ధమై యుండెను. (Mahajana Sabha Golden Jubilee Number)

## హిందూపత్రికా స్థాపనము

ప్రజల యావశ్యకతలనుగూర్చి ప్రకటించు వార్తాపత్రిక యొకటి అవసరమని గ్రహించి రాజా సర్ టి.మాధవరావుగారును, దివాన్ బహద్దరు ఆర్.రఘునాథరావుగారును, రంగనాథ మొదలియారుగారును పూనుకొనగా 'నేటివ్ పబ్లిక్ ఒపీనియన్' అను పత్రిక యొకటి స్థాపింపబడెను. తరువాత మైసూరులో న్యాయాధిపతియైన ఏ.రామచంద్రయ్యరు గారు స్థాపించిన 'మద్రాసీ' యను పత్రికలో నీ పత్రిక కలిపివేయబడినది. ఈ పత్రిక కొంతకాలము చక్కగానే నడుపబడెను గాని త్వరలోనే అది కొందరు స్వార్థపరుల చేతులలో పడెను. 1877లో సర్ టి.ముత్తుస్వామి అయ్యరుగారిని మద్రాస్ హైకోర్టులో న్యాయమూర్తిగా నియమించు విషయములో నీ పత్రిక అనిష్టమును ప్రకటించుటవల్లనే దాని నిజస్వభావము వెల్లడి యయ్యెను. అంతట నిది ప్రజాదరణము గోల్పోయి త్వరలోనే యంతరించెను. ఇట్లు చెన్నపట్టణమున ప్రజాసేవ చేయు పత్రికయే లేకపోయెను.

ఆ సమయమున ననగా 1876లో లిట్టన్ ప్రభువు భారతదేశమునకు రాజప్రతినిధి యయ్యెను. రెండురాష్ట్రములు కరవులో మునిగి బాధపడుచుండగా నీ ప్రబుద్ధుడు 1877లో ఢిల్లీ దర్బారు నతివైభవముగా జరిపెను. దేశము కరవులోనుండి బయలుపడెనో లేదో ఇంతలోనే యితడు క్రొత్త పన్నులు విధింపసాగెను. దేశీయ వార్తాపత్రికల నిరోధక శాసనమును జేసెను. దేశీయులు ఆయుధములు ధరింప వీలులేకుండ నొక శాసనమును జేసెను. అతనికీ దేశీయులపట్ల దయాదాక్షిణ్యములు లేవు. పైన చెప్పిన చర్యలవలనను, ఇతడు చేసిన ఇతర చర్యలవల్లను ప్రజలలో అసంతృప్తి కలిగెను. ఈ నిరంకుశ ప్రభుత్వమును గూర్చి విద్యాధికులైన దేశీయులు క్లబ్బులలోను, సంఘ సభలలోను విమర్శింపసాగిరి.

కాని ఈ యభిప్రాయములనెల్ల కేంద్రీకరించుటకు గాని, ప్రజలలో దీనిని గూర్చి ప్రచారము చేయుటకుగాని ఒక వార్తాపత్రిక గాని, ప్రజాసంఘముగాని లేనందువలన ప్రజల క్షేమలాభములనుగూర్చి గట్టి కృషి చేయుట కవకాశము లేకుండెను. కలకత్తాలోను, బొంబాయిలోను అట్టి పత్రికలును, ప్రజాసంఘములు, ఉండి నందువలన కొంత పని జరుగుచుండెను. చెన్నపట్టణమున నట్టిది లేని కొరత విద్యాధికుల మనస్సులకు బాగుగా తట్టెను. చెన్నపట్టణములో చాల కాలము క్రిందటనే తిరువల్లిక్కేణి వైజ్ఞానిక సంఘమొకటి యుండెను. ఈ లిటరరీ సొసైటీలో ఆకాలమున సర్వకళాశాలలో చదువుచుండిన విద్యార్థులు సభ్యులుగా నుండిరి. అందులో జి.సుబ్రహ్మణ్యయ్యరు, టి.టి.రంగాచార్యులు, పి.వి.రంగాచార్యులు, డి.కేశవరావుపంత్, ఎం.వీరరాఘవాచార్యులు, న్యాపతి సుబ్బారావు పంతులు అను ఆరుగురు బుద్ధిశాలురు పైపరిస్థితుల నాలోచించి ఒక ఇంగ్లీషు వార్తాపత్రికను స్థాపించుటకు నిశ్చయించిరి. అంతట 1878వ సం॥ సెప్టెంబరు 20వ తేదీన హిందూ పత్రిక ఒక వారపత్రికగా ప్రకటింపబడెను. దానికి సుబ్రహ్మణ్య అయ్యరుగారే సంపాదకులుగానుండిరి. దేశములో గొప్ప సంచలనము కలిగెను. The Hindu Golden Jubilee Number - 1928.

## మద్రాస్ నేటివ్ అసోసియేషన్

1878లో హిందూపత్రిక వారపత్రికగా స్థాపింపబడుటతో చెన్నపట్టణమునను దక్షిణ హిందూదేశమునకు రాజకీయముగా నొక నూతన యుగారంభమైనదని చెప్పవచ్చును. ఆ పత్రికను స్థాపించినవారిలో ప్రముఖులైన జి.సుబ్రహ్మణ్య అయ్యరుగారును, ఎం. వీరరాఘవాచార్యులుగారును పూర్వకాలమునాటి మద్రాస్‌నేటివ్ అసోసియేషన్ అను ప్రజాసంఘమును కూడా పునరుద్ధరించుటకు పూనుకొనిరి. అంతట నాపేరుతో నొక ప్రజాసంఘము స్థాపింపబడి నది. దానికి తరువాత చెన్నపట్టణమున హైకోర్టు న్యాయమూర్తిగ నుండిన (సర్) వి. భాష్యం అయ్యంగారు అధ్యక్షులుగా నియమింపబడిరి.

ఎంతో సమర్థతతో నిర్వహించినను ప్రజాసేవ నిమిత్తము వార్తా పత్రిక చేయగలకృషి సంకుచితముగనే యుండును. ప్రజల బాధలనుగూర్చి తగిన ఆందోళనచేయుటకును ప్రజలలో రాజకీయ పరిజ్ఞానము కలిగించుటకును ప్రజాసంఘ ముండి తీరవలెను. రైతుల స్థితిగతులను గూర్చియు, ప్రభుత్వమునందు దేశీయులకు పలుకుబడి యుండుటను గూర్చియు, ఇంకను ప్రజలక్షేమలాభములకు సంబంధించిన ఇరత విషయములను గూర్చియు ఎంత సమర్థులైనను వ్యక్తులు చేయగల కృషి బహుస్వల్పముగా నుండును.



దానిని గూర్చి గట్టి పనిచేయుటకు ప్రజాసంఘమే సర్వవిధములుగను సామర్థ్యము కలిగియుండును.

ఆ కాలములో ప్రభుత్వోద్యోగులు ప్రజా సంఘములందు చేరగూడదను నిషేధము లేదు. అందువలన పైన చెప్పిన విధముగా స్థాపింపబడిన దేశీయ ప్రజాసంఘమునందు చాలామంది ప్రభుత్వోద్యోగులుకూడా సభ్యులుగా చేరిరి. ప్రభుత్వమువారి పట్ల భయభక్తులు కలిగి తమ కష్ట సుఖములను గూర్చి చాలా అడకువతో విన్నపములను, మహజరులను పంపుచుండునంతకాలము అట్టి పత్రములందు ప్రభుత్వోద్యోగుల సంతకము లుండుట యొకవిధముగా లాభకరముగనే యుండెను. అయితే కొలది కాలములోనే ప్రభుత్వవైఖరి మారిపోయెను. 1881వ సం॥ నవంబరు నెలలో సర్ మౌంట్ స్టూవార్టు గ్రాంట్‌డఫ్‌గారు చెన్నపట్టణమునకు గవర్నరై తమ నిరంకుశ పరిపాలనమును ప్రారంభించిరి. దేశీయ ప్రజాసంఘములందు ప్రభుత్వోద్యోగులు చేరు విషయమున బహిరంగముగా నెట్టి నిషేధమును చేయకపోయినను, ఆప్రజాసంఘము యొక్క వ్యవహారములందు పాల్గొనెను. ప్రభుత్వోద్యోగుల ననుమానముతో జూచుట ప్రారంభించెను. అంతట సర్కారు ఉద్యోగులొక్కరొక్కరే దేశీయ ప్రజాసంఘమునుండి జారిపోయిరి. కొంతకాలములోనే ఆసంఘము అంతరించెను.

## మహాజనసభ

క్రొత్త గవర్నరుగారి చర్యలు చాల నిరంకుశముగ నుండెను. సేలములో నొకచోట నొకక్రొత్త మశీదును కట్టగా దాని ప్రక్కనుండి హిందువుల యూరేగింపులు పోవు విషయమై తగవులు వచ్చి పోట్లాట జరిగెను. అంతలో నిదియొక రాజద్రోహకరమైన తిరుగుబాటు అని దీనికి పేరుబెట్టి దానిని అణచుట కతితీవ్రమైన విధాన మవలంబింపబడెను. చాలమంది నిరపరాధులపైన కుట్రనేరములను మోపి ద్వీపాంతరములకంపిరి. ఈ విషయముననేగాక, చెంగల్పట్టు లోని వ్యవహారములందు కూడా గవర్నరు అతి నిరంకుశుడై ప్రవర్తించెను. ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి ప్రబలెను. దీనినిగూర్చి ఆందోళన చేయుటకు ఒక బలమైన దేశీయప్రజాసంఘము అవసరమయ్యెను. దీనిని స్థాపించు విషయమును గూర్చి చెన్నపట్టణములోని ప్రముఖులు కొందరు తీవ్రముగా ఆలోచింపసాగిరి.

హిందూ పత్రిక 1883వ సం॥ అక్టోబరునెల 1వ తేదీ మొదలు వారమునకు మూడు పర్యాయములు ప్రకటింపబడసాగెను. ఇందులోసేలములోని యధికారులు చేయుచుండిన అన్యాయములు విమర్శింపబడెను. ఆ కాలమునాటి దేశీయ నాయకులకు

హిందూపత్రికా కార్యాలయమే కార్యాలోచన మందిరముగ నుండెను. వారిలో ఆంధ్రులగు సి.రంగయ్య నాయుడుగారును శ్రీమాన్ పనప్పాకం అనంతాచార్యులును ముఖ్యులు. వీరును, ఇతరులును ఆలోచించి మద్రాసు మహాజనసభ యను ప్రజాసంఘమును 1884లో స్థాపించిరి. చెన్నపట్టణములోని ప్రజాసేవకులందరును ఈ సంఘమునందు సభ్యులైరి. అంతట ప్రజాక్షేమమునకు సంబంధించిన వ్యవహారములెల్ల నీ ప్రజాసంఘము ద్వారముననే జరుపబడసాగెను.

చెన్నపట్టణములో కేంద్ర ప్రజాసంఘమును, రాజధానిలోని వివిద ప్రాంతములం దుపశాఖ ప్రజాసంఘములను స్థాపించవలెనని ఈ సభాస్థాపకుల యుద్దేశ్యము. సభను స్థాపించినది మొదలు కొంతకాలమువరకును దాని కార్యస్థానము హిందూపత్రిక యుండిన మౌంట్ రోడ్డులోని 100వ సంఖ్య ఇంటిలోనే యుండెను. చెన్నపట్టణములో నసంఖ్యాకములైన దానధర్మములను గావించిన ఆనంద గజపతి మహారాజులవారీ హిందూపత్రికా కార్యాలయముండిన గృహమును కొనుటకు సహాయము చేసి యుండిరి. మద్రాసు మహాజనసభకు మొదటి అధ్యక్షులు పి.రంగయ్యనాయుడుగారే. వీరరాఘవాచార్యులుగారును, అనంతాచార్యులుగారును సంయుక్త కార్యదర్శులు.

తెల్లనికోటు, పూర్వకాలపు తలపాగ దరించి ముఖమునతెల్లని పెద్దబొట్టుతో పి.రంగయ్యనాయుడు గారనుదినమును హిందూపత్రికా కార్యాలయమునకు వచ్చుచుందురు. ఈయనయు, వీరరాఘవాచార్యులుగారును, సుబ్రహ్మణ్యఅయ్యరుగారును మతాచారములందు, అభిప్రాయములందు వివిధ సంప్రదాయములకు చెందిన వారయ్యు దేశాభిమాన మునందు మాత్రము ఏకీభవించి ప్రజాసేవనిమిత్తమే స్నేహితులై యుండిరి.రంగయ్యనాయుడుగారికి నిజదేశవేషభాషలపై నభిమానము మెండు. ఆంగ్లేయుల జాత్యంహకారమును సహింపడు. ఈయన సనాతన ధర్మవీరుడు.ఆస్తికుడు.దేశముకొరకు ఎంతటి స్వార్థత్యాగమునైన చేయుటకు వెనుదీయడు.

పనప్పాకం అనంతాచార్యులుగారు అచ్చమైన ఆంధ్రుడు. ఈయన సుప్రసిద్ధుడైన న్యాయవాది. శాసనసభలో సభ్యుడై పేరుపొందెను. ఈయన తన విమర్శలను నిర్భయముగా వెలిబుచ్చుచుండెను. ఈయన సంస్కృతాంధ్రాంగ్ల భాషలయందు నిరుపమానమైన విద్వాంసుడు. ఈయన 1884 మొదలు, హిందూకార్యాలయముననే ప్రకటింపబడుచుండిన 'పీపుల్సుమాగజీన్' అను మాసపత్రికను అతిసమర్థతతో నడుపసాగెను. ఆయన 1891లో నాగపురమున జరిగిన జాతీయమహాసభకు అధ్యక్షులై మహోపన్యాసమును జేసి ప్రఖ్యాతుడయ్యెను. ఆయన పేరు పి.ఆనందాచార్యులని ప్రఖ్యాతిజెందినను ఆయన



ఎల్లప్పుడును అనంతాచార్లు అనియే వ్రాలుచేయుచు తమ ఆంధ్రత్వమును ప్రకటించుకొను చుండిరి. మహాజనసభవారి పక్షమున వ్రాయబడిన అనేకవిన్నపముల, వినీతపత్రముల, మహజరుల వ్రాసిన దాయనయే. ఆయనకు గొప్పగొప్ప దేశములు దొరలు చాలమంది స్నేహితులై యుండిరి. ఇంగ్లాండు నుండి వచ్చిన పార్లమెంటుసభ్యులు, సంఘసంస్కర్తలు, క్రైస్తవ మతబోదకులు నాయన కతిథులై పోవుచుండిరి. పురశవాకములో, పూనమల్లివీథిలోని లేక్‌వ్యూ అనబడు ఆయన గృహము ఎల్లప్పుడును వచ్చి పోయెడువారితో నిండియుండెను.

1884లో మద్రాసు మహాజనసభ స్థాపింపబడునాటి కింకను కాంగ్రెస్ జాతీయ మహాసభ స్థాపింపబడలేదు. పూనా సార్వజనిక సభతోపాటు, కలకత్తాలోని ఇండియన్ అసోసియేషన్ తోపాటును మన మద్రాసు మహాజన సభ కాంగ్రెస్ స్థాపనకు దారిదీసిన దని చెప్పవచ్చును. చెన్నపట్టణ మమాజన సభ సభ్యులును, అడయారులో జరిగిన దివ్యజ్ఞానసమాజము యొక్క మహాసభకు దేశములోనుండి వివిధ ప్రాంతములనుండి వచ్చిన దేశీయ ప్రముఖులును కలిసి సమావేశమైన ఒక సభలో అఖిలభారత జాతీయ ప్రజాసభను నిర్మించుటను గూర్చిన చర్చ జరిగి ఆమోదింపబడినట్లు కూడా తెలియవచ్చుచున్నది.

రాజకీయ వ్యవహారములందు భారతీయుల పక్షమున పనిచేసి ప్రభుత్వమువారికి ప్రజల యభిమతమునుగూర్చి తెలిపి ప్రజాభిప్రాయమును మన్నించునట్లు ఒత్తిడిచేయుటకు బలీనమైన రాజకీయ ప్రజాసంఘమును నిర్మించుట అత్యవసరమని అందరికిని తెలిసివచ్చెను. చెన్నపట్టణములో గవర్నరైన గ్రాంట్ డఫ్‌గారివలెనే గవర్నరుజనరలైన లిట్టన్ ప్రభువుకూడ నిరంకుశుడై ప్రవర్తించుచుండినందువలన ఇట్టికేంద్ర ప్రజాసంఘమును స్థాపించుట అత్యవసరమయ్యెను.

లిట్టన్ తరువాత వచ్చిన రాజప్రతినిధియైన రిప్పన్ ప్రభువు, మంచివాడు ప్రజానురంజకుడు. అయితే ఆయన - ప్రజలపట్ల సానుభూతి కనబరచుట ఆంగ్లేయోద్యోగులకును, ఈ దేశములో నుండిన ఆంగ్లేయ జనసంఘమునకును ఇష్టములేదు. అందువలన వారాయన ప్రయత్నముల కడ్డు తగులసాగిరి.

న్యాయవిచారణలందు తెల్లవారిని నల్లవారితో సమానముగ పరిగణింపదలచిన "ఇల్‌బర్టుబిల్లు" అనబడు శాసనమును చేయదలపగా నాంగ్లేయులందరు నేకమై అతితీవ్రమైన ఆందోళనమును చేసి దానిని ప్రతిఘటించిరి. అంతట ప్రభుత్వము వారు భయపడి ఆ చట్టమును ఉపసంహరించుకొనిరి. ఇందువలన రాజకీయాందోళనము యొక్క ప్రభావము దేశీయులకు తెలిసివచ్చెను.

ఆంగ్లేయ ప్రభుత్వము తెల్లవారి జాత్యహంకారముపైన నాధారపరుపబడియున్నదను సంగతి వెల్లడియయ్యెను. కాని ఆధిక్యతను శాశ్వతముగా నిలువబెట్టుకొనుటకు వారు ప్రయత్నించు చున్నట్లు స్పష్టపడెను. దీనిని ప్రతిఘటించుటకు దేశీయు లేకమై కృషి చేయవలసిన యావశ్యకత బోధపడెను. అందుకొరకు సంఘీభావమును అభివృద్ధిచేయుట అవసరమని గ్రహించిరి. వివిధ రాష్ట్రములలో వివిధ ప్రజాసంఘము లున్నను భారతజాతీయ విషయమున నవి కలసి పనిచేయలేకపోవుట యొక గొప్పలోపమనియు, అట్లు పాటుపడగల ఒక కేంద్రజాతీయమహాసభ యుండుట అత్యంతావశ్యక మనియు గ్రహించిరి. అయినను అది వెంటనే స్థాపింపలేకపోయిరి. జనానురంజకుడైన రిప్పన్ ప్రభువు తన యుద్యోగమును విరమించి 1884లో సీమకు పోవుచుండగా, ఆయనను సమ్మానించుటకు భారతీయులత్యుత్సాహమును ప్రదర్శించిరి. చాలచోట్ల సభలు చేసిరి. ఆయనకు బొంబాయిలో అనేక వినతి పత్రములొసగబడెను. అందులో మద్రాసు మహాజనసభవారి దొకటి. దానిని సమర్పించుటకొరకు అనంతాచార్యులు గారును, పి.రంగయ్య నాయుడుగారును, పి.త్యాగరాయసెట్టిగారును, పి.సోమసుందరము సెట్టిగారును స్వయముగా బొంబాయికి వెళ్ళిరి. సోమసుందరంసెట్టిగారే ఆ వినతిపత్రమును జదివిరి. అప్పటి కాయన కడు వృద్ధుడు. 40 సంవత్సరముల క్రిందట 1844లో గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారితో కలసి ఆయన మద్రాస్ నేటివు అసోసియేషన్ స్థాపించి, దానికి కార్యదర్శిగ నుండిననాడు తను తలపెట్టిన రాజకీయ కృషి నేటికి కొంత వరకు సఫలమైనదికదా యని ఆయన సంతోషించుచుండెను.

1884లో దక్షిణ హిందూదేశ ప్రజల యభిప్రాయమును ప్రకటింపగల ఏకైకరాజకీయ ప్రజాసంఘమా మద్రాసు మహాజనసభయొక్కటే. మద్రాసు రాజధానిలోని వివిధ ప్రాంతములలో నుండు సభ్యులను చెన్నపట్టణమునకు రప్పించి సమావేశపరచి ఐకకంఠ్యమైన ప్రజాభిప్రాయమును కలిగింపదలచి ఈ మహాసభ స్థాపించిన మొదటి సంవత్సరములోనే వివిధ ప్రాంతముల ప్రతినిధుల సమావేశము నొకదానిని ఏర్పాటు చేసిరి. ఈ సమావేశము 1884వ సం॥ డిశంబరు 29, 30 తేదీలలోను 1885 జనవరి 1, 2 తేదీలలోను మొత్తము నాలుగు దినములు జరిగెను. దేశముయొక్క రాజ్యాంగమును గూర్చియు, కేంద్ర రాష్ట్రీయ శాసనసభల అధికారములను గూర్చియు, న్యాయవిచారణ శాఖను, ప్రభుత్వశాఖను విడదీయుటను గూర్చియు, వ్యవసాయదారుల స్థితిగతులను గూర్చియు, స్థానిక స్వపరిపాలనా సంస్థల అధికారబాధ్యతలను గూర్చియు ఇంకననేక విషయములను గూర్చియు చర్చింపబడెను. ఇట్లు కాంగ్రెసు మహాసభ జరుగుటకు



ముందుగనే మద్రాస్ మహాసభ రాజకీయ సంస్కరణలను గూర్చి వార్షిక సభయందు చర్చింప ప్రారంభించెను.

1885వ సంవత్సరము డిశంబరు నెలలో మద్రాసు మహాసభయొక్క రెండవ వార్షిక సమావేశము జరిగెను. ఇది బొంబాయిలో జరిగిన మొదటి కాంగ్రెస్ మహాసభ సమావేశమునకు కొద్దిరోజులకు ముందుగా జరిగెను. ఈ సభకు వచ్చిన ప్రతినిధులే తరువాత మద్రాస్ రాజధానికి ప్రతినిధులుగా బొంబాయిలోని కాంగ్రెస్ సభకు వెళ్ళిరి.

సర్ మౌంట్ స్టూవార్టు గ్రాంట్ డఫ్‌గారి నిరంకుశపరిపాలన మెట్టకేలకు 1886వ సం॥ డిశంబరు నెలలో అంతమయ్యెను. అప్పుడు మద్రాసు మహాసభవారు మర్యాద కొరకాయన కొక వినతిపత్రమును సమర్పించిరి. ఆమహానుభావుడు తన సహజగర్వముతో – "మీరు రాజకీయ హక్కులను అపేక్షించుటకు ముందుగా మీ పెరళ్ళను శుభ్రముగా నుంచుట నేర్చికొనవలె"నని తన ప్రత్యుత్తరమున జెప్పెను.

1887లో సం॥ ఏప్రిలు 16, 17వ తేదీలలో మహాసభ యొక్కమూడవ సమావేశము కుంభకోణమున జరిగెను. తరువాత నీ సభ కాంగ్రెస్ మహాసభకు ప్రతినిధులను పంపు స్థాయి సంఘముగా పనిచేసెను. ఇట్టి స్థితిలో 1907వ సంవత్సరమున న్యాపతి సుబ్బారావు పంతులుగారి అధ్యక్షత క్రింద జరిగిన సభలో నొక ప్రత్యేక రాష్ట్రీయ కాంగ్రెస్ ఉపసంఘమును స్థాపించుటకు తీర్మానింపబడెను.

– ***ఆంధ్రపత్రిక, 5.5.1948***



# మరాఠీ సైనిక శిబిరాల బజారు విశేషాలు

మైసూరు రాజైన టిప్పుసుల్తానుతో ఇంగ్లీషువారు యుద్ధంచేసి బెంగుళూరు పట్టుకొన్న తరవాత శ్రీరంగపట్నం మీదికి పోవాలని ఆలోచించారుగాని సాధన సామగ్రి చాలక చాలా చిక్కులు పడి యుద్ధంలో జయం దుర్భరమని తలచి 1791 మే 20వ తేదీన గవర్నరు జనరలున్నూ సేనానాయకుడున్నూ అయిన కారన్‌వాలీసు తన సైనిక దళాన్ని వెనుకకు మరలించాడు. ఇంగ్లీషు సైన్యాలు వెనుకకుపోతూ మొదటిరోజు ప్రయాణం పూర్తి అయ్యేసరికి ఎడమ ప్రక్కనుంచి ఒక పెద్ద అశ్వదళం వస్తూవున్నట్లు కనబడింది. ఈ పక్కనుంచి శత్రుసేనలు వస్తాయని అనుకోలేదు గాని టిప్పుసుల్తానుయొక్క అశ్వికదళం అతిచురుకుగా నడుస్తూ వుండడం అందరూ ఎరిగిన వాళ్లవడంవల్ల ఇది టిప్పుసుల్తాను సైన్యమేననీ తమ ఆహారపదార్థాలనూ సామగ్రిని అడ్డంకొట్టడానికి వస్తూవున్నదని భయపడి యుద్ధానికి సిద్ధమై ముందువచ్చే సైనికులమీద తుపాకులు కాల్చడం ప్రారంభించారు. అంతట ఆవచ్చే వాళ్ళలో ఒకడు "మేము మరాటీ సైనికులమయ్యా!" అని ఎలుగెత్తి అర్చాడు. ఈ వచ్చిన సైన్యాలు ఇంగ్లీషువారికి సహాయం చెయ్యడానికి వచ్చిన మహారాష్ట్ర సైన్యాలు!! ఇందులో ఒక సైన్యానికి పరశురామభావుగారు సేనాధిపతి. రెండవదానికి హరిపంతులు సర్వసేనాని. ఈ సైన్యాలు నూటయాభైమైళ్లనుంచి వచ్చి కలుసుకున్నవి. తాము వస్తూన్నామని వీరు ఒక నూరుమంది చారులను ముందుగా పంపించారు. గాని వారినందరినీ టిప్పుసుల్తాను సైనికులు పట్టుకుని ఇంగ్లీషువారికి వార్త చేరకుండా అడ్డంగొట్టారు. ఈసైన్యాలు కాస్తముందు వచ్చినట్లైతే ఇంగ్లీషువారికి నష్టంకలగకపోయేది.

ఏది యెలాగవున్నా ఈ సమయంలో నైనా ఈమహారాష్ట్రులు సైన్యాలు సహాయంగా రావడం చాలా మంచిదైంది. రవాణాకు ఎడ్లుచాలక బాధపడుతూవున్న ఇంగ్లీషు సేనకు వీరు మంచి ఎడ్లను యిచ్చారు. ఇంగ్లీషు సైన్యానికి కావలసిన ఆహార పదార్థాలు ఇతరసరుకులూ పుష్కలంగా ఇచ్చి సహాయం చేశారు.

"ఈ మమారాష్ట్ర సేన ఒక అల్లరిమూకలాగవుంది. దీని వెంబడిని రకరకాల



సరుకు లమ్మేవర్తకులూ వివిధవృత్తులు చేసుకునే వాళ్లూవస్తున్నారు. ఇది ఒక పెద్ద సంతలాగ వున్నది. దీన్ని చూస్తే దేశం చాలా శాంతంగా ఉన్న సమయంలో ఏమహాగనరంలోనో వర్తక వ్యాపారాలూ వృత్తులూ యధేచ్చగా చేసుకుంటూవున్నట్లు ఉన్నదిగాని శత్రురాజ్యం మధ్యలో యుద్ధానికి పోతూవున్న సైనిక శిబిరంలాగ లేదు" అని కర్నల్ విల్‌క్సు (Colonel Wilks) వ్రాశాడు. లెఫ్టినెంటు మూర్ (Moor) ఇంకాచిత్రంగా వర్ణించాడు. సామాన్యంగా యుద్ధాలలో సరియైన ఆహారంగాని జీవితావసరాలుగాని దొరకక కృశించి తిరిగే సైనికులకు, ఈమహారాష్ట్ర సైనిక శిబిరంలోని బజారులలో కనబడే దృశ్యాలు చాలా ఆశ్చర్యకరంగా వుంటాయి. ప్రాచ్యపాశ్చాత్యదేశాల వస్తువులన్నీ అక్కడ కనబడినవి. ఇంగ్లీషుదేశపు బ్రాడ్‌క్లాత్ (Broad Cloth) మొదలుకొని బర్మింగుహాంలోచేసిన పేనాకత్తులవరకూ, కాశ్మీరశాలువలు మొదలు హిందువులు ధరించే పాతదుస్తులు వరకూ, వెలలేని వజ్రాలు మొదలుకుని బీదకాపుకన్నె చెవునించి దొంగిలించిన వెండిపోగులవరకూ ఎడ్లు, గొఱ్ఱెలు, కోల్లు, బాతులు, కొంకణదేశపు ఎండు ఉప్పుచేపలు, ఇదీ అదీ అనడం ఎందుకు? అత్యంతభాగ్యవంతమైన మహానగరాలలోని గొప్ప బజారులలో దొరికే సమస్తవస్తువులూ సరుకులూ కనబడినవి.

వీటి కన్నింటి కేమిగాని ఆశిబిరాల బజారులలో చిల్లరమారకం వ్యాపారంచేసే బచ్చులు అన్ని తూర్పుదేశాలలోనూ చలామణీ అయ్యేరకరకాల నాణెములను పోగులు పోసుకుని బట్టబయలున కూర్చుని వుండడం చూస్తే చిల్లరగానూ టోకుగానూ దోపిడిచేసే సైనికుల శిబిరాలలో తప్ప మరే శిబిరాలలోను ఇంతవిరివిగా వాణిజ్యవ్యాపారాలు జరగడానికి అవకాశం లేదనే సంగతి స్పష్టంగా తెలుస్తుంది.

ఈ శిబిరాలబజారులలో ప్రతివ్యాపారమూ ప్రతివృత్తీ మంచినేర్పుతో చేస్తూ వుండడమేగాక అందులో మంచిపోటీ బేరాలు కూడా జరుగుతూవుంటవి. అందులో ముఖ్యంగా ఇలాగ ఒకచోటనుంచి ఇంకొక చోటికి సదా తిరుగుతూవుండే శిబిరాల వెంబడినిపోతూ చెయ్యడానికిసులభ సాధ్యంకాని వృత్తులనుకూడా చాలా బాగా చేస్తూవున్నట్లు కనబడుతున్నది. ఉదాహరణానికి తోళ్లను పదునుచేసే వృత్తి ఇలాగ ఒకచోటినుంచి యింకొకచోటికి సదా మారుస్తూండడానికి వీలైన వృత్తికాకపోయినా ఈశిబిరాలలో దీనిని ఎంతో నేర్పుతో నిర్వహిస్తూవున్నారు. మహారాష్ట్ర శిబిరానికి దగ్గరగా ఒకచోట నేలమీద గుండ్రంగా ఒక గొయ్యితీసి ఆ గోతిలో సరిగ్గా అమరేటట్లు ఒక పచ్చితోలును ఇమిడ్చి నేలమట్టానికి దాని అంచులమీద శీలలుకొట్టి బిగించి పదనుచేసే తొట్టిని తయారుచేస్తారు. సైనిక శిబిరాన్ని యెత్తివేసి ఇంకొకచోటికి పోయేటప్పుడు దగ్గిర

మజిలీ అయితే ఆగోతిలోవున్న తోలును పదునుచెయ్యడానికి తయారుచేసిన ద్రవపదార్థంతో సహా తిత్తిలాగ ముడిచి గుర్రానికి గాని ఎద్దుకుగాని వీపుమీద ఒక పక్కను వేసుకునిపోతారు. చాలా దూరప్రయాణం చేయవలసివస్తే తిత్తిలోని ద్రవపదార్థాన్ని పారబోసి మరుమజిలీలో దానిని మళ్లీ తయారు చేసుకుంటారు.

తోళ్లను పదునుచేసే ముఖ్యమైన వస్తువులలో కాచు ఒకటి. అది సులభంగా తీసుకునిపోవడానికి వీలుగా ముక్కలుగా దొరుకుతుంది. ఆకాలంలో ఇంగ్లీషు సైనికాధికారులు కత్తిని ధరించే తోలుపటికాలు ఇంగ్లీషు రాజ్యంలోని ముఖ్యనగరాలలో కూడా తయారయ్యేవికావు. సీమనుంచి దిగుమతి చేసేవారు. ఈ మహారాష్ట్ర సైనిక శిబిరాల ప్రశస్తమైన తోలుపటకాలు తయారవుతూ వున్నందువల్ల కొందరు దొరలు అవి కావలసి వచ్చినప్పుడు ఆశిబిరాలకు పోయి కొనుక్కునేవారు!

(Historical Sketches of the South of India. By Lt. Colonel Mark Wilks (1817) Vol. III pp. (158-159)

– *ఆంధ్రపత్రిక, 9.4.1944*





# మేలర్ కొట్లావథలు

బ్రిటీషు పరిపాలనపట్ల విరోధభావం వహించిన శిక్కులలో ఒక తెగకు చెందిన 'కూకా'లనేవారు ఒక వందమంది 1872 సంవత్సరం జనవరి 14వ తేదీన బహిరంగముగా తిరుగుబాటుచేసి దౌర్జన్యములు చేయ సమకట్టి 'మలోదు' అనే ఊరిమీదికి దాడివెళ్లి 'సట్లేజి' నదికి ఇవతలి ఒడ్డున నున్న మేలర్‌కొట్లా అనే చిన్న సంస్థానం యొక్క రాజధాని నగరమైన మేలరు కొట్లాపైన పడ్డారు. అక్కడ అధికారుల సిబ్బందికిని వీరికిని సంకులసమరం జరిగి చాలా రక్తపాతమై ఉభయపక్షములవారిలో చాల మంది మరణించారు. అలా చచ్చిపోగా మిగిలిన 66 మందిలో ఇరవైఇద్దరికి తీవ్రమైన గాయాలు తగిలినాయి. వీరందరూ పక్కనేవున్న పాటియాలా సంస్థానం సరిహద్దులలోకి పారిపోయి జనవరి 15వ తేదీన ఆ సంస్థానం అధికారులకు లోబడిపోయారు. ఆరాత్రికి వీరిని షెర్పూరుకోటలో వుంచారు. దీనితో కూకాలతిరుగుబాటు సర్దుమణిగింది. ఈకోటకు దగ్గిరగావున్న బ్రిటిషు పరగణాలయిన లూధియానా జిల్లాకు డిప్యూటీ కమిషనరు కోవన్‌గారు ఈ ఖైదీలను కొట్లాకు పంపించవలసిందని 16వ తేదీన వర్తమానంచేసి తాను కూడా ఆ రోజున కొట్లాకువెళ్లాడు. పరిస్థితులు శాంతముగానే వున్నాయనిన్నీ పితూరీదార్లగుంపు చాలాభాగం నశించినదనిన్నీ మిగిలిన ఖైదీలను అమర్నాడు ఉదయము ఫిరంగి మూతుల యెదట నిలబెట్టి పేల్చివేసిగాని ఉరిదీసిగాని వధిస్తాననిన్నీ కోవన్‌గారు ఆ సాయంత్రం తనపై అధికారియైన కమిషనరుగారికి వ్రాశాడు. షెర్పూరునుంచి ఖైదీలను తీసుకుని రావడానికి లూధియానా నుంచి సిబ్బందివచ్చేవరకూ వాళ్లను షెర్పూరులోనే వుంచవలసినదని 17వ తేదీన మధ్యాహ్నం 12 గంటలవేళ కమిషనరుగారైన ఫార్సతుగారు కోవన్‌గారికి చీటీవ్రాశారు. కోవనుగారు ఆచీటిని చూసుకొని జేబులో పెట్టుకున్నారు. ఆ మధ్యాహ్నం అనగా 17వ తేదీన నాలుగు గంటలవేళ కూకా ఖైదీలను కొట్లాపట్నంలోకి నడిపించుకొని తీసుకొనివచ్చారు. రాగానే వెంటనే ఎలాంటి విచారణగాని లేకుండా కోవన్‌గారు ఆ ఖైదీలలో 49 మందిని ఫిరంగిమూతుల ఎదటనిలబెట్టి పేల్చివేయించడానికి వుత్తర్వుచేశారు. అలా పేల్చివేస్తూ వుండగా సాయంత్రం 7 గంటలవేళ ఆ 49 మందిలో మిగిలిన ఆఖరుజట్టు

ఆరుగురు ఖైదీలను ఫిరంగిమూతులకు కడుతూవుండగా ఈ పితూరీదార్లు చేసిన నేరాన్ని గురించి విచారించగలందులకుగాను ఆ ఖైదీలను తనవద్దకి పంపించవలసినదని కమిషనరైన ఫార్సతుగారి దగ్గరనుంచి కోవనుగారికి వుత్తర్వులు వచ్చాయి. కోవనుగారు ఆ వుత్తరాన్ని చదివి ఫిరంగిమూతులకు కట్టిన ఖైదీలను పేల్చివేయకుండా మరణదండన ఆపడానికి వీలులేదనిన్నీ అలా ఆపితే ప్రజలదృష్టిలో తాము చులకన అయిపోతామనిన్నీ అంటూ ఆ వుత్తరాన్ని కర్నల్ పెర్కిన్సు గారిచేతికిచ్చి ఆఫిరంగి మూతులకు కట్టిన నిర్భాగ్యులనుకూడా పేల్చివేయించాడు. పైవిధంగా హతులైనవారి సంఖ్య యాభైమందికి ఒకడు తక్కువ అయివుండగా విధి ప్రేరణవల్ల కాబోలు ఖైదీలలో ఒకడు కాపలావాళ్లను తప్పించుకొని వచ్చి కోవనుగారి గడ్డాన్ని పట్టుకొని లాగినాడు. అంతట అక్కడవున్న దేశీయ వుద్యోగులు ఆఖైదీని నరికివేశారు. ఇలాగ ఆరోజున 50 మంది ఖైదీలను వధించారు. న్యాయశాస్త్రవిధుల ప్రకారము జరుపవలసిన తంతు యావత్తూ సరిగా జరిగించవలసినదని కమిషనరు ఫార్సతుగారు కోవనుగారికి స్పష్టంగా వ్రాయనే వ్రాశారు. 17వ తేదీన గవర్నమెంటువారికి పంపిన టెలిగ్రాములో ఆ ప్రదేశానికి దగ్గరలోనే తాను వున్నాననిన్నీ ఈ కేసులను తాను ఎలాంటి ఆలస్యము లేకుండా సక్రమంగా పరిష్కరించగలననిన్నీ వేరే ప్రత్యేకమైన చర్యలు తీసుకోవడం అవసరం లేదనిన్నీ అలాచేస్తే ప్రజలలో ఉద్రేకం సద్దు అణగడానికి బదులు ప్రబలుతుందనిన్నీ ఫార్సతుగారు తెలియపరిచాడు. కోవనుగారు తాను జరిపిన ఘోరవధలను గురించి ఫార్సునుగారికి తెలియచేసిన తరువాత 18వ తేదీన ఫార్సరుగారు ఆయనకు వ్రాసిన జవాబుమాత్రం చిత్రంగా వుంది.

"ప్రియమైన కోవనుగారికి మీరు చేసిన దంతా నేను పూర్తిగా హర్షిస్తున్నాను. దానిని ఖాయపరుస్తున్నాను. మీరు చాలా బాగా చేశారు.నేను అక్కడికి వస్తున్నాను." అని ఫార్సతుగారు వ్రాశారు : – ఆ ప్రకారము ఫార్సరుగారు అక్కడికి వెళ్లి మిగిలిన పదహారుమంది ఖైదీలను లా ప్రకారము ఉరితీయడానికి వుత్తర్వులిచ్చి ఈ చర్యను శాస్త్ర బద్ధము చేశారు. ఆ ఖైదీలను ఉరిదీసి వేశారు.

ఈసంగతులు కేంద్రప్రభుత్వము వారికి తెలిసినతరవాత వారు దీనిని గురించి ఒక తీర్మానాన్ని జారీచేశారు. హిందూదేశ సాక్ష్యస్మృతిని రచించిన పిట్సుజేమ్సు స్టీఫెన్‌గారు అప్పట్లోకేంద్రప్రభుత్వములో లీగల్ మెంబరుగా వున్నారు. ఆయన తరవాత కొద్దికాలంలో పనిచాలించుకొన్నారు. ఆతీర్మానాన్ని రచించినది ఆయనేనని తెలిసింది. ఆతీర్మానంలో ఇలా వుంది :



"కోవన్‌గారు జరిపిన చర్య అక్రమమనిన్నీ అలాంటిచర్య జరపవలసిన ఆవశ్యకత యేమిన్నీ లేదనిన్నీ ఆ సందర్భంలో చేసిన పనులన్నీ అనాగరిక దారుణ కృతములలాగ కనపడుతున్నాయనిన్నీ చెప్పవలసివచ్చినందుకు గవర్నరు జనరలుగారు విచారిస్తున్నారనిన్నీ కోవనుగారిని ఉద్యోగంలోనుంచి తొలగించవలసినదని వుత్తుర్వు చేయుటకున్నూ విచారించుచున్నారనిన్ని తీర్మానించినారు. కమీషనరైన ఫార్సతుగారి విషయంలో ఆయన చర్యను కఠినంగా గర్హించుచూ ఆపరగణానుంచి ఇంకొక పరగణాకు అదేజీతము బత్తెములున్నూ సమానహోదాయున్నూ గల వుద్యోగంలోకి బదలాయింపుచేసి వదిలివేశారు. ఈ ఫార్సుతుగారు తరవాత యార్కండుదగ్గర సరిహద్దుల కవతల చేసిన ఘనకార్యమునకు సర్ బిరుదును పొందాడు.

అప్పట్లో ప్రభుత్వోద్యోగులున్నూ ఆంగ్లోయిండియను పత్రికాధిపతులున్నూ కోవనుగారిపట్లను పార్సతుగారిపట్లను సానుభూతి చూపిస్తూ వారిచర్యలనుసమర్థించడానికి ప్రయత్నించారు. భారతీయ పత్రికలకు అప్పటి కింకా ఎక్కువ పలుకుబడి లేనందువల్ల హాహాకారము మాత్రం చేయగలిగినాయి. సర్ హెన్రీ కాటన్‌వంటి ధర్మాత్ములు మాత్రము ప్రభుత్వమువారు తీసుకున్న చర్య చాలా అసంతృప్తికరంగా వున్నదని అభిప్రాయపడ్డారు.

(Indian and Home memories Sir Henry Cotton 1911 (pp 111-113)

*– ఆంధ్రపత్రిక, 9.1.1944*



# మోతర్పా

జమీందారీ గ్రామాలలో కల్లుగీయడానికి తాటిచెట్ల కామందులకు ఇచ్చే సొమ్ముకి 'మోతర్పా' అని ఇప్పటికీ వాడుతూవుంటారుగాని ఈ మోతర్పా అనేది మనదేశచరిత్రలో చాలా ప్రసిద్ధి జెందిన ఒకవిధమైన తలపన్ను. ఇంగ్లీషు తూర్పు ఇండియావర్తక కంపెనీవారు మనదేశాన్ని పరిపాలిస్తూ వుండగా గ్రామాలలోనూ పట్నాలలోనూ కులవృత్తులు చేసుకని జీవించేవాళ్లమీదా వర్తకంచేసుకని బ్రతికేవాళ్లమీదా ఈపన్ను విధించేవారు.

సాలెవాళ్ల మగ్గాలమీదను, పత్తిరాటాల మీదను, గొఱ్ఱెలకాపరుల మీదను, కమ్మరి, కంచరి, వడ్రంగి రాతి చెక్కడము పనివాళ్లు మొదలైన వృత్తులు చేసుకునేవాళ్ల మీదను, ఆఖరికి రాటంమీద నూలువడికే ముసలమ్మమీదను కూడా ఈపన్ను వేసేవారు. ఇది మన ప్రజలకు చాలాబాధాకరంగా వుండేది... దీనిని గురించి మనవాళ్లు మొరపెట్టుకోగా మొరపెట్టుకోగా ఆఖరికి 1853 నాటికి ఒక్కచెన్న రాజధానిలో తప్ప తక్కిన రాష్ట్రాలన్నింటిలోనూ దీనిని రద్దుచేశారు.

ఏవృత్తిగాని ఏవ్యాపారంగానిచేసుకొని బ్రతకాలన్నా ఏవస్తువునైనా అమ్ముకొని బ్రతకాలన్నా ఈపన్ను చెల్లించాలి. దుకాణదారులపైన ప్రత్యేకంగా పన్నువిధించడమే గాక వీధుల పక్కలను చాపలో గుడ్డలో పరుచుకుని అమ్ముకునే చిల్లర బేరగాళ్ల మీదను, వీధులలో తిరిగి అమ్ముకునేవాళ్లమీదను గూడా ఈపన్ను విధించేవారు. చిన్నచిన్న వృత్తులు చేసుకునేవాళ్లమీదనే గాక వాళ్లు తయారుచేసే వస్తువులమీదను వాళ్లు వుపయోగించే పనిముట్లమీదనూ కూడా ఈపన్నువేసేవారు. ఆపనిముట్ల ఖరీదును ఎన్నోరెట్లు సొమ్మును మోతర్పాగా చెల్లిస్తేనేగాని ఆవృత్తిచేసుకోవడానికి వీలులేదు!

ఈమోతర్పా పన్ను యొక్క భారం ధనవంతుల మీదకంటె బీదవాళ్లమీదనే ఎక్కువగాపడేది.

ఈపన్ను వసూలు చెయ్యడానికి వుద్యోగుల కివ్వబడిన నిరంకుశమైన అధికారాలను పురస్కరించుకుని వాళ్లు తమ చిత్తం వచ్చినట్లల్లా ఆ అధికారాలను చెలాయించేవారు. నేరాలను ఆచోకీ తీయడంకోసం పోలీసువారుచేసే జులుము నుపయోగించేవారు.



ఆకస్మికంగా వచ్చి దర్యాప్తులుచేసేవారు. ఇళ్లలో జొరపడి సోదాచేసేవారు. పన్ను లివ్వలేనివారిని సంకెళ్లువేసి బొండలో పెట్టి, ఖైదుచేసి హింసించేవారు. ఈచర్యలకు భయపడి లంచాలిచ్చేవారు.

చెన్నపట్నంలో గాజుల లక్ష్మీనర్సు సెట్టి గారి నాయకత్వంకింద 1844 మొదలు ప్రజాసేవచేస్తూ వుండిన మద్రాస్ నేటివు అసోసియేషన్ అనే దేశీయ ప్రజాసంఘంవారు హిందూదేశ ప్రజలబాధలను గురించి ఇంగ్లాండులోని కామన్సుసభవారికి 10-12-1852వ తేదీన పంపిన మహాజరులో మోతర్పాను గురించి గట్టిగా మొరపెట్టారు. అందులో ఇలాగ వ్రాశారు : -

"మోతర్పా అనేది వర్తకులమీదను, కులవృత్తులు చేసుకుని బ్రతికేవారి మీదను విధించబడే పన్ను. ఇది ప్రత్యక్షంగా రైతులను బాధించేటట్లు కనబడకపోయినా వర్తకులకుయిబ్బందిని కలిగించి వ్యాపారాన్ని తగ్గించేది ఏదైనా రైతులు పండించే పంటలకు సరియైన ధరలు రాకుండా చేస్తుంది. గనుక ఆవిధంగా ఇది రైతులకు నష్టం కలిగిస్తూవుంది. ఈమోతర్పాలో చాలాభాగం చేనేతను మగ్గాలమీద బట్టలు నేసేవాళ్లే చెల్లంచాలి! ఇంగ్లాండు దేశంవారి యంత్రాలతో పోటీ చేయలేక బాధపడుతూ వ్ను చేనేత మగ్గాలవాళ్లమీదనే యీ భారంపడడంవల్ల వాళ్ల కష్టాలు యింకా దుర్భరంగా వున్నాయి. ఇందువల్ల నేతపరిశ్రమ తగ్గిపోయి రైతులు పండించే ప్రత్తిధర పడిపోయితీరుతుంది.

భూమిమీద విధించిన పన్నులవసూలు పద్ధతి కంటే కూడా ఈ మోతర్పా పన్ను వసూలు చేసే పద్ధతి చాలా క్రూరముగా వున్నది. ఈ నేతగాండ్రు తమ మగ్గాలను కనపడకుండా ఎక్కడనో దాస్తున్నారనేనెపంతో పన్ను వసూలుచేసే ఉద్యోగులు వాళ్లయిళ్లల్లో జొరబడతారు. ఈ పన్నుకు ఒక నిలకడగానినిరుకుగాని లేదు. తమ యిష్టంవచ్చినప్పుడల్లా, పన్ను మొత్తాన్ని హెచ్చిస్తూ వుంటారు. దానిని హెచ్చుచేస్తామని బెదిరించిగాని తగ్గిస్తామని ఆశపెట్టిగాని ఉద్యోగులు లంచాలు పుచ్చుకుంటూ వుంటారు. ఈ పన్ను యొక్క భారంకూడా అందరిమీదా సమానంగా పడదు. డబ్బుగలవాళ్ల పైనకంటే బీదవాళ్లపైననే యీ పన్ను ఎక్కువగా పడుతూవుంది. ఈపన్ను చెల్లించడానికిన్నీ పట్టాలు పొందడానికిన్నీ ఈ బీదవాళ్లు చాలా దూరంలో ఇంకోగ్రామం లోవుండే కచ్చేరీకి బోవలసి వస్తూవున్నందువల్ల పనిచెడి తాము చెల్లించే పన్ను మొత్తంకంటె యెక్కువ మొత్తమునే నష్టపడుతూ వుంటారు. ఈపన్ను అయోధ్య, ఆగ్రారాష్ట్రాలలో ఎన్నడూ విధించినట్లు లేదు. వంగరాష్ట్రంలో విధించబడినా 1793లోనే రద్దుచేసేశారు. బొంబాయి రాజధానిలో 1844లో రద్దుచేశారు. ఇప్పుడీ హిందూదేశంలో ఇంగ్లీషువారిరాజ్యంలో ఒక యీరాజధానిలో మాత్రమే ఈ మోతర్పా

వసూలు చేస్తున్నారు. పోనీ, దీనివల్ల ప్రభుత్వం వారికేమైనా గొప్ప ఆదాయం వస్తూవుందా అంటే పదిలక్షల మందిని బాధపెట్టగా వసూలు అయ్యే పన్ను మొత్తం 116000 నవరసులు మాత్రమే." (The Madras Native petition quoted in the condition and Requirements of Madras John Bruce Norton 1854 p.p. 168-169)

చెన్నపట్నం ప్రజాసంఘంవారు వ్రాసిన అంశాలలో అతిశయోక్తి యెంతమాత్రమూ లేదు. 1853లో కామన్సుసభవారి యెదుట సాక్ష్యం చెప్పిన సాక్షులలో చెన్నరాజధానిలో మేజస్ట్రేటుగారు రివిన్యూ శిస్తువసూలు వుద్యోగిగానూ పనిచేసిన జె.డబ్లియు, బి.డైక్సుగారు ఈ మోతర్ఫా పన్ను తాను వసూలుచేయించినా ననిన్నీ, ఇది ప్రజలకు చాలా బాధకరంగా వున్నదనిన్నీ గట్టిగా చెప్పాడు. "కేవలమూ ఎగుమతి దిగుమతి వాణిజ్యవ్యాపారాలు చేసుకునేవారిమీదనే కదా ఈమోతర్ఫా విధించబడుతూ వున్నది?" అని కామన్సుసభలో డైక్సుగారిని ప్రశ్నించగా ఆయన ఇలాగ జవాబు చెప్పాడు. "భూమిని దున్నుకునిబ్రతికే కర్షకుల రైతులుగాక యింక యే వృత్తి వ్యాపారము చేసుకునేవారైనా వాళ్లందరిమీదనుకూడా యీ పన్ను విధిస్తున్నారు. ఒకముసలమ్మ కూరగాయలు పట్టుకుని ఒక వీధివరకు అమ్ముకోవడానికి వెడితే ఆ ముసలమ్మవల్లకూడా యీ మోతర్ఫా పన్ను వసూలుచేస్తారు. ఒక మనిషి బట్టల వర్తకుడుగా వుంటే వాడు మీదా యీమోతర్ఫా యిచ్చుకోవాలి. అయితే యూరోపాదేశస్తులెవ్వరూ యీ పన్ను చెల్లించనక్కరలేదు. సాలు మొత్తంమీద ఏదో కొద్ది పాటి లాభం సంపాదించుకునే దేశీయ వర్తకుడు మోతర్ఫా యిచ్చుకుని తీరాలి. వాడి ఇంటి ప్రక్కనే వ్యాపారంచేస్తూ చాలా లాభం సంపాదించే దొర ఒకదమ్మిడీ అయినా యిచ్చుకోనక్కరలేదు" అని డైక్సుగారు జవాబుచెప్పారు. (Forty Years of progress in the administration of the Madras Presidency, Srenivasa Raghava Iyengar p.xxxiii)

కోయంబత్తూరు జిల్లాలోని సింగనీలూరు అనే గ్రామకరణం గారు వుంచిన లెక్కలవల్ల ఆకాలంలో వసూలు చేయిబడు మోతర్ఫా పన్నుల వసూళ్ళు తెలుస్తున్నాయి.

| | | |
|---|---|---|
| బట్టలదుకాణం 1వ రకం | 40 ఫణములు రూ. | 11-12-0 |
| రెండవరకం | 20 ఫణములు | 5-14-0 |
| మూడవరకం | 10 ఫణములు | 2-15-0 |
| మంగళ్లపైన తల 1కి | 8 ఫణములు | 2-5-8 |
| కమ్మరివారిపైన | 8 ఫణములు | 2-5-8 |
| వడ్రంగులపైన | 8 ఫణములు | 2-5-8 |
| రెండెడ్లబళ్లపైన | 8 ఫణములు | 2-5-8 |
| నేతగాళ్లపైన | 6 ఫణములు | 1-12-3 |
| సరుకులు మోసే ఎడ్లపైన | 4 ఫణములు | 1-2-10 |
| కూలీలపైన | 2 ఫణములు | 0-9-5 |
| కంబళినేతగాళ్లపైన | 2ఫణములు | 0-9-5 |
| చాకళ్లపైన తల 1కి | 8 ఫణములు | 2-5-18 |
| మాలవాళ్లపైన | 3 ఫణములు | 0-14-2 |
| నీలిమందు తొట్లెమీద | 8 ఫణములు | 2-5-8 |
| జోళ్లుకుట్టేమాదిగలమీద | 8 ఫణములు | 2-5-8 |
| నూనెగానుగల మీద | 10 ఫణములు | 2-5-8 |

* Comons' First report 1853. Appendix 7. Fourth report 1853. India in the Victorian Age. R.C.Dutt pp 164–165.

– *ఆంధ్రపత్రిక, 14.11.1943*



# 1857 నాటి విప్లవంపై పంచాంగాల ప్రభావం

ఇప్పుడు లౌకిక వ్యవహారములందు క్రీస్తు శకముతోపాటు శాలివాహనశకము కూడా వాడునట్టు స్వతంత్ర భారత ప్రభుత్వమువారు శాసించినారు. మనము చిరకాలము నుంచి తెలుగు పంచాంగములందు శాలివాహనశకమునే వాడుకొనుచున్నాము. ఇది క్రీస్తు శకము 78లో నారంభమైనది. ఉత్తర భారతదేశమున క్రీస్తుకు పూర్వము 57-58సం॥ల పూర్వమారంభమైన విక్రమ శకమునే పంచాంగములందు వాడుకొనుచున్నారు. చాంద్రమానము ప్రకారమే మన పంచాంగములు గుణింపబడుచున్నవి. ఉత్తరమున సైరమానము; బీహారు, వంగరాష్ట్రములలో బార్హస్పత్యమానము కూడా వాడుకలోనున్నవి. ఏ మానము ప్రకారము గుణించినను సిద్ధాంతులు తమ పంచాంగములందు తిథి వారనక్షత్రయోగ కరణములను గ్రహసంచారమును బట్టి నిర్ణయించి దిన,వార, మాస, సంవత్సర ఫలములను కూడా వ్రాయుచుందురు. వ్యక్తుల జాతకములనుబట్టి వారికి సంభవించు శుభాశుభములను గ్రహస్థితిని బట్టి దేశం మొత్తంమీద ప్రజలకు. రాజులకు సంభవించు శుభాశుభములను పంచాంగములందువ్రాయుట పరిపాటియైయున్నది. అతివృష్టి అనావృష్టి దోషములు, పాడిపంటల వృద్ధి నాశములు, యుద్ధభయము, అగ్నిభయము, చోరభయము,ఉత్పాతములు, ఈతిబాధలు, దేశారిష్టములు మొదలగు అనేక విషయములను వివరించుచుందురు.

క్రీస్తుశకము 1857లో ఇంగ్లీషు వర్తక కంపెనీ ప్రభుత్వము వారి సైన్యములు తిరుగుబాటు గావించుటవలన ప్రజలు వారితో కలిసి యుద్ధములు చేయుటయు అది విఫలమగుటయు చరిత్ర ప్రసిద్ధమైన సంగతి.

క్రీ.శ. 1857కు సరియగు విక్రమశకము 1914వ సంవత్సరమునాటికి ఇంగ్లీషు ప్రభుత్వ స్థాపనకు దారిదీసిన ప్లాసీయుద్ధము జరిగి నూరేండ్లగును. ఆ యుద్ధము జరిగిన విక్రమ శక 1914 నాటి పంచాంగములను గుణించిన సిద్ధాంతులీ తెల్లవారు దేశము నాక్రమించి నూరేండ్లు పాలింతురని వ్రాసియుండిరి. సాధారణముగా సంవత్సరాదిక ముందుగానే పంచాంగములు సిద్ధపరుపబడు చుండును. విక్రమశక 1914 సంవత్సరాది



1857 మార్చి 25వ తేదీయైనది. విక్రమశక 1914 పంచాంగములందు ఆ సంవత్సరములో గ్రహచారమునుబట్టి దేశారిష్ట యోగములెన్నో సిద్ధాంతులకు కనపడెను. వారు జాగ్రత్తగా గుణించి దేశమున జలోపద్రవములు విషూచి మొదలగు వ్యాధులవలన జన నష్టము పాడిపంటల నష్టము కలుగునని, ప్రజలు ఈతి బాధలకు లోనగుదురని, ఉత్పాతములు కలుగునని, యుద్ధభయము, రాజ్యకల్లోలముకలుగునని, కుంపినీ పారిపాలన మంతమొందునని కూడా వ్రాసిరి.

## ప్రథమ సంగ్రామం

ఆసేతు హిమాచల పర్యంతముగల భారతదేశ ప్రజలు పుట్టినది మొదలు చనిపోవువరకు పంచాంగంలోని తిది వారనక్షత్రములు చూచి మంచి ముహూర్తము పెట్టించుకొనిగాని ఏపనియు చేయరు. గ్రహచారము బాగులేనిచో గ్రహ శాంతులు చేయించుకొందురు. గ్రహశాంతులు చేయించుకొందురు. గ్రహచారమువలన శుభాశుభములు కలుగునని వారికి గట్టి నమ్మకము. ప్రతి గ్రామమునను పంచాంగ బ్రాహ్మణు లుండును. సంవత్సరాదినాడు పంచాంగ శ్రవణముచేసి తమ జీవితములు సంవత్సర ఫలములు చెప్పించు కొందురు. విక్రమశక 1914 సంవత్సరాది నాడు ఉత్తర భారత దేశములోని వివిధగ్రామములందు పంచాంగము చదివి క్రొత్త సంవత్సరంలో దేశారిష్ట యోగములున్నవని యుద్ధభయం. జననష్టం కలుగునని, రాజులకు విపత్తు కలుగునని, ఉత్పాతములు కలగునని పంచాంగము శాస్త్రులుగారు చెప్పిన ఫలితాలు వినగానే ప్రజలలో భయోత్పాతము కలిగెను. కొత్త సంవత్సరం ప్రారంభింపక పూర్వమే వరదలవలన, విషూచివలన జననష్టము కలిగెను. పంటలు, పశువులు నశించెను. ఇంకనెంత ముప్పు కలుగునోయని తలచిరి.

పూర్వం నూరేండ్ల క్రిందట ప్లాసీ అను పలాసియుద్ధం జరిగినతరువాత ఆనాటి సిద్ధాంతులు గ్రహస్థితిని గుణించి నప్పటినుంచి నూరేండ్లు ఇంగ్లీషు కంపెనీవారు మనదేశమును పాలింతురని చెప్పియుండిరి. అంతకుపూర్వం కేవలం వర్తకంచేయుచు అణగిమణగి యుండిన ఇంగ్లీషు కంపెనీ వారు బలవంతులై రాజాధిరాజులై "కంపినీ బహద్దురు" అని గౌరవించ బడుచుండిరి. వారి సైన్యముల కెల్లప్పుడు జయమే కలుగుచుండెను. వారికి క్రమశిక్షణ, మంచి తుపాకులు, ఫిరంగులు వున్నందువల్ల దేశీయుల సైన్యము లెంత పెద్దవైనను వానికెదురుగా పోరాడజాలకుండెను. కంపెనీవారి కొలువులో చేరిన దేశీయ సిపాయిలును స్వామి భక్తికలిగియుండి ధైర్య సాహసములతో ప్రాణాలు

లర్పించి ఇంగ్లీషు వారికి జయము చేకూర్చుచుండిరి. ఈకంపెనీ వారు నూరేండ్లు మన దేశమునేల వలసినట్టు వ్రాసి పెట్టివున్నందువల్లనే వీరిట్లు విజృంభించు చున్నారని వీరినిప్రతిఘటించుట దుస్తరమని దేశీయులలో నొక నమ్మకంప్రబలెను. మన దేశంలో యుద్ధములందారితేరిన మహారాష్ట్రులు, సిక్కులు, మహమ్మదీయులుకూడా వారికి లోబడిపోయిరి.

1857వ సంవత్సరరంలో నీ యింగ్లీషు వారికేదో ముప్పు రాక తప్పదని దేశీయులందు గట్టి నమ్మకముకలిగెను. ఏమి రానున్నదో మాత్రము ఎవ్వరును ఊహింపలేకుండిరి. ఇంగ్లీషు వారితో స్నేహముగనుండిన మనదేశీయులుకొందరు వారికి కలుగబోవు విపత్తును గురించి బాధపడిరి. వారిపట్ల జాలి వహించి వారిని రక్షింపదలచిరి. దీని ఫలితంగా 1857 ప్రారంభములో వూరు పేరు లేకుండా ఇంగ్లీషు వారికి కలుగబోవు విపత్తును గురించి హెచ్చరించుచు ఉద్యోగములు చేయుచున్న ఇంగ్లీషు దొరలను సెలవు పుచ్చుకొని పోవలసినదనియు, తుదకు తమ భార్యలను, పిల్లల నైనను పంపివేయ వలసినదనియు వేడుకొనుచు వ్రాయబడిన ఉత్తరములు ఇంగ్లీషు ఉద్యోగులలో కొందరికి వచ్చుట ప్రారంభమయ్యెను. ఇది చూచి వారాశ్చర్యపడి విచారించగా దేశీయులలో ప్రబలిన పుకారులు వారికి తెలిసెను. అయితే చాలామంది దానిని లెక్కచేయలేదు. పరిస్థితులు పైకి ప్రశాంతముగనే కనబడుచున్నందునను దేశములో ఇంగ్లీషువారి అధికారము స్థిరముగా నెలకొల్పబడి యుండినందునను చాలా మంది ఈ ఉత్తరములు చూచి నవ్వుకొనిరి. దేశములో నేదో కొంత కల్లోలం కలుగునేమోయని ఆంగ్లేయులలో నెవ్వరైన అనినచో వారి మిత్రులైన తెల్లవారు వారిని పరిహసింపసాగిరి. ఈ సంగతి ఆ కాలమునాటి ఇంగ్లీషువారు తరువాత వ్రాసిన గ్రంథములందు ఉదహరింపబడి యున్నది.

ఆ కాలమున ప్రకటింపబడిన అనేక గ్రంథములందు ఆ కాలములో వ్యాపించిన పుకారులను గూర్చియు, నీలివార్తలను గూర్చియు వివరము లున్నవి. అవి యనేక విధములైనవి. అవి నమ్ముటకు వీలున్నదా లేదా యని విచక్షణచేయ వీలులేని వార్తలు కూడా వ్యాపించుచుండెను. దీనివలన ఆనాటి దేశీయుల మనోభావములను తెలుసుకొనుటకు వీలుకలుగుచున్నదని ఆ గ్రంథకర్తలు వ్రాసినారు.

## మూఢనమ్మకాలు

భారతీయులను కులభ్రష్టులుగ చేయుటకును, వారిని క్రైస్తవ మతమున గలుపుటకును కంపెనీవారు అవలంబించిన పద్ధతులను గూర్చి చిత్ర విచిత్రములైన



సంగతులు ప్రచారమగుచుండెను. అవి అతి త్వరితముగా వ్యాపించుచుండెను. ఒక ఉత్పాతము కలిగినప్పుడు గాని, దేశములో నొక విపత్తు కలిగినప్పుడుగాని గ్రామ ప్రజలు భయపడి అది దైవ సంకల్పమని తలంతురు. ఒకతోక చుక్కకనబడినను, ఆకాశము నుంచి నక్షత్రము రాలినట్టు కనబడినను ఏదో ఘోర విపత్తు కలుగునని బయపడుదురు. విషూచి, మశూచి మొదలగు జాడ్యములు అమ్మవారని యెంచికొలుపులు, జాతరలు చేయుదురు; బలులొసగుదురు. ఇంకనేమి సంభవించునోయని అనుక్షణమును భయపడుచుందురు. ఇటు వంటి సమయమునందు ఎక్కడనో రక్తవర్షం పడినదని, రాళ్ల వాన కురిసినదని, తోకగల వాడు పుట్టెనని, అంగుష్ఠమాత్రదేహుడు జన్మించెనని వార్తలు వ్యాపించును. కలికాలములో కలుగు విపరీతములను వివరించుచు, వీర భోగవసంతరాయలు పుట్టినాడని పాటలు, పదములు వ్యాపించెను. ఇది విని ప్రజలు మహత్తులు జరుగునని ఎదురు చూచుచుందురు. ఇటువంటి సమయములందు ప్రజల మనోభావములను బట్టిప్రతి చిన్న విషయమునకు ప్రతిచిన్న సంఘటనకు నొక యంతరార్థమును కల్పించు కొందురు అది దేశమునందంతటను వ్యాపించును. అంతట ప్రజలలో నుద్రేకము కలుగును.

## 1857 నాటి సంఘటన

1857లో ఎవరు-ఎప్పుడు-ఎక్కడ-ప్రారంభించిరోగాని ప్రతి గ్రామమునకును దాని ప్రక్కనున్న గ్రామమునుండి యొకదూత చపాతీలను, గోదుమరొట్టెలను తెచ్చి గ్రామాధికారికిగాని, గ్రామ పెత్తనదారునకుగాని ఇచ్చి పోవుచుండుటయు ఆ గ్రామాధికారి లేక పెత్తనదారుడు గ్రామస్థుల కోరిక పైన మరల నట్లే చపాతీలను చేసి ప్రక్క గ్రామమునకు పంపి దాని మంచి చెడుగులను వారికి వదలివేయుటయు నిరంతరంగా జరుగసాగెను. ఏక్షణమున నేమి విద్దూరము జరుగునోయని ప్రజలు నిరీక్షించుచుండగా ప్రక్క గ్రామము నుంచి ఒకహర్కారా అనువార్తావహుడు నాలుగు చపాతీలను తెచ్చి ఇవి పలుదిక్కులకు ననిచెప్పి గ్రామాధికారికిగాని పెత్తనదారునకుగాని ఇచ్చి ఈ గొలుసు త్రెంచకుండా మీరుకూడా నాలుగు చపాతీలనుచేసియవతలిగ్రామమునకు పంపవలెనని చెప్పిపోవును. నీవు ఎవరవు? దీనిని నీ కెవ్వరిచ్చిరి? ఎందుకు తెచ్చితివి అని అడుగుట యొక అపచారముగ నెంచి అతనినేమియు అడుగకనే అతడు తెచ్చిన చపాతీలను పుచ్చుకొని అతడు చెప్పి నట్లే చేయుచుండిరి. ఆ దూత నెవ్వరైనను అడిగినచో బాబూ నాకుతెలియదు; మా ప్రక్క యూరినుండి యిట్లే మా యూరికి చపాతీలను తెచ్చియిచ్చినారు. మా గ్రామ

పెత్తనదారులు వీటిని మీకివ్వమని చెప్పి నున్న పంపినారు. అని చెప్పును. పూర్వము కూడా దేశ సంక్షోభము కలిగినప్పుడును, ఉత్పాతములు పుట్టినప్పుడు నిట్లే జరిగినదని గ్రామములోని వృద్ధులు చెప్పుకొనిరి.

ఈ కల్లోలము అంతమొందిన పిమ్మట దీనిని గురించి దర్యాప్తుచేయగా దీని పుట్టుపూర్వోత్తరముల నెవ్వరును చెప్పలేకపోయిరి. ఇది చలువకొరకై చేయబడిన ప్రక్రియ యని కొందరనిరి. కుంపిణీ వారే దీనినిట్లు చేయుడని యుత్తరువు లిచ్చియుందురని మేమనుకొంటి మని కొందరనిరి.

ఇట్లే ఈ తరుణమున నెవ్వరో యొక సిపాయి ఒక సైనికదళ స్థావరమునకు వచ్చి ఒక ఎర్రకలువ పువ్వును ఆ దళములోని సిపాయిల జమేదారునకిచ్చి పోవుచుండుటయు ఆ జమేదారుడా పువ్వును వాసనచూచి తన దళములోని ప్రక్కసిపాయికిచ్చుటయు ఇట్లా పువ్వు ఆ దళములోని సిపాయి లొకరి తరువాత నొకరు పుచ్చుకుని వాసన చూచిన పిమ్మట దానిని తీసికొనిన చివరిసిపాయి ఆసైనిక దళమునుంచి మెల్లగా దగ్గరనున్న ఇంకొక సిపాయి దళ స్థావరమునకు వెళ్ళి ఆ సిపాయిల దళము జమెదారున కిచ్చుటయు అక్కడ కూడా ఆ పువ్వు ఇక్కడవలెనే సిపాయి లందరువరుసగా తీసికొని వాసన చూచుటయు జరుగుచుండెను.

ఇలా కలువ పువ్వు ప్రతిసిపాయి దళము లోను ప్రదక్షిణము తిరుగును. ఈసాంకేతిక ప్రదక్షిణము అంతరార్థమును కూడా ఎవ్వడును చెప్పలేకపోయిరి. విక్రమశక 1914 సంవత్సరమునాటి విడ్డూరములలో నిదియొకటి యనుకొనిరి. దీనిని గూర్చి యెవరికితోచినట్టు వారు అర్థము చేసికొను చుండిరి. అయితే ఒక్క సంగతి మాత్రము నిజము, ఈ చిత్ర సంఘటనలు సాంకేతిక చిహ్నములు నాకాలమున ఇంగ్లీషుకంపెనీవారు దేశీయులను కులభ్రష్టులుగ చేయదలచినారను అనుమానమును గూర్చి ప్రజలు తలచుకొని ఉద్రేకము పొందుటకు తోడ్పడిన ననుమాట మాత్రము నిజము.

## తెల్లవారి నక్క వినయాలు

ఇంగ్లీషు వర్తక కంపెనీ వారు తమ అధికారము మన దేశములో బలపడునంత వరకును చాలా అడకువతో నుండి ప్రజల పట్ల దయగా ప్రవర్తించుచుండిరి. పూర్వము మహమ్మదీయ పరిపాలనా కాలము నందువలె హిందువులకు తాము బలవంతముగా అన్యమతమున గలువబడుదునను భయము పోయినది. కంపెనీవారి యుప్పుదిను సిపాయిలు వారిపట్ల విశ్వాసము గలిగియుండిరి. కుంపిణీ సర్కారుపట్ల దేశీయులు



భయభక్తులు కలిగియుండిరి. ఆకాలమున మనదేశమునకు వచ్చిన ఇంగ్లీషు కుంపిణీ దొరలు మంచివారుగనుండి ప్రజల గౌరవమునకుపాత్రులైరి.

ఇంగ్లీషువారికి భారతదేశం పూర్తిగా వశపడిన తరువాత ఇంగ్లీషు వారు కుంపిణీవారునిరంకుశులైరి. వారు తమకు లోబడిన దేశీయ రాజులను నవాబులను పదభ్రష్టులుగ చేయసాగిరి. ఈ రాజులను, నవాబులను ఆశ్రయించుకొని బ్రతుకు సైనికులు ఇతరోద్యోగులు వివిధ వృత్తులవారు జీనవములేక తిరుగసాగిరి. ఇంగ్లీషు వర్తకుల పోటీవలన దేశీయపారిశ్రామికులు జీవనములు పోయి దేశద్రిమ్మరులైరి. ఇంగ్లీషు సైనికోద్యోగులు చీటికిమాటికి దేశీయ సిపాయిలను కొరడాలతో కొట్టి హింసింప సాగిరి. చిన్నతప్పుచేసినను కొంచెము అవినయము కనపరచినను కఠిన శిక్షలు విధించి, వారిని పనిలోనుండి తొలగించుచుండిరి. దీనివలన అసంతృప్తి వ్యాపించెను.

ఈ కంపెనీవారు క్రొత్తగా నిర్మించిన రైలుమార్గములు టెలిగ్రాపు తీగలు ప్రజలకు వింతగా కనబడెను. వారు పిశాచ కృత్యములుచేసి దేశీయులను కట్టివేయ జూచు చున్నారను కొనిరి. ఇదికూడా తమ కులాచారములను నాశనం చేయుటకే చేయుచున్నారనుకొనిరి.

1857 నాటికి దేశంలో పాశ్చాత్య నాగరకత ప్రబలి వర్ణాశ్రమ ధర్మములడుగంటి వని ఇంగ్లీషువారు ప్రవేశపెట్టిన క్రొత్త శాసనములును, క్రొత్త న్యాయశాస్త్ర విధులును హిందువులకును, మహమ్మదీయులకును రుచింపలేదు. సిపాయిలు సముద్రమున దాటి అన్య దేశములకు పోవలెను. క్రొత్తగా విధించిన సైనిక విధులు తమను కులభ్రష్టులను జేయుటకే చేసిరని దేశీయులు తలచిరి. దీనికి తోడు క్రైస్తవమత బోధకులు సైనిక స్థానరములందు మత బోధ చేయుచూ హిందూ దేవతలను దూషింపసాగిరి.

అయోధ్య రాష్ట్రమునకు చెందిన బ్రాహ్మణ, క్షత్రియ సైనికులను కంపెనీవారు పటాలము నుంచి తొలగింపగా వారు జీవనములులేక దేశద్రిమ్మరులై అసంతృప్తితో కంపెనీవారు చేయు అన్యాయములను గూర్చి ఇతర పటాలము లందును, గ్రామ ప్రజలందున ప్రచారము చేయసాగిరి. కంపెనీవారి భూస్వామిత్వ విధానమువలనను, పన్నులు వసూలు పద్ధతులవలనను పూర్వపు భూస్వాములు ఫకీరులైరి. కంపెనీవారి కొలువులో పనిచేయు దేశీయోద్యోగులు లంచగొండులై ప్రజాపీడనం చేయుచుండిరి. దేశంలో శాంతి భద్రతలు పోయినవి. ఆలన,పాలనలు లేవు. ప్రజలలో అసంతృప్తి వ్యాపించెను. ఇంగ్లీషు కంపెనీవారు చేయు ప్రతి కార్యాము ప్రజలనుమానముతో చూడసాగిరి. వానికి అపార్థమును కల్పించి తమను కుల భ్రష్టులను చేసి కిరస్తానీ మతమున గలుపదలచినారని తలచిరి. తమను మత భ్రష్టులను చేయదలచి నారనుభయము

వ్యాపించినకొలది దేశీయ సిపాయిల లోను సామాన్య ప్రజలలోను గంగవెర్రులెత్తసాగినవి. ఈ కుంపిణీ వారిపీడను వదల్చుకొనుటకును, ఈ తెల్లదొరలను నాశనము చేయుటకును తమకు కాళికాశక్తి తప్ప వేరు శరణ్యములేదని తలంపసాగిరి. అంతట కాళికాపూజలు చెలరేగెను. ఈ తెల్లదొరలను బలిగొనవలసినదని ఆ పూజలందు ప్రార్థించసాగిరి. దానికి తగినట్టు పూజలు చేయించు బ్రాహ్మణులును అతిభీకరములయిన పద్ధతులతో బలులతో మేళతాళములతో బీజాక్షరములతో పూజాకల్పమును జరిపి ఈ తెల్లవారిని నాశనము చేయుమని కాళికాశక్తిని ప్రార్థింప సాగిరి. ఈ సమయమున భగవంతుడవతారమెత్తి రాక్షసులను నాశనముచేసి ప్రజలను రక్షించిన ఘట్టములుగల పురాణములు చెప్పుట ప్రారంభమయ్యెను.

ప్రజల చిత్తవృత్తుల నెరిగిన బ్రాహ్మణ పురోహితులు, జ్యోతిష్కులు ఈ కుంపిణీ రాజ్యమంతరించు రోజులు దగ్గరించినవనివారు నాశనమగుట తప్పదని వి.శ. 1914 సంవత్సరమున ఇంగ్లీషు కుంపినీ అంతరించు నని దైవనిర్ణయమైనదని పంచాంగములందే కనబడుచున్నదని ప్రజలకు బోధించుచు, పురాణములు చెప్పుచు కాళికా శక్తి యర్చనలు చేయుచు లాభము పొందసాగిరి. కాళికా శక్తి పూజలును మంత్రములును దేశీయుల సైనిక పటాలములందును ప్రజలయందును ఆవేశము కలిగించు చుండెను. వి.శ. 1914 సంవత్సరంలో కాళికాశక్తి ఈ తెల్లదొరలను బలిగొని వారి రక్తపానము చేసి తీరునను గట్టి నమ్మకము ప్రజలలో వ్యాపించెను. ఆకాలమున మన దేశమున నివసించి ప్రజలతో కలసి మెలసి తిరిగిన మెడోస్ టెయిలర్ అనునొక ఇంగ్లీషుదొర క్రీస్తుశకం 1857వ సంవత్సరపు విప్లవమును ఇతివృత్తముగా గైకొని రచించిన సీతయను నవలయందీ కాళికాపూజల ప్రభావాలను గూర్చియు ప్రజలలో కలిగిన సంచనలమును గూర్చియు చక్కగా వర్ణించియున్నాడు.

1857 నాటికి భారతదేశ ప్రజలకును దేశీయ సిపాయిలకును ఇంగ్లీషు కుంపిణీ వారిపైనను ప్రబలియుండిన అసంతృప్తి తీవ్రరూపము దాల్చి మతావేశమువలన దేశ వ్యాప్తమైన కల్లోలముగ పరిణమించినది. ఈ కుంపిణీవారిని పారద్రోలి మరల మొగలాయి చక్రవర్తిని సింహాసన మెక్కించ వలెనను ఆలోచన కలిగినది. ఈ విప్లవము స్వాతంత్ర్య యుద్ధముగ మారెను. మొదట కొన్ని నెలలు విప్లవకారుల సైన్యములకు జయము కలిగి ఇంగ్లీషు కుంపిణీ రాజ్యమంతరించు నట్లుగనే కనబడెను. అయితే మన విప్లవ సైన్యముల నాయకులలో నైకమత్యము లేనందున తమకు లభించిన అవకాశములను పాడుచేసుకొనుట తటస్థించినది. ఇంగ్లీషువారికి సీమనుండి క్రొత్తసైన్యములు వచ్చెను.



దేశములలోని సిక్కులును కొందరురాజులును, నవాబులను కుంపినీవారికి సహాయులైరి. అందువలన ఇంగ్లీషు కుంపినీ వారు క్రమక్రమముగా విప్లవ సైన్యములను ఓడించి తిరుగుబాటును అణచి వేయగలిగిరి. విప్లవ సమయమున దేశీయసైన్యము ఇంగ్లీషు వారిపైన చేసిన దౌర్జన్యములకన్న దాని నణచుటలో ఇంగ్లీషు వారు చేసిన అత్యాచారములు క్రూరములై వర్ణనాతీతములైనవి. అనుమాన మున్నవారినెల్ల పట్టుకొని చిత్రవధ చేసిరి. స్త్రీలను చెరచిరి. ఇంగ్లీషు వారు చేసిన ఘాతక కృత్యాలను చూచి కొందరు తెల్లదొరలే చాలా నొచ్చుకొనిరి. ఆ సమయమున జరిగిన అన్యాయాలను గురించి ఇంగ్లీషు గ్రంథములందే వర్ణించబడినది.

ఇంగ్లీషు సైనికులుచేయు అన్యాయములను గూర్చియు, ఘాతుక కృత్యములను గూర్చియు చెప్పుకొనినను వినువారు లేకుండిరి. ఇట్లీ విప్లవము విఫలమైపోయెను. దేశము అల్లకల్లోలమయ్యెను. వర్ణనాతీతమైన రక్తపాతము యుద్ధభయము. అగ్నిభయము జనక్షయము కలిగెను. ఇంగ్లీషువారు దేశమును మహాశ్మశానముగా చేసివైచిరి. ఈ కల్లోలముల నణచినపిమ్మట ఇంగ్లీషు పార్లమెంటు వారు భారతదేశము కంపెనీ పరిపాలనను రద్దు చేసి ఇంగ్లీషు రాణియైన విక్టోరియా రాణి మంత్రి కిందనే నేరుగా ప్రభుత్వము జరుగు నట్టు శాసించిరి. అంతటి ఆంగ్లరాజ ప్రతినిధి పరిపాలన మారంభమయ్యెను. ఒక విధముగా చూచినచో విక్రమ శకము 1914 పంచాంగ ఫలములు జరిగినట్లే ఒప్పుకొనవలసి వున్నది. ఆ పంచాంగములందు చెప్పబడినట్టుగా దేశములో నుత్పాతములు పుట్టినవి. కల్లోలము కలిగినది, జనక్షయము కలిగినది. ఇంగ్లీషు కుంపిణీ వారి రాజ్యము విక్రమశకం 1914 నుంచి నూరేండ్లు జరుగునని ఆకాలం నాటి జ్యోతిష్కులు చెప్పిన జోస్యము నిజమైనది. భారతదేశమున కంపెనీ రాజ్యమంతరించి ఇంగ్లీషు పార్లమెంటువారి యధికారం క్రిందకొత్త ప్రభుత్వం స్థాపించబడినది.

కుంపిణీవారు కేవలం పన్నులు వసూలు చేయు హక్కును ఇజారా పొందిన వర్తకులని మనదేశంలోని రాజులు. నవాబులు ప్రజలు అనుకొనుచుండిరని అందువలన వారిపట్ల గౌరవం లేకపోయినదని ఈ సంగతిని గమనించియే ఇంగ్లీషురాణి క్రింద పరిపాలనము స్థాపించబడినదని, ఆకాలం నాటి వారను కొనిరని మెడోస్ టెయిలర్ వ్రాసినాడు.

– ***ఆంధ్రజ్యోతి, 11.9.1966***



# రాజా సితాబ్‌రాయి

భారతదేశము నేకచ్ఛత్రముగ నేలిన మొగలాయి చక్రవర్తులలో కడుసమర్థుడైన ఔరంగజేబు క్రీ.శ. 1707లో చనిపోయెను. ఆయనసంతతివారు బలమీనులైనందువలన వివిధ ప్రాంతముల నేలు సుబేదారులును, రాజప్రతినిదులును స్వతంత్రులై నవాబులుగ పరిపాలింప జొచ్చిరి. ఆ సమయముననే మన దేశములో వర్తకము చేసికొనుచుండిన ఫ్రెంచివారును, ఇంగ్లీషువర్తకసంఘముల వారును ఈ యవకాశమును కనిపెట్టి మెల్లమెల్లగా రాజులను, నవాబులను త్రోసిరాజనసాగిరి. ఈమార్పుదలకాలమున, మొదట మొగలాయి ప్రభువుల దగ్గరను, తరువాత ఇంగ్లీషు ప్రభువుల దగ్గరను ఉద్యోగముచేసి పేరుపొందిన వారిలో రాజా సితాబ్‌రాయిగా రొకరు. వీరి కాపురస్థలము 'షాజహానాబాదు' అని ఆకాలమున వ్యవహరింపబడిన ఢిల్లీనగరము. వీరొక క్షత్రియ కుటుంబమునకు చెందినవారు. 1719 మొదలు 1748 వరకును భారతదేశమునకు చక్రవర్తిగా నుండిన మహమ్మదుషాపాదుషాగారి మంత్రియైన ఖాన్ దౌరాన్‌గారి బానిసగా నుండి గొప్ప పలుకుబడిని, గౌరవమును సంపాదించిన ఆగాసులేమాను అనునొక జార్జియాదేశీయుని దగ్గర సితాబ్‌రాయిగారు మొదట నొక చిన్నగుమాస్తాగా ప్రవేశించిరి. తరువాత ఆయన తన యజమానికి తలలో నాలుకవలె నుండి విశ్వాసపాత్రుడై క్రమక్రమముగా గొప్ప యుద్యోగములను సంపాదించి పైకి వచ్చినాడు.

ఢిల్లీ (షాజహానుబాదు)లో రాజకీయకల్లోలములు కలుగగా నిక అక్కడనుండుట క్షేమకరము కాదని యెంచి, చక్రవర్తిగారి దర్బారులో తనకు కొందరు స్నేహితు లున్నందువలన వారి ప్రాపకమువలన ఆకాలమున 'అజీమాబాదు' అని పిలువ బడుచుండిన పట్నానగరము నందు 'దివాన్' అను పన్ను వసూలు చేయు ఉద్యోగములను, చక్రవర్తిగారి మంత్రియైన ఖాన్ దౌరాన్‌గారికి వంగరాష్ట్రమునం దుండిన జాగీరుల నజమాయిషీ చేయు నుద్యోగమును సంపాదించెను. వంగరాష్ట్రము మొగలాయీ సామ్రాజ్యములో నొక భాగము. దానిని సుబేదారు డను రాజప్రతినిధి పరిపాలించు చుండెను. క్రీ.శ. 1707లో మహాసమర్థుడైన ఔరంగజేబుచక్రవర్తి చనిపోవగా ఆయన



సామ్రాజ్యములోని సుబేదారులు బలవంతులై, పేరునకు మాత్రము మొగలుచక్రవర్తికి లోబడి దేశమునకు స్వతంత్రనవాబులైరి. వంగరాష్ట్రనవాబైన అలీవర్ధాఖాను తరువాత 1756లో నవాబైన సురాజ ఉద్దౌలా చాల చిన్నవాడు. అతని యుద్యోగులు స్వార్థపరులు. సురాజ ఉద్దౌలా చాల చిన్నవాడు. అతని యుద్యోగులు స్వార్థపరులు. సురాజ ఉద్దౌలా ఇంగ్లీషు వర్తకుల పైని కోపించి వారిని దండింపదలపగా నతని బందుగుడును, మంత్రియు నైన మీర్జాఫరు అతనిపట్లద్రోహముచేసి ఇంగ్లీషువారితో చేరెను. అంతట 1757లో జరిగిన ప్లాసీయుద్ధములో నవాబు సైన్యము లోడిపోయెను.[1] మీర్జాఫరు సురాజ ఉద్దౌలాను వధించి, ఇంగ్లీషువారి సహాయముతో వంగరాష్ట్రమునకు నవాబయ్యెను. ప్లాసీయుద్ధము చాలా చిన్నదైనను రాజకీయముగా ప్రాముఖ్యమైనది.

మీర్జాఫరు నవాబై ఇంగ్లీషువారి వశవర్తియయ్యెను. క్రొత్తనవాబు అజీమాబాదు (పట్నా)కు వచ్చిన సమయముననే మనసితాబ్‌రాయిగారు కూడ అక్కడకు వెళ్లిరి. సితాబ్‌రాయిగారు కొంత ధనముతోను, పరివారముతోను అక్కడికి పోయినందున ఆయనకు త్వరలోనే కొంత గౌరవము, పలుకుబడియు కలిగెను. అప్పటి కాప్రాంతములో ప్రముఖుడుగా నుండిన హైందవోద్యోగి రాజా రామనారాయణుడు. సితాబ్‌రాయిగా రాయనను దర్శించి, ఆయనయనుగ్రహమును సంపాదించినాడు. క్రొత్త నవాబును కూడ దర్శించినాడు. అయితే వీరు తన యుద్యోగమును ఖాయపరతురని అతనికి నమ్మకము కలుగలేదు. అందువలన ఆ సమయమున వంగరాష్ట్ర ప్రభుత్వమున గొప్ప పలుకుబడి కలిగి మనదేశములో క్రమక్రమముగ బలవంతులగుచున్న ఇంగ్లీషు వర్తకకంపెనీవారి సేనానాయకుడైన క్లైవు నాశ్రయించినయెడల చాలలాభము కలుగునని యెంచి సితాబ్‌రాయి వంగరాష్ట్రమునకు రాజధనియైన మూర్షిదాబాదుకు పోయి ఇంగ్లీషు సేనానికి బహుమతుల నిచ్చి, ఆయన అనుగ్రహమును సంపాదించి, తాను చక్రవర్తిగారి వలన సంపాదించుకొనిన ఉద్యోగములను ఖాయపరుపవలసినదని మీర్జాఫరుకు సిఫారసులు తీసికొనివెళ్లెను.

పిమ్మట నతడు వంగరాష్ట్రనవాబుగారియొక్కయు, రామనారాయణునియొక్కయు అనుగ్రహము నతిసులభముగ సంపాదించి, అప్పటి రాజధానీనగర మయిన మూర్షిదాబాదులో గౌరవముగను, సుఖముగను కాపురముచేయసాగెను.

సితాబ్‌రాయి ఇంగ్లీషువారి స్నేహమునకు పాత్రుడై, చక్రవర్తియైన షాఅలం పాదుషాతో వారు జరిపిన రాజ్యతంత్రమునందు వారి రాయబారిగా పోయి వారికి చాల సహాయము చేసెను. తరువాత అయోధ్యనవాబైన ఘజా ఉద్దౌలాదగ్గర ఉద్యోగమునకు కుదిరి ఇంగ్లీషు వారితో రాజీ కుదిర్చెను. చక్రవర్తి యాయనను బీహారు పరగణాకు

దివానుగా నియమించెను. ఇంగ్లీషు సేనాధిపతియైన కార్నకుతోడి స్నేహఫలితముగా అజీంగర్, జాన్‌పూర్‌ల దగ్గర సాలుకు లక్షరూపాయలు రాగల జాగీరు నొకదాని నతని కిచ్చిరి. చక్రవర్తితో రాయబారము జరుపుటకై క్లైవు 1765లో అలహాబాదుకు పోవు నప్పుడీతనిని వెంటబెట్టుకొనిపోయెను. ఇతడు క్లైవుకు అంతరంగికుడయ్యెను. అజీమాబాదులోని ప్రజలకు సౌకర్యములు కలిగించుట కొఱకు పరిపాలనావిధానమును గూర్చియు, ఫిర్యాదుల విచారణను గూర్చియు కొన్ని కట్టుబాటులు చేసి రామనారాయణునితో కలిసి పరిపాలింపసాగెను. కలకత్తాలోని కార్యాలోచనసభవారు సితాబ్‌రాయిని అజీమాబాద్ పరగణాకు ముఖ్యపరిపాలకునిగ నియమించిరి. తరువాత 1771లో వంగరాష్ట్రమున కంపెనీవారి ప్రధానదేశీయాధికారిగ నుండిన రెజాఖాన్‌తోపాటు సితాబ్‌రాయినికూడ కంపెనీవారనుమానించి పట్టుకొనిరి. రెజాఖాను చాల అన్యాయములు చేసినట్లు బయల్పడెను. సితాబ్‌రాయిగారి యందు దోషము లేదనియు విచారణవలన తెలిసెను. అంతట వారాతనిని వదలివేసి అతని యుద్యోగము నాతని కిచ్చిరి. ఆయన కీవిచారణవలన చాల మనఃక్లేశము కలిగినది. అతనికి ప్రపంచము మీదనే రోత కలిగెను. అతడంతటి విరక్తుడై, కొలది కాలములోనే మరణించెను.

సితాబ్‌రాయి ఆ కాలమునాటి దేశీయమంత్రులలో చాల సమర్థుడు. వ్రాతకోతలయందు ఆయన చాల నేర్పరియగుటయేకాక పరిపాలనయందు సమర్థుడును, యుద్ధములందు ధైర్యసాహసముల కలవాడును, గొప్ప కార్యసాధకుడు నై యుండెను. ఆయనను వజీరులు, చక్రవర్తులు ఆశ్రయించుచున్నను ఆయన గర్విష్ఠి కాలేదు. గొప్ప విద్యావంతులుగాని, గొప్పవంశీయులుగాని ఆయనదగ్గరకు వచ్చినపుడు అతడు వారిని చాల మర్యాదచేయును. ఎవరైన విన్నపము చేయవచ్చినచో వారు చెప్పుకొనుదానిని సావధానముగ విని వారర్థించిన కార్యము తనకు సాధ్యమైనచో వెంటనే చక్కపెట్టి పంపును. తనకు సాధ్యముకానిచో తానేమియు చేయలేనందుకు చాల నొచ్చుకొని వారి నోదార్చి, చాల మర్యాదచేయును.

సితాబ్‌రాయిగారు నిర్వహించవలసిన రాజకార్యము లసంఖ్యాకములుగ నుండెను. కార్యభారమువలన నాతని కెప్పుడును విది విరామము లేని పని యుండును. ఉదయముమొదలు మధ్యాహ్నము వఱకును, రాత్రిమొదలు తెల్లవారుఝామున మూడుగంటలవఱకును అతడు విధి విరామము లేక వచ్చువారికి దర్శన మిచ్చుచునే యుండును. అతడెన్నడును, ఎవ్వరిని తిట్టిగాని, అవమానించిగాని యెరుగడు. అతడు మంచి ప్రపంచజ్ఞానము కలిగినవాడు. అన్ని వస్తువుల ధరలను బాగుగా నెఱిగినవాడు.



అనవసరముగ బేరములు చేసి వర్తకులను బాధింపడు. ఎవరినైనను బహూకరింపదలచినపుడు పొదుపు నాలోచింపడు. అనవసరమైన వ్యయము చేయడు. తనకు కావలసిన వస్తువులనెల్ల చౌకగా నమ్ముచోటులనుండి సరసముగా తెప్పించుకొనును. అతడు చాలభోగి. ఆయనయింట నుండువారందరికి నాతడు సకలసౌఖ్యములు కల్గించును. ఆయూరికే పెద్దమనుష్యుడు వచ్చినను,వాని హోదానుబట్టి రకరకముల పిండివంటలు, పండ్లు, ఆహారపానీయములు వారికి పంపి గౌరవించును. తనయింట చేయు విందులలో మొగలాయి ప్రభువుల ననుకరించి అతిథిసత్కారమును చేయుచుండును.

సితాబ్‌రాయి చాల మర్యాదను, గౌరవమును పాటించు సరసుడు. ఆయనకు 'రాంజీ'యను ఉంపుడుకత్తె యుండెను. ఆమెపై నాతనికి చాల ప్రేమ. ఐననామెతో నాతడెప్పుడు మాటలాడునో ఎవ్వరికిని తెలియదు. అతడెన్నడు నామెతో బహిరంగముగ సరసమాడి యెరుగడు. అతడు జనానాలోనికి పోవుట యెవ్వరు చూడలేదని చెప్పుట యతిశయోక్తికాదు. అతని ధర్మపత్ని ఒక క్షత్రియస్త్రీ. ఆమెవలన నాయనకు ఇరువురు కుమాళ్లు కలిగిరి. అతడామె కొఱకు ప్రత్యేకముగ నొక మేడ కట్టించెను. అతడు సంవత్సరముకు రెండుమూడుమారులు మాత్రము ఆ మేడకు పోయి హిందూగృహస్తులు శాస్త్ర ప్రకారము జరుపవలసిన ఆచారధర్మములు నెరవేర్చుచుండును.

సితాబ్‌రాయిగా రెవ్వరికిని అపకారము చేయడు. కాని యాతనికిని కొందరు విరోధులుండిరి. అయితే అతడువారి నెన్నడు నగౌరవపరచి యెరుగడు. పైగా వారి కాపద వచ్చినపు డడ్డుపడి రక్షించుచుండెను. తన స్వగ్రామమైన షాజహానాబాదునుండి ఎవ్వరైనను వచ్చిరని తెలియగనే సితాబ్‌రాయి వారి కన్నివిధములైన సహాయములు చేయుచుండెను. అతడు సర్కారుధనమును ముట్టుకొనువాడుకాడు. అందువలన నెవరికైన నేదైన సహాయము చేయదలచినయెడల వారి కేదో యుద్యోగము నిచ్చుచుండెను. అది సాధ్యముకానిచో వారిని పిలిపించి ఏదో బహుమానము నిచ్చి తాను సహాయము చేయలేకపోయినందులకు విచారము తెలుపును.

ఇస్లాము మతముకొఱకు ప్రాణములను బాసిన మహానుభావుడైన షెహ్ సయ్యదు మహమ్మదుగారి వంశీయుడైన షెహ్ షెరీఫ్‌ఉద్దీన్ మహమ్మదుగారు అరబ్బీదేశములోని పవిత్రమైన యూఫ్రటీస్ నదీతీరమున గల పుణ్యభూమిలో నివసించు నొక ముదుసలి విద్వాంసుడు. ఆయన చాల యోగ్యుడును, పుణ్యపురుషుడును. ఆ పుణ్యభూమిలో మహమ్మదుగారి యల్లుడును, ఇమామ్‌ను, షియామతస్థులకత్యంతగౌరవపాత్రుడునైన అలీగారి గోరీ యున్నది. ఇది షియా శాఖ వారికి పవిత్రస్థలము. ఈ పుణ్యపురుషునికి

కొన్ని చిక్కులు కలిగి దారిద్ర్యమున బడెను. అంతట నతడు హిందూ దేశము పాడిపంటలతో తులతూగు దేశమనియు, అక్కడ ముసల్మాను రాజ్యమునందు గల ధనవంతులును, ప్రభువులును అరబ్బీ దేశములోని విద్వాంసులను, పుణ్యస్థలములకు యాత్ర పోయివచ్చిన వారిని ఆదరించు రనియు విని, అక్కడకు ప్రయాణమై వచ్చి తన ఎనుబదవ ఏట హుగ్లీలోను, మూర్షిదాబాదులోను కాలక్షేపము చేసెను. వంగరాష్ట్రమున కప్పుడు ముబారకుద్దౌలా నాజీము (సహాయపరిపాలకుడు)గాను, మహమ్మదు రెజాఖాను ప్రధాన పరిపాలకుడుగాను ఉండిరి. వీరిరువురును చాల ధనవంతులైన ముసల్మానులు. వారి తాబేదారులు కూడ గొప్ప ఐశ్వర్యము ననుభవించుచున్నవారే. అయినను వారెవ్వరును ఈ ముదుసలివిద్వాంసు నాదరింపరైరి. అందువలన నితడు తన జీవనాధారమునకై ఇంకొక చోటికి పోవదలచి అయోధ్యనవాబు షుజాఉద్దౌలా రాజధాని అయోధ్యాలక్నో నగరములకును, షాఅలం చక్రవర్తి నివసించుచున్న అలహాబాదునకును పోయినచో అక్కడ సుఖముగ బ్రదుకవచ్చునని బయలుదేరెను. మార్గమధ్యమున ఆయన అజీమాబాదుకు రాగా 'సియర్‌ముతాఖెరన్' గ్రంథకర్తయైన సయ్యద్ ఘులామ్ హుస్సేన్‌ఖాన్‌గా రాయనను దర్శించి, తన మిత్రుడైన సితాబ్ రాయిగారి కాయనగొప్పదనమును గూర్చి చెప్పిరి. అంతట నీమంత్రి గారు హిందువుడైయుండియు, ఈ ముసల్మానుమతాచార్యుని దర్శింప బోయినప్పుడు తన పరివారమును, రాజలాంఛనములను బయటనే వదలి ఒకరిద్దరు సేవకులును, తనమిత్రుడైన మిర్కవం ఎద్దీన్‌ఖాన్ గారును తప్ప ఇతరులెవ్వరును తనవెంట లేకుండనే పోయెను. ఆ పుణ్యపురుషుని సమక్షమునకు పోవగానే, అడకువతోను భయభక్తులతోను సాగిలబడి మ్రొక్కెను. ఈ గొప్ప మంత్రిగారు వచ్చుచున్నారని ఆయాచార్యు డాయనకొఅ కొక తివాచి వేసి దానిపైన ఒక పరుపును వేయించి ఎత్తైన ఒక మస్నదు (పీఠము)ను తయారు చేయించి యుంచి, ఆయనను దానిపైన కూర్చుండవలసినదని ఎంత బలవంతము చేసినను, సితాబ్‌రాయిగారు వలదు వలదని దానిమీద కూర్చుండక మర్యాదతో ఆముదుసలి విద్వాంసుడు కూర్చున్న తివాచికి అంచువరనే కూర్చుండిరి. తరువాత నొక గంటసే పాయనతో గడపి, తమ యింటికి దయచేసి తాను చేయు సత్కారము స్వీకరింపవలెనని వారి నెంతో వినయముగ ప్రార్థించి సెలవు పుచ్చుకుని యింటికి వెడలిపోయెను.

ఆ సాయంకాలము సితాబ్‌రాయిగారు తమ యింట నొక పెద్ద తివాచిపైన పరుపు వేయించి దానిమీద పట్టుజరీబుటేదారిపని చేసిన కీన్కాబు వస్త్రమును పరపించి, తాను గొప్ప గొప్ప యుత్సవ సందర్భములందు కూర్చుండునట్లు ఒక గొప్ప 'మస్నదు'ను ఆ



విద్వాంసునికొఅకు అతిభక్తితో తయారుచేయించి, దానిదగ్గరనే ఒకతెల్లని తివాచి వేయించి దానిపైనతాను కూర్చుండెను. ఆ సమయమున నితరు లెవ్వరును రాకుండ కట్టడిచేసెను. అంతట సాయంకాలపు ప్రార్థన యైనతరువాత నా ముసల్మాను పుణ్యపురుషుడును, సయ్యదు ఘులాంహుస్సేన్ ఖానుగారునుసితాబ్‌రాయిగారింటికి రాగా ఆయన తన యింటి ఆవరణముందు గుమ్మముదగ్గరకు ఎదురుగా వచ్చి ఆయనకు నమస్కరించి వారిని చేయిపట్టుకొని తీసికొనివెళ్లి మస్నదుపై కూర్చుండబెట్టి ఎంతో భక్తితో అతిథిసత్కారమును చేయసాగెను. ఇంత గొప్పవాడైన యీ హిందూగృహస్థుడు విజాతీయమతాచార్యునిపట్ల నింత శ్రద్ధాభక్తులు చూపుచు గౌరవించుట చూచి ఆ ముదుసలి యాచార్యుడు చాల సంతోషించి "అయ్యా, భగవంతుడు తమకు ప్రసాదించిన సుగుణసంపదలో నొక కొంతయైన నీదేశపు ముసల్మానులకు ప్రసాదించియుండిన నెంత బాగుండును!" అని అరబ్బీభాషలో ననెను. ఈ మాటలను ఘులాంహుస్సేనుగారు సితాబ్‌రాయిగారికి తర్జుమా చేసి చెప్పగా ఆయన యింత సదభిప్రాయమునకు తాను తగనని మర్యాదగా బదులుచెప్పి ఆయనకు వందనము లర్పించెను. ఆ విద్వాంసుడు వెడలిపోవునప్పుడు సితాబ్‌రాయిగా రాయనకు విలువ గల దుశ్శాలువలను, పట్టుజరీతో నేసిన కీన్కాబులను అమూల్యాం బరములను సమర్పించెను. అప్పుడు తా నాయనకు ధనము నిచ్చినచో నాయన ఏమైన అనుకొనునేమో యని సందేహించి వారు బసకు వెళ్లినతరువాత నొక నమ్మకమైన సేవకునికొక వెయ్యి రూపాయలుగల సంచి నిచ్చి, ఘులాం హుస్సేనుగారిచేతికిచ్చి ఆ పుణ్యపురుషునకు సమర్పింపుడని చెప్పి ఇచ్చిరమ్మని పంపెను.

ఒకమారు సితాబ్‌రాయిగారి స్వగ్రామమైన షాజహానా బాదులోని యొక పెద్దమనుష్యుడు గయా క్షేత్రమునకు తీర్థయాత్రచేయుచు షాజహానాబాదులో నున్న చక్రవర్తిగారి ఖలిస్సాదివాను గారైన నకుర్మల్ గారి కతడు మిత్రుడైనందువలన గయ, అజీమాబాదు, లేక పట్నాషహరుకు మూడుదినముల ప్రయాణములో నున్నందు వలన సితాబ్ రాయిగారి కొక సిఫారసు ఉత్తరములు వ్రాసి యీయవలసినదని నకుర్మల్‌గారిని కోరెను. అతడు తన హోదానుబట్టి వజీరులతోను, ఉమ్రావులతోను సమానమైన దర్జాకలవాడు. "సితాబ్ రాయిగారు మీకు పరిచితులేకదా? మీరు తీర్థయాత్రకు పోవు చున్నారని తెలియగనే ఆయన మీకు తప్పక సహాయము చేయగలరు. నేను మరల ఉత్తరము వ్రాయుట ఎందులకు? ఇంతకును సితాబ్‌రాయిగా రిప్పుడు మహోన్నతపదవిలో నున్నారు. ఆయన నెట్లు సంబోధింపవలెనో నాకు తెలియుటలేదు. ఏమి వ్రాసిన నేమి కోపము వచ్చునో? ఆయన పూర్వపు మనుష్యుడా? నే నేదైన జాబువ్రాసిన నది మీ

కుపకరింపకపోగా అపకారముకూడ చేయవచ్చును." అని నకుర్మల్‌గారనిరి. ఆకాలములోని గొప్పవారందరి వలనే సితాబ్‌రాయిగారు కూడా చాలాసొమ్ము వ్యయముచేసి దేశపు నలుమూలలను ప్రతిదర్బారులోను తనగూఢచారులను నియమించి ఎప్పటికప్పుడా యాచోటులనుండి వచ్చు వార్తలను తూ.చ. తప్పకుండ తెప్పించుకొనుచుండును. అంతట షాజహానాబాదులో జరిగిన సంభాషణ యాత్రికునికన్న ముందుగనే అజీమాబాదు చేరెను. ఆ పెద్దమనుష్యుడు సితాబ్‌రాయిగారిని దర్శించగనే ఆయన ప్రధానమంత్రిగారైన నకుర్మల్‌గారిచేత నొక ముక్క వ్రాయించుకొనివచ్చిన నెంత బాగుండును అనిరి. "అయ్యా, నేను మిమ్ము స్వయముగ నెరుగుదునని ఆయనకూడ నెరిగియున్నందున నే నాయనవలన నుత్తరము వ్రాయించుకొనిరాలేదు." అని యా పెద్ద మనుష్యుడనెను. "అదికాదు లెండు" అని యాసంగతి యంతయు తమకు తెలిసినట్లు సితాబ్‌రాయిగారు మాట్లాడగా నప్పుడక్కడ నున్న పెద్దమనుష్యులకు సంగతి యర్థముకాక వారాయనను గుచ్చిగుచ్చి యడుగగా సితాబ్ రాయిగారు జరిగిన సంగతియంతయు చెప్పి "దేవుడు మేలుచేసిన యెడల నాసంగతి యాయనకు త్వరలోనే తెలియగలదు" అనెను. దీని యంతరార్థ మెవ్వరును గ్రహింపలేకపోయిరి. సితాబ్‌రాయిగారు ఆ వచ్చిన పెద్దమనుష్యుడకు తగిన సహాయము చేసి అతడు తరిగిపోవునపుడు నకుర్మల్ గారి కీయవలసినదని యొక జాబు నిచ్చెను. ఆయన వలన తనకు కావలసిన పని యేమియు లేకపోయినను సితాబ్‌రాయిగారాయన నెంతో మర్యాదగా సంబోధించుచు, దూరమున నుండు తమబోటివారియందు దయయుంచవలసిన దను భావమును సూచించుచు, మీరు నాయందనుగ్రహించి వ్రాసిన జాబునకు కృతజ్ఞుడ ననియు, దూరముననుండి మీయనుగ్రహము కోరువారిపట్ల మీ సహృదయత్వము చూసి వారి కానందముకలిగించుట మీమంచి స్వభావమునకు తార్కాణమనియు వ్రాసి పది పండ్రెండు వేల రూపాయల విలువగల బహుమానములను నకుర్మల్ గారి కివ్వవలసిన దని ఆయన కిచ్చెను. వంగదేశమున కూడ ఎత్తుకు 25 ఎత్తుల వెండికి విక్రయించు విలువయైన యగరును, వంగరాష్ట్రములో మాత్రమే తయారగు 'మల్‌మల్' జిలుగు వలువలు (ఢాకా మజిలిన్లు), దంతముతో చేసిన మంచపుకోళ్లను, ఐరోపానుండి దిగుమతి చేయబడిన గోడగడియారములు, జేబుగడియారములు, స్ఫటికము వంటి గాజుతో చేసిన ఫంగలదీపముల అస్తరులు (Sconces), పెద్ద పెద్ద అద్దములు,ఐరోపా చీనా దేశముల వింత వస్తువులు మొదలైన విలువగల సామానులను సితాబ్‌రాయిగారు నకుర్మల్ గారికివ్వగలందులకు తన పరముగ నివ్వగా నాపెద్దమనుష్య డాశ్చర్యపడి తాను గయకు పోయి యింటికి చేరునప్పటి కాలస్యమగునని, ఆ బహుమతుల నెల్ల ముందుగనే



షాజహానాబాదుకు పంపించెను. సితాబ్‌రాయిగారి యుత్తరమును, ఆ బహుమతులను చూచి నకుర్మల్ దిగ్భ్రమ చెంది ఆయన నాకు తగినట్లు బుద్ధిచెప్పినాడని సిగ్గుపడి అనేక క్షమాపణలతో ప్రత్యుత్తరము వ్రాసిపంపెను.

సీతాబ్‌రాయిగారి దయాదాక్షిణ్యములు క్రీ.శ. 1770లో వచ్చిన మహాక్షామములో వెల్లడియయ్యెను. ఈ కఱవు వంగరాష్ట్రమును పీనుగపెంటలతో ముంచివేసెను. అన్నవస్త్రములు లేక ప్రజలల్లాడుచుండుట చూచి సితాబ్‌రాయిగారి హృదయము కరగి బీదవారికిని, కన్ను కాలు లేని వారికిని, ముదుసలి వారికిని, దిక్కులేనివారికిని అన్నవస్త్రములిచ్చి కాపాడుట కనేక సదుపాయములను చేసెను. ఇదికాక క్షామనివారణకొరకు కొన్ని చక్కని ఏర్పాటుల నతడు చేసెను. ఆ సంవత్సరమున బియ్యము కరవై ధరలు విపరీతముగ పెరిగిపోగా వేలకొలది ప్రజలు అన్నము దొరకక మరణింపసాగిరి. ఆ సమయమున కాశిలో బియ్యము చౌకగానుండెను. కాని, దానిని వంగరాష్ట్రములోనికిచౌకగా తెచ్చుమార్గములేదు. అంతట సీతాబ్‌రాయిగారు తన పడవలను, మనుష్యులను కాశికి పంపి, ముప్పదివేల రూపాయల బియ్యమును కొని దానిని అజీమాబాదుకు తెచ్చి కాశీబజారు ధరకే యిక్కడవిక్రయింప సాగెను. ఆ సంవత్సరమెల్ల ఆయన పడవలను, మనుష్యులను అట్లు త్రిప్పుచు, బియ్యమును దిగుమతిచేసి ప్రజలకు మహోపకారముచేసెను. సరసమైన ధరకుకూడ బియ్యమును కొనలేని బాధలు పక్షులవలె రాలిపోవుట చూచి హద్దులేనిచో నిజమైన దరిద్రుల కన్నమే దొరకదని నిశ్చయించి సితాబ్‌రాయిగారు నాలుగు తోటలకు చుట్టు నావరణగోడ లుంచి అందులోనికీ దరిద్రుల నందరిని చేర్చి, వారి కన్నముపెట్టి రక్షింపసాగెను. దానికొరకు కొంతమంది గుమాస్తాలను, సిబ్బందిని కూడ నియమించెను. ఆ దరిద్రులలో ముసల్మానులకు వేరుగాను, హిందువులకు వేరుగాను సౌకర్యములు కలిగించెను. ఇట్లు ప్రతిదినము వేళకు భోజనము పెట్టి యీ దీనజనుల నితడు కాపాడు పద్ధతిని చూచి ఇంగ్లీషు వర్తకులును, డచ్చి వర్తకులును కూడ బీదల ననేక ఆవరణలందుంచి పోషింపసాగిరి. రాజధానీ నగరమైన మూర్షిదా బాదులో నట్టి చక్కని ఏర్పాట్లు జరుగలేదు. అక్కడ కంపెనీవారు మహమ్మదు రెజాఖానును క్షామనివారణ పనిచేయు పోలీసుశాఖ కధికారిగ చేసిరి. కాని గింజ దొరకక సామాన్య ప్రజలు బాధపడసాగిరి. బీదలపైన పెత్తన మివ్వబడిన మిర్ సులేమాన్ ఖాన్ మొదలైన 'సూపరైజర్లు' స్వార్థపరులై బీదలకై తెచ్చిన బియ్యము నంతయు తామే హరించివేయసాగిరి. సర్కారువారి బియ్యపు పడవలు రేవులో దిగగానే రెజాఖానుగారి యాంతరంగికులు, ఆ బియ్యమును తమ యిండ్లకు తోలించుకొనసాగిరి. ఇట్లు

అన్యాయముచేసి బీదలను మాడ్చినవారిలో రాజా అమృతసింగ్ ఒకడు. మీర్జాఫరు దగ్గర నొక నీచసేవకుడుగా నుండిన నామెత్ ఒల్లాఖాన్ మహమ్మదు రెజాఖాను దగ్గర నొక కార్యకర్త (Steward) యై నమ్మిన బంటుగా నుండెను. అతడాకాలమున బియ్యము నమ్ముటకు నియమింపబడి చాల అక్రమములు గావించెను. అతడు 18 లక్ష లార్జించినట్లు ప్రతీతి. ఈ యక్రమములను మాన్పువారుగాని, బియ్యము సరియైన ధరకు అమ్మించువారు గాని, అన్యాయము చేయువారిని శిక్షించువారు గాని లేకపోయిరి. పరిపాలనలో రెజాఖాను చేసిన అన్యాయమునకు తర్వాతనతనిని పట్టుకున్నప్పుడు అతనిపైన మోపబడిన నేరములలో నది యొకటి.

సితాబ్‌రాయిగారు ప్రతియేటను ఇరాన్ (పారశీక)దేశమునుండి యపూర్వ ఫలజాతులను తెప్పించి యింగ్లీషు దొరలలో ముఖ్యులైనవారికిని, వంగరాష్ట్రములోని గొప్పగొప్ప ప్రభువులకును, అజీమాబాదులోని గొప్పవారికిని, విద్యావంతులకును బహుమానముగ పంపుచుండును. ఇతడు ఫలజాతుల నమ్ము వర్తకులకు ప్రత్యేకముగ కొంత ధనమును అప్పుగా నిచ్చి వివిధజాతుల ఫలముల విక్రయమును ప్రోత్సహించుటవలన తన పట్టణములోని బజారులో నపూర్వ ఫలజాతుల నమ్ముటకు కారకుడయ్యెను. అదిగాక అతడు దూరదేశములనుండి లాహోరు, ఆగ్రా, కాబూలు నగరములనుండి అనేక ఫలజాతుల మొక్కలను, గింజలను తెప్పించి, తోటలయందు నాటించుచుండును. ఇతడు కస్తూరికర్బూజ (Musk-melon) అను అపూర్వ కర్బూజజాతిని అజీమాబాదులో వ్యాపింపజేసినాడు.

సితాబ్‌రాయిగారు పుట్టుకవలన హిందువుడే యైనను, మతాచారములందు షియాశాఖకు చెందిన ముసల్మానుడే నని సియర్ ముతాఖెరిన్‌గ్రంథకర్తయైన ఘులాం హుస్సేన్ ఖాన్ గారు చెప్పుచు తమ గ్రంథమునం దీ క్రింది యుదాహరణముల నిచ్చి యున్నారు. మహమ్మదు ప్రవక్త అల్లుడైన ఆలీ యవతార పురుషుడని నమ్మి ఆయన మరణమును గూర్చి దుఃఖించుట కేర్పడిన నెలయైన మొహరంలో ఆలీగారు చనిపోయిన దినమైన 21వ నాడు సితాబ్ రాయిగారు పాలతో నుడికించిన యన్నపు ముద్దలను, ఇతర మిఠాయిలను, ఆహారపదార్థములను భక్తితో తయారుచేయించి, ప్రార్థన, నైవేద్యానంతరము దానిని నగరమునందు పంచిపెట్టించుచుండును. ఆయన సాధారణముగ 'యా అలీ' అని భగవన్నామ స్మరణ చేయుచుందురు. 'వల్లాబిల్లా' యని దైవముపై నొట్టు పెట్టుకొనుచుందురు. సంవత్సరమున నొకమారు రాజసింహుని (King of Braves) స్మృతిచిహ్నముగ భోజనములు తయారుచేయించి, 'ఫాతెహా' ప్రార్థనము చేయించి, దానిని



పంచి పెట్టించుచుందురు. ఒక దినమున దానిని పంచిపెట్టుట లోపల నేదైన నొక మహత్తు కనబడువఱకును వేచియుండుట మంచిదని ఒక పెద్ద మనుష్యు డనగా, "అయ్యా, అన్యమతమునకు జెందిన నావంటివాడు ఆలీగారి మహత్త్వమును చూడగోరుట విపరీతము. అట్టి మహాత్త్వము లేకుండగనే నాకాయన దివ్యత్వమునందు నమ్మక మున్నది. పదార్థములు చేయించుటలో శుచిశుభ్రతలు తక్కువైనందువలన గాని, మఱి యే పొరపాటు వలనగాని అట్టి నిదర్శనము కనబడక పోవచ్చును. అంత మాత్రమున దానినిబట్టి హేళనచేయుట కవకాశ మేర్పడును. ఇది సమంజసము కాదు" అని చెప్పెను.

ఒకమారు అతడు జనరల్ స్మిత్తు దొరకు స్వాగత మిచ్చుటకై ఎదురేగుచు పోయి ఒక దేవాలయముదగ్గర గుడారములను వేయుట తటస్థించెను. ఆ మరునాటి యుదయ మాయన పల్లకీలో బయలుదేరుటకు సిద్ధముగ నున్నప్పుడు ఆ దేవాలయపుటర్చకులు వచ్చి "అయ్యా, ఈ దేవాయలము మహాదేవునిది. ఈ దినము పౌర్ణమి. ఇది భగవదారాధనకు ముఖ్యమైన శుభదినము" అని చెప్పి తమ్ము కనిపెట్టుడని వేడుకొనిరి. అంతట నాయన "మీరేదైన చెప్పవలసినచో దేవుని దర్శింపవచ్చిన భక్తులతో చెప్పవచ్చును. ప్రస్తుతము నాకు మీతో గాని దేవునారాధనతో గాని పనిలేదు" అని పల్లకి నెక్కి వెడలిపోయెను. హిందూ యాచకులాయన నర్థించినపుడు, ఆయన ఏమియు నివ్వక పోయినను, మహమ్మదీయ ఫకీరు లర్థించినపుడు మాత్రము తప్పక ఒక రూపాయి నిచ్చుచుండును. సితాబ్‌రాయిగారు కలకత్తాకు గాని, వంగరాష్ట్రమునకుగాని పోవుట తరుచుగా తటస్థించును. అప్పుడు దారిలోని దేవాలయములోనికి పోయి దేవుని దర్శించివత్తమని యాయనతో నున్న మిత్రులనగా నాయన వారి కొక వందరూపాయిలిచ్చి వారిని వెళ్లి పూజలు చేయింపుడని, తాను మాత్ర మేదో సాకు చెప్పి పోకుండ మానును.

సితాబ్‌రాయిగారు తన కాపురమున కొక దివ్య భవనమును కట్టించుకొనెను. అందులో గృహప్రవేశ సందర్భమున బ్రాహ్మణులకు సంతర్పణచేయవలసిన దని దేశీయమిత్రు లాయనతో ననగా, ఈ బ్రాహ్మణులు తన భవనమును పాడుచేయుదురనియు, కావలసినచో వారికి గంగాతీరమున సంతర్పణ చేయింతుననియు చెప్పి అట్లే గావించెను. 1770లో వంగరాష్ట్రమును, ఉత్తర హిందూ స్థానమును నాశముచేసిన ఘోరక్షామములో ఆయన స్నేహితుడైన మురళీధరుడు, రాయ్ కిటుల్దాస్ సూర్దుసింగ్ మొదలైనవారి కోరిక పైన నిష్ఠాగరిష్ఠుడైన ఒక బ్రాహ్మణుడు ఆయనను దర్శించుట తటస్థించెను. అటు తర్వాత నా బ్రాహ్మణు –డా విద్వాంసుడు తఱచుగా సితాబ్‌రాయిగారికి సనాతనధర్మమునందు గట్టి నమ్మకము గలిగింప తలచి ఒకనాడు

"మహాప్రభూ, తమ జాతకమునుబట్టి తాము చేయదగిన నామజపమునునిర్ణయించినాము. దాని ప్రకారము తాము తావళముతో జపము చేయుచుండిన చాల మంచిది" అనెను. అంతట సితాబ్‌రాయిగారు "స్వామీ, నే నిదివరకే వెయ్యిన్నొక్క పేర్లు నామజపము చేయుచున్నాను. అది చాలును' అనెను. అది ఏమని బ్రాహ్మణుడడిగినను, సితాబ్ రాయిగారు చాలసేపటివఱకు చెప్పలేదు. తరువాత 'రహీము', అనగా పరమదయాళుని జపమని చెప్పెను. అంతట నాబ్రాహ్మణుడు "మహాప్రభూ, రామ్ రహీమ్ లను పేర్లు రెండును అద్వితీయుడైన పరమాత్మయొక్క నామములే కదా? ఇందు భేద మేమి?" అని సరిపెట్టజూచెను. సితాబ్‌రాయిగా రందుకొని "కొంచెము భేదమున్నది. రాముని పేరుచ్చరింపగనే దశరథ నందనుడని స్ఫురించును. రహీముపేరుచ్చరించగనే జరామరణములు లేని పరబ్రహ్మము మాత్రమే స్ఫురించును" అనెను. ఈ వేదాంతిని తాను మార్చలేనని బ్రాహ్మణుడు సెలవు పుచ్చుకొనెను - అని ఘులాం హుస్సేనుగారు తమ గ్రంథమున వ్రాసియున్నారు.

*- ఆంధ్రపత్రిక సర్వధా సంచిక*



ఈ వ్యాసము గులాం హుస్సేన్ ఖాన్‌గారు పారశీ భాషలో రచించిన 'సియర్ ముతా ఖెరిన్ అను ఒక చరిత్ర గ్రంథము యొక్క ఇంగ్లీషు తర్జుమా నాధారపరుచుకొని వ్రాయబడినది.

[1] నిజమునకు ప్లాసీలో జరిగిన దొక చిన్న సంకుల సమరమేగాని గొప్ప యుద్ధముకాదు. ఆ క్రిందటి రాత్రి పడిన వర్షములో నవాబుగారి ఫిరంగులు పనిచేయలేదు. క్లైవు మొదట భయపడెను గాని ఆకస్మికముగా తన సైన్యము ముందుకు నడువగా నవాబు సైన్యము చెల్లాచదురయ్యెను.



# విస్సన్న చెప్పింది వేదం: విన్సెంట్ స్మిత్తు వ్రాసింది చరిత్ర

**(ప్రచారంలో లేకుండా చేయబడిన పూర్వ చరిత్రలు - చరిత్రలోకెక్కకుండా చేయబడిన ఆంగ్లయుగం నాటి చరిత్రాంశాలు - నూతనంగా సృష్టింపబడిన బ్రిటిష్ ఇండియా చరిత్రలు)**

ప్రపంచంలో ఏదేశం యొక్క చరిత్ర చదివినా ఆ దేశ ప్రజల సుగుణసంపత్తీవారి గొప్పదనమూ, వెల్లడియౌతూ వుంటాయి. దేశాభిమానపూరితమైన చరిత్రాంశాలు కనబడతాయి. దేశభక్తుల జీవితాలు కనబడతాయి. అదియేమి పాపకర్మమోగాని, మనదేశంలో ఇప్పుడు ప్రచారంలో వున్న హిందూ దేశచరిత్రలు చూస్తే మాత్రం ఇందుకు విరుద్ధంగా మన ప్రజల అవగుణాలు, లోపాలూ మనలను పరిపాలించే ఆంగ్లేయుల గొప్పదనమూ, ఔదార్యమూ, వారు మనకు చేసిన ఉపకారాలూ ప్రచారంచేసే అంశాలే కనడతాయి. మన ప్రజల స్థితిగతులను గురించిన సంగతులుగాని, పాలకులకూ పాలితులకూగల పరస్పరసంబంధముల చరిత్రగాని, దేశాభిమాన పూరితములైన చరిత్రఘట్టాలుగాని, మనదేశభక్తుల జీవితచరిత్రలుగాని అందులో కనబడవు. ప్రజలను పీడించి అన్యాయాలు చేసిన వారన్‌హేస్టింగ్సు క్లైవుమున్నగు నాంగ్లేయుల చర్యలు సమర్థింపబడుతాయి. మహానుభావుడగు శివాజీ ఛత్రపతి కొండయెలుకయనిన్నీ ఇంకను ఇతర దేశభక్తులను రాజులను నవాబులను చిత్రవిచిత్రములగు నీచపు బేళ్లతోను వర్ణిస్తారు. కలకత్తా చీకటికొట్టు కథలవంటి పుక్కిటిపురాణాలు, వ్రాయబడి వుంటాయి.

మనచరిత్ర లిలా వుండడానికి కారణమేమిటి? ఇవి స్వతంత్రంగా రచియింపబడిన జాతీయ చరిత్రలుగాక, మన యాంగ్లేయ ప్రభువుల మెప్పుకోసం వారి చిత్తానుసారంగా రచింపబడిన పరతంత్రరచనలు కావడమే దీనికి కారణమని చెప్పాలనా? భారతీయులలో పొరబాటున నైనా స్వతంత్రభావాలు వ్యాపింప గూడదని మన యాంగ్లేయ ప్రభువుల యభిప్రాయం. అందువల్ల స్వాతంత్ర్యం లభిలషించడమూ అందుకోసం పాటుపడడమూ ఎంతరాజద్రోహకరంగా ఎంచబడుతాయో, పూర్వం మనవారు స్వాతంత్ర్యము

నభిలషించారనిన్నీ అందుకోసం పాటు బడ్డారనిన్నీ వ్రాయడము కూడా అంత రాజద్రోహకర విషయంగానే ఎంచుతారు మనప్రభువులు. ఇంగ్లీషువారీ దేశము నాక్రమించక పూర్వం ఈ దేశము నేలిన రాజులు నవాబులు దుర్మార్గులన్నీని, వారి దుష్పరిపాలనంలో ప్రజలు బాధలుపడుతూ ఆంగ్లేయులకు స్వాగత మిచ్చి, వీరి సత్పరిపాలనము క్రింద సకల సౌఖ్యాలూ అనుభవిస్తూ వున్నారను ప్రచారము జరుగువలెనని కూడా మనప్రభువులయూహ. ఇట్టి భావములు లేతవయస్సులో నాటుకొనినచో భారతీయులు శాశ్వతముగా బ్రిటీష్‌ప్రభుభక్తి పరాయణులై యుందురని వారి తలంపు. అందువలన మన దేశ చరిత్రలు ఇలాంటి పాఠాలు బోధించునట్టివిగా నుండవలెనని వీరు నిశ్చయించారు. రాజు తలుచుకుంటే దెబ్బలకేమి కొదవ? త్వరలోనే మన ప్రభువులకోర్కె సఫలమైనది. శీఘ్రంగానే ప్రభుభక్తి పాఠములు బోధించే చరిత్రలు బయలుదేరినాయి. మన ప్రభువుల కిష్టములేని సంగతులు తీసివేసి, వారి యభిమతానుసారముగా నుండే అంశాలు కల్పింపబడిన నూతన హిందూదేశచరిత్రలు బయలుదేరినాయి. పూర్వ మీ దేశమును జూచి ఆంగ్లేయులు వ్రాసిన గ్రంథాలలో నిందుకు విరుద్ధమైన అంశాలు చాలా వుండడంవల్ల అలాంటి గ్రంథాలు మళ్లీ అచ్చువేయబడక అణచివేయబడినాయి. ఇటీవల రచనలన్నీ ఆంగ్లేయ ప్రభుత్వ పక్షపాతబుద్ధితో ఇల్లాగే వ్రాయబడిన కృత్రిమ చరిత్రలే. ఈ నూతన చరిత్ర వాఙ్మయానికి విన్సెంటుస్మిత్తుగారు వేదవ్యాసుడైనాడు. ఇతడు వ్రాసిన పురాణేతిహాసములే మనకు పరమప్రమాణములైన చరిత్రలైనాయి. ఏ చరిత్రాంశమైనా ఈ శంఖంలో పోస్తేనేగాని తీర్థంకాదు. ఆంగ్ల ప్రభుత్వవిధానమువలన భారతీయులకు దాపురించిన రాజకీయ దాస్యముతోపాటు ఆంగ్ల విద్యావిధానమువలన భావదాస్యముకూడ దాపురించి, నిజదేశ వేష భాషలపై నభిమానమును మాని, పారతంత్ర్యవ్యామోహమున జిక్కి, పాశ్చాత్య చరిత్రకారులు పెట్టిన బిక్షమునే గ్రహించుట కలవాటుపడితిమి. కొన్నాళ్లకు సత్య చరిత్రనే మరచి పూర్వస్మృతి యేలేక యీ కృత్రిమచరిత్రలనే నిజములని నమ్మసాగితిమి. ఇందుకు భిన్నముగా నున్న పాతచరిత్రలను బయటకు దీసినచో, మన యాంగ్ల ప్రభువులకు కోపము వచ్చునని చరిత్ర పరిశోదకులు భయపడిరి. విద్యాపీఠములందు వార్షికము లనుభవించు ఆచార్యపురుషులు సర్కారునౌకరుల మనుభావముతో మేజర్ బీ. డీ. బసూవంటి ధైర్యశాలియెవడైనను యథార్థచరిత్రను బయటకు దీసినను, దాని నాదరింప రైరి. ఇట్టి స్థితిలో నిటీవల కొందరాంగ్లేయ గ్రంథకర్తలే మన యదృష్టవశమున ప్రాతపుస్తకములను బయటకు దీసి, భారతదేశ యథార్థచరిత్ర రచనకు దారిచూపినారు. అట్టివారిలో ఎడ్వర్డు



తాంప్సన్ జి.టి. గెర్రాట్టుగార్లు ప్రముఖులు. వీరు 1934లో Rise and Fulfilment of British Rule in India అను పేరుననొక బ్రిటీష్ ఇండియా చరిత్రను రచించినారు. దానిని మాక్మీలన్ కంపెనీవారు ప్రకటించినారు.

"ఇటీవల కొన్ని సంవత్సరాలనుండి హిందూ దేశచరిత్రలను వ్రాయుచున్న ఆంగ్లేయుల మన మీసంగతులు వ్రాస్తే, ఈ విమర్శనచేస్తే భారత దేశంలో మన యాంగ్లేయ ప్రభుత్వానికి నష్టం వస్తుందేమో!" ననే భావంతోనే వ్రాస్తున్నారు. నూరు సంవత్సరాలకు పూర్వం వ్రాసిన వారికి ఇలాంటి ఆలోచనలుగాని జంకుగొంకులుగాని లేవు. వారు వ్రాసిన చరిత్రలు ఎక్కువ యథార్థములుగానూ నిష్పక్షపాతంగానూ సమగ్రంగానూ వున్నాయి" అని తాంప్సన్ గెర్రాట్టుగార్లు ఆగ్రంథంలో వ్రాశారు. విన్సెన్‌టు స్మిత్తుగారి వ్రాతలను చాల చోట్ల వీరు ఖండించి, యథార్థాంశాలు బయటపెట్టినారు.

పూర్వం ఈ దేశాన్ని గురించీ ఈ ప్రజలను గురించీ ఇక్కడ జరిగిన సంగతులను గురించీ వ్రాసిన దొరల గ్రంథములలో నుండి మచ్చుకు కొన్ని సంగతుల నీ క్రింద నుదాహరిస్తున్నాను.

## ఇంగ్లీషు కుంపినీవారి పద్ధతులు

కుంఫిణీ పరిపాలనమునందు ప్రారంభదశలో ఈ దేశము నుండి దోచుకొని ఇంగ్లాండుకు తరలించిన ధనసంచయములకు లెక్కలేదు. ఆకాలమున జరిగిన అన్యాయములకు మితిలేదు. క్లైవుయొక్క పరిపాలనను గురించి పార్లిమెంటులో చర్చ జరిగినప్పు డాతనిని పార్లిమెంటువారు మన్నించినను, ఈ దేశములో జరుగుచుండిన యన్యాయములు కొన్ని బయల్పడెను. అ కాలమున మన దేశమునకు వచ్చిన ఆంగ్లేయు లందరు రాజులనాశ్రయించి, ప్రజలను పీడించి, ఎవరిచేతికి దొరికిన సొమ్మువారు హరించుచుండిరి. భారతదేశమున ఇంగ్లీషు ఉద్యోగులు చేయు అన్యాయములు, పుచ్చుకొనుచున్న లంచములు, ప్రజలను పీడించుటయు మితిమీరిపోయెను. కుంఫిణీ యుద్యోగియైన వారన్ హేస్టింగ్సు దీని గూర్చి 1762లోనే కఠినముగా వ్రాసినయుండెను. ఎట్టకేలకు దీనిని సంస్కరించుటకు ఈక్లైవునే భారతదేశమున కంపిరి. ఇక్కడి స్థితిగతులను చూడగా నతనికే రోత కలిగెను.

"దేశమున విప్లవముల పరంపర-అల్లకల్లోల ములో మునిగిన పరిపాలనా విధానము, ప్రజలు పీడింపబడుచునే యున్నను కుంఫిణీ వారు ధనవంతులుకాకపోవుట" - ఇవి ఈ క్లైవు చూచిన పరిస్థితులు!" ఆహా! ఇంగ్లీషువారి పేరు ఎంత నీచస్థితికి

దిగిపోయినది!" అని క్లైవు తన మిత్రునికి 1765లో వ్రాసినాడు.

ఇంగ్లీషు వర్తకులు ఉద్యోగులు రైతులను గ్రామస్థులను పీడించుచుండుట, బలవంతపెట్టి వారి వస్తువులను చౌకగా అమ్మునట్లు తమ సరకులు ప్రియముగా కొనునట్లు చేయు చుండుట, మీర్ఖాసీం నవాబుకు సుంకము లివ్వక ఆయన యుద్యోగులను దౌర్జన్యము చేఉయుట, అనేక అన్యాయములు చేయుచుండుటలను గూర్చి 1765లో ధైర్యశాలురగు కొందరు జమీందారులు గవర్నరు సభకు ఇచ్చుకొనిన అర్జీలో వర్ణింపబడినది.

1784లో బర్కు మహాశయుడు పార్లిమెంటులో నిట్లుపన్యసించిరి.

"1773 మొదలు 1784 వరకుగల భారతదేశ పరిపాలనమును గూర్చి పార్లిమెంటువారు చేసిన విచారణలయొక్క ఫలితముగా తూర్పుఇండియా కంపెనీ అన్ని రాజకీయ వాణిజ్యవ్యవహారములందును స్థాపింపబడిన ఉద్దేశములకు వ్యతిరేకముగా విపరీతపరిణామమును జెంది, అన్యాయములతో నిండినదని తేలినది. యుద్ధములుచేయుటకు సంధులు చేసికొనుటకు ఇంగ్లీషురాజువారి కిచ్చినపట్టా దుర్వినియోగము చేయబడినది. దోపిడిచేసి లాభము లార్జించుటకు వైరములు పెంచబడి, అనవసరములైన యుద్ధములు ప్రకటింపబడినవి. దేశీయరాజులతో వారుచేసిన సంధియేర్పాటులన్నిటిని వారు మీరి, భంగపరిచి, నమ్మకద్రోహముచేసినారు. ఒకప్పుడు సంపదలతో తులతూగిన రాజ్యభాగములు దారిద్ర్యములో మునిగి పాడువడి నిర్మానుష్యములైపోవుచున్నవి. దీనివలన అచ్చట మనబలముకూడా తగ్గుచున్నది. మనజాతీయ ప్రతిష్ఠకు భంగము కలుగుచున్నది. మనదేశము యొక్క శాసనధర్మములు బహిరంగముగా తృణీకరింపబడుచున్నవి. కుంఫినీ యుద్యోగులు కుంఫిణీడైరెక్టర్లకోర్టువారి పాలకసభలో వోటు చేయుహక్కులను వాటాల క్రయములద్వారా సంపాదించి, కంపెనీకే పెట్టుబళ్లు పెట్టి తమకు వశవర్తులుగా జేసికొనుచు వారిని లెక్కసేయక సర్వాధికారులై స్వేచ్ఛగా ప్రవర్తించుచున్నారు. అందువలన ఉద్యోగము లందు వారు చేయు అక్రమములు దస్తుఫాజల్ అపహరణములు బయల్పడినప్పుడు కుంఫిణీవారు విమర్శించి శిక్షించుటకు బదులు, వారిచర్యలను సమర్ధించుచున్నారు. ఈ కుంఫినీవారి వ్యవహారములన్నియు చాలా భయంకరస్థితిలోనికి దిగినవి. ఈజాతియొక్క సంరక్షణలో నున్న కోట్లకొలది నోరులేని ప్రజలు న్యాయముగా పరిపాలింప బడవలసియున్న ప్రజలు వారిని పీడించిపీకుకొని తినుచున్న నిరంకుశ దుష్పరిపాలనము వలన బాధలనందుచున్నారు. ఇట్లు కుంఫిణీవారు వారి యుద్యోగులు నొకగూడుపుఠాణీగా యేకమై సర్వాధికారములు గల ఈపార్లిమెంటు వారు ఈ పరిస్థితులను సంస్కరించుట కొరకు వారికిచ్చిన సలహాలను వారింపులనుకూడ లెక్కచేయక, ప్రవర్తించుచున్నారు. ఈ



అక్రమములను చేయుచున్న దుర్మార్గులలో కొందరినీ పార్లిమెంటుసభ పేర్కొని, వారిని ఉద్యోగములనుండి తొలగించి, సీమకు రప్పింపుడని కోరినను కుంఫిణీవారేవో సాకులుచెప్పుచు ఈ దుష్పరిపాలన సంస్కరింపక, ఆదుర్మార్గుల విషయమై చర్యగైకొనక, ఈ సభవారు గర్హించినవారిని సమర్ధించుచున్నారు" అని బర్కు మహాశయు డుపన్యసించెను.

ఆంగ్లేయ గవర్నరు జనరలైన వారన్‌హేస్టింగ్సు చేయుచుండిన అక్రమములనుగూర్చి దేశీయులు కవున్సిలు కనేక అర్జీలిచ్చుకొనిరి. వారన్ హేస్టింగ్సు బలవంతుడై సుప్రీమోకోర్టు తీర్పుద్వారా నందకుమారుని ఉరిదీసినపిదపనే భయపడి, ఫిర్యాదులు చేయుటమానిరి. అంతట పాపము బ్రద్దలుకాగా, వారన్‌హేస్టింగ్సు దుష్పరిపాలనమునుగూర్చి పార్లిమెంటులో విచారణ జరిగెను. ఆ సందర్భమున ఎడ్మండు బర్కు షరిడనుగార్లు పార్లిమెంటులో చేసిన మహోపన్యాసమువలన ఆనాడు మనప్రజలెంత ఘోరమైన బాధల నందిరో తెలియుచున్నది. 1787 సంవత్సరమున నుపన్యసించుచు షెరిడన్ మహాశయుడు పార్లిమెంటు సభాముఖము నిట్లు చెప్పినాడు. "ఈ కుంఫిణీవారి పద్ధతులలో వీధులలో మూటలు వేసికొని తిరిగి యమ్ముకొను వర్తకుని హైన్యస్వభావము, సముద్రముపైన ఓడలను దోచుకొను బందిపోటు దారుల దౌష్ట్యమును గలిసియున్నవి. రాజకీయ సైనిక వ్యవహారములందు గూడ వేలము పాట పాడు రాయబారులు రాజ్యతంత్రము నడుపువర్తకులు కనబడుచున్నారు. ఇట్లు ప్రమాణపత్రముల ద్వారాను ఒకనిని అరెస్టు చేయుట నొక సైన్యము నుపయోగించుట వలనను, ఒక ప్రోనోటు బాకీ వసూలు కొరకొక పట్టణమును ముట్టడించియు, ఒక కాతాబాకి కొరకొక రాజును పదభ్రష్టుని జేసియు విప్లవములు కలిగించుట కాననగుచున్నవి. రక్తసిక్తమైన రాజదండలాంఛనములు, చిల్లర వర్తకుడు గల్లా పెట్టె దగ్గరనడుపు కృత్రిమములు ఒకచేత ధర్మదండము ఇంకొకచేత జేబులు కత్తిరించు పద్ధతులును నడిచినవి."

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక 14-5-1941 నుండి 4-6-1941 వరకు ఈ శీర్షికలో ప్రకటింపబడినది.

1818 నాటికి భారతదేశమున చాలా భాగమింగ్లీషు కుంపిణీవారివశమయ్యెను. 1813లో ఇంగ్లాండు పార్లమెంటువారు కుంపిణీ వారికి 1818 నాటికి భారతదేశములో చాలభాగము ఇంగ్లీషు కంపెనీ వారివశమయ్యెను. 1813లో ఇంగ్లండు పార్లమెంటువారు భారతదేశములో వర్తక రాజ్యాధికారముల పట్టానిచ్చునప్పుడు అదివరకు కుంపిణీవారికీ దేశముననుండిన సర్వమక్తా వ్యాపార హక్కులను రద్దుచేసిరి. కాని కుంపినీవారికీ దేశమునగల వర్తక స్థానములను రద్దుచేయలేదు. కుంపినీ వారు చీనాదేశముతో వర్తకము

చేయుటకు ప్రత్యేకాధికారము కలిగియుండిరి. వీరీ హిందుదేశమున రాజ్యపాలనము చేయుచు చీనా వ్యాపారము చేయుచు రెండు విధములుగను లాభము పొందసాగిరి. హిందూదేశములో మహారాష్ట్ర సామ్రాజ్యము విచ్ఛిన్నమగుటతో కుంపినీవారినెదురింపగల ప్రబల శత్రువులే లేకపోయిరి. అందువలన వారు బలవంతులై దేశీయరాజులు ప్రజలేమనుకొందురో యను జంకుగొంకులు లేక నిరంకుశలై గర్వాంధులై ప్రవర్తింపసాగిరి. దేశీయులను మర్యాదగ చూచుటపోయి అవమానించుట విహీనముగ ప్రారంభమయ్యెను.

1818 వరకు హిందువులను, మహమ్మదీయులను చాల మర్యాదగ చూచుచూ వారి దేవాదాయములను ధర్మాదాయములను కాపాడుచుండిరి. వారి మతాచారములలో నెట్టి జోక్యము కలిగించుకొనక వారినాదరించుచుండిరి. కుంపినీవారి పరిపాలనమందు చేరిన గ్రామస్తులు శాంతిభద్రతలు కలిగియుండి తమ కృషిని పరిశ్రమలను వృత్తులను చేసుకొనుచున్నందువలన వారికి విజాతీయులు తమ దేశమును విజాతీయులు పరిపాలించుచున్నారను బాధ వారికి కలుగలేదు. ఇంతలో నొక గొప్పమార్పు వచ్చినది. దేశీయుల మతాచారములను దూషించుచు హిందువులను మహమ్మదీయులను మత భ్రష్టులుగ చేసి క్రైస్తవ మతమున కలుపుకొనదలచిన మిషనరీలు దేశములో వ్యాపించి కుంపనీ ప్రభుత్వమున పలుకుబడి క్రైస్తవమత పక్షపాత చర్యలకు దోహదముచేసిరి. ఇటీవల కుంపినీవారు చేసిన శాసనములును వారి చర్యలును మిషనరీల ప్రోత్సలముతో హిందువులను మహమ్మదీయులను బాధించునట్టివిగ నుండెను. దేశీయుల మతధర్మముకు ఆచారములకు భంగము కలిగించు కొన్ని నిబంధనలు చేయబడెను. ఇదిగాక కుంపినీవారు దేశప్రజలలో స్వయముగా విద్యాభివృద్ధిగావింపక మిషనరీలు స్థాపించు పాఠశాలలకు సహాయము చేయుచుండిరి. ఈ మిషనరీలు బాలురకు విద్యబోధించు నెపమున వారికి హిందు మహమ్మదీయ ధర్మములపైన ఆచారములపైన అసహ్యము కలిగించు సంగతులు బోధించుచూ వారి మనసులు విరిచి క్రైస్తవ మతమును బోదించి క్రైస్తవమతములో కలుపుటకు ప్రయత్నింపసాగిరి.

## 1793 నాటి పరిస్థితులు

1793 వ సంవత్సరము వరకును కంపెనీ పరిపాలన పూర్వకాలమునాటి మొగలాయి పద్ధతుల ప్రకారమే జరిగెను. దేశీయోద్యోగులే అన్ని కార్యములను నిర్వహించు చుండిరి. వీరిపైన దొరలు పైతనిఖీ చేయుచుండిరి. అంతేగాని దొరలే స్వయముగానే కార్యమునుచేయువారు కారు.



గ్రామపరిపాలనమెల్ల పూర్వమువలెనే గ్రామ పంచాయితులద్వారముననే జరుగుచుండెను. గ్రామములోనిసాగుభూమినెల్ల పంచాయితులే అమరకపరచి శిస్తులను వసూలుచేసి రాజభాగమునుస్థానిక రాజోద్యోగికిచ్చుచుండెను. న్యాయపరిపాలనమును కూడా పంచాయితులే జరిగించుచుండెను. పట్టణములలో మొగలాయి న్యాయస్థానము లుండెను. ఈ న్యాయ విచారణలపైన మొగలాయి చక్రవర్తి అప్పీలు అధికారములు కలిగి యుండెను. భారతదేశము నందు మొగలాయి ప్రభుత్వమునకు బదులు కంపెనీ ప్రభుత్వము వచ్చినను దేశముయొక్క పరిపాలనా విధానము పూర్వమువలెనే సాగుచుండి నందువలన దేశము యొక్క రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థలు కట్టబాటులు చెక్కుచెదరక ఎప్పటివలెనే యుండెను.

కారన్‌వాలిసు భారతదేశమునకు గవర్నరుజనరలుగా వచ్చిన తరువాత అతడుచేసిన మొదటిపని, శాశ్వతఫైసలా అను భూమిశిస్తుల నిర్ణయము. అదివరకు దేశము లోని వివిధ ప్రాంతములలో శిస్తులను దళారీలు ఇజారాలు పాడుచుండిరి. కంపెనీ వారికి కొంత పేష్కసును శాశ్వతముగా చెల్లించుపద్ధతిని దేశములో రైతుల అధీనమందుండిన భూమికి ఈ దళారీలేహక్కుదారులైయుంటు ఒక క్రొత్త జమీందారీపద్ధతిని కారన్‌వాలిసు స్థాపించెను. అంతట నీ జమీందారులు రైతులను పీడించి, తమ యిచ్చవచ్చినట్టు హెచ్చు శిస్తులు వసూలుచేయుచు తామమాత్రము కంపెనీకి నిర్ణీతపు సొమ్మును చెల్లించుచు తాము బాగుపడసాగిరి. వీరు భూములను నీటివనరులను మరమ్మత్తు చేసి బాగుచేయక ఉపేక్షింపసాగిరి. భూసారము తగ్గినను ఆదాయము క్షీణించినను శిస్తులు తగ్గించక వసూలు చేయుచుండిరి. శిస్తులు చెల్లించలేని రైతుల మళ్లు మాన్యములు ఇళ్లు వాకిళ్లు పశువులు జప్తుచేసి అమ్మించు అధికారము ఈ ఇంగ్లీషు పరిపాలనలో ఏర్పడినందువలన జమీందారుల నిరంకుశత్వము హెచ్చినది. పేష్కషు చెల్లించలేని జమీందారులు జమీల నమ్మించు హక్కుకంపెనీవారి కుండినందువలన జమీందారీలుకూడా తల క్రిందగుచుండెను.

కారన్‌వాలిసు దేశమును జిల్లాలుగా విభజించి ప్రతి జిల్లాకు నొక పన్నులవసూలు అధికారి నేర్పరచినాడు. ఈ అధికారులకు కలెక్టరులని పేరు. వీరందరు నింగ్లీషు దొరలే - రైత్వారీ భూములను సాలియానా అమరికపరచి శిస్తువసూలు చేయుటయే వీరి ప్రధాన కర్తవ్యము. ఈ పనిని చక్కగా జరుపుటకు కావలసిన నిరంకుశ అధికారము లన్నియు వీరి కొసగబడెను. ధాన్యపు శిస్తువసూలు పద్ధతి తీసివేసి రొక్కపు శిస్తువసూలు పద్ధతిని స్థాపించిరి. అందువలన శిస్తులను కిస్తీల ప్రకారము చెల్లించ వలసి వచ్చిన అప్పటికి ధర లేకపోయినను ధాన్యమును అమ్మవలసి వచ్చుచుండెను. అమ్మపోయినచో అప్పు

చేయవలసి వచ్చుచుండెను. అందువలన రైతులు ఋణములు చేయసాగిరి. దీనికి తోడు శిస్తులు వసూలు చేయు ఉద్యోగులు, ముఖ్యముగా చిన్న చిన్ని ఉద్యోగులందరును లంచగొండులుగా నుండి నిరంకుశులయి రైతులను పీడించుచుండిరి.

న్యాయ విచారణ పద్ధతిలో కూడా చాలా మార్పులు జరిగినవి. ప్రతిజిల్లాలోను ఒక ఇంగ్లీషు జిల్లా జడ్జి, కోర్టు స్థాపింపచబడెను. అన్ని తగాదాలును అతడే తీర్మానించు నటులు చేసిరి. ఈ జిల్లా న్యాయాధికారి జిల్లా మేజిస్ట్రేటు కూడా అయియుండెను. ఇతడే పోలీసు సిబ్బందికి పయి యధికారి ఈ పోలీసుశాఖకు ప్రతి కేంద్రమునకు ఒక్కొక్క ఠాణాయుండెను. ఈ ఠాణా అధికారిని "దారోగా" ఇతడు దేశీయోద్యోగి ఇతనికి నెలకు 25-0-0 లు జీతము. ఆ దినములలో దోపిళ్లు దొంగతనములు చాల హెచ్చుగ నుండెను. దారోగాలు లంచగొండులైయుండిరి.

కారన్‌వాలిసు ప్రభుత్వములో పెద్ద యుద్యోగము లన్నియు దొరలే చేయునటుల నిర్ణయించిరి. ఈ దొరలకుచాలా పెద్దజీతముల నేర్పాటు చేసిరి. న్యాయవిచారణచేయు, దొరలకు దేశపరిపాలన చేయు దొరలకు దేశభాషలు రానందువల్లను వారికి దేశీయుల ఆచారవ్యవహారములు తెలియనందువల్లను వారు దేశీయోద్యోగుల చేతులలో నుండిరి. వీరు వివాదములను పరిష్కరించ లేనందువల్ల తీర్మానముగాక నిలువయుండిన వివాదము లసంఖ్యాకములుగా నుండెను. కొంత కాలము గడచిన పిదప కలెక్టర్లకే మేజిస్ట్రేటు పనిని కూడా ఇచ్చిరి. చెన్నపట్టణము రాజధానిలో మాత్రము మొదటి నుండియు జిల్లా కలక్టరే మేజిస్ట్రేటుగా నుండెను. తరువాత కొన్ని కొన్ని మార్పులు జరిగినను మొత్తముమీద 1793లో కారను వాలిసు చేసిన రాజ్యాంగ సంస్కరణములే తరువాత కంపెనీ పరిపాలనా విధానము నకంతకును పునాదిగా నుండినది.

ఈ మార్పులవలన త్వరలోనే రాజకీయార్థిక సాంఘిక వ్యవస్థలలో విపరీతపు ఫలితములు కలుగుట ప్రారంభమైనది. నేరముల విచారణలో సాక్ష్యబలమే ప్రధానముగ చూచునందువలన అబద్ధపు సాక్ష్యములు వృద్ధియైనది. నేరగాండ్రు తప్పించుకొని పోవుచుండిరి. బలవంతులు జమీందారులు బీదవారిని పీడించగలుగుచుండిరి.

## ఇంగ్లీషు పరిపాలనముయొక్క ప్రత్యక్ష ఫలితాలు ప్రజల అసంతృప్తి

ఈ కుంఫిణీ పరిపాలనమున ఇంగ్లీషు వానిపేరు చెప్పిన మాత్రముననే ప్రజలు గడగడలాడుచున్నారని రాజా రామమోహనరాయలవారు క్రైస్తవ ప్రచారకుల పద్ధతులను



గురించి వ్రాయుచు బ్రాహ్మనికల్ మాగజీన్ పీఠికలో 1821లో వ్రాసియున్నారు.

నలుబదేండ్లు చెన్నరాజధానిలో పెద్ద యుద్యోగములుచేసి, 1820లో మద్రాసు గవర్నరై 1827లో దివంగతులైన సర్ తామస్ మన్రోగారు మద్రాసు దేశస్థితిగతులను గురించి 1824 డిశంబరు 31వ తేదీన నొక గొప్ప 'మినిటు' అను సూచనవ్రాసినాడు. అందులో అనేక విషయములు చర్చించి "ప్రభుత్వము లోని అన్ని పెద్ద సివిలు మిలిటరీ యుద్యోగములు ఇంగ్లీషువారి హస్తగతము చేయబడి, భారతీయులకు లేకుండా చేయబడిన వనిరి." "మనము ప్రజల ఆశలన్నిటిని అణచివేసినాము. అన్ని తారతమ్యములను తీసివేసినాము. భారతీయులలో రాజవంశములను నాశనము జేసినాము. సంపన్న గృహస్థులు లేకుండ చేసినాము. వీరికి బదులుగా బంట్రోతులజాతి రైతుల జాతిని ఒక దానిని నిర్మించినాము" అని 1842 మొదలు 1872వరకు నీ దేశములో బారిస్టరుగా నుండిన జాన్ బ్రూస్‌నార్టను గారు 1857లో ప్రకటించిన గ్రంథమున వ్రాసిరి.

ఈ ఇంగ్లీషు ప్రభుత్వము దేశములోని జనసంఘముయొక్క పై తరగతులను దాని పరువు ప్రతిష్ఠలను నాశనమునైన జేయుచున్నది. లేదా, దానిని తీసివేసి, తగ్గించి, అందరిని ఒకే నేల మట్టమునకైన దింపి, పూర్వము దేశములో వారి కుండిన పలుకుబడిని తీసివేసి దేశపరిపాలనమునకు వారావంతయైన నుపయోగము లేకుండ చేయుచున్నది. అని సర్ తామస్ మన్రోగారు 31-12-1824 తేదీన వ్రాసిరి. "శాశ్వత పైసలా అనబడుపర్మనెంటు సెటిల్మెంటు వంగరాష్ట్ర రైతులను జమీందారులు కప్పగించినది. కేంద్ర ప్రభుత్వము బలహీనమైనందున ఆ జమీందారు లీరైతులను పీకుకొని తినుచుండగా, కాపాడలేక పోయినది. అయిదులక్షలమంది ప్రజలను పరిపాలించి రక్షించవలసిన పోలీసు న్యాయ విచారణాధికారము ఒక్కొక జిల్లాలో నొక్కొక ఆంగ్లేయాధికారి వశము చేయుటవలన పైనుండి క్రిందివరకు బలవంతులు బలహీనులను పీకికొని తినుచున్నారు. అని ఇంగ్లండ్ అండ్ ఇండియా అను గ్రంథమున B.W. నోయిల్‌గారు వ్రాసిరి.

ఆనరబిల్ ఛార్లెస్. డబ్లియు. విన్‌గారికి కలకత్తాలో ప్రధాన క్రైస్తవ మతాచార్యుడైన బిషప్ హెబరుగారు ప్రతాప్‌ఘరునుండి 1825 సం॥ మార్చి 1వ తేదీన నిట్లు వ్రాసిరి. (చూడు బిషప్ హెబరు జర్నల్ 3వ సంపుటము 336-338). "నిజముగా బ్రిటిషువారు తమ ప్రభావమును భారతదేశక్షేమము కొరకే వినియోగించినారనియు దీనివలన ప్రజలకు చాలా లాభములు కలిగినివనియు నేను నమ్ముచున్నప్పటికిని, మన పరిపాలనప్రజల అనురాగమునకు పాత్రముగ నున్నదనిగాని, ఇది ప్రజల యిష్టమునకు పాత్రమగు చున్నదనిగాని నా క్వెరును చెప్పలేదు. మనకిట్టి కితాబుకలుగట కష్టమనియు తోచుచున్నది.

గాని నిజముగా ప్రజల అతృప్తికిగల కారణములలో మన స్వయం కృతాపరాధములు కొన్ని యున్నవి. వానిని నివారించుటగాని, లేదా కొంతవరకైన తగ్గించుటగాని మనధర్మము. ఆకారణములలో నొకటి మన కుంపిణీవారి సివిలు మిలిటరీ యుద్యోగులలో చాలమంది జాత్య హంకారముతో దేశజనులలోని ఉత్తమ కులజులను మధ్యతరగతివారిని కూడా దూరముగా నుంచి అమర్యాదతో చూచుచుండుట ముఖ్యమైనది దేశీయులతో కలసి మెలసి యుండుటకు చాలా అడ్డంకులున్న మాట వాస్తవమే. వారు మనతో కలిసిభోజనము చేయకపోవు ప్రతి బంధకము మహమ్మదీయుల విషయమున నెందు కింకనుండ నీయవలెను? ఈ విషయమును ఉత్తర హిందూ స్థానమున సరసులైన యుద్యోగులు కొంత పనిచేయవచ్చును. మనవారు జరుపు వినోద క్రీడలలో కొన్ని - ముఖ్యముగా ప్రయివేటు నాటకములాడు శాలలకును, మైదానములలో నాడు ఆటలకును దేశీయులు పాల్గొనుటకు చాల నుత్సాహపడుదురు. అట్టి స్థలములకు వారి నాహ్వానించినచో వారుబ్బిపోవుదురు. అయితే, మనవారు వీరిని స్నేహపాత్రులుగనెంచి యాహ్వానించుటలేదు. పెర్రానుడీబాయిన్సు మొదలగు ఫ్రెంచివారికి ఇతర విషయములందు మంచి పేరులేక పోయినను, గొప్పతరగతుల దేశీయులతో స్నేహముగానుండి వారిని చక్కగా చూచు విషయమున మాత్రము గంగా యమునల మధ్య ఆగ్రాలో ప్రజలు వారి నిప్పటికిని తలుచుకొను చున్నందున మన కన్న వారీవిషయమున ప్రజల అనురాగమునకు పాత్రులుగా నున్నారు. ఇంతేకాదు మనవారి అహంభావము కుంఫిణీవారు నిర్ణయించిన మర్యాదలను కూడ గమనింప నిచ్చుటలేదు. ప్రధాన దేశీయు (సివిలు) రివిన్యూఉద్యోగులైన తాశీల్దారులు పై యధికారులగు ఆంగ్లేయులవద్దకు వచ్చినప్పుడు వారికి కుర్చీ లివ్వవలెనని యొక నిబంధనకలదు. ఇట్లే సైన్యమున సుబేదారులకును పైవారు కూర్చుండుటకు కుర్చీలివ్వవలెనని యొక నిబంధనకలదు, గాని, హృదయ పూర్వకముగా నీ నిబంధన ప్రకారము జరుపు కలెక్టరు లీ హిందూ దేశమున ఆరుగురైనను లేరు. పదునైదేండ్లక్రిందట సైన్యములో నీ మర్యాద లెన్నడు మీరు వారుకారు. నే డీమర్యాద సంపూర్ణముగా విడువబడినది. దీనినిగూర్చి నేడు చెప్పిన కుంఫిణీవారి నిబంధన లున్న సంగతి దేశీయోద్యోగులందరు నెఱుగుదురు. ఇట్టి తరి తమకు జరుగవలసిన మర్యాద బుద్ధిపూర్వకముగా జరుగక పోవుటను ప్రతి పర్యాయమునుచూచి, వారు లోపల మనోవ్యధనొందకుందురా? మర్యాదగల పూర్వకాలము నాటి గొప్ప కుటుంబములవారు ఇటువంటి అమర్యాదలును ఇంక నిట్టి సంగతులును జూచియె తమ పూర్వపు హోదాలదరికి రాకయున్నారు. ఈ మర్యాదలు జరుగక పోవుచున్నందులకు దేశీయలెల్లరు ఐరోపావారికి



చూపవలసిన గౌరవములుచూపక, ఐరోపావారు తమకు జరుగుచున్నట్లు చెప్పుచున్న అమర్యాదలను జరుపుచున్నారు. అనిబిషప్ హెబరుగారు వ్రాసిరి.

(Bishop Heber'e Journal Vol III ppj 336, 338)

## ఇంగ్లీషు దొరతనము ప్రజల అసంతృప్తి

ఉత్తర హిందుస్థానమున సర్క్యూటు సెషన్సు జడ్జిగా పదేనేడేండ్లు పనిచేసి, మనదేశము సంగతిని ప్రజలసంగతిని బాగుగా గ్రహించిన ఆనరబిల్ జాన్ ఫ్రెడరిక్ షోరుగారు 1832మొదలు 1835 సంవత్సరమువరకును భారతదేశస్థితిగతులను గూర్చి అప్పుడప్పుడు ఇండియాగెజెట్ అనుపత్రికకు వ్యాసములు వ్రాయుచుండిరి. అవి యన్నియు 1838లో నోట్సు ఆన్ ఇండియన్ ఎఫెయిర్సు అనుపేరున రెండు సంపుటములుగా ప్రకటింపబడినవి. దానిలో వారిట్లు వ్రాసియున్నారు. "భారతదేశమునబ్రిటిష్ పరిపాలనముయొక్క ముఖ్యలక్షణ మేమనగా, సామదానభేద దండోపాయముచేత సంపాదింపబడి జనబాహుళ్యముయొక్క అభిమతమునకు వ్యతిరేకముగా సైనిక బలమువలన అమలు జరుగుచు ముఖ్యముగా మన నేటీవు పటాలముల వలనే నిలువబెట్టబడియున్నది. అని 1834 సంవత్సరమున ఫ్రెడరిక్ జాన్‌షోర్ ఇండియన్ గెజెటుపత్రికలో వ్రాసినాడు. (Vol. 1. 394 Notes on Indian affairs) ఈయన మఱల 1835లో నిట్లు వ్రాసిరి:

"ఈ భారతదేశ ఇంగ్లీషు పరిపానలముయొక్క ముఖ్యలక్షణములను సంగ్రహముగా చెప్పెదను : "హిందూ దేశములో పూర్వముండిన అన్ని ప్రభుత్వములను ఈదొరతనము పన్నుల భారమునందును ప్రజాపీడనమునందును మించిపోయినది. ఇందు ప్రభుత్వమువారును ధనికులగు వ్యక్తులునుగూడ అన్యాయము లనేకములు చేసిరి. ఇంకను చేయుచున్నారు. చేయగలరు. ఈ ప్రభుత్వమున జరిగినఅన్యాయములను ఆలించి తీర్చగలవారెవ్వరును లేరు. దీనికి నష్టపరిహారము సిద్ధించుటఅరుదు. అందువలన ప్రజలు మనలను త్రోసిరాజనగల బలవంతులెవరైన గలరని ప్రజలకు నమ్మకము కలిగినచో, వారత్యుత్సాహముగ వారియందను జేరుదురు. (Vol.II. P 521)

1834 సంవత్సరములో జాన్ ఫ్రెడరిక్ షోరు గారు ఈ బ్రిటిష్ పరిపాలనములో ప్రజల అసంతృప్తికిగల కారణముల నిట్లు క్లుప్తముగా వ్రాసిరి.

1. నేటివులు లంచగొండులనియు, అసమర్థులనియు మనవారు అధికులనియు మనకుగల అహంభావము.

2. అకారణముచేత ఇంగ్లీషువాడు చేయుట కంగీకరించు ప్రతియుద్యోగములను నేటివులకు లేకండచేయుట,అన్ని వ్యవహారములనుజాతి వారి ద్వారాగానే జరిగింప జూచుట.
3. దేశములోని పూర్వసంస్థల నన్నిటిని నాశనముచేయుట,న్యాయవిచారణ కొరకు క్రొత్తగా స్థాపించిన సంస్థలు అసంతృప్తికరముగా నుండుట.
4. అత్యధికమగు పన్నులు విధించుటవలన దేశచరిత్రలో ఇదివరకెన్నడు కనివిని యెరుగని విధముగా దేశ ప్రజలనుండి ధనము పిండుట.
5. రివెన్యూ హెచ్చించుటకొరకు పూర్వపు రాజవంశీయులను దేశములో పరువు ప్రతిష్ఠగల పెద్దభూస్వాములను నాశనముచేయుట. (ibid vol 1 pp 355-356)

1793-1809 మధ్యదేశములో నింగ్లీషు సర్క్యూటుజడ్జీల నివేదికలు 1812లో పార్లిమెంటు వారి కొరకు తయారుచేయబడిన ఫిఫ్తురిపోర్టులో చేర్చబడినవి. ఆనాటి న్యాయవిచారణపద్ధతు లెంత దుఃస్థితిలో నుండెనో వానివలన తెలియగలదు. దీనిని గూర్చి దేశీయులు మొఱలు పెట్టుకొనిరి. ప్రజలు తమకష్టములను గూర్చి చెప్పుకొని, మొఱబెట్టిపెట్టి, ఆలనాపాలనా చేయువారు. లేనందున విసిగియూరకొనిరి. అని జాన్ ఫ్రెడరిక్ షోరుగారు 1834లో వ్రాసిరి. (Notes on Indian affair Volume I pp 447)

ఈ షోరుగారు 1835 జనవరి 12వ తేదీన నిట్లువ్రాసిరి! "మనవా రనుకొనునట్లు మన ప్రభుత్వముపట్ల భారతీయులు చాల స్నేహభావముతో నున్నారని ఈ దేశమున మన ప్రభుత్వము స్థిరముగా పాదుకొని యున్నదనియు నేను తలంపను." ఆంగ్లేయులపట్ల అనిష్టమును ద్వేషమును ప్రజల హృదయములందు పాదుకొని యున్నవి. మనవారు వారిపట్ల ప్రవర్తించు చర్యవలన దీనిలో నాశ్చర్యములేదు. గడచిన అయిదేండ్లలో నీదేశీయుల మనోభావములను గూర్చిన నిజస్థితి మన వార్తాపత్రికలు కొంత వెల్లడించినవి.

దూరదృష్టిలేని మన పద్ధతులును, మన అత్యాశయు, నందువలన జరుగు ప్రజాపీడనము దుష్పరిపాలనమును ప్రజల అతృప్తికి నిజమైన కారణములు. అని 1834 మే 15వ తేదీన వ్రాసినాడు.

(Notes on Indian Affairs Vol. II P. 247)

1834 డిశంబరులో షోరుగారిట్లు వ్రాసిరి. భారతీయ లతి శ్రద్ధగా మనలను కనిపెట్టి చూచుచున్నారు. ఇప్పుడు తాము మనచేతిలో పడి బలహీనులుగ నున్నామని భారతీయులెరుగుదురు. మనము చేయు ప్రజాపీడనమును గూర్చి అన్యాయములను గూర్చి వారు తమలో తాము విషాదముతో గొణుగుకొనుచున్నారు. ఇది యంతయువారు



స్వయముగా చూచుచు కలవరముతో వితర్కించుకొనుచున్నారు. కొద్దిమంది (తెల్లవారి) లాభము కొరకు లక్షలకొలది భారతీయులను పరిపాలించుటకు మనకేమి హక్కుకలదు?

దేశ ప్రజలలో పలుకుబడిగల వారిలో చాలమంది కిప్పుడు మనభాష వచ్చును. దినదినము ఎక్కువమంది దీనిని నేర్చుకొనుచున్నారు. వంగరాష్ట్రమునందును ఉత్తర హిందూస్తానములోని పరగణాలయందును దేశీయుల వార్తా పత్రికలున్నవి. కలకత్తాలోని పలుకుబడిగల ఆంగ్లేయ వార్తాపత్రికలలో నొకటి యిటీవలనొక ధనవంతుడైన దేశీయుని సొత్తు అయినది. దేశములోని దూరస్థలములలో నున్న ప్రజలకు రాకపోకలు దినదినము హెచ్చు అగుచున్నవి. ఇంకను హెచ్చగలవు. న్యాయమైన శాసనములను జేసి, ఇట్లు విజృంభించుచున్న శక్తులనన్నిటిని యావద్భారత దేశములోని ప్రజల క్షేమలాభములు నిప్పుడుపోవుచున్న మార్గములనుండి మరల్చి, ఇతర మార్గములోనికి ద్రిప్పి, యుపయోగింపనిచో భారతదేశమున బ్రిటిష్ పరిపాలనము కూలిపోవునని జోస్యము చెప్పుచు చేయబడిన హెచ్చరిక త్వరలోనే నిజము కాగలదు"

(Notes on Indian Affairs Vol.II. P.P. 224-227).

షోరుగారు 1835 నవంబరులోనిట్లు వ్రాసిరి.

"ప్రజలు మనలను అసహ్యించుకొనుచున్నారు. మనలను కూలద్రోయ శక్తిగల బలవంతులెవ్వరైననున్నారని వారెంచినచో, వారు పరమసంతోషముతో వారియండజేరుదురు.

(Notes) on Indian Affairs Vol. I page 5 - 21

ఆంగ్లేయ ప్రభుత్వము పట్ల భారతీయుల భావములెట్లుండెనను విషయమును గూర్చి షోర్‌గారు 1833 ఏప్రిలు 6వ తేదీన నిట్లు స్పష్టముగా వ్రాసియున్నారు. నేననేక స్వతంత్రరాజుల రాజ్యములను తిరిగి చూచియున్నాను. అన్నిటికన్నను ముఖ్యముగా బ్రిటీషువారి యధికారమునకు లోబడుటను వారు హర్షించుటలేదని నేను గట్టిగా చెప్పగలను. సర్వకాల సర్వావస్థలయందును మనసైన్యము అప్రమత్తతవమించి యున్నందువలననే దేశమున తిరుగుబాటు జరుగకుండనున్నదను సంగతిని అందఱును అంగీకరించు చున్నారు. అవకాశము కలిగినప్పుడల్లా అధికారధిక్కారముకనబడుచునే యున్నదనుట కనేక ఉదాహరణలున్నవి. అని 1781, 1824, 1832 సంవత్సరములలో జరిగిన తిరుగుబాటులను వివరించిరి... ఆంగ్ల పరిపాలము దేశమున కదల్చుటకు వీలులేకనంత గట్టిగా స్థిరపడియున్నదని చాలామంది ఆంగ్లేయుల యభిప్రాయము. మన యధికారము పట్ల తిరుగుబాటు జరిగిన జరుగవచ్చును కాని అది చాలా దూరపు సంగతియని తలచుచు

ఆ సంగతినే ఆలోచింపరు. దేశీయులలో నైకమత్యము లేక పోవుటవలనను, తగినబలముగల పరరాజ్య ప్రభుత్వములులేక పోవుటవలనను, మనకే భయమును లేదని యనుచుందురు. కొందఱు మాత్రమింకొక విదముగా తలచుచున్నారు. సమర్థులైన గ్రంథకర్తలు చాలా మంది యట్టి పరిస్థితులు త్వరలోనే కలుగవచ్చునని యభిప్రాయపడుచున్నారు. అని షోర్‌గారు చెప్పిన జోస్యము 1857లో ఫలించినది!

(Notes on Indian Affairs. Hon.F.T.Shore Vol.I p.p.151. ibid p. 158, 165. 145-166).

"చిరకాలమునుండి మన లోపములను బాగుగా నెరిగియున్న భారతీయ ప్రజలిప్పుడాలోపములను గురించి కొంత స్వేచ్ఛగా చర్చించుట మొదలిడినారు. ఇంకను ముఖ్యమైన సంగతియేమనగా, మనకు గలబలమును గూర్చియు మన కిప్పుడుగల (రాజ్యాంగ) స్థితిని నిలువబెట్టకొనుటకు మనకు గలమార్గములను గూర్చియు చర్చించుట ప్రారంభించినారు. మనము న్యాయముగా నిర్వహింపవలసిన కర్తవ్యమును సాధ్యమైనంత త్వరితముగా చేయనిచో, ఫ్రెంచిదేశమున రాజరికమునకును అచ్చటి కన్నులు మూసికొని ప్రవర్తించిన ధనవంతులకును తటస్థించిన ఘోరమైన గతియే మనకు నిచ్చట తటస్థింపగలదు. ఆంగ్లేయ పరిపాలనమును భారతీయులపాటి పెన్నిధిగా చేసి, ఈ ఘోరమైన విపత్తురాకుండ చేయుట కింకను వీలుకలదు. అని షోర్‌గారు నోట్సు ఆన్ యిండియన్ ఎఫెయిర్స్ అనుగ్రంథమున 527వ పుటలో వ్రాసినారు.

గౌరవనీయుడైన జాన్ ఫ్రెడరికు షోరుగారు త్తర హిందూస్థానమున 17 సంవత్సరములు జిల్లాజడ్జీగా పనిచేసి, దేశము సంగతి, ప్రజల మనోభావములను బాగుగా గుర్తెరిగిన అనుభవశాలి. తనకు న్యాయమని తోచినసంగతులు నిర్భయముగా చెప్పు ధైర్యశాలి. ఈయన భారతస్థితిగతులను గూర్చి ఇండియాగెజెటుకు వ్రాసిన లేఖలు 1838లో రెండు సంపుటములుగా నీపేరును ప్రకటింపబడినవి.

## ఆంగ్ల ప్రభుత్వము : క్రైస్తవమత ప్రచారము, సంఘర్షణము

ఆంగ్లేయ రాజ్యాక్రమణమువలన రాజకీయ ఫలితములు 1818 సంవత్సరము వరకును భారతదేశ ప్రజల కంతగా కనబడలేదు. మహమ్మదీయ ప్రభుత్వము స్థాపించు చున్నప్పటికన్న ఆంగ్ల రాజ్యస్థాపన సమయమున ఎక్కుడు పోరాటము జరుగలేదు. భారతదేశ గ్రామములందు జీవనము చేయుట రైతులకును బ్రాహ్మణులకును తమ కృషియు ఆచారములును చేసి కొన్నంత వరకు ఈ దేశమును పరిపాలించునది మీర్జాసీం నవాబైనను,



క్లైవుదొరయైనను వారికి పట్టలేదు. వర్తకులమను షాహుకారులకును గావలసినది బలముగల ప్రభుత్వము. అందువలన దేశపరిపాలనమునందు మార్పులు కలిగించుట కొరకు తమకు నష్టకరమైన ప్రయత్నములు చేయరుగాని, శక్తి సామర్థ్యములుగల కుంఫిణీవారి దొరతనమే మంచిదని తలంతురు.

1818 సంవత్సరమునుండి సంగతి సందర్భములందు మార్పు కలుగసాగెను. ఈ బలమైన కుంఫిణీ ప్రభుత్వము క్రైస్తవమిషనరీలతో సంబంధమును గలిగించుకొనెను. ఈ మిషనరీలు హిందూ మహమ్మదీయ మతముల యొక్క పునాదులను పెల్లగింప ప్రయత్నించు చుండిరి. ఈ ప్రభుత్వము పూర్వాచారమైన సహగమనమును నిషేధించెను. వితంతువలు పునర్వివాహములను హర్షించెను. హిందూమతము నుండి క్రైస్తవులైనవారి కుటుంబములందు వారి ఆస్తిహక్కులను వారి కుండునట్లు చేసెను. పూర్వము హిందూమహమ్మదీయుల పండుగలను ఉత్సవములను తనపిల్లల యాటలవలె ఆదరించి, వానియందు తాను పాల్గొని, వారి దేవాదాయములను ధర్మాదాయములను చక్కగా పరిపాలించిన ఈ ప్రభుత్వము ఇప్పుడది మానివేసి, వదిలివేసెను. మొదటి దేశముయొక్క పూర్వవిజ్ఞానమును పోషించిన ప్రభుత్వము ఈ ప్రాచీనపరిజ్ఞానమును హేళనచేయు క్రొత్త విద్యావిధానము నొకదానిని స్థాపించెను. మాలవాండ్రతోపాటు బ్రాహ్మణులుగూడ నొకే పెట్టెలో కూర్చుండవలసివచ్చు రైళ్లను నిర్మించెను. ఇంద్రజాలమువలన తీగెలద్వారా వార్తలంపు తంతివార్తల తీగెలను నిర్మించెను. ఇంతకాలము చలనము లేక స్థిరముగా నున్న తమ దేశములోనికీ క్రొత్త ప్రపంచమును దెచ్చి పెట్టినప్పుడు సనాతన ధర్మ పరాయణులగు హిందువులే మనుకొందురు? దీనికి జవాబు అనేక విషయములందు కనపడుచున్నది. త్వరలోనే దేశీయు లెల్ల మ్లేచ్ఛులుగను క్రైవులుగను చేయబడుదురనువార్త వ్యాపించెను. బొంబాయిలో పారశీలు హిందువులుకూడ బట్లరు వ్రాసిన మతముల సామరస్యము (Anolagy of religion) అను గ్రంథమును చదువవలసి యుండిరి. చెన్నపట్టణమున ఉత్సాహవంతులగు క్రైస్తవ మత ప్రచారకులు పాఠశాలలందలి విద్యార్థులన క్రైస్తవ మతమునకు సంబంధించిన ప్రశ్నలకు భక్తితో జవాబులు చెప్పునట్లు నిర్బంధించుచుండిరి. ఈ జవాబులు క్రైస్తవులు చెప్పినచో సమంజసముగనే యుండునుగాని, సనాతన హిందువులు చెప్పవలసి వచ్చుట రోత గనుండెను. బీహారులో విద్యాశాఖ పరీక్షకుని (Educational Inspecter)కచ్చేరీకి సైతానీ దఫ్తార్ అనగా పిశాచకార్యాలయమని పేరిడిరి.

చెరసాలలందలి ఖైదీలు పూర్వమువలె తాము త్రాగు మంచినీటికి తాము

తీసికొనిపోవరాదని శాసింపగనే, కులములను కూలద్రోసి హిందువుల నందరిని క్రైస్తవులుగ చేయదలచి నారని తలంచిరి. అని హెచ్. హెచ్. డాన్వెల్ గారు ప్రకటించిన ది కేంబ్రిడ్జి షార్టర్ హిస్టరీ ఆఫ్ యిండియా అను గ్రంథమున 728-729 పుట లలో వ్రాయబడినది.

## కుంపినీ వారి దుష్పరిపాలనము

## భారతదేశ ప్రజల కష్టములను గూర్చి జాన్ బ్రైట్‌గారు చెప్పిన మాటలు

భారతదేశ స్థితి గతులను గూర్చి తెలిసికొని, పార్లమెంటులో నీదేశీయుల కష్టములను చెప్పి, మనవారికి జరుగు అన్యాయములను తొలగించుటకు ప్రయత్నించిన మహానుభావులలో ఎడ్మండుబర్కు మహాశయుని తరువాత జాన్ బ్రైటుగారి పేరు శాశ్వతముగా స్మరింపదగినది. ఈయన 1811లో జన్మించెను. ఈయన 1843లో పార్లమెంటులో సభ్యుడయ్యెను. ఆ కాలమున నింగ్లాండులో జనసామాన్యమునకు గింజ కరవై కష్టపడుచుండగా, ధనికులు సౌఖ్య మనుభవించుచుండుటను గూర్చి కొంత ఆందోళన జరుగుచుండెను. అందీయన పాల్గొని, బీదజనుల పక్షమున పనిచేయసాగెను. ఇంగ్లాండులోని బీదజనుల దుస్థితియే గాక, భారతదేశమున దారిద్ర్య మనుభవించుచున్న కర్షకులు కార్మికుల దుస్థితియు నీయనమనసు కరగించెను. అంతట నీయన భారతదేశ సమస్యలను జాగ్రత్తగా పరిశీలించి, మన బీదజనుల నుద్ధరించుటకు బద్ధకంకణులై తన యావజ్జీవము 1889 మార్చి 27వ తేదీన స్వర్గస్థులగువరకు మన కొరకు పాటుపడసాగిరి. ఈయన భారతదేశమున కుంఫిణీవారి పరిపాలనములోగల లోపములను ఆందీ ప్రజలనుభవించుచున్న కష్టములను గూర్చిన వివరముల నన్నిటిని సంగ్రహించి, యానాటి దేశీయనాయకులతో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచు, పార్లమెంటువారికి నివేదించుచు, భారతదేశ ప్రభుత్వ విధానమును, సంస్కరించి ప్రజల బాధలు తొలగించుటకు కృషిచేయసాగిరి. వీరీ దేశమునం దిట్టి శ్రద్ధ వహించుటవలన పార్లమెంటులో నీయనకు 'భారతదేశ ప్రతినిధి' యని పేరు వచ్చెను. బ్రైటు గారు చేసిన మహత్తరమైన కృషివలననే భారత దేశ పరిపాలనా విధానమునందు కొన్ని సంస్కరణములైనను చేయబడెను. భారతదేశమున నాంగ్లేయులు ప్రజలను నీచముగా చూచుటయు నీ ప్రభుత్వమున ప్రజలు పడుచుండిన బాధలును అందువలన వారిలో వ్యాపించుచున్న అతృప్తిని గూర్చియు వీరు వెల్లడించిరి. 1857లో జరిగిన స్వాతంత్ర్య విప్లవమునకు దేశములో జరిగిన దుష్పరిపాలనమే కారణమని వెల్లడించి, ఈ విప్లవమునకు ప్రతిక్రియగా నాంగ్లేయులు అత్యాచారములు చేయుచుండుటను నిరసించి, కుంఫిణీపరిపాలన తీసివేసి, ఆంగ్లరాజ్య



మకుటము క్రింద సత్పరిపాలనము నెలకొల్పవలెనని తీవ్రముగా వాదించిరి.

భారతదేశమున ఆంగ్లేయ పరిపాలనలో నీ దేశ ప్రజలనుభవించుచుండిన కష్టములకెల్ల కుంఫిణీవారి దుష్పరిపాలనమే కారణమని జాన్‌బ్రైట్ మహాశయుడు శీఘ్రముగనే గ్రహించి, ఈ సమస్యను పార్లమెంటుసభలో తీవ్రముగ జర్చింపసాగెను. 1847 నాటికి భారత దేశములో చేనేత పరిశ్రమ యంతరించి ఈ దేశమునండి ముడిప్రత్తి ఇంగ్లాండున కెగుమతి చేసి అక్కడ యంత్రములమీద తయారైన నూలుబట్టలు దిగుమతిచేయు విపరీతపు ఆర్థిక పద్ధతి యవతరించి దేశము నానాటికి దారిద్ర్యమున మునుగుచుండెను. ఇట్టిస్థితిలో నైనను మనదేశమునం దీ ప్రత్తిపంట యొక గొప్ప పరిశ్రమగానే యుండెను. గాని, ఈ పత్తిపంట పరిశ్రమలో జీవనముచేయు రైతులు కూలివారు పారిశ్రామికులు కడుపునిండ కూడు లేక, కట్టగుడ్డ లేక నిలవ నీడలేక ఘోరదారిద్ర్యమనుభవించుచు బాధలుపడుచుండుటవలన నీ పరిశ్రమ గూడ నానాటికి క్షీణించి దుఃస్థితిలోనికి వచ్చుచుండటను గూర్చి ఇచ్చటి స్థితిగతులను చూచిన ఉద్యోగులు నుద్యోగేతరులుగూడ అనేక వ్యాసములందుగ్రంథములందు వ్రాయుచుండిరి. ఇదిచూడగా, పరోపకారపారీణుడగు బ్రైటు గారి హృదయము దహించుకొని పోయెను. ఈ దీనజనుల కష్టములను బాధలనుగూర్చి మననము చేసి వీరి నుద్ధరింప సమకట్టి ఇంగ్లాండుకును భారతదేశమునకును గూడ ఆర్థికముగా ముఖ్యమైన ఈ ప్రత్తిపంట పరిశ్రమయొక్క స్థితిగతులను గూర్చి వర్ణించి దీనిని విచారించుట కొక విచారణసంఘమును నియమింపు డని బ్రైటుగారు 1847లో పార్లమెంటువారిని కోరిరి. అంతట 1848లో నట్టి విచరాణ సంఘమొకటి నియమింపబడెను. దానిలో కుంఫిణీ డైరెక్టరులుగూడ జాలమంది సభ్యులుగానుండిరి. బ్రైటుగారు చాల శ్రమపడి ఈ ప్రత్తిపంట పరిశ్రమలోని లోటుపాటులను పారిశ్రామికుల దారిద్ర్య కారణములును దేశస్థితిగతులను దెలుపు సాక్ష్యములనెల్ల సమకూర్చి, దీనిలోని యక్రమములను ఇందలి గుట్టుమట్టులను బయటకుదీసి ఒక గొప్ప రిపోర్టును తయారు చేయించిరి. భారతదేశమున రోడ్లు రాకపోకలు చేయుటకు తగిన స్థితిలో లేకుండుట, పల్లపుసాగుకు నీరు సరఫరాచేయు నీటి వనరులు బాగుగా లేకుండట, పారిశ్రామికులు రైతులు గర్భదరిద్రులై అప్పులలో మునిగి విత్తనములు గింజలు కొనుటకు సాహుకారులకు తమ పంటలను తాకట్టపెట్టి వారిచేతిలో చిక్కి బాధలు పడుచుండుటయు, నీ ప్రత్తి పంటయొక్క దుఃస్థితికి ప్రధాన కారణములనియు, కుంపిణీవారి ద్రవ్యపద్ధతి లోపభూయిష్టమై భూమిపన్ను అత్యధికమై ప్రజలకు మిగులునది లేకపోవుట, రోడ్లు వంతెనలు నీటి వనరులు, చెరువులు కాలువలు తటాకములు మొదలగు ప్రజాసౌకర్యము

ల కొరకు దేశమునుండికుంఫిణీవారు గ్రహించుచున్న ఆదాయములో నూటికి అర్ధరూపాయి వంతుమాత్రమే ఖర్చుపెట్టబడు చుండుటవలన కుంఫిణీవారి దొరతనమున నవి పాడై దుస్థితిలో నుండుటయు ఇతర కారణము లనియు నీ విచారణసంఘమువారి రిపోర్టువలన రూఢియైనది.

పార్లమెంటువారు తత్‌క్షణమే జోక్యము కలిగించుకొననిచో నీ యన్యాయములు తొలగి భారతదేశ ప్రజల స్థితి బాగుపడదని బ్రైటు గారు స్పష్టీకరించి దీనిని గూర్చి యొక రాయల్ కమిషను నియమించవలసినదని కోరిరి. కాని, ఇది జరుగలేదు. 1853లో కుంఫిణీవారికి మరల పట్టానిచ్చు తరుణమున భారతదేశ వ్యవహారములు మరల చర్చకు వచ్చెను. ఆ సందర్భమున బ్రైటుగారు మాట్లాడుచు నిట్లు చెప్పిరి. "భారతదేశ పరిపాలన ఆంగ్లేయ పార్లమెంటు వారు నిర్వహింపవలసిన యొక ధర్మ కర్తృత్వపు బాధ్యత యని పార్లమెంటులో నన్ని పక్షములవారు నంగీకరించుచున్నారు. గాని, కుంఫిణీవారి పరిపాలననుగూర్చి పార్లమెంటు వారింతవరకును సరియైన తనిఖీచేసి సరియైన అదుపు అజ్ఞలలో నుంచలేదు. ఈ భారతదేశమును ఆంగ్లేయుల పశువులను మేపుకొనుట కేర్పడిన యొక గ్రామబంజరువలె నుపయోగించుకొనుచున్నారు. అనగా దానివలన తమకు కావలసిన లాభమును పొందుటకు మాత్రమే దాని నుపయోగించుచున్నారు." వంగరాష్ట్ర రైతుల దుస్థితి వర్ణనాతీతముగా నున్నదనియు వారు కుక్కలు గూడ పండుకొనుట కసహ్యించు కొనునంతటి అసహ్యమైన గుడిసెలందు వసించుచున్నారనియు, చింకి పేలికలు తప్ప వారికికట్టు గుడ్డలేదనియు వారికి వారి కులుంబములకు నొక పూటయైన కడుపునిండ కూడులేదనియు, మానవ జీవనమునకు కావలసిన సామాన్య సౌకర్యములయినను వారికి లేవనియు,కొన్నికోట్ల రూపాయిల విలువగల పంటను పండించి కుంఫిణీ వారి ధనాగారమును నిండించు నీ పారిశ్రామికులనుభవించు ఘోరమైన స్థితియొక్క నిజము బయల్పడినచో వినువారి మనస్సులు కరగిపోవు ననియు, కుంఫిణీ ప్రభుత్వ పక్షపాతముగల "ఫ్రెండ్ ఆఫ్ ఇండియా" పత్రికలోనే 1852వ సం॥ ఏప్రియల్ 1వ తేదీన వ్రాయబడినదనియు, ఒక్క వంగరాష్ట్రమునందేగాక అన్ని రాజధానులలోని ప్రజల స్థితియు నిట్లే యున్నదని బ్రైటుగారు చెప్పిరి.

మంచి సారవంతమైన భూమియుండియు సకల సంపదలు నుత్పత్తి యగుచున్నను, ప్రజలూ అసహాయులయి గర్భదారిద్రమునననుభవించుచు బాధలు పడుచున్నారన్నచో నాదేశ ప్రభుత్వమునం దేదో యొక గొప్పలోప ముండితీరవలయు ననియు, ప్రత్తిపంట విచారణసంఘము వారి యెదుట సాక్ష్యమిచ్చిన వారందరును కుంఫిణీవారిక్రింద



యుద్యోగులేననియు వీరందరును భారతదేశపు రైతులెట్టి ఘోరమైన బాధ అనుభవించుచున్నారో స్పష్టముగ వెల్లడించుచున్నారనియు, ఈ రైతులు విత్తనములు కొనుటకు సాలుకు నూటికి నలుబదిలేక యేబది రూపాయలవంతున వడ్డీలపైన అప్పుతెచ్చుకొనవలసి వచ్చుచున్నదని వారు చెప్పియున్నారనియు, ఈ బాద రైతులు తమకుగల కొద్దిపాటి వెలగల వెండినగలను కుదువబెట్టవలసి వచ్చుటనుగూర్చి తాను రుజువు చేయగలననియు, పన్నుల వసూలుకొరకు కుంఫిణీవారు నియమించిన ఉద్యోగులు మిడతలవలె వచ్చి యీ దురదృష్టవంతులగు రైతులపైన బడి వారి సర్వస్వమును మ్రింగివేయుచున్నారని అచ్చటి స్థితి గతులను గూర్చి అనేక గ్రంధకర్తలు వ్రాసియున్నారనుయు బ్రైటుగారు చెప్పిరి. కుంఫిణీ వారికి మరల పట్టానిచ్చుటకు ఇంగ్లాండు దేశపు పార్లమెంటుసభలో 1853వ సం॥ ప్రవేశపెట్టబడిన ఇండియా రాజ్యాంగ చట్టము చర్చకు రాగా నీ సుప్రసిద్ధాంగ్లేయరాజ్య నీతిజ్ఞుడగు జాన్ బ్రైట్ గారుపన్యసించుచు, "రాజ్యాంగ మునందు మార్పుల చేయవలెనని భారత దేశీయులెల్లరు నేకగ్రీవముగా గోరుచున్నా"రని చెప్పి, భారతదేశమునన్యాయస్థానములు అమిత ధనవ్యయ కారణములయి వ్యాజ్యములకు తెంపులేక కాలము జరుగుచుండుట, పోలీసు వారు అవినీతిపరులయి లంచగొండులయి యుండుట, రోడ్లు పల్లపు సాగుకు వలసిన నీటి సదుపాయములు బాగుచేయక ఉపేక్షించుచుండుట ప్రభుత్వముయొక్క లోపమునకు ప్రత్యక్ష నిదర్శనముతార్కాణమునగు భారతీయ ప్రజల ఘోరదారిద్ర్యమును ఎట్టి విచక్షణము లేకుండ దేశీయుల కుద్యోగము లొసగబడవలెనని 1833వ సం॥లో చేయబడిన రాజ్యాంగవిధి నిష్ఫల మగుటయు ప్రాపకము వలననే ఐ.సి.యస్, ఉద్యోగులను నియమించుటయు వారి సీనియారిటీని బట్టియే వారికిప్రమోషన్ (ఉద్యోగమున అభివృద్ధి) నొసగుటయు దేశీయులలో తెలివైన వారి కుద్యోగము లిచ్చుటకు ప్రతిబంధకమగుటయు వివరించి, "పన్నుల విధించు పద్ధతి పనికి మాలినదిగానున్నది. ఆర్థికముగా యంత్రసహాయ మావంతయులేని ప్రజలకీ పన్నుల భారము దుర్భరముగా నున్నది. ఉప్పు పన్ను అన్యాయము. నల్లమందు వలన వచ్చు ఆదాయము నిలుకడలేనిది. దేశాదాయము అనవసరమైన యుద్ధములకు దుర్వినియోగము చేయబడుచున్నది. సివిల్ సర్వీసు ఉద్యోగుల కత్యధిక జీతము లివ్వబడుచున్నవి.

హిందూదేశములో కొన్ని వందల చతురపు మైళ్ల వైశాల్యముకలిగి కొన్ని లక్షల ప్రజలుండు పెద్ద పెద్దజిల్లాలను పరిపాలించుటకొరకు నియమింపబడిన ఆంగ్లేయ జిల్లా కలెక్టరులకు మేజస్ట్రేటులకుగల అధికారములు అనిర్ణీతములును అపరిమితములునై

యున్నవి.

ఒక పెద్ద జిల్లాలను బాగుచేయుటకును పాడుచేయుటకును వీలైనంత అపారమైన అధికార మీకలెక్టరులకున్నది. భారతదేశ వ్యవహారములను పార్లమెంటువారు తృప్తికరముగా పరిష్కరింపలేకున్నారు. ఈ దేశపు పార్లమెంటువారికిని ప్రజలకును భారతదేశము యొక్క నిజస్థితి వెల్లడింపబడుటలేదు. మొత్తముమీద ఈ బ్రిటిష్ ఇండియా ప్రభుత్వము బాధ్యతలేని రహస్య ప్రభుత్వముగా నున్నది. దీని నింక సహింపరాదు" అని చెప్పి, ఇట్లనిరి. "భారతదేశ ప్రజలలో విద్యాభివృద్ధి చేయుడు. వారిని వివేకముతో పరిపాలింపుడు. అంతట నాదేశములోని కులభేదములు పోయి వారందరు మనలను దేశమును జయించినవారుగ గాక, తమ కపారమైన మేలొనగూర్చినవారిగ పరిగణింతురు" అనిరి.

బ్రైటుగారి మహోపన్యాసములుగాని, భారతదేశ ప్రజల మొరలుగాని పార్లమెంటు వారి ఉద్దేశములం దెట్టి మార్పును కలిగింపలేదు. ఏవో కొన్ని స్వల్పపు మార్పులతో భారతదేశ రాజ్యాంగచట్టమును మఱల శాసింపబడెను. ఈ మారు 20 సంవత్సరములవరకు ననిగాక, కాల పరిమితి నిర్ణయింపకయె భారతదేశము నేలుటకు కుంఫిణీవారికి పట్టా నిచ్చిరి. భారతదేశ ప్రజానాయకులకు గొప్ప ఆశాభంగము కలిగెను. రాజధాని నగరములందలి ప్రజాసంఘములు అసమ్మతిని తెలుపుచు తీర్మానములను చేసెను.

కుంఫిణీవారికి పార్లమెంటువారు 1853లో మరల పట్టానిచ్చుటకు ముందీ భారతదేశ ప్రజానాయకులు ఈ దేశమున కంపెనీ పరిపాలనమున ప్రజలకే యే యన్యాయములు జరుగుచున్నవని మొఱబెట్టుకొని యుండిరో ఆ అన్యాయములలో నేవియు పోలేదు సరికదా, 1853వ సంవత్సరము తరువాత 1857 వరకును జరిగిన దుష్పరిపాలనమునకు దానివలన దేశీయ ప్రజలు పొందిన బాధలకు హద్దుపద్దులు లేకుండెను. ప్రజల మొఱలాలకించి వారికష్టములు తీర్చువారు లేకుండిరి.

చెన్నపట్టణమున కుంఫిణీవారి రివిన్యూ అధికారులకే గల పోలీసు అధికారములను పురస్కరించుకొని పన్నులీయలేని బీదరైతులను చిత్రహింసలను బెట్టి పన్నులు వసూలు చేయుట చాల కాలమునుండి జరుగుచుండెను. దీనిని గూర్చి గాజుల లక్ష్మీనరుసుసెట్టిగారు గొప్ప యాందోలనము చేసిరి. పార్లమెంటు సభ్యుడగు డేన్బీసేమరుగారీ దేశమునకు వచ్చి, ఇక్కడ ప్రభుత్వము వారు తమ అధికారములను దుర్వినియోగములు చేసి ప్రజలను పీడించుట స్వయముగా చూచినాడు. అంతట 1854లో కామన్సుసభలో జరిగిన చర్చలో నీ యన్యాయము లెల్ల వెల్లడింపబడగా, నొక విచారణ సంఘము నియమింపబడెను.



దానిలో బయల్పడిన ఘోరములు వర్ణనాతీతములు, రివిన్యూ ఉద్యోగులు పన్నులీయలేని రైతులను నరకబాధలెల్ల పెట్టుచుండినట్లు బయల్పడెను. భారతదేశమున జరుగుచుండిన దుష్పరిపాలనమునుగూర్చియు దానివలన ప్రజలు పడుచుండిన బాధలను గూర్చియు దేశీయులేగాక ఇక్కడనుండిన మిషనరీలు ఆంగ్లేయులుకూడ ఇంగ్లాండువారికి తెలుపజొచ్చిరి. చెన్నపట్టణమున తరువాత అడ్వొకేటు జనరలుగ పనిచేసిన జాన్‌బ్రూస్ నార్టనుగారీ యన్యాయములను గూర్చి 1854లో 500 పుటలుగల యొక పెద్దలేఖను పార్లమెంటు ఉపసంఘ కార్యదర్శికి వ్రాసిరి. (The condition and requirements of the Presidency of Madras by John Bruce Norton.) ఇట్లే పలువురు గ్రంథములను వ్రాసిరి. దేశపరిపాలనమును కుంఫిణీవారి చేతులలో నుండి తీసి వేసి ఆంగ్లరాజ్యముకుటము క్రింద పార్లమెంటు వారే స్వయముగా జరుపవలసినదని 14000 మంది చెన్నపట్టణ ప్రజలచేత సంతకములు చేయించి, గాజుల లక్ష్మీనరసు సెట్టిగారు 1855లో పార్లమెంటువారి కొక మహజరు నంపిరి. ఇట్లు చెన్నపట్టణమున లక్ష్మీనరుసుగారును, కలకత్తాలో రామగోపాలఘోష్, హరిశ్చంద్ర ముఖర్జీ గార్లును బొంబాయిలో నౌరోజీ పర్దూంజీ భావుదాజీ మొదలగువారును ఎన్నో సభలు చేసి, తీర్మానము లను చేసి, మహజరులంపి శాంతియుతముగను ధర్మబద్ధముగను గొప్ప ఆందోళనముచేసినను 1857లో రక్తపాతముజరుగువరకు పార్లమెంటువారు కన్ను తెరువరైరి.

1857లో జరిగిన రక్తపాతమునకు ఇటీవలి ఆంగ్ల ప్రభుత్వ పక్షపాతులగు చరిత్రకారులు సిపాయిల పితూరీయని పేరిడి, దాని నిజస్వభావమును గప్పిపుచ్చి దానికి ముఖ్యకారణము పందికొవ్వు గొడ్డుకొవ్వు పూసినతోటాల నుపయోగింపుడని సిపాయిలను శాసించుటయు ఆంగ్లేయ నాగరికత దేశీయులపార్థముచేసికొనుటయనియు చెప్పజూచుచున్నారు గాని, పూర్వకాలపు టాంగ్లేయ చరిత్రకారులను ఉద్యోగులు నుద్యోగేతరులు మిషనరీలుగూడ నీరక్తపాత మొక మహావిప్లవమే యనియు దీనికి మూలకారణము కుంపణీవారి దుష్పరిపాలనమును అందువలన ప్రజలలో గలిగిన తీవ్రమైన అసంతృప్తియునని స్పష్టముగా వ్రాసియున్నారు.

## క్రైస్తవ మత ప్రచారకులు చెప్పిన సంగతులు

కుంఫిణీ ప్రభుత్వమున డాల్‌హౌసీ ప్రభువు హిందూదేశమున గవర్నరు జనరలుగ నుండిన కాలమున, అనగా 1848మొదలు 1856వరకును వంగరాష్ట్రమునందలి ప్రజలబాధలను గూర్చి భారతదేశమున నుండిన వివిధ క్రైస్తవ మత ప్రచారకులు

పార్లమెంటువారికి 1852, 1853, 1856 సంవత్సరములలో మహాజరు లంపిరి. వీరు భారతదేశ ప్రజలపట్ల పక్షపాతము వహించరని గాని, ఆంగ్ల పరిపాలనకు విరోధులుగాని చెప్పవలనుకాదు. అందువలన వీరి మాటలకు హెచ్చు విలువకలదు.

కుంఫిణీవారికి క్రొత్తపట్టా నిచ్చుటకు ముందు 1852లో వీరు పార్లమెంటుకు సమర్పించిన అర్జీలో దేశమంతటను ప్రజాసామాన్యము బాధలనొందుచుండుట, ప్రభుత్వము సవరింపవలసిన లోపములు నానాటికి హెచ్చుచుండుటయు వివరించిరి. వంగరాష్ట్రమునందు అనేక జిల్లాలలో ప్రజల ప్రాణములకుగాని ఆస్తికిగాని రక్షణ లేకుండెను. దొంగలగుంపులు దోపిడులు వృద్ధియగు చుండెను. దేశములో దౌర్జన్యములు పోలీసువారి అశక్తతతయు వర్ధిల్లెను. న్యాయవిచారణ పద్ధతి బాగుగా లేకుండెను. చిత్రహింసలు పెట్టి నేరముల నొప్పించుట, ప్రజాపీడనమును వర్ణించిరి. ప్రస్తుతము అమలులో నున్న భూస్వామిత్వపద్ధతులవలన దేశములోని గ్రామప్రజల ఘోరదారిద్ర్యము దుఃస్థితిలోనికి దిగుచుండుట, జమీందారులు రైతులను పీడించి బాధించుట, శాంతిభద్రతలు కాపాడవలసిన పోలీసు రక్షకశాఖవారు చౌకీదారీపన్ను పైననో గవర్నమెంటు జీతములపైననో బ్రతుకుచు ప్రజలపట్ల క్రూరముగా ప్రవర్తించుటను ఈ అన్యాయములందు రైతులు ఘోరదారిద్ర్యమునను దాస్యమునను బాధపడుచుండుటను గుర్చియు విన్నవించిరి.

వంగరాష్ట్రమునందు కాపురమున్న క్రైస్తవులు 1800 మంది 1853లో పార్లిమెంటువారికి ప్రత్యేకవిన్నప మంపిరి. వంగరాష్ట్రములోని క్రిందిజిల్లాలలో పోలీసువారు నేరములు జరుగుకుండా కాపాడలేకున్నారనియు, నేరగాంద్రపట్టుకొన లేకున్నారనియు, వీరిలో లంచగొండితనము హెచ్చి, చీటికి మాటికి ప్రజలను పీడించుచున్నారనియు, అనుమానముపైన పట్టుకొన్న వారిని చిత్రహింసలపాలుచేయుచున్నారనియు చెప్పి ప్రజల, ఘోరదుఃస్థితినిగూర్చియు న్యాయ పరిపాలనా పద్ధతి అసంతృప్తికరముగా నుండుటను గూర్చియు విన్నవించిరి. ప్రజల కష్టసుఖములను గూర్చిన విచారణ ప్రారంభింపక పూర్వమే పార్లమెంటువారి విచారణ ముగించుట యన్యాయమని వగచిరి.

1853లో క్రొత్త పట్టా ఇవ్వబడిన పిదప కుంఫిణీ పరిపాలనలో భారతదేశ స్థితిగతులందు మార్పులు కలుగలేదు సరికదా, దుష్పరిపాలనము వలనిబాధలు మరింత యధికమైనట్లు మిషనరీలు 1856లో పార్లమెంటుకు పంపిన మహజరువలన విదితమయ్యెను. మిషనరీ లిట్లువ్రాసిరి. 1853లో పార్లిమెంటు విచారణ జరిగిన తరువాత సంభవించిన అనేక సంగతులవలనను ప్రకటింపబడిన అనేక గ్రంథములవలనను వంగరాష్ట్రము నందలి ప్రజలస్థితి అధోగతిలో నున్నదను సంగతి మరింత స్పష్టముగా



తెలిసినది. ఇదివరకు పంపిన మహజరులో అసలు దేశములో నున్న నిజస్థితికన్న చాలాతక్కువ తీవ్రముగానే అస్థితి గతులు వివరింపబడి యుండినట్లును బయల్పడిన దనియు చెప్పిరి వంగరాష్ట్ర లెఫ్టినెంటు గవర్నరగు హాలిడే గారే పోలీసు వ్యవహారములను గూర్చియు వంగరాష్ట్రమునందలి నేరవిచారణల పద్ధతిని గూర్చియు వ్రాసిన మినిట్సులో వంగరాష్ట్రమున చాలాకాలము నుండి పోలీసు వ్యవహారములు బాగుగా లేవని ప్రజలు మొరపెట్టుకొనుచునే యున్నారనియు అయినను దానిని చక్కచేయుటకు జరిగిన ప్రయత్నములు బహు స్వల్పమని యంగీకరించినారు. దేశములో నన్ని ప్రాంతములందును బలవంతులు బలహీనులను సదా పీకుకొని తినుచున్నారనియు, దేశములోని అధికారములు వానివలన సంపాదింప వీలుగల సొమ్మునుబట్టియే విలువ కలిగి యున్నవనియు, గ్రామపోలీసుల (చౌకీదారీ) పద్ధతియొక్క స్వభావము, స్థితి,నిలుకడయు గడచిన యిరువదేండ్లలో క్రమక్రమముగా క్షీణదశలోనికి వచ్చినదనియు, క్రిమినలు నేరవిచారణచేయకచ్చేరీలును ప్రజలవిశ్వాసమునకు పాత్రమగుటలేదనియు, అది సరియైనను కాక పోయినను, క్రిమినలు నేరవిచారణ యనునది సాధారణముగా నేరగానికి లాభము కలగుజూద వ్యవహారమును భావము దేశీయులలో వ్యాపించి యున్నదనియు, దేశములో నున్న ఐరోపా వారుకూడా ఇట్లే తలంచుచున్నారనియు, ఘోరమైన నేరములు చేయువారిలో బహుస్వల్పసంఖ్యాకులను మాత్రమే పట్టుకొని విచారింతురనియు, అట్లు విచారణచేయబడువారిలో సగముమంది విడుదలయగు చుందురనియు, పరీక్షలయందు తేరినవారిని ఉద్యోగులుగా నియమింపక, ఇంగ్లాండులో కుంఫిణీవారి డైరెక్టరుల ప్రాపకమువలననే కొందరి బంధువులైన యువకులను సివిలునర్వీసులో నియమించుటవలన నిక్కడ పనిచేయు మేజిస్ట్రేటులకు అనుభవము గాని, శక్తి సామర్థ్యములుగాని లేకపోవుటయు హెచ్చుచున్నదనియు బయల్పడినది. ఇట్లు ప్రభుత్వ నివేదికలనుండియే కొన్ని సంగతులు చెప్పి, "బీదవారి కెంత యన్యాయము జరిగినను ఆలన పాలన జరిగి పరిహారములు కలుగనను నాసలేదు. గ్రామము లందలి జనులలో తీవ్రమైన అసంతృప్తియున్నదిగాని, చెప్పుకొనినను ప్రభుత్వము ఏమీచేయదనుభావముతో నోరుమూసికొనియున్నారు. ఇంతకాలమునుండియును జరుగుచున్న ఈయన్యాయము లింకనట్లే యుండటయు, ప్రజలలో నిందువలన కలిగిన చెడ్డ ఫలితములను వారి బాధలను చూడగా, తమకు చాలా దుఃఖమును భయమును కలుగుచున్న"దనిరి. "ప్రజల బాధలను మాన్పుటలో నింకనొక క్షణమైన జాగుచేసినచో, మాట దక్కదు. మాకు తెలిసిన అంశములను బట్టిగ్రామ ప్రజలయందశాంతి యను దినము వృద్ధియగుచున్నది. వారి

మనసులందు తీవ్ర మైన ద్వేషభావము రగుల్గొనుచున్నది" అని వ్రాసి, అధికార పక్షపాతముగాని స్థానిక స్పర్ధలుగాని లేని స్వతంత్ర వ్యక్తులను ఒక ఉపసంఘముగా నియమించి, ప్రజలకు గల బాధలనెల్ల జాగ్రత్తగా విచారణ చేయించవలెనని కోరిరి. ఇట్టి ఆంగ్లేయ ప్రభుత్వాభిమాను లింత స్పష్టముగా చెప్పిన సంగతులును, చేసిన హెచ్చరికలును కుంఫినీ ప్రభుత్వమువారు పెడచెవిని బెట్టిరి.

భారతదేశ వ్యహారములను గూర్చి ఇంక ననేకులు గ్రంథములందు ఉపన్యాసములందును వ్యాసములందును తీవ్రముగా విమర్శించి యుండిరి గాని, లాభములేక పోయెను.

## సర్ ఆర్థర్ కాటన్‌గారి సాక్ష్యము

1853 లో హిందూ దేశమునకు వచ్చి, కావేరికిని, గోదావరికిని ఆనటకట్లు కట్టి, "కాటన్ మహాఋషి" యని ప్రజలచే గౌరవింపబడిన సర్ ఆర్థర్ కాటన్‌గారు 1853లో భారతదేశమను గూర్చి వ్రాసిన సంగతులను గూర్చి, లండన్ టైమ్సు పత్రిక డిశెంబరు 12వ తేదీన వివరించినది. "భారతదేశ ప్రజలేల దరిద్రులుగా నున్నారు? ఏలననగా వారికి మానవపరిశ్రమకు బదులుగా పనిచేయుటకు ఎడ్లు తప్ప వేరే యంత్రసాధనములునులేవు. తమ పరిపాలకులగు ఆంగ్లేయులు భోగము లనుభవించుటకొరకు వీరు అమితశ్రమ పడవలసి యున్నందున, కడుపునిండ కూడు, కట్టుబట్ట, నిలువనీడయు చేకూర్చుకొనుటయే కష్టతరముగా నున్నది. ఇంగ్లాండు దేశప్రజలు తమ సౌకర్యము కొరకు పడు పాటుకన్న అక్కడ ఆవిరి, నీరు, రోడ్లు, కాలువలు,రైళ్లు, రేవులు, నౌకాశ్రయములు వారికి కలిగించు సౌకర్యములు హెచ్చుగా నున్నవి. భారతదేశమున నన్నియు ఉన్నవిగాని, అన్నిటికన్న పెద్దలోప మొక్కటే యున్నది. అది మన మాదేశము నాక్రమించి పరిపాలించుట మొదలిడినుండి ఇప్పటివరకును భారతదేశమును అవిద్యాంధకారమునందు దారిద్ర్యమునందు నుంచిన పెద్దలోపము.

"ఇంగ్లాండులోనున్నచో ఆదేశమున తనకు గౌరవప్రదము లని తలచు కార్యముల నన్నిటిని చేయు మానవుడే హిందూదేశమున సూర్యోదయమునుండి సూర్యాస్తమయము వరకు తన జిల్లాలో శిస్తులనిర్ణయము దాని వసూలు తప్ప, వేరే కార్యమును గూర్చి యాలోచింపకపోవుట ఆశ్చర్యము" అనినాడు. పూర్వరాజు లీదేశములో నిర్మించిన కాలువలు తటాకములు పల్లపు సాగునీటి వనరులును కుంఫిణీవారు బాగుచేయక పోవుటనుగూర్చి తీవ్రముగా విమర్శించినాడు. (Life of general sir Arthu cotton, by



his daughter Lady Hope PP 186`198) చాలాకాలమాదేశమున పెద్దఉద్యోగములు చేసి పేరుపొంది, 'రాసమాల' యను గుజరాతు దేశపు రాజుల కథలను రచియించిన అలెగ్జాండరు కీన్‌లోక్‌ఫోరుబ్సు అను నాయన భారతదేశమున 1857లో విప్లవము వచ్చుటకు ముందుగానే, దేశమున జరుగుచుండిన దుష్పరిపాలనమును గూర్చియు, దేశీయుల నందరిని ఒకే తరగతిని సామాన్యస్థితిలోనికి తెచ్చుటను గూర్చియు, రాజులలోను ప్రజలలోను గల అశాంతినిగూర్చియు "బొంబాయి క్వార్టర్లీరివ్యూ" పత్రికలో అనేక వ్యాసములను వ్రాసియుండెను. అందు ముఖ్యముగా దేశములోని ఆంగ్లేయసివిలు మిలిటరీ ఉద్యోగులందు జాత్యహంకారము ప్రబలి, దేశీయుల ఆచారములపట్ల నిరసనమును చూపుచు వారి మనసులకు నొప్పికలిగించుటను గూర్చియు వెల్లడించిరి.

## భారతదేశ విప్లవమును గూర్చి బ్రైట్‌గారి యుపన్యాసము

భారతదేశ పరిపాలనమును గూర్చి 1858 సంవత్సరము జూన్ 24వ తేదీన పార్లిమెంటుసభలో బ్రైటుగా రిట్లుపన్యసించిరి. "భారతదేశమునం దిపుడు మనకు కనబడు లోపములేమి? భారతదేశప్రజలే నా ముఖతామీకు చెప్పుకొనుచో, వారేమని మొరపెట్టుదురో మీకు తెలియునా? ఈ సభవారికి వారిట్లు మొఱపెట్టుకొందురు: -

ప్రతిరాజధానిలోను, అందుముఖ్యముగా ఆంగ్ల పరిపాలనము క్రిందికి చిరకాలము క్రిందట నేవచ్చిన రాష్ట్రములలో దేశ ప్రజలలో అధికసంఖ్యాకులుగా నున్న భూములుదున్నుకొను రైతులు ఘోరమైన దారిద్ర్యమున మునిగియున్నారు. చాలా దీనావస్థలో నున్నారు. చాలాబాధలు పడుచున్నారు. పదేండ్లక్రిందట నీసభవారు నియమించిన ప్రత్తిపంటను గూర్చిన విచారణ సంఘమువారి నివేదికనుండి ఇదివరకనేకమారులిక్కడ పెక్కుసంగతులు చెప్పియున్నాను. ఆ సంఘములో కంఫిణీ డైరెక్టరులు చాలామంది సభ్యులుగా నుండిరి. ఇక్కడ నేను చెప్పిన సంగతులెల్ల వారంగీకరించినవే. ఆ సంఘమువారు బొంబాయి చెన్నపట్టణ రాజధానులను గూర్చి మాత్రమే విచారించినను, తక్కిన ప్రదేశములందుగూడ అట్టి స్థితిగతులే యున్నవి. భారతదేశ ప్రజల బాధలను గురించి నేనిప్పుడు మీకు మరల చెప్పదలనచినచో, ప్రపంచములో నింక నేదేశములోను లేనంత ఎక్కువ పన్ను లీ భారతదేశమున విధింపబడుచున్నవని చెప్పవలసి యున్నది. నాగరకతకల క్రైస్తవప్రభుత్వము క్రింద కొంతకాలమైన నున్న ఏదేశమునందును కానరాని విధముగా నీదేశమున పారిశ్రామికాభివృద్ధిని ప్రభుత్వమువారు పేక్షించినారని చూపగలను. హిందూదేశములో పనిచేసిన ఉద్యోగుల వ్రాతలనుండియు, వంగరాష్ట్రమున గవర్నరుపని

చేసిన హాలీడేగారి వాక్యములనుండియు నేనీ సంగతిని చూపించగలను. ఉదాహరణమునకు నాగరికత కలదని నటించు ఏ దేశములోను వంగరాష్ట్రమునందు పోలీసుపరిపాలనలో కనబడుస్థితిగతులతో పోలికలు ఏకాలముననుకూడ కనబడవు. ఇకన్యాయవిచారణచేయు కోర్టుల విషయమునగూడ నేనీసంగతినే చెప్పగలను. కుంఫిణీవారికి స్నేహితులుగ నుండి వారిపట్ల పక్షపాతబుద్ధితో వారి కనుకూలముగా వ్రాసిన పుస్తకములయందుగూడ ఈదేశములో ఇంగ్లీషు కోర్టులు వృద్ధియగుచున్న కొలదియు అబద్ధపు సాక్ష్యములు, నందువలన న్యాయపరిపాలనము నందు ప్రవేశించు నష్టములును ఆరాజధానులలో వృద్ధియగుచున్నవని వ్రాసియున్నారు. ఇక ప్రజాసౌకర్యము (పబ్లిక్ వర్కు)లను గూర్చి చెప్పవలసినచో, యావద్భారతదేశమునం దంతటి కన్నను ఈ ఇంగ్లాండు దేశములో నొక్క చిన్న జిల్లాలోనే రాకపోకల కనువైనరోడ్లు ఎక్కువగా నున్నవన్నచో, హిందూదేశమునం దవి యెంత మృగ్యములో తెలిసికొనవచ్చును. ఈ తూర్పుఇండియా కుంఫిణీ ప్రభుత్వము అవిశాల భారతదేశమున అన్నిరకములైన ప్రజాసౌకర్యములకొరకు 1834 మొదలు 1848 సంవత్సరము వరకు గతించినపదునాలుగేండ్లలో వ్యయము చేసిన సొమ్ముకన్న మనదేశమున ఒక్క మంచెస్టర్ నగరమందు కేవలము ఒక్క మంచినీటి సదుపాయముకొరకే ఎక్కువసొమ్ము వ్యయము చేయబడినదని చెప్పినచో, అదేశమునందు ప్రజాసౌకర్యములకొర కెంత స్వల్పపు మొత్తము వెచ్చింపబడెనో తెలియగలదు. భారతదేశమును పరిపాలించు ప్రభుత్వము నింతవరకు చేయుచుండిన ప్రధానకార్యము రాజ్యాక్రమణము చేయుట, రాజ్యాక్రమణముకొరకు యుద్ధములు చేయుచుండుట మాత్రమే. భయంకరమైన సైనిక విప్లవమువచ్చి, పార్లిమెంటువారు కన్నులు తెరచి, భారతదేశ సమస్యల విషయమున నీసభవారు శ్రద్ధవహించుట తటస్థింఇంచినదిగాని లేనిచో, నింక నీ యన్యాయము లిట్లే జరుగుచుండియుండును. ఈ భారతదేశ ప్రభుత్వములోని ఇంకొక లోపమును బేర్కొనవలె నన్నచో, నది యక్కడ అమలులోనున్న అర్థపద్ధతియె. ఈ భారతదేశ ప్రజలనుండి పిండుటకు వీలైన మొత్తముకన్నను వారిని పరిపాలించుటకొరకు చేయబడు ఖర్చు అధికమైనది" అని బ్రైటుగారుద్ఘోషించిరి.

## ఇక్కడ జరిగిన అన్యాయములను గురించి సదరుకోర్టు జడ్జిగారు చెప్పిన సంగతులు

1857వ సంవత్సరము ఆగష్టు 12వ తేదీన భారతదేశ విప్లవకారణములను గురించి ఒక వంగరాష్ట్ర హిందూ అనుపేరుతో వ్రాయబడిన చిన్నపుస్తకమున కుపోద్ఘాతము



వ్రాయుచు, చెన్నపట్టణమున సదరుకోర్టు జడ్జిగా పనిచేసి, ప్రభుత్వసభ్యుడుగా నియమింపబడి, ప్రజలపట్ల సానుభూతి కలిగియుండి 1847లో పనిమానుకొనిపోయిన మాల్కలం లెవిస్ గారిట్లు వ్రాసిరి.

"మనము (ఆంగ్లేయులను భారతీయులును) ఒండొరుల సాంఘిక సంప్రదాయములను గ్రహించిన వారముకాము. మనకుగల సంబంధము గ్రీసు దేశమున స్పార్టనులకు హెలటులకునువలె బానిసయజమానికి బానిసలకు మధ్యగల సంబంధమే. జీవితమున సుఖప్రదముగా చేయువానినన్నిటిని మనము చేజిక్కించుకొని, దేశీయులు మానవులుగా నున్నతస్థానము పొందుటకు వలసిన మార్గముల నన్నిటిని అరికట్టినాము. వారి కులభేదములను దూషించితిమి. వారి వారసత్వపు పద్ధతులను తీసివేసితిమి. వారి వివాహపు నిషేధములను తొలగించిమి. వారు పవిత్రముగా భావించు మతాచారములను తృణీకరించితిమి. వారి దేవాదాయములను మన కిష్టము వచ్చిన వారికిచ్చి, ధర్మములను నాశముచేసితిమి. వారిని మనరికార్డులలో మతేతరులని ముద్రవేసితిమి. వారి స్వదేశరాజుల రాజ్యములను లాగికొంటిమి. వారిభూస్వాముల యీనాములను తీసికొంటిమి. మన అక్రమపన్నుల వసూలు వలన దేశములోని రైతులకు నిలుకడ లేకుండా చేసితిమి. చిత్రహింసలు చేసి, శిస్తులు వసూలుచేయించితిమి. ప్రపంచములోని పురాతనమై ఉత్తమవంశీయులను మాల మాదిగలస్థితికి దింపితిమి."

## విప్లవాగ్ని - భారతదేశమున మరల విప్లవము రాకుండచేయుటెట్లు? 1842-1857 మధ్య జాన్ బ్రూస్ నార్టన్‌గారు స్వయముగా గమనించిన సంగతులు

1842వ సంవత్సరము మొదలు చెన్నపట్టణమున సుప్రీముకోర్టులో బారిష్టరుగా పనిచేసి, తరువాత అడ్వొకేటు జనరలైన జాన్ బ్రూస్ నార్టనుగారు భారతదేశ స్థితిగతులనుగూర్చి 1857లో "భారతదేశ విప్లవము ఇకముందట్టిది రాకుండచేయు టెట్లు?" అను నొక గ్రంథముననిట్లు వ్రాసిరి. "హిందూదేశములో మనలను హృదయపూర్వకముగ ద్వేషించు ప్రజాసంఘములో పలుకుబడిగల జనసంఖ్య చాలా కలదు. తమ సామ్రాజ్యము నాశనముచేసి, తమ్ము తల క్రిందుచేసితి మనుకోపమును, కాఫరులమనుద్వేషమును మహమ్మదీయులకు కలదు. అంత తీవ్రముగను బహిరంగముగను కాకపోయినను, తమకు పలుకుబడిపోయిన దనుకోపముతో బ్రాహ్మణులు మన లను ద్వేషించుచు, లోలోపల కుట్రలుచేయుచున్నారు. దేశములో తమ ప్రాముఖ్యతపోయి, ప్రజలను పీడించి తాము

పొందుచున్న లాభములు పోయినవని, గొప్పకులములవారు మనపై కోపముగ నున్నారు. పెద్దజమీందారులు భూస్వాములు తమ యస్టేటులు పోయినవని దుఃకించు చున్నారు. వీరినాశ్రయించి తిరుగువారు తమ జీవనములు పోయినవని విచారించుచున్నారు. దేశములో పూర్వకాలమునుండియు ప్రత్యేక మైన సౌకర్యముల ననుబవించుచున్న ధనవంతులగు భూస్వాముల జనసంఘమువారును మనయందు విరోధించియున్నారు. అత్యధికమైన శిస్తు వసులును క్రూరముగ చేయుచు తమ వ్యవసాయ వ్యవహారములకు తరచుగా భంగము కలిగించుచున్నారనియు దేశమును కోర్టు వ్యాజ్యములలో ముంచుచున్నామనియు,న్యాయపరిపాలనపద్ధతియు పోలీసు వారి లంచగొండితనమును వారు అబద్ధపు నేర ములను మోపి ప్రజలను పీడించుచున్నామనియు, ప్రజల ప్రాణములను ఆస్తులను దౌర్జన్యములనుండి రక్షింప లేకపోచున్నామనియు ప్రజలు అతృప్తితో గొణుగుకొనుటకు కారణములగు చున్నవి.

స్వదేశరాజులతో మనము చేసిన సంధిషరతులను బహిరంగముగ భంగపరచుచు మనము ప్రజలకు భయాశ్చర్యములు కలిగించితిమి. మన ధర్మమునందు వారికి అపనమ్మకము కలిగినది. వివిధతరగతి ప్రజల మనస్సులు విరిగినవి.

ప్రజల క్షేమము నాలోచింపక, కేవలము స్వప్రయోజనముకొరకే పరిపాలించుట ప్రారంభించితిమి. మొన్న మొన్నటివరకు వారినుండి వీలైనంత శిస్తును రాబట్టుటకు మాత్రమే ప్రయత్నించితిమి. ఈ దేశప్రజల కింకనుగల అనేకమైన చిన్నచిన్న బాధలు కలిగి, వారియందు అతృప్తిని విరోధభావమును పెంచుచున్నవి.

చెన్నపట్టణమున ప్రకటింపబడుచున్న "ఎతేనియం" పత్రికలో నీస్థితిగతులను గూర్చి ఉత్తర హిందూస్థాన వాస్తవ్యుడగు నొక అనుభవజ్ఞుడు వ్రాసినలేఖ నీక్రింద ఉదాహరించుచున్నాను. "దేశమునం దంతటను బ్రిటిషు ప్రభుత్వముపట్ల విరోధభావము ప్రబలియున్నది. ఇది కులభేదమునకు మతదర్మమునకు సంబంధించినది కాదు. క్రొవ్వుపూసిన తోటాలకుగల అభ్యంతరమనునది ఈ విప్లమున కొక నెపముగాని, నిజముగా మహమ్మదీయులు హిందువులుగూడ సమానముగా నీ విప్లవమునకు సంసిద్ధులైరి. ఈ విరోధభావమునకు నిజమైన కారణము దేశములోని దుష్పరిపాలన. కుంఫిణీవారి యంగీకారముతో డల్హౌసీ ప్రభువు ప్రారంభించిన రాజ్యాక్రమణవిధానము. తమ స్వదేశరాజుల పరిపాలనకన్న మన ప్రభుత్వమును పలుకుబడిగల భారతీయులు వాంఛించుచున్నారనుమాట సత్యమునకు విరుద్ధము. చాలా పొరపాటు మాట."

ఈ అన్యాయ మింతటితో ఆగలేదు. సర్వభక్షణవిధానముపైనుంచి క్రిందికి



ఒకతరగతి నుండి ఒక తరగతికి సామాన్య ప్రజలందరివరకును దేశములోని ప్రతి యకరమువరకును ప్రాకినది. మహారాజుల రాజ్యములను తుడిచివేయుటతో మనము తృప్తిచెందలేదు. వీలైనప్పుడెల్ల పాళెగారుల పాళెములను, జమీందారుల జమీనులను వశముచేసికొంటిమి. ఇంతటితో నైనను మనము తృప్తిచెందక, పూర్వకాలమునుండి పన్నులు లేకుండా అనుభవించుచు ప్రత్యేకహక్కులు బాధ్యతలుగల యీనాముదార్ల యీనాములనుగూడ తీసివేసితిమి. ఇట్లు దేశములో భూమినంతటిని ఆక్రమించి, మనమే సర్వంసహా భూస్వామిగా కాదలచితిమి. దీని ఫలితము ప్రజలకు మనపట్ల కలిగిన విరోధభావము. హిందూదేశములో బాధలేని వ్యక్తినిగాని, లేదా, తనకుబాధలేదని తలచు వ్యక్తిగాని కనబడుటలేదు. అతని యీనామును కంపెనీవారు లాగివేసి యుండవచ్చును, లేక, ఒకకోర్టు వ్యాజ్యములో నాతడు నష్టపడి యుండవచ్చును, అబద్ధపునేరములను మోపుట వలన బాధనంది యుండవచ్చును, ఒకొకప్పుడు హత్యానేరముగూడ మోపబడి యుండవచ్చును. కేవలము కక్షసాధించుటకు మేజస్ట్రేటు ఇతనిని బయటకు లాగి, చెరసాలయందు పడవేసి యుంచవచ్చును, ఈతని ఇంటిలోనికి బలవంతముగ చొరబడి యుండవచ్చును, నిష్కారణముగా నీతనిని జమీనుదారులులను తెచ్చుకొనుమని నిర్బంధించి యుండవచ్చును, లేదా ఇతడు దోపిడి దొంగలగుంపువలన సర్వస్వమును పోగొట్టుకొనగా, ఈతని బాధను తీర్చువారే లేకపోవచ్చును, ప్రభుత్వ అవసరములకొర కీతని యాస్తిని సర్కారు వశముచేసికొని యుండవచ్చును, ఆదారిని పోవుచున్న పటాలముల యుపయోగముకొర కితని బండి యెద్లుకూడ యెక్కడికో పంపబడి మరలివచ్చునను నాస లేకపోవచ్చును, సర్కారుకొరకు ఇతడు చేసిన పనికిగాని ఈతడు సరఫరాచేసిన వస్తువులకు గాని రావలసిన సొమ్ము పరిష్కరింపబడక, కాలహరణము జరుగుచుండ వచ్చును, ప్రజల కొరకు నిర్మింపబడు ఆనకట్టలు మొదలైన పబ్లికువర్క్సుకొర కితడు వెట్టిచాకరీచేయుటకు నిర్బంధింపబడి యుండవచ్చును, కలెక్టరు ఇతని భూమి నొక్కగీటుతో ఇంకొకనికి వశము చేసి, సివిలుకోర్టులో దీర్ఘమైన బాధను కలిగించు వ్యాజ్యములు పాలుచేసే యుండవచ్చును. దేవాదాయ వ్యవహారములం దితనికి వివాదము కలిగి, పైకి అప్పీలు చేసికొనుటకు న్యాయవిచారణ సంస్థలేక నుండపోవచ్చును. రెవిన్యూ అధికారులగు శిరస్తాదారుగాని తహస్సిల్‌దారుగాని ఈతని నేదో చిక్కులో పెట్టి యుండవచ్చును, ఎట్టి సాక్ష్యము లేకుండగనుఉన్న సాక్ష్యనిదర్శనమునకు వ్యతిరేకముగను కూడ క్రిమినలుకోర్టువారీతనిని శిక్షించి యుండవచ్చును. ఇట్లు ప్రజలకుగల నానావిధములైన బాధలు దేశములోని పరిపాలనాపద్ధతి బలహీనమై చలనములేని స్థితిలో నుండుటకు

నిదర్శనముగా నున్నది.

భారతదేశములోని ప్రజలు అజ్ఞానులుగ లేరు. విద్య నానాటికి వృద్ధియగుచున్నది. ప్రజలలో మంచి చెడ్డలనగూర్చిన విచక్షణజ్ఞానము వర్ధిల్లుచున్నది. అభిప్రాయములు విమర్శనజ్ఞానము విషయనిర్ణయము పొడసూపుచున్నవి. అయినను నూరుసంవత్సరముల క్రిందట మనము జయించిన పిల్లలవంటి పిరికివారై అశక్తులై, అజ్ఞానులైన ప్రజలను చూచినట్లే నేటి ప్రజలను చూచుచున్నాము.

వార్తాపత్రికల ప్రకటనము వృద్ధియగుచున్నది. ఏవ్యవహారముగాని రహస్యముగా నుంచుట కష్టతరమగుచున్నది. సత్ప్రభుత్వలాభముల విషయమున మనయందుగల లోపములు విద్యావిధానము, న్యాయపరిపాలన, చక్కగ లేకుండుట ప్రజలు గ్రహించుట లేదని మనము అనుకొను చున్నాము.

మనలను పరీక్షించుటకు వలసినసాధనములను వారికిచ్చియుంటిమి. అవి వారుపయోగింప రని తలచుట పొరపాటు. ఇది నమ్మనివారెవరైన నున్నచో ప్రపంచములో వార్తాపత్రిక నిర్వహణమునం దేవిషయమునను తీసికొక సూక్ష్మదృష్టితో మంచి ఆలోచనతో వ్రాయుచున్న బ్రాహ్మణు డొకడు (హరిశ్చంద్రముఖర్జీగారు) హిందూపేట్రియట్ పత్రికలో వ్రాయుచున్న సంపాదకీయవ్యాసములను చూడవచ్చును.

ప్రజలలో కలిగిన రాజకీయపరిజ్ఞానము ధర్మశాస్త్రజ్ఞానము సర్వమానవ సమానత్వ భావమును దేశపరిపాలనమునందు పాల్గొనుటకుగల వాంఛయు రాజకీయ స్వాతంత్ర్య వాంఛయు రాజకీయ హక్కులను ప్రజలు గట్టిగ కోరుచుండుటను చూపుచున్నవి.

ఈ విషయములలో అనుమాన మున్నవారెవ్వరైన నున్నచో, భారతదేశ జనసంఘమునందు వృద్ధియగుచున్న వార్తాపత్రికాపాఠకులసంఖ్యను గమనింపవచ్చును. దేశీయవార్తాపత్రికల స్వభావము గమనింపవచ్చును. ఒక వంగరాష్ట్రజర్నలు వీనిని అణచివేయు మని కోరునంత తీవ్రముగ నివి యుండుట చూడవచ్చును. అల్పజ్ఞానము వలన చాల నష్టములు గలవు. విద్య పరిపూర్ణముగ అభివృద్ధిచేయుట అవసరము. వారికి జ్ఞానమే గాక, వివేకముకూడ గలిగించి, వారి యందు సరి అయిన దృక్పథము కలిగించవలెను. అన్నిటికన్న ముఖ్యముగ న్యాయవిచారణ యందు ఆంగ్లేయులకుగల ప్రత్యేకాధికారము లను తీసివేయుటకు చేయ నుద్దేశించిన క్రొత్త చట్టముల విషయమై కలకత్తాలో జరిగిన దేశీయ ప్రజల మహాసభయు దానిలో నివ్వబడిన మహోపన్యాసములను చూచినచో, ఈప్రజలమనస్సు నందు మహత్తరమైన మార్పు ఒకటి కలిగినదని తెలియగలదు. వారు దీర్ఘాలోచన చేయుచున్నారని, పాశ్చాత్యమనోభావములనుబట్టి



పౌరులకు గల హక్కులెట్టివో వారు ఆలోచించుచున్నారని, స్పష్టముగా గ్రహించిరని తమ వాదనలను అనర్గళముగను తిరుగులేనట్లుగను చేయగలుగుచున్నారనియు తెలియగలదు. గతకాలమున నీ ప్రజలు మనము వారికన్న శ్రేష్ఠుల మనియు తాము నిగ్రహింపలేని అధికారబలము కలవారమనియు పొరపాటుగా తలంచుచు మనకు లోబడియుండిరి గాని, మన సంగతి వారికి తెలిసినకొలదియు నీపొరబాటును గ్రహించి తమ హక్కులను స్థిరపరచుకొనజూచుచున్నారు."

సిపాయిలవిప్లవ మని చెప్పబడు భారతదేశ స్వాతంత్ర్య యుద్ధము వచ్చుటకు ముందు ఒక సంవత్సరము క్రిందటనే నార్టనుగారు పచ్చయప్పకళాశాలలో నుపన్యసించుచు దేశీయుల యందు గొప్పమార్పు కలుగుచున్నదనియు, దేశములో నున్న ఐరోపావారి కళ్లఎదుటనే యీ మహత్తరమైన పరివర్తనము దేశీయులమనస్సు లందును శీలమునందును ఆ క్షణముననే కలుగుచున్నదనియు, దానిని దర్శనములు స్పష్టములై అగ్నిలో చిత్రింపబడిన అక్షరములలో లిఖియింపబడియున్నవనియు, ఈ భయంకరమైన హెచ్చరికను గమనింపకుండ కండ్లుమూసికొనినచో, తమగతి ఏమగునో తెలియదనియు చెప్పియుండిరి.

("The Rebellion in India How to prevent another - By John Bruce Norton Pp. 192-197")

*- ఆంధ్రపత్రిక, 1941 మే 14 - జూన్ 6*



# వ్యాజ్యాల కోసం కల్పించిన ధర్మశాస్త్రాలు

ఇంగ్లీషువారు ఈదేశాన్ని పరిపాలించడం ప్రారంభించిన దినాలలో న్యాయ స్థానాలలో న్యాయవిచారణ చేసేవారందరూ దొరలే. వాళ్లకు దేశభాషలు రావు. దేశాచార వ్యవహారాలు తెలియవు. 1830వ సంవత్సరం వరకూ న్యాయస్థానాలలో అన్ని వ్యవహారాలూ పారశీభాషలోనే జరిపే వారు. ఆ దొరలకు హిందూధర్మశాస్త్రాన్ని గురించి ధర్మసందేహాలు కలిగినప్పుడు ప్రతిస్మృతులలో ఇలాగ వున్నదని చెప్పడానికి పండితులను నియమించేవారు. వాళ్లు చెప్పిన వ్యవస్థను న్యాయాధిపతులు ప్రమాణంగా అంగీకరించి ఆ ప్రకారం తీర్మానించేవారు.

ఆసందర్భంలో కొందరు పండితులు వ్యాజ్యాలలో తాము సమర్థించదలచిన వాదనకు అనుగుణ్యంగా వుండేటట్లు కొన్నిఅబద్ధపు న్యాయశాస్త్రకారికలనూ, ధర్మశాస్త్ర గ్రంథాలనూ కూడా సృష్టించినట్లు నిదర్శనాలున్నాయి. తరువాత కొందరు దొరలు సంస్కృతం నేర్చుకొని ధర్మశాస్త్రాలను ఇంగ్లీషులోని కనువదించారు. ఇంగ్లీషు రాజభాష అయింది. పండితుల అభిప్రాయాలను గుడ్డిగా అంగీకరించే పద్ధతి పోయింది.

మహామహోపాధ్యాయకువేర ప్రణీతమైన దత్తతచంద్రిక అనే సంస్కృతధర్మ శాస్త్రగ్రంథాన్ని సదర్లాండు అనే దొర ఇంగ్లీషులోకి అనువదించాడు. అందులో గ్రంథకర్త వ్రాసిన ఒక శ్లోకాన్ని చూసి స్మృతిచంద్రిక వ్రాసినవాడే దాన్నికూడా వ్రాసినట్లు భ్రమపడ్డాడు. ఇది మొట్టమొదట ఇంగ్లీషులోకి అనువదింపబడిన గ్రంథాలలో ఒకటి అవడంవల్ల ఈ గ్రంథానికి చాలా గౌరవం వచ్చింది. చాలామంది ఇంగ్లీషు న్యాయాధిపతులు దీనిని ప్రమాణంగా అంగీకరించారు. అయితే ఈ గ్రంథాన్ని నిజంగా రచించినది కువేరుడు కాదనిన్నీ కోల్‌బ్రూక్ అనే ఇంగ్లీషు న్యాయాధిపతి దగ్గర సంస్కృతపండితుడుగా వుండిన రఘుమణి విద్యాభూషణుడే దానిని రచించాడనిన్నీ అప్పట్లో వంగరాష్ట్రంలో ఒక పెద్దజమీందారీ విషయమై ఆజమీందారు దత్తతకొమారుడికీ తరువాత పుట్టిన ఔరసుడికీ వచ్చిన వారసత్వపు వ్యాజ్యం సందర్భంలో వంగరాష్ట్రంలో శూద్రులుగా పరిగణింపబడే కాయస్తులలో ఔరసుడితోపాటు దత్తుడికి కూడా ఆస్తిలో సమానమైన వాటా వుంటుందనే



వాదనకు అనుగుణ్యముగా ధర్మశాస్త్రాన్ని నిర్వచించడానికే ఈ గ్రంథం సృష్టించబడిందనిన్నీ వంగరాష్ట్రంలో చిరకాలం నుంచీ ఒక ప్రతీతివున్నది. దత్తత చంద్రికలో గ్రంథకర్తృకృతమైన ఈ కింది శ్లోకంలో రెండుపాదాల మొదటిచివర అక్షరాలతోనూ "రఘుమణి" అనే తన పేరును యిమిడ్చి నట్లుకూడా పెద్దలు చెపుతారు!

శ్లో॥ రమ్యైషాచంద్రికాదత్త
పద్ధతే ద్దర్శికా లఘు,
మనోరమా సన్నివేశై
రజ్ఞి ధర్మతారణిః॥

సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడును సంస్కర్తయున్నూ అయిన ఈశ్వరచంద్ర విద్యాసాగరులవారు వితంతువివాహమును గురించి 1855లో వ్రాసిన గ్రంథములో దత్తతచంద్రిక సృష్టింపు అనే ప్రతీతిని గురించి స్పష్టంగా వ్రాశారు. 1858లో బంగాళీలిపిలో ప్రకటించబడిన దత్తతచంద్రికకు వ్యాఖ్యానాన్ని వ్రాస్తూ భారతచంద్ర శిరోమణిగారుకూడా ఈ సంగతిని వుదాహరించివున్నారు. దీనికి ఇంకా చాలా నిదర్శనాలున్నాయి.

*- ఆంధ్రపత్రిక 16.5.1943*



# శిస్తుల వసూళ్లలో చిత్రహింసలు

శిస్తు లివ్వలేని రైతులను అధికారులు బాధించేపద్ధతి మనదేశంలో చిరకాలం నుంచీ మొన్న మొన్నటివరకూ బాహాటంగా జరుగుతూవచ్చిన దురాచారం. అనేక రాజాధిరాజుల పరిపాలనలో మహావైభవం అనుభవించిన శ్రీనాధకవి సార్వభౌముడు తన చివరరోజులలో అనగా క్రీస్తుశకం 1437-1440 ఆ ప్రాంతంలో దరిద్రుడై కృష్ణా జిల్లాలో బొద్దుపల్లెను గుత్తకు పుచ్చుకుని వ్యవసాయం చేసి నష్టపడి శిస్తు చెల్లించలేక పోగా అప్పటి ప్రభువులైన ఒడ్డెరాజుల అధికారులు ఆయనను హింసలు పెట్టినట్లు ఒక చాటుపద్యంవల్ల తెలుస్తూవుంది.

సీ॥ కవిరాజు కంఠంబు కౌగలించెనుగదా
పురవీధి నెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్తయం ఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేరి
వియ్యమందెనుగదా నెదురుగొడియ
సార్వభౌమునిభుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిట నుండు నల్లగుండు

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయె దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్లు చెల్లింతు దంకంబు లేదునూర్లు॥

"పొగడదండ" యనగా తప్పుచేసిన వారి మెడను వేయు నొకతీరు బొండకొయ్య



(చూడు : ప్రభావతీ ప్రద్యుమ్నం. ఆ 5 పద్యం 120. పురాణపండ మల్లయ్యశాస్త్రి గారి వ్యాఖ్య). పరమయోగి విలాసంలో కూడా ఈ ప్రయోగం వున్నది.

'నిగళయుగ' మనగా ఏనుగుకాలి సంకెల. 'నెదురుగొడియ' యనగా అందలము యొక్క అవయవము. నల్లగుండు అనేది పెద్దరాయి. శ్రీనాధుణ్ని ఇలాగ బాధించారో లేదో కాని శిస్తు ల్విలేనివారిని ఆకాలంలో ఇలాగ చిత్రహింసలు పెట్టి బాదిస్తూవుండే మాట మాత్రం నిజం. నాగరికులైన ఇంగ్లీషువారి పరిపానలో మొన్నమొన్నటివరకూ ఇంతకన్న క్రూరమైన చిత్రహింసలు జరుగుతూ వున్నాయంటే యెప్పుడో ఒడ్డెరాజుల కాలంలో అలాంటివి కొన్ని జరుగుతూ వుండే వంటే ఆశ్చర్యం ఏమిటి?

క్రీ.శ. 1857లో శిపాయీల మ్యూటినీ అని ఆంగ్లేయులు వ్యవహరించే స్వాతంత్ర్య సమరం జరిగేవరకూ ఇంగ్లీషు వర్తక కంపెనీ వారు ఈదేశాన్ని పరిపాలిస్తూ వుండినకాలంలో రివిన్యూశిస్తులు వసూలుచేయడంలో రివిన్యూ అధికారులూ, నేరాలు ఆచూకీతీయడంలో పోలీసు అధికారులూ కూడా ప్రజలను అనేక చిత్రహింసలు పెట్టి బాధిస్తూ వుండేవారు. ప్రజలు నోరులేని వారైనందువల్లనూ, రాజకీయ పరిజ్ఞానం లేనందువల్ల తమకు జరుగుతూ వున్న అన్యాయాలను గురించి ఎవరికి చెప్పుకోవాలో ఎలా చెప్పుకోవాలో తెలియక బాధపడుతూ వుండేవారు. గత శతాబ్దంలో ఈ అక్రమాలు మితిమీరిపోయినాయి. చెన్నపట్నం లో మిషనరీలు చేసే అక్రమాలను అరికట్టడంకోసం పాటుపడుతూ 1844లో మద్రాసునేటీవు అసోసియేషననే ప్రజాసంఘాన్నీ క్రెసెంటు అనే పత్రికను స్థాపించి ప్రజాసేవ చేస్తూవుండిన శ్రీ గాజుల లక్ష్మీనర్సు సెట్టిగారు ఈ అన్యాయాలను గురించి కూడా సభలలో తీర్మానాలను చేయించీ ఇంగ్లాండుకు మహజరులంపీ చాలా ఆందోళన చేశారు. అంతట కొంత కదలికపుట్టింది. డేన్బీసేమర్ అనే పార్లిమెంటు సభ్యుడు 1852లో ఈదేశానికి వచ్చి లక్ష్మీనర్సుగారికి అతిథిగావుండి దక్షిణజిల్లాలలో పర్యటనంచేసి అక్కడి అధికారులు ప్రజలను పెడుతూవున్న బాధలను చిత్రహింసలను స్వయంగా చూసి ఆశ్చర్యపడ బొండలు, చిరతలు మొదలైన కొన్ని హింసాసాధనాలను సీమకు తీసుకొనివెళ్ళాడు. 1854 సం॥ జూలై నెలలో ఈ హింసలనిజానిజములను గురించి పార్లిమెంటులో ఒక చర్చ జరిగింది. నాగరిక ప్రభుత్వంలో ఇలాంటి హింసలు జరుగుతున్నాయంటే అక్కడి సభ్యులు నమ్మలేదు. అంతట సేమరుగారు తాను తెచ్చిన హింసాసాధనాలు వారికి చూపించారు. అంతట బోర్డు ఆఫ్ కంట్రోలు అధ్యక్షుడు దీనినిగురించి విచారణ జరిపిస్తానని అన్నాడు. ఆప్రకారం చెన్నపట్నంలో ఒక విచారణసంఘాన్ని నియమించగా వారు సాక్ష్యాలు విచారించి హింసలు జరుగుతూవున్న మాట నిజమేనని 1855లో ఒక నివేదికను

ప్రకటించారు. అంతట ఇలాంటి హింసలు ఇకముందు జరగకూడదన్ని ప్రభుత్వంవారు శాసించారు. మద్రాసు టార్చరు కమిషను (హింసలవిచారణసంఘము) వారి విచారణలో రివిన్యూశిస్తువసూళ్లలో ఈ కింది హింసలు జరుగుతూవున్నట్లు రుజువు అయింది :

శిస్తుబాకీ యివ్వలేని మనిషిని మండుతూ వున్న ఎండలో నిలబెట్టి వుంచడము; భోజనానికి గాని, దేహబాధ తీర్చుకోవడానికి గాని వెళ్లనివ్వకపోవడము; ఒకచోట ఖైదు చేసి వుంచడము; అతని పశువులను పట్టుకొని ఒక ఇంట్లో పెట్టి మేతకు పోనివ్వకపోవడము; ఒక బంట్రోతును తైనాతీవుంచి అతనికి బాకీ దారుడుచేతనే రోజుభత్యాలు యిప్పిస్తూ వుండడము; చేతివ్రేళ్లను చిరతలలో నొక్కడము, అనగా రెండు కర్రలను కలిపి ఒకపక్క తాడుకట్టి, ఆకర్రలమధ్య వ్రేళ్లను పెట్టి కర్రలకొనలనునొక్కడము; మనిషిమెడను వంచి కాలి వేళ్లకు అంటదీసి తాడుతోగాని పైబట్టతోగాని విరిచి కట్టడము; రెండుచేతుల వ్రేళ్లను ఒకదానిలో ఒకటి నొప్పించి ఇసరకపోసి చేతులతో నొక్కడము, తొడపాసెము పెట్టడము, లెంపకాయలు వెయ్యడము, గుద్దడము, లేక కొరడాతో కొట్టడము, ముందుకు వెనుకకు పరుగెత్తించడము; చెవులు ఎక్కతియ్యడము; మోకాళ్ల సందున ఇటికలను పెట్టి గొంతుకూర్చోబెట్టడము; మాలవాడినో మాదిగవాడినో పాకీవాడినో వీపుమీద ఎక్కించి కూచోబెట్టడము; ఇద్దరు బాకీదారులు తలలను డీడిక్కి కొట్టించడము, లేదా వాళ్ల ఇద్దరిజుట్లు కలిపి వెనుకకు కట్టడము; బొండను వెయ్యడము, జుట్టును దున్నపోతు తోకకో గాడిదతోకకో కట్టడము; ఎముకలనో ఇతర అసహ్యకరమైన పదార్థాలనో మెడలో వెయ్యడము; ఒక్కొకప్పుడు ఇతర విధాలైన చిత్రహింసలు పెట్టడముకూడా జరుగుతూ వుండేది.

నేరాలు ఆచూకీ తియ్యడానికీ ఒప్పించడానికీ పోలీసువాళ్లుపెట్టేబాధలు ఇంకా చిత్రంగానూ కఠినంగానూ క్రూరంగాను వుండేవి. ఉదాహరణానికి : రక్తము ప్రవహించకుండా బాధపెట్టేట్టు జబ్బకుగాని కాలికిగాని చేంతాడును పాముపెనవేసుకున్నట్లు గట్టిగా చుట్టడము, మీసాలు పట్టుకొని లేవదీయడము, చేతులు వెనక్కి విరిచికట్టికోదండం తీయించడము; ఇనపఖడ్డీలు ఎర్రగా కాల్చి వాతలు పెట్టడం; కుమ్మరపురుగును గాని గులగుల పెట్టి దొలిచే ఇంకోపురుగును గాని బొడ్డులోగాని మర్మావయముల దగ్గరగాని పెట్టికట్టడము; ఉక్కిరిబిక్కిరి అయ్యేవరకూ నూతిలోగాని చెరువులోగాని ముంచియెత్తడము; వృషణములనునొక్కడము; కర్రలతో కొట్టడము; నిద్రపోనియ్యకపోవడము; సవాణాలతో మాసంలోకి పొడిచి కెలకడము; కంట్లోమిరియపు పొడికాని కారంగాని కొట్టడము, ఇలాంటి చిత్రహింసలు పెడుతూ వుంటే ఒక్కొకప్పుడు ఆ దురదృష్టవంతుడు చచ్చిపోవడంకూడా



తటస్థించేదనే సంగతి కూడా రుజువు అయింది. ఆరువందల యేళ్ల కిందట శ్రీనాథుడు వర్ణించిన ఒడ్డెరాజుల పరిపాలనలో జరిగే చిత్రహింసలకీ ఒక శతాబ్దంలో పుగానే ఇంగ్లీషు పరిపాలనలోనే జరిగిన చిత్రహింసలకీ తారతమ్యం చూశారా?

**– ఆంధ్రపత్రిక, *18.7.1943***



---

Forty years of progress of the administration of the presidency of Madras - Srinivasa Raghava Iyangar.

# సాత్వికనిరోధం సమర్థించిన గవర్నరు

**1857**లో జరిగిన సిపాయీల తిరుగుబాటు అనే స్వాతంత్ర్యవిప్లవాన్ని అణచినతరవాత 1859లో ఇంగ్లీషు ప్రభుత్వంవారు ఈదేశప్రజలపైన ఆదాయపుపన్ను (ఇన్‌కంటాక్సు) పొగాకుపన్ను, అమ్మకములపన్ను, అనే కొత్తపన్నులు విధించడానికి నిశ్చయించారు. ఆ సమయంలో చెన్నపట్నంలో గవర్నరుగా వుండిన సర్ చార్లెస్ ట్రెవెలియన్‌గారు ఇది అన్యాయ మనిన్నీ, ఆవిప్లవంవల్ల ఖర్చు ఎక్కువ అయిసొమ్ము అవసరమైనంతమాత్రంచేత దానితో సంబంధంలేని ప్రజలను బాధించడం న్యాయం కాదనిన్నీ, ప్రజలకు బాధలు దుర్భరం అయితే వాళ్లుతిరుగుబాటు చేయడమో సాత్విక విరోధం చేయడమో జరుగుతూనే వుంటుందనిన్నీ తన మినిట్సులో వ్రాశారు. యిక గవర్నరు ఇలాగ వ్రాయడం పైవారికి విపరీతంగా తోచి సీమలోని బ్రిటిషుప్రభుత్వం వారికి వ్రాసి ఆయనను పనిలోనుంచి తొలగించారు. అప్పుడుఆయన ఈ సంగతులన్నింటిని గురించీ ఒక స్టేటుమెంటును తయారుచేసి తాను పంపిన మినిట్సుతో కలిపి 1860లో ప్రకటించాడు. అందులో సంగతులివి :

"ఈ భారతదేశ ప్రజలకున్నూ వీరిని పరిపాలించే ప్రభువులకున్నూ మధ్య మొదటి నుంచీ దాటశక్యంగాని అగాధమైన అంతరం వుంటూవున్నది. ఈ యాంగ్లేయ ప్రభుత్వం రావడానికి పూర్వం ఈ ప్రజల నేలిన మొగలాయీ ప్రభువులున్నూ దేశీయరాజులున్నూ కూడా నిరంకుశులుగానే వుండేవారు. వీరు ప్రజలకు బాధ్యత వహించి పరిపాలించే వారు కానందువల్ల ప్రజల విశ్వాసమునకు పాత్రులుగాలేరు. ప్రభుత్వోద్దేశములను ప్రజలు గ్రహించలేకపోయేవారు. ప్రజల కోరికలను మన్నించేటట్లు చేయడానికిగాని ప్రజల అభిమతానుసారంగా పరిపాలన జరిగేటట్లు చేయడానికిగానిప్రజల కెలాంటి అధికారంగాని పలుకుబడిగాని లేకపోవడంవల్ల ప్రభుత్వంవారి చర్యలు ప్రజల కిష్టం లేనప్పుడు ప్రజలు ఆయుధాలు పూని తిరుగుబాటు చేయడమో లేకపోతే అందరూ యేకమై కట్టుకట్టి సాత్వికవిరోధం చెయ్యడమో తప్ప ప్రభుత్వంవారి నిర్ణయాలను మార్చడానికి వేరేమార్గం లేకుండా వుండేది.



ఈ సాత్విక నిరోధవిధానంఈదేశ ప్రజలలో అనాదిసిద్ధంగా వుంది. ఆంగ్లయుగంలో కూడా ఇందుకు వుదాహరణలు వున్నాయి. 1813లో కాశీనగరంలో ఇళ్లపైన పన్నులు విధించినప్పుడు వేలకొలది గృహస్థులు భోజనాలు మాని, గంగానదీతీరానికి పోయి ధరణా కూర్చుని ప్రాయోపవేశం చేయడానికి నిశ్చయించారు. ఇలాగే బెరిల్లీలోని ప్రజలు కూడా 1815లో స్వాతికనిరోధం చేశారు. ఈ చరిత్ర విల్సన్‌గారి హిందూదేశ చరిత్రలో 7వ సంపుటమున 466-469 పుటలలోను, 8వ సంపుటంలో 120-128 పుటలలోనూ వర్ణించబడింది. కాశీలో జరిగిన సత్యాగ్రహాన్ని గురించి బిషప్ హెబరుగారు తమ జర్నల్ మొదటి సంపుటం (428-436)పుటలలో వ్రాశారు) ఇలాగే సౌతుకనరా జిల్లాలోప్రజల కిష్టంలేని పన్ను విధించగా అక్కడి ప్రజలుకూడా సాత్వికనిరోధం చేశారు."

– *ఆంధ్రపత్రిక, 19.9.1943*



# సిపాయిల విప్లవానంతరము వచ్చిన మార్పు

**1857**లో భారతదేశమున సిపాయిల పితూరీయను స్వాతంత్ర్యవిప్లవము జరిగినది మొదలు 1885లో భారతజాతీయ కాంగ్రెసు మహాసభ స్థాపించబడు వరకునుగల మధ్యకాలము బ్రిటీషు భారతీయసంబంధములందు చాలా చిక్కులతో నిండినకాలమని చెప్పవచ్చును. ఇంగ్లీషు విద్యనభ్యసించిన భారతీయయువకులకును, భారతదేశమును పరిపాలించుటకొరకీ దేశమునకు వచ్చి నెలకొన్న బ్రిటీషువారికిని మధ్య అగాధమైన ఒక భేదభావ ముద్భవించి వర్థిల్లినది. సిపాయిల పితూరీ, తరువాత భారతదేశములో ఇంగ్లీషు ఉద్యోగివర్గమును ఎక్కవ చేసి వారికి ఎక్కువ సౌకర్యములు కలిగించవలెననెడి భావము కలిగినది. ముఖ్యమైన ఏ యుద్యోగములున్ను దేశీయుల కివ్వరాదని తోచినది. చాలామంది ఇంగ్లీషువారు భారతీయులందరు రాజద్రోహులే అను భావముతో ప్రవర్తించిరి.

## ఆంగ్లేయులు - దేశీయులు

పూర్వము ఇంగ్లీషు ఉద్యోగుల భార్యలిక్కడికి వచ్చేవారుకారు. అందువల్ల వారీదేశీయులతో కలిసిమెలసియుండెడివారు. ఇటీవల తెల్లవారి స్త్రీ జనమువచ్చుటతో వారొక ప్రత్యేక కులముగా నేర్పడి దేశీయులతో సంసర్గము లేకుండా తాము అధికులమను అహంకారముతో జీవింపసాగిరి.

ఇంగ్లీషు విద్యావిధానమువల్ల ఇంగ్లీషు సాహిత్యమును ఇంగ్లీషు దేశచరిత్రను భారతీయులు చదివి దానిలోని స్వాతంత్ర్య భావములను గ్రహించి పూర్వాచారములను బ్రాహ్మణాధిక్యమను ధిక్కరించుటయే గాక, తాముకూడా పాశ్చాత్యులతో సమానులమేనను భావముతో ప్రవర్తింపసాగిరి. ఇది ఈ దేశమున నున్న ఇంగ్లీషు వారికి భరింప నశక్యమైనది. అందువల్ల వారు వీరిని అసహ్యించుకొనసాగిరి. మొదట ఈదేశమునకు వచ్చినప్పుడే ప్రజలతో సానుభూతిగల ప్రాశ్చాత్యోద్యోగులు క్రమక్రమముగా తమ తోడి యుద్యోగులను చూచి భారతీయులను నీచముగా చూడసాగిరని సర్ హెన్రీ కాటన్ గారు వ్రాసినారు.

భారతదేశమును పరిపాలించుటకు నియోగింపబడిన ఇండియన్ సివిల్ సర్వీసు



ఉద్యోగులు విద్యావంతులుగానుండి పెద్ద జీతములుకలిగి ఋజువర్తనముకలిగి న్యాయపరులుగా నున్నప్పటికిని వారికి దేశీయులపట్ల సానుభూతి లేకపోయినందువల్ల ఈ ప్రభుత్వవర్గమొక జడయంత్రముగా పరిణమించినది. దేశీయుల కష్టసుఖములను గురించి పై యధికారులకు చెప్పుకొను అవకాములులేవు. ఆలన పాలనలు లేవు. అందువల్ల పరిపాలనా విధానములో అభివృద్ధిలేదు. ఈదేశప్రభుత్వము ఇంగ్లాండునందువలె ప్రజలకు క్షేమలాభములు కలిగించు కార్యములు చేయలేదు. సరికదా ప్రజాక్షేమమునకు నష్టకరమయిన పనులనే చేయసాగినారు. ఆంగ్లేయులు అవలంబించిన స్వేచ్ఛా వ్యాపార పద్ధతివలన ఇంగ్లీషు వారి వ్యాపారము వృద్ధిచెందినది. వారి సరకుల నిక్కడ చలామణి చేసికొనుట కనేక విధానముల నవలంబించినారు. గ్రామ పరిశ్రమలను అణగగొట్టినారు. గ్రామజీవనమే చంపివేసినారు. ఈ కాలములో వారు భారతదేశమున నిర్మించిన రైళ్ళు కేవలము వారి వ్యాపారాభివృద్ధికే తోడ్పడినవి. ఇక్కడనీదేశములోనున్న ఇంగ్లీషు స్త్రీ పురుషులు భారతీయులను నీచముగా చూడసాగిరి. తమ నౌకరులను దూషించుట శిక్షించుట మితిమీరినది. ప్రజలను నీచముగా చూచుట ఎక్కువైనది. నీలిమందుతోటల యజమానులైన తెల్లవారు నల్లకూలీలను రైతులను నానాబాధలు పెట్టసాగినారు. రైలు ప్రయాణములలో ఇతరచోట్లను గొప్పగొప్ప దేశీయులకుకూడా అవమానములు జరుగసాగినవి.

ఇంగ్లీషు ఉద్యోగుల అధికారములకు హద్దుపద్దు లేకపోవుటయేగాక, తెల్లవారందరకును ఈదేశములో పలుకుబడి గౌరవము అధికారము అధికములైనవి. ఎవరైనా తెల్లవారి అధికారమును ధిక్కరించుటకు సాహసించినచో వారికి శాస్తి జరిగెడిది. నీలిమందుల తోటల యజమానులకు వ్యతిరేకముగా రైతుల పక్షమున పనిచేసిన హరిశ్చంద్ర ముఖర్జీగారిపైన వ్యాజ్యమువేసి ఇళ్ళువాకిళ్లమ్మించినారు.

ప్రతి తెల్లవాని చేతులలోను ఆయుధములున్నవి. భారతీయులను 1857 మొదలు క్రమక్రమముగా నిరాయుధులుగా చేసినారు. సైన్యములో భారతీయులకు బాధ్యతగల అధికారములు లేకుండా చేసినారు. భారతీయులు ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షలలో చేరకుండ అనేక బందోబస్తులు జరిగినవి. పాశ్చాత్యులకిది అతి సలభమయినది. లేక లేక ఒకరిద్దరు భారతీయులీ పరీక్షకు పోవగా వారిని మెల్లగా ఆవలకు బంపివేసిరి. భారతీయులీ సంగతులెల్ల చూచికుమిలిపోయిరి. సర్వాధికారులైన ఇంగ్లీషువారిని చూచినచో వీరికి భయమేగాని భక్తిలేదు. ఇంగ్లీషు వారదృష్టవంతులు. భారతీయులు దురదృష్టవంతులు" అను భావము వ్యాపించినది.

ఈ అన్యాయములను గూర్చి భారతీయులు మొఱపెట్టు కొనులోపలనే ఇంగ్లాండు లోని రాజ్యనీతిజ్ఞులు కొందరీ పరిస్థితులను గమనించి కొంతమేలుచేయుటకు పూనుకొనిరి. ఇంగ్లాండు దేశమునకు తరువాత ప్రధానామాత్యుడైన గ్లాడ్‌స్టన్ ఉదారబుద్ధికలవాడు. ధర్మశీలుడు ఆయన తోడిరాజ్యనీతిజ్ఞులైన జాన్ బ్రైట్ ఫాసెట్ బ్రాడ్లా మొదలైన వారుకూడా ఉదారహృదయులు. భారతదేశపరిస్థితులను గూర్చి వారు బాగుగా చదివి, భారతీయుల క్షేమములను గుఱించివారు ఆలోచింపసాగిరి. ఆకాలములోనింగ్లాండులో నుండిన దాదాభాయి నౌరోజీగారు భారత దేశముయొక్క స్థితిగతుల విషయమై ప్రచారము చేయసాగిరి. పందొమ్మిదవ శతాబ్దిచివర భాగమున దాదాబాయినౌరోజీ రమేశచంద్రదత్తు, విలియండిగ్బే మొదలైనవారు భారతదేశ దారిద్ర్యమును గూర్చియు, రాజకీయ దాస్యమును గూర్చియు ఉద్గ్రంథములను వ్రాసిరి. గ్లాడ్‌స్టన్ గారు మిడ్లోతియన్‌లో చేసిన సుప్రసిద్ధములైన యుపన్యాసములలో నొకదాని యందు భారతీయులకు క్షేమలాభములను గలిగించుటయే అక్కడ మనముండుటకు ప్రధాన కారణమై యుండవలెను. మనమక్కడ నుండుట తమకు లాభకరమని భారతీయులు గ్రహించి వారు కూడ అట్లు అనుకొనునట్లు గనె మనము ప్రవర్తింపవలెను అనిరి. ఈ యుద్దేశముతోనే ప్రధానమంత్రియైన గ్లాడ్‌స్టన్ గారు 1880లో భారతదేశమున రిప్పన్ ప్రభువును రాజప్రతినిధిగా జేసెను. రిప్పన్ గారి పరిపాలనలో భారతీయులకు కొంతమేలు కలిగింపదలపగా ఇక్కడ పాదుకొనియున్న ఇంగ్లీషు ఉద్యోగివర్గము వారాయనకు అనేక ఆటంకములను కలిగింపసాగిరి. న్యాయవిచారణ పద్ధతిలో దొరలకు దేశీయులకు తారతమ్యములుండుట బాగులేదని ఆ తారతమ్యములను తీసివేయుటకు "ఇల్‌బర్డు" చట్టమను శాసనమొక దానిని చేయబూనగా తెల్లదొరలందఱును ఏకమై బ్రహ్మాండమైన ఆందోళనమును జేసి అదిశాసనము కాకుండ చేసిరి. ఒకదేశమింకొక దేశమును తన స్వప్రయోజనము కొఱకు పరిపాలించునప్పుడు పాలక దేశ ప్రభుత్వము వారు పరిపాలిత ప్రజలకే యుపకారము చేయదలచినను అది పాలక జాతి వారికే మాత్రము అనిష్టముగ నున్నప్పటికిని గూడా వారు కొనసాగనివ్వరను సంగతి స్పష్టపడినది. భారత దేశములో వివిధ యుద్యోగములు వ్యాపారములు చేసి కొని జీవించు తెల్లవారు, ఈ రీతిలో అత్యంత బలవంతులై యుండి దేశపరిపాలనము తమ లాభము కొరకు జరుగునట్లు చేయగలుగుచున్నారనియూ బలహీనులైన భారతీయులకు న్యాయము జరుగునవకాశములే లేవనియు జాన్‌స్టువార్టుమిల్‌గారు వ్రాసిరి.

1857 సంవత్సరపు మహావిప్లవము జరిగిన తరువాత భారతదేశ వ్యవహారముల లోనే యేవో లోపములున్నవను సంగతి పార్లిమెంటువారికి తెలిసివచ్చినది. అంతట



వారు ఇంగ్లీషు వర్తకకంపెనీవారి ప్రభుత్వమును రద్దుచేసి ఇంగ్లీషు రాణియైన విక్టోరియా రాజ్ఞి ప్రభుత్వమును స్థాపించిరి. అప్పటి నుండి భారతదేశ ప్రభుత్వమంతయు ఇంగ్లాండు రాణీగారి మంత్రులలో నొకడైన ఇండియా రాజ్యాంగకార్యదర్శి అదుపు ఆజ్ఞలకు లోబడి ఇక్కడి గవర్నరు జనరలుగ నుండు రాజప్రతినిధి (వైస్రాయి)యె జరుపుపద్ధతి అమలులోనికి వచ్చెను.

ప్రభుత్వ స్వరూపము మారినను ప్రభుత్వ పద్ధతులు మాత్రము మారలేదు. ప్రభుత్వ స్వరూపముతో పాటు భారతీయులకుగల బాధలు గూడ క్రొత్త రూపముదాల్చెను. భారతదేశ ప్రభుత్వమున ఉన్నతోద్యోగములు చేయుదొరలును భారతదేశమున వ్యాపారము చేయు దొరలును, నీలిమందు తోటల యజమానులు, తేయాకుతోటల వారును అమిత లాభములను సంపాదించుచు భారతీయ కూలి జనమును చాలాకష్టపెట్టి చాల నిరంకుశులై ప్రవర్తించుచుండిరి. 1857వ సంవత్సరపు విప్లవమును అణచుటకు ఇంగ్లీషు ప్రభుత్వమువారు అతి దారుణమైన చర్యలు తీసికొనిరి. సివిలు మిలటరీ యుద్యోగులెన్నో అత్యాచారములు చేసిరి. ఇంగ్లీషు పరిపాలనకు వ్యతిరేకులని తమకనుమానమున్నవారిని పట్టుకొని వధించిరి. అనేకులను చెరలో పెట్టి నిర్బంధించిరి. భారతీయులందఱును విద్రోహులేయను అనుమానముతో చూచినవారిని అనేకవిధములుగా అవమానించి హింసింపసాగిరి. స్వాతంత్ర్యనిరోధకశాసనములనేకములు చేసి ప్రజలకూపిరి తిరుగకుండ చేసిరి. ప్రభుత్వ విధానమును మరింత కట్టుదిట్టముచేసిరి. దేశములో ప్రజాభిప్రాయ ప్రకటనము లేకుండచేసిరి. పదేండ్ల పాటు దేశము ఈస్థితిలో జీవచ్ఛవములై పడియుండెను.

1857 సంవత్సర విప్లవము సంపూర్ణముగ అణచివేయబడిన పిమ్మట దేశము నిర్వీర్యమై పడియున్న స్థితిలో దేశములో మరల కొంత చైతన్యమును కలిగించి కొంత కదలిక పుట్టించుటకు కృషిచేసిన మహాపురుషుడు సర్ సయ్యద్ అహమద్ ఖానుగారు. ఆయన 1857వ సంవత్సరము విప్లవము నాటికి కంపెనీవారి కొలువు నందు ఢిల్లీ దగ్గర నొక యూరిలో నొక సబ్‌జడ్జిగనుండెను. విప్లవ సమయములోనితడు చాలామంది ఇంగ్లీషు స్త్రీ, పురుషుల ప్రాణములను కాపాడినాడు.

భారతదేశములోని ఇంగ్లీషు ప్రభుత్వము నందు చాలలోపములున్నప్పటికిని మొత్తము మీద నది దేశప్రజలకు క్షేమలాభములను కలిగింపగలట్టిదని ఆయన దృఢవిశ్వాసము. 1857వ సంవత్సరపు విప్లవమునకు ప్రజలలోగల అసంతృప్తి యొక ముఖ్యమైన కారణమనియు కొంచెము నిప్పురవ్వ తగిలించినంతటనే భగ్గుమని మండగల పరిస్థితులనేకములు దేశమునందప్పుడుండెననియు విప్లవకారులా పరిస్థితులలో

నిప్పునంటించిరనియు ఆయనకు రూఢియయ్యెను. ప్రజల సంగతి ప్రభుత్వము వారికిని ప్రభుత్వము సంగతి ప్రజలకును తెలియుటకు తగిన అవకాశములీయాంగ్లేయకంపెనీ ప్రభుత్వమున లేకపోయినందు వలననే ప్రజలలో చాలా అపోహలు కలుగుటకు హేతువయ్యెనని ప్రభుత్వము వారి శాసననిర్మాణకార్యాలోచన సంఘములో పాల్గొనుటకు ప్రజాప్రతినిధుల కవకాశముండి యున్నచో ఇంతకీడు మూడెడిదికాదనియు ఆయనకు అవగతమయ్యెను. అంతట ఆయన యీ విషయమును గూర్చి తన శక్తివంచనలేకుండ ప్రచారముచేయుటకు పాటుపడసాగెను.

భారతదేశమున 1857లో విప్లవము జరుగుటకు గలకారణముల నతడు తన గ్రంథమునందిట్లు వివరించెను.

1. ప్రభుత్వోద్దేశములను ప్రజలు గ్రహింపలేక దానిని గూర్చి దురభిప్రాయపడుట.
2. హిందూదేశ ప్రజల ఆచారవ్యవహారములకు కేవలము క్రొత్తవైనట్టియు వ్యతిరేకములైనట్టియు కొన్ని శాసనములను నిబంధనములను కంపెనీ ప్రభుత్వము వారు చేయుట.
3. ప్రజలస్థితిగతులను గూర్చియు వారి జీవితవిధానమును గూర్చియు వారికి గల బాధలను గూర్చియు ప్రభుత్వమువారు సరిగా తెలిసికొనలేకపోవుటవలన ప్రభుత్వము మధ్యను ప్రజల మధ్యను సామరస్యము లేకపోవుట.
4. హిందూ దేశ సత్పరిపాలన కావశ్యకములైన విషయములను గూర్చి ప్రభుత్వము అవంతయైన శ్రద్ధవహింపలేకపోవుటయు విప్లవము కలుగుటకు కారణములైన వనియు ఆయన స్పష్టపరచెను. ఈ విషయములను గూర్చి ప్రభుత్వమువారి యుద్దేశ్యములెట్లున్నను వారి చర్యలను మాత్రము ప్రజలు సరిగా అర్థము చేసికొనలేకపోయినందువల్లనే అనేక అపోహలుకలిగినవి. అవి విప్లవమునకు కారణములైనవి. భారతదేశ శాసననిర్మాణ సభయందొక భారతీయుడైన ఉన్నచో ప్రభుత్వము వారీలాటిపొరపాటులు చేయకుందురుఅని సయ్యద్ అహమద్ ఖాన్‌గారు తమ గ్రంథమునందు 1858లో వ్రాసిరి.

పై విషయములను గూర్చి ఆయన దేశమునందుపన్యాసమిచ్చుచు ప్రచారము గావింపసాగిరి. భారతదేశములో నున్న ఇంగ్లీషు జాతివారందరును ఒక ప్రజాసంఘముగ నేర్పడి తమహక్కులను గూర్చియు తమ ఆశయములను గూర్చియు అప్పుడప్పుడు ఇంగ్లాండులోని పార్లిమెంటువారికి తెలుపుచు ఆందోళనము జేసినందువలన వారికనేక ప్రత్యేక సౌకర్యములు కలుగుచుండుట ఆయన చూచి వారివలెనే భారతీయులుకూడ



ఒక ప్రజాసంఘముగా నేర్పడి తమ స్థితి గతులను పార్లిమెంటువారికి చెప్పుటకింగ్లాండులో నొక ప్రతినిధిని ఏర్పరచికొని ఆందోళనము జేసినచో భారతీయులకు చాల లాభముకలుగునని అహమద్ ఖాన్‌గారికి తోచెను. అంతట భారతీయుల బాధలను గూర్చియు వారికి కావలసిని సౌకర్యములను గూర్చియు ఇంగ్లాండులో ప్రచారము చేయటకును పార్లిమెంటువారికి నివేదించుటకును భారతీయులొక సంఘముగా నేర్పడి రాజకీయాందోళనము చేయవలెనన అహమద్ ఖాన్ గారు దేశములో తిరిగి ప్రచారంచేశారు. 1866 సంవత్సరము మే 18 తేదీన సయ్యేద్ అలిఖాన్ గారు అలిఘర్‌లోనుపన్యసించుచూ భారత దేశ ప్రజలలో వివిధ తరగతులవారి ఇబ్బందులను గూర్చియు వారి ఆశయములను గూర్చియూ వారి భారతదేశ వ్యవహారములను గూర్చియు పార్లిమెంటు వారికి చెప్పుకున్నచో చాల మేలు కలుగుననియు ఇందులకు ఇంగ్లీషు వారి ప్రజాసంఘము చేయుచున్న కృషియు దానివల్ల వారికికలుగుచున్న లాభములను తార్కాణమనియు హెచ్చరించిరి.

దేశీయ ప్రజాసంఘములను స్థాపించి రాజకీయాందోళన చేయుట లాభకరమని 1866లో ప్రచారముచేసిన ఈ సయ్యిద్ అహమద్ ఖానుగారె తరువాత కొంతకాలమునకు ఆయుద్దేశ్యముతో స్థాపింపబడిన భారతజాతీయ కాంగ్రెస్సు మహా సభలో హిందువులతో పాటు మహమ్మదీయులు చేరుట మంచిదికాదని వింత ప్రచారమును చేయసాగిరి. దీనికి కారణములేక పోలేదు. భారతదేశము నేలుచుండిన మహమ్మదీయులనుండి ఇంగ్లీషువారీ దేశమును చేజిక్కించుకున్నందువలన మహమ్మదీయులకీ దేశమునుండిన రాజ్యాధికారములు నశించెను. మహమ్మదీయ నవాబుల రాజ్యములంతరించెను. అయితే కంపెనీవారు చాల కాలమువరకు దేశ పరిపాలనను మహమ్మదీయోద్యోగుల ద్వారామననే జరిగించు చుండిరి. అందువలన మహమ్మదీయులకు పలుకుబడియు గౌరవమునుండెను. ఇట్టి స్థితిలో 1833లో పారశీ భాషకు బదులుగ ఇంగ్లీషు రాజభాషగ చేయటంతో మహమ్మదీయుల స్థితి తారుమారైనది. వారికి గల ఉద్యోగవకాశములు పోయి హిందువులతో పాటు వారును పారతంత్ర్యమున బడిరి. అంతేకాదు మహమ్మదీయులు హిందువులతో పాటు విజాతీయ భాషయైన ఇంగ్లీషును నేర్చుకొనలేక వెనుబడిరి వారి యుద్యోగములు పోయినవి. చాలమంది జాగీరులమ్ముకుని దరిద్రులు కాసాగిరి. 1857 సంవత్సరమునాటికి మహమ్మదీయ జనసంఘము ఆర్థికముగను రాజకీయముగను అధోగతిలోనుండెను. దీనికి తోడు ఈ మహమ్మదీయులు తమ చేతులలో నుండి జారిపోయిన రాజ్యాధిపత్యమును మఱల చేజిక్కించు కొనవలెనని కుట్రచేసి 1857 సంవత్సరపు మహా విప్లవమును

లేవదీసినారను భావము ఇంగ్లీషు అధికారులలో వ్యాపించెను. అంతట విప్లవము నణచుటలో చేయబడిన అత్యాచారములకు హిందువులు కన్న మహమ్మదీయులు గురియైరి. మహమ్మదీయుల నింగ్లీషనారనుమానముతో చూసి అనేకవిధములుగ భాదింపసాగిరి. ఇటువంటి పరిస్థితులలో మహమ్మదీయులు ముందుగ తమ సాంఘిక ఆర్థిక పరిస్థితులను చక్కజేసుకొననిదె హిందువులతో పాటు కాంగ్రెస్సు ఉద్యమమున చేరి రాజకీయ ఆందోళన జరుపుట సమంజసముకాదని సయ్యద్ అహమద్ ఖానుగారికి తోచెను. అందువలననే వారట్లు ప్రచారముచేయసాగిరి. ఈ యుద్దేశ్యమునకనుగుణముగ మహమ్మదీయులలో నింగ్లీషు విద్యాభివృద్ధి కలిగించి వారి ఆర్థిక స్థితిగతులను చక్కచేయుటకు అలీఘర్ ఉద్యమమును లేవదీసిరి. ఇటీవల భారతదేశమున జరిగిన సిపాయిల విప్లవమునకు పూర్వాపర సందర్భములను బట్టి శాశ్వత ఫైసలా భూస్వామిత్వ పద్ధతియును పేరుతో దేశమునందు నెలకొల్పిన జమీందారుల సమూహమువలన బ్రిటిష్ ప్రబుత్వమునకెంత లాభకరమో బాగుగ విదితమైనది. ఈ కాలమునందు రాజభక్తులెవ్వరో రాజ ద్రోహులెవ్వరో కొంచెము యోచించి చూచినచో శాశ్వత ఫైసలా యతి జరిగిన ప్రదేశములలోని జమీందారులందరును ఇంగ్లీషు ప్రభుత్వము స్థిరముగనుండుటయే తమకు క్షేమకరమని యెంచి రాజభక్తితో ప్రవర్తించినట్లు స్పష్టపడినదనియు అందువలన దేశమంతటను శాశ్వత ఫైసలా చేయవలసినదనియు బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ వారు 1859లో పార్లిమెంటుకొక మహాజరును పంపిరి. తక్కిన విషయములందు మాత్రము ఈ సంఘము వారు ప్రజల క్షేమలాభములను గూర్చి కృషిచేసినట్లు కనబడుచున్నది. శాసన సభలయందు ప్రజలకు ప్రాతినిద్యములేదనియు వారి అభిప్రాయములుగాని కోరికలు గాని మన్నించు అవకాశములేదనియూ న్యాయపరిపాలనా విధానము లోపభూయిష్టముగ నున్న దనియు విద్యచాల ధనవ్యయకారణమై సులభసాధ్యము గాకున్నదనియు ఈ సంఘమువారు పార్లిమెంటువారికి నివెదించిరి. బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్ పేరునకు దేశీయ ప్రజాసంఘమేయైనను దీనిలో ధనవంతులైన భూస్వాములకే ఎక్కువ పలుకుబడి యున్నందున నిది ప్రజల కెక్కుడుగ నుపకరించులేదను భావము వ్యాపించెను. దీని చందాను తగ్గించి సామాన్యులకు కూడ దీనిలో చేరుటకవకాశము కలిగించవలెనని అమృతబజారు పత్రికాస్థాపకుడైన శిశిరకుమార ఘోష్‌గారు 1870లో ప్రయత్నించిరి. గాని లాభము లేకపోయెను. ఈ సంఘమువారు మహాజరులను చేయు విమర్శలును ఇంగ్లండులోని బ్రిటిష్ ప్రభుత్వమువారికేమి కోపము వచ్చునో యని అతిజాగ్రత్తగా భయభక్తులతోను నమ్రతతోను వ్రాయబడుచుండెను. ఇది చాలమందికి రుచింపలేదు.



సామాన్యసంసారులకును మద్య తరగతి జనులకును ఈ బ్రిటిష్ ప్రభుత్వముయొక్క నిరంకుశత్వము గిట్టకుండెను. బ్రిటీషు ఇండియన్ అసోసియేషన్ వారు ప్రజాప్రతినిధిగా పనిచయుట వారికిష్టములేక పోయెను. పాశ్చాత్య విద్యనభ్యసించి వ్యక్తి స్వాతంత్ర్యము జాతీయ స్వాతంత్ర్యము అభిలషించు విద్యావంతులైన భారతీయులలో ఈ బ్రిటిష్ వారికీ భారతదేశములో నుండుటకేమి హక్కు గలదను భావము కలిగెను. భూస్వాములకన్ననో ఈ బ్రిటిష్ ప్రభుత్వమువారు చిరస్థాయిగానుండిననే తాము సుఖముగా తమ జమీందారిలను అనుభవింప వీలుండునను భావము పాదుకొనియుండెను. అందువలన నీ బ్రిటిష్ ఇండియన్ అసోసియేషనుకు బదులుగ నింకోక ప్రజాసంఘము స్థాపించవలసిన ఆవశ్యకతయేర్పడెను. అంతట అమృతబజారు పత్రికను స్థాపించిన శిశిరకుమార ఘోసు గారును ఆయన సోరదుడును తరువాత అమృతబజారు పత్రికకు సంపాదకుడైనట్టియు మోతీలాల ఘోషు గారును ఆయన సోదరుడును ఇండియా లీగ్ అను ప్రజాసభను 1875లో స్థాపించిరి.

ఈ క్రొత్త సంఘము యొక్క కార్యదర్శి శంభచరణ ముఖర్జీగారు. ఈయనకును సంఘ సభ్యులకు త్వరలోనే అభిప్రాయభేదములు కలిగెను. అందువలన నీ ప్రజా సంఘమభివృద్ధి గాంచలేదు. ఇంతలో సురేంద్రనాధ బెనర్జీగారు 1875లో ఇండియన్ అసోసియేషన్ అను మఱియొక ప్రజా సంఘమును స్థాపించిరి. ఆయన ఐ.సి.యస్.లో నుండుట ఇంగ్లీషువారికిష్టములేక ఆయన నందుండి తొలగింపగా ఆయన కలకత్తా కాలేజిలో ఆచార్యుడై బ్రిటిష్ పరిపాలనలో అసంతృప్తిచెందియున్న భారతీయ యువకుల స్నేహకు పాత్రుడైనాడు. ఈ యువకులలో చాలమంది సామాన్యసంసారులైన మధ్యతరగతి వారు. సురేంద్రనాధబెనర్జీ గారికి జరిగిన అన్యాయమునకు చాల మందికి విషాదము కలిగించెను. శిశిరకుమార ఘోషు గారికి వలెనే సురేంద్రనాధ బెనర్జీగారికి నీ ఒక రాజకీయ ప్రజాసంఘము స్థాపించుట అవసరమని తోచినది. అంతట ఆయన ఇండియన్ అసోసియేషన్ అను ప్రజా సంఘమును స్థాపించెను.

బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్‌లోని సభ్యులలో ప్రముఖులుగ నుండిన క్రిస్టోదాస్‌పాల్, మహారాజ నరేంద్ర కృష్ణ మొదలైన వారు ఈ క్రొత్త సంఘమొక్క ప్రథమ సమావేశమునకు వచ్చిరి. బ్రిటిష్ ప్రభుత్వము పట్ల భక్తియు బాధ్యతాయుత పరిపాలన కొరకు కృషిచేయుట ఈ క్రొత్త సంఘముయొక్క ప్రధానోద్దేశ్యములని సురేంద్రనాధ బెనర్జీగారు చెప్పియున్నారు. రాజకీయ విషయములను గూర్చి ప్రజలలో గట్టి అభిప్రాయములు కలిగించుటక, భారతదేశ ప్రజలు రాజకీయాశయముల నేకోన్ముఖమునకు

తెచ్చుట హిందూ ముసల్మానుల మధ్య స్నేహభావము కలిగించుట ఈ సంఘముయొక్క ఆశయములుగ నుండెనని సురేంద్రనాధ బెనర్జీగారు తమ స్వీయ చరిత్రనందు వ్రాసిరి.

భారతదేశమునందు జాతీయ భావములను కలిగించుఉత్కృష్టాశయములతో ఈ సంఘము స్థాపించబడినది. ఇటలీ దేశములో జాతీయ భావమును పురికొల్పిన దేశభక్తుడైన మాజనీ జీవిత చరిత్రను ఆయన రచనలనుసురేంద్రనాధ బెనర్జీగారి మనసులో బాగుగ నాటుకొనెను. ఆయన దేశయంతటను తిరిగి ఈ విషయములు ప్రచారము చేయసాగెను.

భారతీయులింగ్లండుకుపోయి ఐ.సి.యస్. పరీక్షలలో ఇంగ్లండు వారితో పోటి చేయుదురను భయముతో పరీక్షకు కూర్చుండవలసిన అభ్యర్ధుల వయస్సు ఇంగ్లండులో రాజ్యాంగ కార్యదర్శి తగ్గించెను. ఇది అన్యాయమని భారతదేశమందటను పర్యటించి రాజకీయ ఆందోళనము సాగించుటకు సురేంద్రనాధబెనర్జీ గారికి వారి స్నేహితులకు అవకాశము దొరికెను. అంతట 1877 సంవత్సరము మార్చి 24 తేదిన ఇండియన్ అసోసియేషన్ వారి ఆధ్వర్యములో కలకత్తా పుర మందిరములో నొక మహాసభచేసిరి. సుప్రసిద్ధ బ్రహ్మసమాజనాయకుడైన కేశవచంద్ర సేనుగారే ఆ సభలో అధ్యక్షుని ఎన్నిక తీర్మానమును ప్రతిపాదించి తమ సానుభూతిని కనబరచిరి. ఆ సంఘమువారి పక్షమున పార్లిమెంటువారికి మహాజరును పంపించుటకు తీర్మానించిరి. ఈ విషయమున తగు కృషి చేయుటకు సురేంద్రనాద బెనర్జీగారినే ప్రతినిధిగ నియమించిరి. అంతటాయన ఉత్తర హిందుస్తానమంతయు పర్యటనముచేసి ఈ విషయములనుగూర్చి మహోపన్యాసములొసగిరి. ఇటీవల జాతీయ కాంగ్రెస్సు మహాసభ నాయకులు పర్యటనచేయునప్పుడు ప్రజలు చూపిన ఉత్సాహమునే అప్పుడుగూడ చూపించిరి. ఈ పర్యటనయొక్క ఫలితముగా వంగరాష్ట్రములోను భారతదేశములోని ఇతర ప్రాంతములలోను ఇండియన్ అసోసియేషను యొక్క ఉపశాఖలు స్థాపింపబడినవి. 1877-78 మధ్య లాహోరు నగరమునన నొక శాఖోపసంఘము స్థాపింపబడినది. ఆయన వెళ్ళిన చోట్లలో ప్రజలు బహిరంగ సభలచేసి మహాజరులను బలపరపసాగిరి. తరువాత ఈ మహాజరును సంఘసభ్యునికొక నికిచ్చి న్యాయముగ నింగ్లండునకు పోయి పార్లిమెంటరీ వారి ఎదుట దాఖలు చేయుటకు పంపించిరి.

ఆ సమయమున ఇంగ్లండులోనున్న దాదాభాయి నౌరోజీగారీ విషయమై కృషిచేసిరి. ఈ మహాజరును తీసుకునివెళ్ళిన లాలుమోహన్ ఘోసు గారు ఇంగ్లండులో నుపన్యాసమునిచ్చి గొప్ప ప్రచారముచేసిరి. ఈ ఆందోళన ఫలితముగ భారతీయులలో తగు శక్తి సామర్థ్యముగల వారికి ఐ.సి.యస్ ఉద్యోగముల నిచ్చుటకు భారతదేశ



ప్రభుత్వమునకే అధికారమివ్వబడెను.

ఈ విషయములో ఇండియా అసోసియేషన్ వారి కృషి ఫలితముగ కలిగిన విజయము వలన రాజకీయ ఆందోళన పద్ధతులవలన లాభము కలదను సంగతి స్పష్టముగ రుజువైయ్యెను. అందువలన రాజప్రతినిదియైన లిట్టన్ ప్రభువు 1878లో దేశభాషా వార్తాపత్రికలను శాసించి పత్రికా స్వాతంత్ర్యమును నిరోధించినప్పుడు నీ ఇండియా సంఘమువారు ఇంగ్లండు ప్రధానామాత్యుడైన గ్లాడస్టన్ గారికొక విన్నప్పమును పంపించిరి. 1880లో రాజప్రతినిధిగ పంపబడిన రిప్పను ప్రభువు ఈ చట్టమును రద్దు చేసెను. రిప్పను గారు 1884 వరకును రాజ్యప్రతినిధిగానుండి మునిసిపాలిటీలలోను జిల్లా బోర్డులలోను భారతీయులకు ప్రవేశమొసగి స్థానిక స్వపరిపాలనా పద్ధతిలో భారతీయులకు తర్ఫీదు పొందుటకవకాశము కలిగించెను.

## ఇండియన్ అసోసియేషన్ మహాజరు

భారతదేశ పరిపాలనా విధానములోని లోపములవలన ఈ దేశప్రజలకు జరుగుచున్న అన్యాయములను గ్రహించి దేశ పరిపాలనా విధానమును సంస్కరించుట కొరకు భారతీయులు చేసిన కృషియే బ్రిటిష్ ఇండియా అసోసియేషన్ స్థాపనమునకును ఇండియన్ అసోసియేషన్ క్రొత్త ప్రజసంఘ స్థాపనకును అటుపిమ్మట జాతీయ కాంగ్రెస్సు మహా సభా స్థాపనమునకు ను దారితీసినదను సంగతి గొప్ప చరిత్రకారులు అంగీకరించియున్నారు.

సుప్రసిద్ధ చరిత్రకారుడైన డబ్ల్యూ డబ్ల్యూ హంటరు 'భారతదేశమున ఇంగ్లండు చేసిన కృషి' (England's work in India) అను శీర్షికతో 1880లోనొక చిన్న పుస్తకము వ్రాసి భారతదేశములో బ్రిటిష్ పరిపాలనవలన కలిగిన లాభములను వివరించెను. 1890లో ఈ పుస్తకము పునర్ముద్రణము చేయబడినప్పుడు కాంగ్రెస్సు మహాసభవారు చేయుచుండిన ఆందోళనమును గూర్చి వివరించుచూ హంటరు గారు కాంగ్రెస్సు తీర్మానములోని అనేక విషయములు పూర్వము భారతదేశ ప్రజాసంఘములు పార్లిమెంటువారికి విన్నవించిన సంగతులేయనియూ పూర్వము కంపెనీ పరిపాలనలో యిరువది సంవత్సరముల కొకమారు పార్లిమెంటువారు కంపెనీ వారికి రాజ్యాధికార పట్టానిచ్చునప్పుడు భారతదేశ స్థితిగతులను జాగ్రత్తగా పరిశీలించి కొన్నికొన్ని రాజ్యాంగ సంస్కరణలు చేయుచు వచ్చినారనియు ఆ సందర్భములో భారతదేశ ప్రజాభిప్రాయమును కొంత గమనించుచుండిరనియు వ్రాసిరి. మరియు 1879లో బ్రిటిష్ ఇండియా

అసోసియేషన్ వారు పార్లిమెంటువారి దగ్గర దాఖలు చేసిన మహాజరు భారతీయులు కోరు రాజకీయ సంస్కరణములను ఏకరువు పెట్టుచున్నది. భారతదేశ శాసన సభలలో భారతీయులింకను ఎక్కుడు స్వాతంత్ర్యమును కోరుచుండిరి. చాల త్వరలోనే అట్టి అధికారము భారతీయులకివ్వవలసి వచ్చునన్న మాట నిశ్చయము. సైనిక వ్యయము తగ్గించవలసినదని ఆ మహాజరు కోరుచున్నది. 15 లక్షల వ్యయము తగ్గించవలసినదని హిందూదేశపు సైనిక విచారణ సంఘమువారు సిఫారసు చేసినట్లు నేను వినుచున్నాను. కొన్ని సమయములందు భారతీయులు క్షేమలాభములనాలోచించియే భారతీయార్థిక వ్యవహారములు నిర్వహింపబడుచున్నమాట నిజము. ముఖ్యమైన ఖర్చు పద్దులనైనను ఈ సంగతినాలోచించి చేయుట న్యాయము. ఇంతేకాదు ఇది ఆర్థికముగ చాల అవసరము. ఇటీవల కాంగ్రెస్సు మహా సభవారు చేయుచున్న విమర్శలను గాక పదేండ్ల క్రిందట దాఖలుచేయబడిన మహాజరునే నేనిప్పుడు ప్రమాణముగ తీసుకునుటకు కారణము. కాంగ్రెస్సు చేయు విమర్శలన్నియు చిరకాలమునుండి ప్రజల మనస్సునందున్నవని చూపుటకే.

పూర్వము కంపెనీ వారికాలములో ఇరువది సంవత్సరములకొకమారు పరిపాలనను పరిశీలించుటకు నియమింపబడిన పార్లమెంటు ఉపసంఘములవంటి విచారణ సంఘములను మఱల నెలకొల్పవలసినదని 1879నాటి మహాజరు కోరుచున్నది. ఇది చాల ప్రయోజన కారియేయని నా యూహ. భారతదేశ చరిత్రను పఠించినందువల్ల నాకీ క్రింది సంగతులు ధృవమైనవి.

కంపెనీ వారి కాలములో జరిగిన రాజ్యాంగ సంస్కరణములన్నియూ పార్లిమెంటు వారు చేసిన విచారణ యొక్క ఫలితములేనని నిస్సందేహముగా నేను చెప్పగలను. 1813లో కంపెనీ వారికి పట్టానిచ్చునప్పుడు జరిగిన పార్లిమెంటు విచారణ ఫలితముగ కంపెనీ వారకీదేశమునగల సర్వముక్తా ప్రత్యేక వ్యాపారాధికారములను రద్దుచేసి కేవలము వ్యాపార లాభముల కొరకు పాటు బడు వర్తక సంఘమువారది మాని భారతీయ ప్రజలను చక్కగా పరిపాలన చేయుటకే తమ సర్వాధికారములు వినియోగించుటన్లు కట్టడి చేయబడినది. 1833 నాటి విచారణ వలన జాతి మత వర్ణ వివక్షత లేకుండా భారతీయులకు ప్రభుత్వోద్యోగములివ్వవలెనను సూత్రము స్తిరపరడినది. 1853 సంవత్సరము నాటి విచారణ వలన భారతదేశ ప్రభుత్వములోని సివిలు సర్వీసు మొదలైన పెద్ద యుద్యోగము లన్నియూ కంపెనీవారు కేవలము తమకిష్టమైనవారికి తమ వాటాదారుల బంధువులకును, స్నేహితులకు, తమకు లంచమిచ్చినవారికిని ప్రసాదించు అన్యాయపు పద్ధతిని రద్దుచేసి



పోటీ పరీక్షలో తేలినవారికే ఐ.సి.యస్ ఉద్యోగ వర్గములో నియమించు పద్ధతి స్థాపింపబడినది. ఇట్లు భారతదేశ ప్రభుత్వము సక్రమముగ నిర్వహింపవలసిన బాధ్యతయొకటి యున్నదన్న సూత్రమొకటి స్థిరపడినది. ఇప్పుడు మఱల నట్టి విచారణనే జరుపవలసినదని భారతీయులు కోరుచున్నారు. ఈ ప్రభుత్వము కంపెనీ వారి చేతులలో నుండి ఇంగ్లీషు పార్లిమెంటు వారి చేతి క్రిందకి వచ్చి ఇప్పటికి ముప్పది రెండు సంవత్సరములైనది. భారతదేశమును పరిపాలించుచున్న అధికార వర్గమువారికిప్పుడు ఎవ్వరికిని భయపడనవసరములేదు. వారు చేయు పరిపాలనా విధానమును గూర్చి అలాంటి విచారణ జరుగునెడల తమ పద్ధతులలో దిద్దుకొనవలసిన సంగతులనేకములు వారికి తెలుయుటకు అవకాశములు కలుగును. తమ అధికారమును శాశ్వతముగ నిలుపుకొనుటకు ప్రయత్నించు స్వార్థపరత్వములేకుండా తమ యుద్యోగ ధర్మమును సమర్థతతో నిర్వహించు అధికార వర్గమీ భారతదేశ పరిపాలక వర్గమొక్కటి యని అనుకొనవచ్చును. తన కుమారునికిగాని మేనల్లునికి గాని మరల తన యుద్యోగము నిప్పించుటకు ఏ.ఐ.సి.యస్ ఉద్యోగికిని ఆవంత అవకాశమైన లేదు. భారతదేశము నింతకన్న చక్కగ పరిపాలించుటకు మార్గము కనపడునెడల దానిని అమలు చేయుటకు ఐ.సి.యస్. ఉద్యోగులెంతమాత్రము వెనుదీయరని నా అభిప్రాయము.

1879 సంవత్సరపు మహాజరు దేశీయ వార్తాపత్రికలపైన ఇటీవలచేయబడిన నిర్బంధనలు తొలగించవలసినదని కోరుచున్నది. భారతదేశ వార్తాపత్రికలు సత్యమైన వార్తలనే ప్రకటించుచున్నవి. ఇంగ్లండు దేశ ప్రధానమంత్రియైన గ్లాడస్టన్‌గారు తన మిడలోతియన్ ఉపన్యాసములలో నొకదానియందీవిధముగ చెప్పియున్నారు.

“భారతదేశీయుల నిజమైన మనోభావములేవి? ఇంగ్లండులో పత్రికా స్వాతంత్ర్యముండుటకు ఏ ఉపపత్తులను చెప్పుచున్నామో భారతదేశీయ వార్తాపత్రికలకు స్వాతంత్ర్యము నొసగు విషయమున గూడ ఆ ఉపపత్తులనే చెప్పవచ్చును. అయితే ఆకారణములేగాక ఇంకా బలవత్తరమైన కారణములను గూడా అక్కడ పరిస్థితులను బట్టి చెప్పవచ్చును. ఈ దేశములో వార్తాపత్రికల ద్వారమునేగాక ఇంకనూ ఇతర మార్గములుగ గూడా ప్రజల మనోభావములను గ్రహించుటకు అవకాశములున్నవి. ఇక్కడి ప్రజలు స్వేచ్ఛగా సభలుచేసి తమ అభిప్రాయములను ప్రకటింప గలుగుచున్నారు. పార్లిమెంటుకు మహాజరులంపితమ కోర్కెలు వెల్లడింప గలుగుచున్నారు. మన ప్రజలలో కొందమందికైనను ప్రజాప్రతినిధులనెన్ను కొను ఓటు హక్కులున్నవి. భారతదేశమందన్ననో ప్రజలకు ఓటు హక్కు లేనందువల్ల వారు చేయు సభలువారు పంపు మహాజరులు

నిష్ప్రయోజనమగుచున్నవి. భారతీయుల మనోభావములను ప్రభుత్వమునకు తెలుపు మార్గము వార్తాపత్రిక ముఖమొక్కటే. అందువలన భారతదేశములో వార్తాపత్రికా ప్రకటన ప్రభుత్వమునకును ప్రజలకును కూడా చాల అవసరము."

ఈ అభిప్రాయముతో గ్లాడస్టన్‌గారు నియమించిన రాజ ప్రతినిధియైన రిప్పను గారు దేశీయ వార్తాపత్రికలపై పూర్వపు రాజ ప్రతినిధియైన లిట్టన్ విధించిన నిర్బంధనములను తొలగించినారు.

భారతీయులు కోరు విషయమింకొకటియున్నది. అది భారతదేశమున ప్రజాప్రతినిధి సంస్థలను నెలకొల్పవలసినదని అటువంటి సంస్థలు అచిరకాలములోనే స్థాపించుటకు వీలు కలుగుటయేగాక అట్టి స్థాపించు ఆవశ్యకతకూడా కలిగి తీరునని నాయూహ అని హంటరు గారు తమ గ్రంధములోవ్రాసిరి.

రిప్పను ప్రభువు కృషివలన భారతదేశములో మునిసిపాలిటీలకు తాలూకా జిల్లాబోర్డులకు ప్రతినిధుల నెన్నుకొను అవకాశము కలిగినది. హంటరుగారీ పుస్తకము వ్రాయునాటికి వంగరాష్ట్రములోను మద్రాసు రాష్ట్రములోను గల మునిసిపాలిటీలలో 1200 మంది దేశీయ ప్రజాప్రతినిధులెన్నుకొనబడి స్థానిక స్వపరిపాలనమున పాల్గొనుట ప్రారంభించిరి. వివిధ రాష్ట్రములలో స్థాపింప బడిన శాసనసభలలోని కేంద్రమున స్థాపింపబడిన శాసన సభలలోను కూడా దేశీయ ప్రముఖులు సభ్యులుగ నియమింపబడిరి.

ఇప్పుడు మనము అంగీకరించవలసినది సాధించవలసినట్టిది అయిన ఆశయమేది అనునదేగాని అది ఎట్లు ఆచరణలోపెట్టవలెనో ఆవివరములుకావు. పదేండ్ల క్రిందట సుప్రసిద్ధ భారతీయ పత్రికా సంపాదకుడు నడుపుచుండిన హిందూ పేట్రియాట్ అను ఇంగ్లీషు జాతీయ వార్తా పత్రిక (దీనిని 1854 మొదలు 1869 వరకు హరిశ్చంద్ర ముఖర్జియు తరువాత సంవత్సరముల వరకు క్రిస్టోదాస్‌పాల్‌గారును ప్రకటించుచుండిరి) ఈ విషయమై మూడు పద్ధతులు సూచించియుండెను. బ్రిటిష్ ఇండియాలో నుండు గొప్ప మునిసిపాలిటీలన్నిటికి ఎన్నిక హక్కు లిచ్చి మూడు రాజధానినగరములలోని మునిసిపలు సంఘములకును మరికొన్ని ముఖ్య నగర ముల నిసిపాలు సంఘములకును శాసనసభకు ప్రతినిధులెన్నుకొను హక్కునిచ్చుట. ఈ శాసన సభలలో ఆర్థిక విషయములు కూడ చర్చించుటకవకాశమిచ్చుట అను మూడు మార్గములు సూచించినది. అయితే భారతదేశములో గ్రామజనుల ప్రతినిధులను కొందరిని నియమించవలసిన అవసరము అట్లే నిలచి యుండును. అని హంటరు గారు తమ గ్రంథ పునర్ముద్రణమున వ్రాసిరి.

భారతదేశములోని వివిధ రాష్ట్రములనుండి ప్రతినిధులుగల ఒక అఖిలభారత మహాజనసభను సమావేశ పరుపవలెనని ఇండియా అసోసియేషన్‌వారు 1883లో జాతీయ సభనొకదానిని సమావేశపరచిరి.దానికి నేషనల్ కాన్ఫరెన్సు అని పేరు పెట్టిరి. ఈ సమావేశము మన జాతీయ మహాసభకు పూర్వరూపమని చెప్పవచ్చును. విక్‌ఫ్రడ్ బ్లంట్ అనునాతడా సమావేశమును చూచి వర్ణించియున్నారు. ఆమహాసభ కలకత్తాలో జరిగినది. చాల పట్టణములనుండి ప్రతినిదులు వచ్చిరి. ఆనంద మోహన్ బోసు గారు తమ ప్రారంభోపన్యాసమున జాతీయ పార్లిమెంటు స్థాపనలోనిది మొదటి సోపానమనిరి. సురేంద్రనాధ బెనర్జీ గారు ఆసభలో ఇండియన్ సివిలు సర్వీసును గూర్చి తీవ్రమైన విమర్శన చేసిరి. సభ మూడుదినములు జరిగినది. చివరి దినమున జాతీయ నిధి విషయమై చర్చించిరి. ఈ సభ జరిగిన పిదప సురేంద్రనాధ బెనర్జీగారు మఱల ఉత్తర హిందుస్థానము నందు పర్యటనముచేసిరి. ఈ లోపుగనే ఇన్‌బర్టు బిల్లును గూర్చి దొరలు ఆందోళన చేయసాగిరి. రాజకీయ విషయములలో నానాప్రాంత ప్రజలు కలిసి పనిచేసినగాని బలము చేకూరదను సంగతి చాలమందికి విశదమైనది. ఇండియన్ అసోసియేషన్ వారు 1885లో జాతీయ మహాసభ నేషనల్ కాన్ఫరెన్సు రెండవ సమావేశమును కలకత్తాలో జరుపుటకు నిశ్చయించిరి. ఈలోపుగనే జాతీయ కాంగ్రెస్సు మహాసభ వారి మొదటి సమావేశము బొంబాయి నగరమున 1885 సంవత్సరము డిసెంబరులో సమావేశమగు పరిస్థితులు తటస్థించెను. ఒకరికి తెలియకుండ నొకరిట్లు అఖిల భారత జాతీయసభలు సాగించుటయు తటస్థించినది.

*– ఆంధ్రపత్రిక, 9.3.1947*



# సేలందొరలు అణచిన 'రాజద్రోహము'

"**తా**ము స్నానముచేయు చెఱువులలోని నీటినే త్రాగు నీ భారతీయులు రాజకీయ స్వాతంత్ర్యమును పొందుటకు అర్హులు కారు" అని ఈ దేశమునకు 1885-1888 మధ్య వైస్రాయిగా నుండిన డఫ్రిన్ ప్రభువు ఒక యుపన్యాసములో పలికినాడు.

1881 నవంబరు 5 మొదలు 1886 డిసెంబరు 8 వఱకును మద్రాసురాజధానికి గవర్నరుగా నుండిన మౌంట్‌స్టువార్టు గ్రాంట్ డఫ్‌గారు తనకు భారతీయులు సమర్పించిన యొక వినతిపత్రమునకు ప్రత్యుత్తరమొసగచు "రాజకీయహక్కులను కోరుటకు ముందుగా ఈ భారతీయులు తమ ఇండ్లవెనుక నుండు పెరల్లను శుభ్రముగా నుంచుట నేర్చికొనవలె"ననివైస్రాయిగారి కంటెను మోటుగా చెప్పినాడు.

ఈ గవర్నరుగారే తమ కార్యాలోచనసభలోని యొకరిద్దరి సలహాతో, సేలములో నొక మశీదు ప్రక్క నుండి యూరేగింపులు పోవు విషయమై హిందువులకును, మహమ్మదీయులకును కలిగిన యొక పనికిమాలిన తగాదాను గోరంతలుకొండంతలుగా చేసి 'అది యొక రాజద్రోహకరమైనతిరుగుబాటు' అని దానికొక పెద్దపేరుపెట్టి, ఒకమూల ఆ తగాదాలనుగురించి విచారణ జరుగుచుండగాను, ఆ సందర్భములో జరిగిన కొట్లాటకు మద్దతుచేసి రను నేరారోపణ చేయబడి కొందరందుకు న్యాయస్థానములో విచారింపబడు చుండగాను, ఏదో కొంపమునిగిపోయినట్లు ఇతరుల కపోహకలిగింపగల యుపన్యాసము లిచ్చి సేలముకేసులను విచారించుటకు ఒక ప్రత్యేక స్పెషల్ మేజస్ట్రేటును, ఒక స్పెషల్ సెషన్సు జడ్జిని నియమించినాడు. దీని ఫలితముగా చాలామంది దురదృష్ట వంతులు అరెస్టు చేయబడి శిక్షింపబడి కారాగారములకు, యావజ్జీవ ద్వీపాంతర వాసమునకు అండమాను ద్వీపమునకును పంపబడిరి.

ఈ ఖైదీలలో నొక్కడును నేరము చేయుచుండగా పట్టుకొనబడినవాడు కాడు. స్పెషల్ మేజస్ట్రేటును, స్పెషల్ పోలీసువారును వేసిన పథకము (ప్లాను)ను బట్టి వారిపైన నేరారోపణముచేయబడి వారు అరెస్టుచేయబడిరి. పోలీసువారి కిష్టమువచ్చినవారిని పట్టుకొనుటకు వీలుగా అరెస్టుచేయవలసినవాని పేరు వివరింపకుండగనే జిల్లా మేజిస్ట్రేటు



సంతకముచేసి యిచ్చిన ఖాళీఅరెస్టువారంటు నమూనాఫారములను (Blank warrants) పుచ్చుకొని అందులో తమ యిచ్చవచ్చినవారి పేళ్లను నమోదుచేసి కొందరిని అరెస్టచేసిరి! సేలముపట్టణము అల్లకల్లోలముగా నుండెను. చాలమంది భయోత్పాతమును, దుః ఖమునను మునిగిరి. ఖాళీ అరెస్టువారంటు పత్రములలో తమ పేళ్లను వ్రాసి తమ్ము అరెస్టుచేసిపోదురేమో అను భయముతో చాలామంది పట్టణములోని తమ గృహములను వదలి పెట్టి వెళ్లిపోయిరి.

చెన్నపట్టణములో అప్పటికి 5 సంవత్సరముల క్రిందటనే స్థాపింపబడిన "హిందూ" పత్రిక ఈ సందర్భములలో న్యాయసిద్ధికొరకు అపారమైన సేవ చేసినది. సేలంలో జరిగిన సంగతుల వివరముల నతిధైర్యముతో ప్రకటింపసాగినది. సెషన్సుకోర్టులో శిక్షింపబడినవారు హైకోర్టుకు అప్పీళ్లుచేయగా హైకోర్టువారుకూడ పొరపాటు అభిప్రాయముతో ఆ శిక్షలను ఖాయముచేసిరి. అంతట సేలములో నుండి నలుగురు పెద్దమనుష్యులు బయలుదేరి చెన్నపట్టణమునకు వచ్చి రెండు సంవత్సరములపాటు ఎంతో కష్టపడి తమ ధనమును, కాలమును వినియోగించి లోగడ జరిగిన అన్యాయముల నెల్ల పెల్లగించి అసత్యపు సాక్షములను కండించి హిందూ మహమ్మదీయుల కొట్లాటకు తరువాత జరుపబడిన అక్రమచర్యలలోని యన్యాయమునంతయు బయటికి తీసిరి.

ఈ నలుగురిలో ముగ్గురు సేలంలోని న్యాయవాదులు. అందులో సుప్రసిద్ధ దేశభక్తులును, కాంగ్రెస్ అధ్యక్షులును, కీర్తిశేషులును అయిన శ్రీమాన్ సేలం విజయరాఘవాచార్యులుగా రొకరు. నాలుగవ యాయన "జరుగబోవు తిరుగుబాటు" విషయమై కలెక్టరు గారికి ముందుగా హెచ్చరింపలేదను నెపముపైన పెద్ద పనిలోనుండి తొలగింపబడిన ఒక భారతీయ ప్రభుత్వోద్యోగి. ఈ నలుగురు పెద్దమనుష్యులును తమతమ స్వంత పనుల నన్నిటిని మానుకొని రెండేండ్లపాటు తమ ధనమును, కాలమును, శక్తినికూడ వినియోగించి ఈ ఘోరమైన అన్యాయమంతయు అప్పటి స్పెషల్ మేజస్ట్రేటు గారైన లూయిస్ మెకైవర్ దొరగారి స్వకపోల కల్పనమని రుజువు చేయగలిగిరి. పై వ్యవహారములో న్యాయము జరిగించవలెనని ఆ నలుగురును ప్రారంభించిన ఆందోళనమునకు హిందూ పత్రికాధిపతి యైన శ్రీ జి.సుబ్రహ్మణ్య అయ్యరుగారును, వ్యవస్థాపకుడును సహాయపడినారు. హిందూపత్రిక చివరవరకు నీయాందోళనమున కెంతో ధైర్యముతో తోడ్పడినందువలననే ఇది సఫలమైనది.

1880 మొదలు 1884 వరకును భారతదేశమునకు వైస్రాయిగా నున్న రిప్పన్ ప్రభువు చాల గొప్పవాడు. అన్యాయములను సహింపడు. న్యాయస్థానముల తీర్పులకును,

స్థానిక ప్రభుత్వమువారి యభిప్రాయమునకును భిన్నమైన నిర్ణయమునకు వచ్చుటకు రిప్పన్ ప్రభువుకూడ మొదట ఇష్టపడలేదుగాని క్రమక్రమముగా బయల్పడిన సంగతులవలన ఈ వ్యవహారములోని యథార్థమంతయు ఆయనకు అవగతము కాగా, ఆయన న్యాయము జరిగించదలచి సేలము ఖైదీల నందరిని వదలి పెట్టవలసిన దని మద్రాసు ప్రభుత్వమువారిని కోరినాడు. కాని ఇట్లు చేయుట తమకు పరువుతక్కువగా నెంచి మద్రాసు ప్రభుత్వమువారీ ఖైదీలను విడుదలచేయలేదు. అంతట రిప్పన్ ప్రభువు ఆ ఖైదీలను వదలవలసినదని మఱియొక మారుకూడ వారిని హెచ్చరించెను. అయినప్పటికిని గూడ వారు విడుదలచేయరైరి. ఇంతలో రిప్పన్ ప్రభువు ఉద్యోగకాలము పూర్తియై సీమకు పోవు తరుణమాసన్నమయ్యెను. అప్పుడాయన ఈ సేలముఖైదీల నందరను వెంటనే వదలిపెట్టనియెడల తా నింగ్లాండుకు పోవగనే ఈ యన్యాయమును గురించి విక్టోరియా మహారాజ్ఞికి స్వయముగా విన్నవించి ఆమె చేతనే విడుదలచేయించెద నని మద్రాసు ప్రభుత్వము వారికి ఖండితముగా వ్రాసినాడు. ఇది యొక బ్రహ్మాస్త్రమువలె పనిచేసినది. చెన్నపట్టణ ప్రభుత్వమువారు గత్యంతరము లేక 1884 వ సం. నవంబరు 26వ తేదీన ఈ సేలం ఖైదీల నందరను వదలిపెట్టిరి.

రిప్పన్ ప్రభు నీవిషయమున స్వయముగానే చర్య దీసికొని ఖైదీలను విడుదల చేయించుట కధికారమున్నప్పటికిని క్రిమినలు న్యాయస్థానముల తీర్పులవిషయమును స్థానిక ప్రభుత్వమే చర్యదీసికొనుట న్యాయమను అభిప్రాయము కలవాడైనందువల్లనే మద్రాసు ప్రభుత్వమువారి నిట్లు పలుమారు కోరినాడు. ఎట్లయిన నేమి,రిప్పన్ గారివలననే ఈ విషయములో న్యాయము జరిగినది.[1]

హిందూపత్రికకు విలేఖరిగా సేలమునకు వెళ్లిన శ్రీ పి. కేశవపిళ్లగారు సేలములో జరిగిన సంగతులను గురించి ఇట్లు వ్రాసిరి :

సేలములో హిందువులును, మహమ్మదీయులును ఒక క్రొత్త మశీదుదగ్గరనుండి ఊరేగింపులు పోవువిషయమై పోరాడుకొనిరి. అప్పుడక్కడ జిల్లా మేజిస్ట్రేటుగా నుండిన డాక్టర్ మెక్లీన్ ఎం.ఏ., ఐ.సి.ఎస్. గారు చేసిన కొన్ని పొరబాటులవలన నీపోరాట మొక కొట్లాటగా పరిణమించి దొమ్మి జరిగినది. అప్పుడు మద్రాసు గవర్నరుగానుండిన మౌంట్ స్టూవార్టుగ్రాంట్ డఫ్‌గారును, ఆయన కార్యాలోచనసభలోని సభ్యుడైన కార్మయికేల్‌గారును, పూర్వము 1857వ సం. సిపాయిల విప్లవానంతరము బ్రిటిషు ప్రభుత్వముపట్ల భారతీయులకు భయభక్తులు కలిగించుటకనేక ఘోరకృత్యములను, అత్యాచారములను చేసిన దొరలవలెనే, ఈ సేలములోని ప్రజలకు ప్రభుత్వముపట్ల భయభక్తులు



కలిగింపదలచిరి.

అంతకుముందు ఇంగ్లీషువారు బర్మాదేశమును పూర్తిగా స్వాధీనపరచుకొనుటలో ఇంగ్లీషు సైన్యములు 'తీబా'ను పట్టుకున్న తరువాత వారి నడ్డగించిన బర్మావారి నందరిని ప్రభుత్వ విరోధులైన దారిదోపిడి గాండ్రుగా ప్రకటించి వారిపైన నట్టి నేరము నారోపించి వారిని పట్టుకుని విచారించి కఠినశిక్షలు విధించుటలో గొప్పపేరుపొందిన మెకైవర్ ఐ.పి.ఎస్. గారిని సేలమునకు స్పెషల్ మేజస్ట్రేటుగా రప్పించిరి. ఈ మెకైవర్‌గారును, ఇతని స్నేమితుడైన సేలముజిల్లా మేజస్ట్రేటుగారును కూడ న్యాయశాస్త్రవిధుల ననుసరించు పిచ్చిపని పెట్టుకొనదలచుకొనలేదని ప్రారంభముననే స్పష్టముగా ప్రకటించివేసిరి. అవసరమైనప్పుడు ఎవరిని పట్టుకొనవలె నన్న వారి పేరు నుదాహరించుటకు వీలుగా పేరు వ్రాయుటకు ఖాళీస్థలము వదలిన "బ్లాంక్" అరెస్టువారంటు "ఫారము"లపైన సంతకములు చేసి జారీచేసిరి. చిత్తూరు నుండియు,ఇ తర చోటులనుండియు రప్పించిన స్పెషల్ పోలీసు అధికారులు ఆ ఖాళీ వారంటు పత్రములలో తమ కిష్టము వచ్చినవారి పేళ్లను వ్రాసి పూర్తిచేసి అమలు పంపసాగిరి. ఇట్లు అసంఖ్యాకులైన పెద్దమనుష్యులను పట్టుకొనుటలో సేలము జిల్లా వైద్యాధికారియు, క్రైస్తవుడు నైన మాణిక్యము పిళ్లగారినికూడ వారు పట్టుకొనిరి. ఆయన చాల స్థూలకాయుడు. ఈ పెద్ద మనుష్యుని పట్టుకొని నేరస్థునిగా విచారించి శిక్షించిన యెడల ఈ దేశీయుల కంటికి నజరుగా కనపడి వారికి బుద్ధివచ్చునని ఈ యధికారులు తలచిరి! అదివరకు మలబారులో జిల్లాజడ్జిగా పనిచేసిన వైగ్రాం (Wigram) గారిని సేలములో స్పెషల్ సెషన్సుజడ్జిగా నియమించిరి. అంతట ఆయన దగ్గర సేలందొమ్మికేసుల విచారణ ప్రారంభమైనది. నేరారోపణము చేయబడిన వారిలో చాలమంది గొప్పవారుండిరి. సేలములో నొకదానివెంబడి నొకటిగా జరిగిన వింత విషయములును. న్యాయపరిపాలనమునందు చూపవలసిన నిష్పక్షపాతబుద్ధి చూపబడక పోవుటయు దేశప్రజలకు భయాశ్చర్యములు కలిగించెను. సేలములోని పరిస్థితులను గూర్చి హిందూపత్రిక విచారించి తనకు తోచిన సంగతులను నిర్భయముగా వ్రాయసాగినది. సేలమునకు స్వయముగా పోయి అక్కడి పరిస్థితులను హిందూ పత్రికకు వ్రాయగలందులకు గుత్తిలో న్యాయవాదిగా నున్న శ్రీపత్తి కేశవపిళ్లగారు విలేఖరిగా వెళ్లిరి.

"గన్‌షాట్" (తుపాకిగుండుదెబ్బ) అను మారుపేరుతో హిందూపత్రికలో ప్రకటింపబడిన లేఖయొకటి ఐ.సి.ఎస్. ప్రభుత్వ-ఉక్కుచట్రమునకు దిగ్భ్రమ కలిగించెను. జిల్లా మేజస్ట్రేటుగారైన మెక్లీన్ ఎం.ఏ., ఐ.సి.ఎస్.గారు సేలములో హిందూమహమ్మదీయ వైరమువలన ఘోరములు జరుగుచుండగా "నీపట్టణముగతి ఏమైననేమి? దాని కర్మ"మని

వదలిపెట్టి బెంగుళూరు వెళ్లి అక్కడ గుఱ్ఱపు పందెముల వినోదములందు పాల్గొనినాడనియు, అంతకన్న అన్యాయమైన విషయమేమనగా తాను బెంగుళూరులో నున్నకాలములో తాను సేలముజిల్లాలోని హోసూరు మకాములోనే ఉన్నట్లుగా ప్రయాణపు బత్తెమును పుచ్చు కొన్నాడనియు ఆలేఖలో వివరింపబడి యుండెను. ఇది అసత్యపు వ్రాతయే యైయుండినచో ఐ.సి.ఎస్. ఉద్యోగికి పరువునష్టకరమైన అట్టి వ్రాతను ప్రకటించి నందులకు హిందూపత్రికపైన 'డిఫమేషన్' నేర మారోపింపబడి కేసు దాఖలు కాబడియుండవలెను. కాని అట్లు జరుగలేదు. గవర్నరుగారును, వారి కార్యాలోచన సభవారును ఈ ఆరోపణము అభూతకల్పనమని యనుటకు సహసింపక ఎట్టి ప్రకటనను జేయక యూరకొనిరి! పాపము, సేలము స్పెషల్ సెషన్సు జడ్జికోర్టులో విచారింపబడిన దురదృష్టవంతులు చాలమందికి కారాగారవాసశిక్షలును, ద్వీపాంతరవాసశిక్షలును విధింపబడెను. కొందరు హైకోర్టులో అప్పీలు చేయగా అక్కడకూడ వారి శిక్షలు ఖాయపరుపబడెను.

కోర్టులలో శిక్షలు పడినవారును, అబద్ధీకులు నయినవారి సాక్ష్యములపైన శిక్షింపబడిన దురదృష్టవంతులైన ఈ సేలము ఖైదీలను విడుదలచేయవలసిన దను ఆందోలన యొకటి బయలుదేరెను. దీని విషయములో నిజమును బయటకు తీయుటకు శ్రీమాన్‌సేలము విజయరాఘవాచార్యులుగారును, మరికొందరును ఎంతో కష్టపడి రెండేండ్లు కృషిచేసిరి. ఈ విషయమున హిందూపత్రికకూడ వీరికి గట్టిగా తోడ్పడినది.

హిందూదేశమునకు వైస్రాయిగా నుండిన రిప్పన్ ప్రభువు 1884లో చెన్నపట్టణమునకు వచ్చెను. అప్పుడు విజయరాఘవాచార్యులుగారు సేలము వ్యవహారములను గురించి యొక మహజరును తయారుచేయగా మద్రాసు హైకోర్టులో సుప్రసిద్ధ న్యాయవాదిగా నుండిన సావలీ రామస్వామి మొదలియారుగా రొక ప్రాతినిధ్యమునకు నాయకుడుగా పోయి గిండీలో నున్న వైస్రాయిగారిని దర్శించి ఆ మహజరును వారికి సమర్పించిరి. ఏ మహజరును పంపినను "బుట్టదాకలు' చేయు ప్రఖ్యాతిని గడించిన చెన్నపట్టణము గవర్నరు గ్రాంట్ డఫ్‌గారి సమక్షముననే వైస్రాయిగా రామహజరును స్వీకరించి దానిని గురించి ఆలోచించెదమని చెప్పిరి. గవర్నరుగారు చిన్నబుచ్చుకొనిరి.

ఈ 'నేటివు' దేశీయులలో నెవరో కొంతమంది యక్రమముగా శిక్షలనుభవించు చున్నచో ఉందురుగాక ఆచర్యలను తిరుగదోడుట తమ గౌరవమునకు భంగకరముకదా యను భావము ఈ గవర్నరు గారికిని, వీరి కార్యాలోచన సభవారికిని పూర్తిగా ఉండెను. అందువలన వీ రావిషయములను పునర్విమర్శచేయుట కెంత మాత్రమును ఇష్టపడలేదు.



కాని రిప్పన్ ప్రభువుమాత్రమీ విషయమున నన్యాయము జరిగినదని తనకు విశదముకాగానే దీనివిషయమై గట్టిగా పట్టుబట్టినాడు. అంతట డాక్టరు మాణిక్యముపిళ్లగారును, తక్కిన ఖైదీలను అండమాను దీవులనుండి విడుదలచేయబడి తమతమ యిండ్లకు తిరిగివచ్చిరి.[2]

## సేలందొమ్మి కేసులు

1882 వసంవత్సరము ఆగస్టు 15-16 తేదీలలో సేలములో జరిగిన దొమ్మి సందర్భములో మాణిక్యం మొదలియారును, ఇంకను మరికొందరును హత్యచేసి, ఇండ్లు తగులబెట్టిన నేరమునకు మద్దతుచేయుటకు కుట్రచేసి రను అనుమానముపైన మేజిస్ట్రేటు సంతకముతో జారీచేయబడిన వారంటులను బట్టి అరెస్టుచేయబడి ఖైదులోనుంచబడిరి. తమ్ము నెందుకు పట్టుకొనిరో వివరములు తెలుపవలసినదని వారడిగినను తెలుపలేదు. చెఱసాలలో వారి గౌరవమునుబట్టి వారి కొసగవలసిన సౌకర్యములను జైలు అధికారులు వారి కొసగలేదు. వారిని జామీనుపైన విడుదలచేయవలసినదని కోరినను విడువలేదు.

ఆ సందర్భములో ఆగష్టు 30వ తేదీన 8 మందిని, 31వ తేదీన ఒకరిని అరెస్టుచేసిరి. చిన కైలాసగౌండనును 3వ సెప్టెంబరు తేదీన అరెస్టుచేసిరి. ఆగష్టు 16వ తేదీన జరిగిన దొమ్మిని జరిగించుటకు వీరు కుట్రచేసినట్లు అనుమానించుటకు బలవత్తరమైన కారణములు తనకు చూపబడినట్లు జిల్లా మేజిస్ట్రేటు 30వ తేదీన స్వదస్తూరీతో వ్రాసినాడు. అయితే ముద్దాయిలను అరెస్టుచేసి తెచ్చినప్పుడు ఫిర్యాదినిగాని, మరి యెవ్వరినిగాని మేజస్ట్రేటు విచారించలేదు. ఈ సంగతులు హైకోర్టువారికి మనవిచేసినను వారు జామీను పైన విడుదలచేయలేదు.

ఈ కేసులవిషయమై సేలములోను, సేలముజిల్లాలోను ప్రజలందరు చెప్పుకొనుచు గొప్ప ప్రచురణము జరిగియున్నందున అక్కడ విచారణ జరిగినయెడల తమకు నిష్పక్షపాతమైన న్యాయము జరుగదనియు, ఈ కేసుల నింకొక జిల్లాకు మార్చవలసిన దనియు ముద్దాయిలు హైకోర్టువారిని వేడుకొనిరి. గానినేరము జరిగినచోటనే కేసులు విచారించుట యుచితమనియు, సాక్షులను ఇతరచోటులకు హాజరుపరచుట కష్టమనియు చెప్పి హైకోర్టువారు ముద్దాయిలకోరికను నిరాకరించిరి.

ఈ సంగతులు ప్రభుత్వమువారు ప్రకటించు హైకోర్టున్యాయస్థానతీర్పులలో 6వ సంపుటములో 63వ పుటలో గల మాణిక్యంమొదలివగైరాల క్రిమినలు రివిజనుకేసులో ప్రచురింపబడినవి. ఈ తీర్పు 1882వ సెప్టెంబరు 8వ తేదీన చేయబడినది.

పొన్ను సామిచెట్టిని, మరికొందరిని పై సందర్భములోనే ఆగస్టు 31-వ తేదీనను,

సెప్టెంబరు 8, 13 తేదీలలోను అరెస్టుచేసి జిల్లా మేజిస్ట్రేటుఎదుట హాజరు పరుపగా ఆయన ఎట్టి సాక్ష్యమును తీసుకొనకయే వారి నందరిని ఖైదులో నుంచెను. జామీనుపైన విడుచుటకు నిరాకరించినాడు. దీనిని గురించి వారు హైకోర్టుకు క్రిమినలురివిజనుపిటిషను దాఖలు చేయగా అది 1882 సెప్టెంబరు 22వ తేదీన విచారణకు వచ్చెను. అప్పటికే ఈ కేసుల విచారణకు స్పెషల్ మేజిస్ట్రేటు నియమింపబడి విచారణ ప్రారంభించియున్నందున వారిని జమీనుమీద విడుదలచేయుటకు నిరాకరించిరి. ఈకేసు ఇండియన్ లారిపోర్ట్సు 6-వ సంఖ్య మద్రాసు సంపుటములో 69వ పుటలో ప్రకటింపబడినది.

1882వ సం. ఆగస్టు 16వ తేదీన సేలం దగ్గర సెవ్వాయిపేటలోని మశీదును తగులబెట్టిన నేరము నకు మద్దతుచేసి రను నేరమునకు సుందరంసెట్టి, పొన్నుసామిసెట్టి మొదలైన 15 మందికిసేలంజిల్లా అడిషనల్ సెషన్సుజడ్జి కారాగారవాస, ద్వీపాంతరవాస శిక్షలు విధించినాడు. సెషన్సు జడ్జిగారి తీర్పుపైన ముద్దాయీలు మద్రాసు హైకోర్టువారికి అప్పీలు చేసికొనిరి. గాని ఆ కోర్టువారుకూడా శిక్షలను ఖాయపరచిరి.

ఈ కేసు సంగతులన్నియు సెషన్సుజడ్జిగారి తీర్పులో చక్కగా వివరింపబడినవి.

1882 ఆగస్టు 16వ తేదీన జరిగిన దొమ్మి యొక్క నిజస్వభావమును గ్రహించుటకు ఈ మశీదు చరిత్రను తెలిసికొనుట అవసరము.

సేలముదగ్గర సెవ్వాయి పేటలోని మహమ్మదీయులు 1875వ సం. మేనెలలో ఒక మశీదు కట్టుకొనుటకు కలెక్టరు అనుజ్ఞను కోరిరి. అప్పు డక్కడి హిందువులు ఇది వల్ల కాదనిరి. అంతట అప్పటి కలెక్టరు లాంగ్లేదొరగారు అనుజ్ఞనిచ్చుటకు 1876లో నిరాకరించిరి. ఈ విషయమై మహమ్మదీయులు 1878లో మరల దరఖాస్తుపెట్టుకొనిరి. అంతట హిందువులుకూడా ఒక ఎదురుబడి అర్జీని దాఖలు చేసిరి. హిందువుల ఊరేగింపు లకుగాని, ఇతర యూరేగింపులకుగాని మహమ్మదీయులు అభ్యంతరములు పెట్టకుండు పద్ధతికి లోబడి మశీదుకట్టుకొనుటకు మహమ్మదీయుల కనుజ్ఞనిచ్చుటకు లాంగ్లేగారు నిశ్చయించి ఆ ప్రకారము 1878వ సం. జనేవరు 17వ తేదీన ఉత్తర్వులు జారీచేసిరి.

1874వ సం. మే 9వ తేదీన మద్రాసు ప్రభుత్వమువారు జారీచేసిన జి.ఓ. ఉత్తర్వుల ప్రకారము తురకల మశీదు దగ్గరనుండి హిందువుల ఊరేగింపులు, ఇతర యూరేగింపులు పోవునప్పుడు మేళతాళములను, బాజాలను ఆపుచేయవలెననికూడా లాంగ్లేగారు ఉత్తర్వుచేసిరి. పూర్వము మహమ్మదీయులు మశీదుకట్టుకొను టకు అనుజ్ఞ కోరినప్పుడు, ఆ ప్రదేశమున నొక వారధి (Cause - way) కట్టుట కాస్థల మవసరమగునని అనుజ్ఞ నివ్వలేదనియు, ఇప్పుడావారధి యింకొకచోట కట్టబడినందున ఆ స్థల మవసరము



లేదనియు, మహమ్మదీయులు తమ మశీదును నిర్మించుకొనుటకు కావలసిన సామానంతయు సిద్ధముచేసికొనిరనియు, మూడేండ్ల నుండి ఆ స్థలముదగ్గరనే ఇంకొక చిన్నకట్టడములో తమ ప్రార్థనలు జరుపుకొనుచున్నారనియు, మునిసిపలుకమిషనర్లను, ఇతరులను తానాలోచించితిననియు, మహమ్మదీయులకోరిక న్యాయమైనదే యని తానభిప్రాయ పడుచున్నాననియు, హిందువులు కేవలము కక్షకొరకే అభ్యంతర పెట్టుచున్నట్లు తనకు తోచుచున్నదనియు చెప్పి కలెక్టరుగారు హిందువుల అర్జీని త్రోసిపుచ్చినాడు.

మశీదునిర్మాణము విషయములో హిందువులయాక్షేపణలు కేవలము నిరాధారములేనా యను సంగతిని కొంచెము చూతము. మహమ్మదీయులు తమ మశీదును కట్టుకొనుటకు నిర్దేశించిన స్థలము నదియొడ్డున గల ఒక ఎత్తైన ప్రదేశము. అది చాలా ప్రాముఖ్యమైనది ఉత్తరమునుండి యొక రోడ్డును, పడమటినుండి రెండు రోడ్లను వచ్చి అక్కడ కలియును (Converage). అక్కడనుండి యింకొక బాట ఏటవాలుగా పోయినది. మీదివంతెనపైకి పోవును. అందువల్ల అక్కడ మశీదు కట్టినయెడల హిందువుల యూరేగింపు లన్నియు పోవు రెండురోడ్లును దానికి రెండు ప్రక్కలను చుట్టుకొని యుండును. ఆ ప్రదేశమునకు తూర్పున ఒక బీటిభూమి (Waste) ఉన్నది. దానిలో పాడుపడిన దేవాలయమొకటి యున్నది. దాని దగ్గర నొక చిన్న విఘ్నేశ్వరాలయముకూడా ఉన్నది. దాని దగ్గరనుండియే నదిలోని స్నానఘట్టమునకు పోవు మెట్లు కలవు. అందువలన అక్కడ మశీదు కట్టుటకు హిందువుల కిష్టము లేకపోవుటకు కారణము కేవలము అన్యమతముపట్ల అసహనముమాత్రమే గాక తమకు ఇబ్బంది కలుగు నను కారణముకూడ లేకపోలేదు.

ఈ కేసులో సాక్షిసాధనములలో నొకటిగా ప్రదర్శింపబడిన ఫౌక్సుదొర వ్రాసిన మెమోరాండము వలన కొన్ని విశేషములు తెలియుచున్నవి. ఊరిలోని ఇతర దేవాలయములలోని దేవతలను ఉరేగించునప్పుడెల్ల పైన చెప్పిన రోడ్డు ప్రక్కనున్న ఖాళీస్థలములోని విఘ్నేశ్వరాలయముదగ్గర మేళతాళములు నృత్యముతో కొలుపు జరిగితీరవలయునను ఆచార మొకటి చిరకాలానుగతముగా నున్నది. అయితే సేలములో ఊరేగింపుల విషయమై హైకోర్టుకు పోయి, మద్రాసు హైకోర్టు తీర్పుల రెండవ సంపుటము 140వ పుటలోప్రచురణము కాబడిన కేసు సందర్భములో ఈఆచారముసంగతి చర్చకు వచ్చియుండలేదు. మశీదుకు తూర్పున గల రోడ్డుమీదుగా పోవు హక్కునుగురించి మాత్రమే వాదన జరిగినది. బహుశా ఈ ఆచారము కొంతకాలము నుండి సరిగా ఆచరణలో

లేకుండియుండి 1881వ సం. డిశంబరులో హిందువులు దీనిని మఱల ఉద్ధరించుటకు ప్రయత్నించి యుందురని యూహింపవచ్చును.

హిందువుల యూరేగింపులు ఈ క్రొత్త మశీదుదగ్గరనుండి పోవునప్పుడు మేళతాళములను ఆపివేయవలెనని జిల్లా మేజిస్ట్రేటు (కలెక్టరు) చేసిన యుత్తరువు సశాస్త్రీయమైనది కాదని తలచి ఈ కేసులోని ముద్దాయియైన సుందరము సెట్టిగారును, సెవ్వాయి పేటలోని మరికొందరు హిందూ ప్రముఖులును సేలముజిల్లా మునసబు కోర్టులో 1878వ సంవత్సరపు 208వ నెంబరు వ్యాజ్యమును దాఖలుచేసిరి.

అప్పుడు జిల్లామునసబుగారొక బ్రాహ్మణుడు. హిందువు లితర ప్రదేశములలో నెంత స్వేచ్ఛగా నూరేగింపులు చేసికొందురో మశీదు ప్రక్కనుండి కూడా అంత స్వేచ్ఛగాను ఉరూగింపులు చేసికొనవచ్చునని ఆయన 1879వ సం. మార్చి 31వ తేదీన తీర్మానించిరి. మహమ్మదీయులీ తీర్పుపైన జిల్లాకోర్టులో అప్పీలుచేసిరి. జిల్లాజడ్జియైన హానింగ్టన్ దొర గవర్నమెంటువారి 1874వ సం. మే 9వ తేదీ జీ.ఓ.ననుసరించి జిల్లామునసబుగారి తీర్పును 1879వ సం. జూలై 28వ తేదీన రద్దుచేసి హిందువుల దావాను కొట్టివేసిరి. అంతట హిందువులు హైకోర్టులో సెకండ్ అప్పీలు దాఖలుచేయగా నది 1880వ సం. అక్టోబరు 11వ తేదీన విచారణకాబడి జిల్లా జడ్జిగారి తీర్పును రద్దుచేయుచు న్యాయసమ్మతమైన (Lawful) సమయములందెల్ల ఇతర ప్రజలనుగాని దైవారాధనమును గాని మతసంబంధమైన కర్మలుగాని చేసికొనువారి శాంతికి భంగము కలిగింపకుండ న్యాయసమ్మతమైన విధముగా ఊరేగింపులు చేసికొనుటకు హిందువులు అర్హులేయని హైకోర్టువారు తీర్మానించిరి. ఇది యొక విధమైన తునితగవుగా తీర్మానమైనది. హిందువుల యొక్క అసలు ఆక్షేపణ నిది త్రుంచలేదు. తమ యూరేగింపుమార్గమున కీ క్రొత్త మశీదు అన్యాయముగా నాటంకము కలిగించుచున్నదనియు, పురాతనమైన మశీదుకు చూపవలసిన మర్యాదల నిటువంటి క్రొత్త మశీదు పొందుట కర్హత లేదనియు హిందువుల అసలు వాదము, ఇది తీర్మానింపబడనేలేదు.

1881వ సం. మార్చి 15-16 తేదులలో మారియమ్మ కొలుపుల యూరేగింపు మశీదు ప్రక్కనుండి పోవునప్పుడు తమకు తగిన బందోబస్తు నివ్వవలసినదని సుందరము సెట్టిగారును, సెవ్వాయిపేటలోని ఇతర హిందూ ప్రముఖులును (మార్చి9వ తేదీన) అర్జీ దాఖలుచేయగా నది అసిస్టెంటు మేజిస్ట్రేటు అయిన ముల్లాలీగారి దగ్గర విచారణకు వచ్చినది. అంతట ఆయన సుందరంసెట్టిగారిని, మారియమ్మగుడి ధర్మకర్తను, ఒక మహమ్మదీయ ప్రముఖుని విచారించినాడు. ఈ మశీదులో సర్వకాల సర్వావస్థలయందును



దైవప్రార్థనము జరుగుచుండునని ఆ మహమ్మదీయుడు సాక్ష్యము చెప్పినాడు. అంతట ముల్లాలీగారు మార్చి 13వ తేదీన ఉత్తర్వులు జారీచేసిరి. మశీదులో ఎప్పుడు ప్రార్థన జరుగునో చెప్పుటకు వీలులేదుకనుకను, శాంతికి భంగముకలుగునుగనుకను దానిప్రక్కనుండి పోవునప్పుడు మేళతాళములు వాయించకూడదని తన యుత్తరువులో వ్రాసెను. దానిని పురస్కరించుకొని 13 మంది హిందువులను, 13 మంది మహమ్మదీయులను శాంతికి భంగము కలుగకుండా పూచీకత్తుల నివ్వవలసినదని కోరెను. అంతట హిందువులు తమ యూరేగింపును మానుకొనిరి. ఈ మేజస్ట్రేటు ఉత్తర్వుపైన ఒక హిందువుడు హైకోర్టులో క్రిమినిలురివిజన్ పిటిషను దాఖలుచేసెను. అది విచారణకు వచ్చునప్పటికే ఊరే గింపుల కాలము గడచిపోయినందున హైకోర్టువారు ఆ పిటిషనును పరిహరించిరి. అయితే లోగడ మశీదు దావాలో హైకోర్టువారు చేసిన తీర్మానము ప్రకారము మహమ్మదీయులకు ఒక నిర్దిష్టమైన ప్రార్థనకాలము లేని యెడల అట్టికాలము లేని యెడల అట్టికాలములను వారు నిర్ణయించుకొనవలెననియు, వారట్లునిర్ణయించుకొననంత మాత్రమున హైకోర్టుతీర్పు నిరర్థకముగాకుండా చూడవలెననియు హైకోర్టువారు 1881వ సం. జూలై 11వ తేదీన ఆతీర్పులో సూచించిరి. అయితే ఈతీర్పు సేలం జిల్లా మేజస్ట్రేటు స్టోక్సుగారికి సెప్టెంబరు 7 వ తేదీవరకూ చేరలేదు. అంతట ఆయన 1881 నవంబరులో మహమ్మదీయులను తమ ప్రార్థనసమయములను నిర్ణయించుకొనవలసిన దని కోరిరిగాని వారు సమాధానము చెప్పలేదు. అంతట అతడే యొక ప్రణాళికను తయారుచేసి కొన్ని కాలములలో హిందువులు మశీదు ప్రక్కనుండి మేళతాళములతో పోవచ్చునని నిర్ణయించినాడు.

1881వ సం. డిశంబరులో సేలము గ్రామములో జరిగిన భద్రకాళికొలుపు మొదటిదినము ఊరేగింపుటుత్సవము, స్టోక్సుగారు దగ్గరనుండిగానే, మశీదు ప్రక్కనుండి మేళతాళములతో ఎట్టి యాటంకమును లేకుండా పోయినది. మూడవ దినమున సుందరము సెట్టిగారు హైరోడ్డు వదలి మశీదుతూర్పు ప్రక్కనున్న ఒక తూము (Culvert) దగ్గరనుండి అడ్డముగా పోవుటకు ప్రయత్నించగా పోలీసువారు ఆటంకపరచినారు. అంతట నాలుగువ దినమునాటి యూరేగింపు ఆగిపోయి నది. కాని అయిదవదినము నాటి యూరేగింపు క్రమముగనే జరిగినది. ఇట్లు హిందువులు మశీదు ప్రక్కనుండి ఊరేగింపుచేయు హక్కును చాలా వ్రయప్రయాసలకు లోనై కోర్టు ద్వారా పొందగలిగిరి. ఈ తగవులలో మహమ్మదీయులు ఓడిపోయిరి.

హిందువులకు కలిగిన విజయమువలన వారు చాలా ఉత్సాహమును జెంది తమ

యూరేగింపుల నింకను వైభవముగా జరుపుకొనదలచి మశీదు ప్రక్క రోడ్డు దగ్గరనున్న తూమును పెద్దదిగా చేసి రోడ్డును విశాలముచేయుటకు ప్రయత్నించిరి. వారి యదృష్టవశమున అప్పుడు సేలము మనిషిపలు కమిషనర్లుగా ఎన్ను కొనబడినవారు హిందూ సంఘముయొక్క క్షేమలాభములను, అభిప్రాయములను మన్నించుటకు కృతనిశ్చయులైన వారైయుండిరి.

ఇట్టి స్థితిలో 1882వ సంవత్సరము జూన్ నెల 1వ తేదీన చెన్నపట్టణ ప్రభుత్వమువారి క్రొత్త జీ.ఓ.ఉత్తరు వొకటి వచ్చినది. బహుశా మెక్లీన్‌దొర గారి తరువాత చర్చల కీయుత్తరువే కారణమైయుండును. సేలముపట్టణమున శాంతిభద్రతలను స్థాపించుట కొఱకు అదనపు పోలీసులను సమకూర్చిన స్టోక్సుగారి చర్యలను ప్రభుత్వమువారు ఖండించిరి. సామాన్య ప్రజల అల్లరులను (Civil Tumult) అణచుటకు తమ పోలీసు సిబ్బంది చాలనే చాలదనియు, అల్లరులు కలుగునని తోచినప్పుడు సివిలుహక్కులను చలాయించుటనే నిషేధించు విషయములో సాధ్యమైనంత వివేచనను, జాగ్రత్తను ఉపయోగించ వలసిన దనియు ప్రభుత్వమువారు హెచ్చరించిరి.

న్యాయమును పరిపాలించు విషయములో హైకోర్టు వారిచ్చిన తీర్పును, దానిని అమలుజరుపుటలో నుపేక్షాభావమును సూచించు ప్రభుత్వమువారి యుత్తరువును ఒకదానికొకటి విరుద్ధముగా నున్నట్లు భారతీయ ప్రజాసామాన్యములోని సామాన్యవ్యక్తులకు తోచుటలో నాశ్చర్యమేమున్నది?

1882వ సంవత్సరము జూలై నెలలో మారియమ్మ ఉత్సవములు జరుగును. ఆ సమయములోనే ఆ సంవత్సరము రంజాన్ పండుగ వచ్చెను. ఆ సందర్భములో మహమ్మదీయులు తమ మశీదులో నిరంతరాయముగా ప్రార్థనలు జరుపుచుందురనియు, హిందువులు రెండవతరగతి మేజిస్ట్రేటుదగ్గరకు వెళ్లి తమ మారియమ్మ యుత్సవములలో మేళతాళములతో మశీదు ప్రక్కనున్న కన్నారువీథిలోనుండి యూరేగింపులు తీసికొనిపోవుట కనుజ్ఞను పొందినారనియు, అట్లు చేసినయెడల శాంతికి భంగము కలుగగలదనియు, మహమ్మదీయులు గ్రామాంతరమున మకాములో నున్న జిల్లా మేజస్ట్రేటుకు జూలై 20వ తేదీన అర్జీపంపుకొనిరి అంతట జూలై 21వ తేదీన అర్జీపంపుకొనిరి అంతట జూలై 21వ తేదినుండి ఆగష్టు 3వ తేదీవరకును హిందువులు మశీదుదగ్గర మేళతాళములతో ఊరేగింపులు జరుపరాదని జల్లా మేజస్ట్రేటు హిందువులను విచారించకుండా వారి పరోక్షముననే ఉత్తర్వుచేసినాడు. అంతేగాని అటువంటి పరిస్థితులలో తాను సేలమునకు వచ్చి వేయుట యుక్తమని తలంపలేదు.



స్టోక్సుగారి హయాములో సేలములోని హిందువుల ఇండ్లలో జరుగుచున్న శుభకార్యముల సందర్భములోకూడా కొన్ని నిర్దిష్టసమయములందు మశీదువద్ద నుండి మేళతాళములతో నూరేగింపులు పోవుట కనుజ్ఞనిచ్చుచుండిరి. స్టోక్సుగారి తరువాత వచ్చిన జిల్లామేజస్ట్రేటు కాలములో నటువంటి యూరేగింపులు రెండు నిషేధించుట తానెరుగుదునని ముల్లాలీగారు సాక్ష్యమిచ్చినారు.

1882వ సంవత్సరం జూలై 28వ తేదీన అటువంటి యూరేగింపు ఒకటి అక్కడనుండి పోవుటవలన నక్కడ దొమ్మి జరిగెను.

కొంతమంది చాకలివాండ్రు తమ కులములో నొకడు మరణింపగా నాశవమును మేళతాళములతో ఊరేగించుచు అప్పు సెట్టివీథినుండి నదిదగ్గరకుతీసికొని పోవుచుండగా నలుబదిమంది మహమ్మదీయులు వారి పైన బడి దౌర్జన్యము చేసిరి. అంతట నదిదగ్గర సెవ్వయి పేటవైపునను, గోగైవైపునను రెండువేలమంది జనము ప్రోగైనట్లు జాన్సనుగారు సాక్ష్యాలు చెప్పినారు. అప్పుడు హిందూమహమ్మదీయుల కొట్లాట జరిగినది. చాలారక్తపాతమైనది. గాయపడి ఆసుపత్రికి వచ్చిన వారిలో హిందువులును, మహమ్మదీయులును సమానము గానే యున్నారని జిల్లాసివిలుసర్జనుగారి సాక్ష్యములో నున్నది. జూలై 29, 30వ తేదీలలో కూడా అల్లరి సాగినది. ఆయుధములతో మిలిటరీదళము వచ్చినందువల్ల కొట్లాట ఆగినది. అప్పుడు దౌర్జన్యమును ప్రారంభించినది. మహమ్మదీయులేయనియు, హిందువులు తిరుగబడి దానికి ప్రతిక్రియ జరిగించిరనియు ఆగస్టుకొట్లాట కేసులను విచారించిన సెషన్సుజడ్జిగా రభిప్రాయపడిరి. అంతేకాదు; ఈకొట్లాటలో పాల్గొనినవారిపట్ల జరుపబడిన చర్యకూడా చాలా అసంతృప్తికరముగ నున్న దనియు అభిప్రాయము వెలిబుచ్చిరి. దొమ్మిచేసినవారిపైన దాఖలు కాబడిన కేసులను మేజస్ట్రేటుగారు సెషన్సు కోర్టుకు కమిటుచేయక తానే విచారించినాడు. మలబారు నుండి వచ్చి దొమ్మిలో నాయకత్వమును వహించిన యొక మాపిళవానికి ఒక సంవత్సరము కారాగారశిక్షయు, జుల్మానాయు మాత్రమే విధించిరి. మేజస్ట్రేటుకోర్టులో శిక్షింపబడిన తక్కిన మహమ్మదీయులు అప్పీలుకోర్టులో తప్పించుకొనిపోవగలిగిరి. దీనివలన సేలములో హిందువులకు న్యాయము దొరక దను భావము కలిగినదనియు, రాజకీయముగా నీభావము చాలచిక్కులను తెచ్చి పెట్టుటకు కారణమైనదనియు సెషన్సుజడ్జిగా రభిప్రాయపడిరి.

కొట్లాట జరిగిన మరునాడు, అనగా జూలై 29వ తేదీన జిల్లా మేజస్ట్రేటు ఊరిలో హాజరుగా లేనందువలన "డిప్యూటీ" సహాయమేజస్ట్రేటుగారొక నిషేధపుటుత్తరువును జారీచేసిరి. ఇది చాలా విచిత్రముగా నుండెను. సెవ్వయిపేట బజారువీథిగాని, మశీదుదగ్గర

గాని హిందువు లెవ్వరును మేళతళములు వాయించరాదనియు, ఖాజీగారును పేష్ఇమాంగారును తప్ప మహమ్మదీయు లెవ్వరును కూడా సెవ్వయిపేట మశీదులోనికిప్రార్ధనల నిమిత్తము పోరాదనియు సాదరు చేయబడిన ఈ విపరీతపు ఉత్తరువు జిల్లా మేజస్ట్రేటు గారు ఊరినుంచి వచ్చి ఆగష్టు 15వ తేదీన రద్దుచేయువరకును అమలులో నుండెను.

సేలములో నింతఘోరములు జరిగినతరువాత కొన్నాళ్లకు జిల్లా మేజస్ట్రేటుగారు గ్రామమునకు తిరిగివచ్చిరి. ఆయన రాగానే మారియమ్మగుడి ధర్మకర్త లైన సుందరము సెట్టిగారును, మరియొకరును పైన చెప్పిన యుత్తరువువలన తాము ఆపియుంచిన మారియమ్మ యుత్సవములను జరుపుకొనుటకును, ఊరేగింపు చేసి కొనుటకును తగిన పోలీసుబందోబస్తుగాని, మిలిటరీ బందోబస్తుగాని సేలములో హాజరుగా నుంచవలసినదని కోరుచు జిల్లా మేజస్ట్రేటుగారివద్ద అర్జీని దాఖలుచేసిరి. ఈ అర్జీలో తమకు సహాయ మవసరమైన సందర్భములు బాగుగనే వివరించిరి గాని ఒక పేరాలో వ్రాసిన మాటలు మాత్రము జిల్లా మేజస్ట్రేటుగారికి ఆగ్రహమును కలిగించెను.

డిప్యూటీమేజస్ట్రేటుగారు జారీచేసిన నిషేధపుటుత్తరువువలన మహమ్మదీయులు తాము బలవంతులమైనందువల్లనే ఈ యుత్తరువు జారీచేయబడినట్లు వారనుకొనునట్లు చేసినదనియు, మహమ్మదీయులు పేచీ కోరులైనందువల్ల (Troublesome) బాధింతురను నభిప్రాయముతో ప్రభుత్వమువారు వారిపట్ల పక్షపాతబుద్ధితో నీ నిషేధపుటుత్తరువును జారీచేసిరనియు హిందువులనుకొనుటకు కారణమైనదనియు, మఱియు నాయుత్తరువునకు ప్రజలను లోబఱచియుంచుటకు అధికారబలము లుపయోగించి దానిని అమలు జరుపవలసివచ్చినందువలనను, దాని నుల్లంఘించినందువలన కలిగిన శాంతిభంగము నివారణచేయదలచిన శాంతి భంగముకన్నఎక్కుడుగ నున్నదనియు శాసనమును అమలుపరచి ప్రజల హక్కులను కాపాడుటకు వలసిన బలములను సమకూర్చి యుంచనియెడల కొట్లాటలను అణచుట కవసరమైన బలములను సమకూర్చవలసి వచ్చునను సంగతి అనుభవమువలన విశదమగుచున్నదనియు, ఆ యుత్తరువు అన్యాయముగను, నష్టకరముగను ఉన్నదనియు అర్జీదారులు వ్రాసిన మాటలు జిల్లా మేజస్ట్రేటు గారికి కొంత ఆగ్రహము కలిగించెను. ఈ అర్జీవిషయమై జిల్లా మేజస్ట్రేటుగారు 1882సం. ఆగష్టు 4వ తేదీన ఇట్లు తీర్మానించినారు :- "ప్రస్తుత పరిస్థితులలో అర్జీదారులు కోరు రక్షణను ఇచ్చుటకు జిల్లా మేజస్ట్రేటుకు ఎంతమాత్రమును సావకాశము లేదు. అట్టి సావకాశమున్ననుకూడ అట్టి రక్షణ నొసగుట తన విధియని జిల్లా మేజస్ట్రేటుకు



తోచుట లేదు. ప్రస్తుతము సెవ్వయి పేటలో నూరేగింపులు జరుపుట క్షేమకరము కాదనియు, శాంతిభద్రతలను కాపాడుటకు మేజస్ట్రేటులును, పోలీసువారును తమ యధికారముల నన్నిటిని అవసరమును బట్టి వినియోగింతురనియు అర్జీదారులను హెచ్చరించడమైనది. " అని తన తీర్పులో వ్రాసినాడు. ఈ యుత్తరువువలన సుందరము సెట్టి మొదలైనవారి కింక కోర్టుద్వారమునగాని, అధికారులద్వారమునగాని తమ హక్కులను కాపాడుకొనుట కవకాశము లేదని రూఢి యైన దనియు, అందువలన వీరందరు నాలోచించుకొని కుట్రచేసి తమ హక్కులను నిలువబెట్టుకొనుటకు అక్రమ చర్యలకు దిగి 1882వ సం. ఆగష్టు16వ తేదీన జరిగిన దుర్మార్గపునేరములను జరిగించినారనియు వీరి పైన మోపబడిన కేసులలో ప్రాసిక్యూషను (ఫిర్యాదుల) తరఫున వాదింపబడినది. ఆకేసులను విచారించిన సెషన్సుజడ్జిగారికిని ఈ యభిప్రాయమే కలిగినది. అగష్టు 16వ తేదీన జరిగిన ఘోరములకు కేవలము మతావేశమే కారణముకాదు. తమ సివిలుహక్కులను కాపాడుటకే న్యాయపరిపాలనాధికారము అసమర్థమైనదని హిందువులకు తోచినది. అనగా అధికారులు మహమ్మదీయులను చూచి భయపడిపోయినారని హిందువులకు తోచినది. ఈ మహమ్మదీయులు దౌర్జన్యపరులై విజృంభించినందువల్ల ఇకముందు వారి మాటయే చెల్లుబడియగుననియు, మశీదుదగ్గర నిక మేళతాళములు వాయించుట కెంతమాత్రమును వీలుండదనియు, ఎంతో కష్టపడి హైకోర్టువరకును పోయి సంపాదించుకొని వచ్చిన హక్కు లిట్లు అన్యాయముగా తీసివేయబడిన వనియు హిందువులలో సామాన్యజను లందరికిని తోచినది. వారాగ్రహముతో మండిపడిరి.

హిందువులకు న్యాయముగా నున్న హక్కుల ప్రకారము వారూరేగింపులు చేసికొనుటలో నెట్టి యాటంకమును లేకుండా రక్షించి వారి హక్కులను కాపాడుట ప్రభుత్వాధికారుల విధి యనుమాట నిజము. అయితే అప్పటి పరిస్థితులలో అట్టి హక్కులను చలాయించినయెడల శాంతిభద్రతలకు భంగము కలుగునను అభిప్రాయముతోనే పైన చెప్పిన నిషేధపుటుత్తరువులు జారీచేయబడినవి. అట్టి పరిస్థితులలో నట్టి యుత్తరువు జారీచేయుట పట్టణములో నక్రమములు, అల్లరియు చెలరేగుననియు, వానిని అణచి న్యాయరక్షణముచేయుటకు తామసమర్థుల మనియు అంగీకరించుటయేకదా! అట్టి యుత్తరువులు పలుమార్లు జారీచేయబడినప్పుడవి ప్రజాశాంతిని కాపాడుట కవసరములే యని న్యాయమైన హక్కులకు భంగము కలిగి బాధపడువారు సరిపెట్టుకొని యూరకుండగలరా? న్యాయమైన హక్కులను తృణీకరించుటకు దౌర్జన్యమునకు దిగిన బలవంతుల పక్షమువారిని అధికారు లేమియు చేయలేక న్యాయ పక్షమువారిపై

నిట్టినిషేధాజ్ఞలను ప్రయోగించి బాధించు చున్నారనియు, అక్రమపక్షమువారివలెనే తాముకూడా పశుబలమును జూపి దౌర్జన్యములకు దిగినచో తమ హక్కులు మన్నింపబడి స్థిరపడగలవనియు ప్రజాసామాన్యమునకు తోచుటలో నాశ్చర్యమేమున్నది? ఇట్టి భావములు ప్రజలలో వ్యాపించినప్పుడు సివిలుహక్కులను కాపాడుటవలన వచ్చు చిక్కులకన్న సివిలు హక్కులను రద్దుచేయుటవలన వచ్చు చిక్కులే యధికముగానుండును. సుందరముసెట్టి మొదలైనవారు సేలముజిల్లా మేజస్ట్రేటుదగ్గర దాఖలుచేసిన అర్జీలో పైన చెప్పిన భావములు ధ్వనించినవి. అదికారులకు పక్షపాతబుద్ధి నారోపించుటవలన నాఅధికారులకు ఆగ్రహము కలిగినదని హైకోర్టువారు గ్రహించిరి. కాని అర్జీదారులట్టి యారోపణముచేయుట తగదని నిరసించిరి.

పైన చెప్పబడిన సందర్భములలో జూలైకొట్లాట అప్పటి పరిస్థితుల కొక ప్రత్యక్షనిదర్శనముగా కనబడుటయేగాక ఎవ్వరో కొందరు బుద్ధిపూర్వకముగా శాంతి భంగమును కలిగించుటవల్లనే ఆ కొట్లాట జరిగియుండునని మేజిస్ట్రేటుమనస్సులోపల నున్న అనుమానము సుందరము సెట్టి వగైరాల అర్జీలోని మాటలలోని ధ్వని వలన బలపడినట్లుకూడా మేజస్ట్రేటు తన తీర్పులో వ్రాసిన మాటలనుబట్టి కనబడినది. ఆ యుత్తరువులోని ధ్వనికూడా అసమంజసముగానే యున్నదని హైకోర్టు వారికి తోచినది. "అర్జీదారుల మనవిని త్రోసిపుచ్చుటకు మేజస్ట్రేటుకు హక్కు కలదుగాని ప్రజాశాంతిని కాపాడుటకొరకు అర్జీదారులకు అసౌకర్యముకలిగించవలసివచ్చినందువలన వారు దానిని భరించుట విషయములో మనస్సులను సరిపెట్టుకొనులాగున మేజస్ట్రేటు కొంత సానుభూతితో ప్రవర్తించియుండవలసినది. అప్పటి పరిస్థితులలో వారి హక్కులను నిరోధించవలసి వచ్చిన దనియు, మునుముందు పరిస్థితులు చక్కబడిన పిదప వారి హక్కులను కాపాడెదమనియు మంచి మాటలనైన చెప్పక తన ఉత్తరువునుబట్టి ఎన్నటికిని కూడ వారి హక్కులను కాపాడవలసిన బాధ్యత తనకు లేనేలేదని వారికి నిరాశకలుగునట్లు వ్రాసినాడు" అని హైకోర్టువారు తమ తీర్పులో వ్రాసిరి.

## మశీదులవద్ద మేళతాళములు

మశీదులదగ్గరనుండి హిందువుల యూరేగింపులు పోవుటకు గల హక్కులవిషయమై మశీదులయెదుటనుండి హిందువులు మేళతాళములతో పోవరాదను ఆచారము బహుశా హిందూదేశము మహమ్మదీయరాజ్యాధిపత్యము క్రిందనుండిన కాలమునాటి దైయుండునని సెషన్సు జడ్జి యభిప్రాయపడినాడు. అట్టి మర్యాద పురాతనమైన మశీదులకే గాని క్రొత్త



మశీదులకు చెల్లుబడికాదనియు కూడా వ్రాసినాడు. మఱియు పూర్వము మశీదుకేసులో హైకోర్టువారిచ్చిన తీర్పు ఈపురాతనాచారమును ఖాయపరచుటయే యగునుగాని క్రొత్తహక్కులను ప్రసాదించుట కాజాలదనియు తీర్మానించినాడు. హైకోర్టువా రీవిషయమై ఇట్లు వ్రాసిరి. అట్టి యాచార మున్నట్లే కోర్టులో వాదింపబడి యుండలేదు. అట్టి ఆచారము నే హైకోర్టువారు నింతవరకు అంగీకరించియు నుండలేదు. ఈరాజధాని చరిత్రను బట్టి చూచినచో నేకాలమునందును కూడా ఈ ప్రాంతములన్నియు పూర్తిగా మహమ్మదీయుల పరిపాలనకు లోబడియుండలేదని తెలియగలదు. అందువలన అట్టి యాచారము సర్వేసర్వత్రా ఉండుట కవకావములేదు. మహమ్మదీయ రాజ్యాధిపత్యము స్థిరముగా నెలకొల్పబడిన జిల్లాలలో మతావేశపరులైన పరిపాలక వర్గమువారు తమ మతముపట్ల పాలితులైన దేశీయులు గౌరవమును చూపునట్లు శాసించియుందురు. ఆ రాజ్యాధిపత్యము పోయినతరువాత కూడా ఆ మతాభిమానులు తమ యభిమతమే అమలుజరుగునట్లు చేసియుందురు. మశీదుల విషయములో ఆస్థలముయొక్క పవిత్రతను పురస్కరించుకొని అట్టి మర్యాదను వారు కోరి యుందురను సెషన్సుజడ్జియూహకూడా సరియైనదే యై యుండవచ్చును. అట్టి ఆచారము రుజువుచేయబడిన యెడల న్యాయస్థానమువారు దాని నెంతవరకు హర్షించెదరో నేను చెప్పజాలను. కాని ఇట్టి హక్కులవిషయములోను, మతధర్మములనుబట్టియు, కులాచారములను బట్టియు కోర్టు మర్యాదల విషయములోను పూర్వకాలమున రాజ్యముచేసిన ప్రభువుల రాజాదరణమునకు పాత్రములైన మతధర్మము దేశముయొక్క (పబ్లికు, ప్రైవేటు) ధర్మశాస్త్రమునందు మార్పులు కలిగించినరోజులకు చెందినది. ఇప్పుడట్టి యవకాశములు లేవు. ఈ ఇంగ్లీషు ప్రభుత్వము ప్రజల మతవిషయములందు జోక్యము కలిగించుకొనదుగాని ప్రజలందరును సర్వసమానమైన పౌరసత్వహక్కులు గలవారే యనుసూత్రము పైననే పరిపాలన జరుపును. రాచబాటలను స్వేచ్ఛగా నుపయోగించు కొనకుండ ఒకకులమువారింకొక కులమువారి కెట్టి యాటంకమును కలిగించుట కీ ప్రభుత్వ మంగీకరింపదు. మలబారులోని అస్పృశ్యుడు కూడా ప్రభుత్వమునకు బాహ్యుడుగా నెంచబడడు. లోగడనున్న కొన్ని యాచారములు ఇప్పటి కాలమునుబట్టి అనుచితములుగా నున్నవి. అరాజకమునకు, నిరంకుశత్వము నకును బదులుగా క్రమపద్ధతిగల ప్రజాస్వాతంత్ర్య మేర్పడినప్పుడు మార్పులు కలుగకతప్పదు. అయితే ఆమార్పులు దేశములోని బుద్ధిమంతులు హర్షించునట్టివిగా నుండవలెను. ఊరేగింపుల విషయములో నవి మతమునకు సంబంధించిన వైనప్పుడు ఒక మతావలంబులైనవారిని తమ దేవాలయముల ప్రక్క నుండి అట్టి యూరేగింపులను

స్వేచ్ఛగా పోనివ్వమని కోరుటకన్న తమ ఆరాధనలను ఒక్కొకప్పుడు నిలుపవలసినదని కోరుట ఎక్కువ కష్టమును కలిగింపదు కాని ఏ పక్షమువారి మతాభిమతములును న్యాయశాస్త్రమును మార్చుటకు వీలులేదు. ఒక మతస్థుడు తాను సత్యమని నమ్మని మతమునకు సంబంధించిన మతమువారి యారాధనస్థలమును పవిత్రవంతమైనదిగా నంగీకరింపమని నిర్బంధింపబడుట కిష్టపడకపోవచ్చును. గాని ఇతరమతములవారు ప్రార్థనచేసికొనుటకు సమావేశమైనప్పుడు వారి శాంతికి భంగము కలిగింపకుండ నుండుటకు వారికి గల సివిలుహక్కులను మన్నించుట కభ్యంతరము చెప్పవీలులేదు.

ఆచారమునుబట్టియే అట్టి హక్కులు స్థిరపరుపవలసివచ్చునెడల ఆయాచారము న్యాయమైనదిగను, నిర్దిష్టమైనదిగను ఉండవలెను.

1820లో చెన్నపట్టణమునకు, గవర్నరుగా నుండిన సర్ తామస్ మన్రోగారు జూలై 18వ తేదీన వ్రాసిన మినిట్సులో మేజిస్ట్రేటులు సాధ్యమైనంతవరకు క్రొత్త యాచారములను సమర్థింప బ్రయత్నింపక పూర్వాచారమునే సమర్థింపవలెనని వ్రాసియుండెను. అది పల్లకులలో వీథులయందూరేగుటను గూర్చి వ్రాసిన మాట. ఆ హక్కులను గురించి 1857లోను, 1861 లోను న్యాయస్థానములు తీర్మానించియే యున్నవి.

మతసంబంధమైన ఆరాధనముకొరకుగాని, ప్రార్థన కొరకుగాని సమావేశమైన వారికి ప్రత్యేకరక్షణము నొసగు న్యావిధి వ్యక్తులు ప్రైవేటుగా చేసికొను ఆరాధనలకు, ప్రార్థనలకు వర్తించునది గాక ఒక జనసమూహము సమష్టిగ చేసికొను (Congregational) దానికి వర్తించునదై యున్నది. అట్టితరి ఇతరుల హక్కులకు ఇబ్బంది కలుగకుండ నుండుటకుగాను తామెప్పుడెప్పు డట్టి ఆరాధనలను, ప్రార్థనలను జరుపుకొనునదియు నిర్దిష్టముగా ఆ జనసంఘమువారు చెప్పవలసియుందురు.

తాము ప్రార్థనలు, ఆరాధనలు చేయు స్థలము పవిత్రమైన దను కారణమునగాని, అచ్చట రాత్రింబవళ్లు ఆరాధనలు, ప్రార్థనలు జరుగుచుండునను నెపమునగాని ఇతర జనసంఘములు రాజబాటలపైన యథేచ్ఛగా పోవు హక్కులకు భంగము కలిగింపరాదు అని హైకోర్టువారు తీర్మానించిరి. రాజబాటల నుపయోగించు ఒక శాఖవారి నింకొకశాఖవా రాటంకపరచుటకు ప్రయత్నించినందువలన శాంతిభద్రతలకు భంగము కలుగునని తోచినప్పుడు మేజిస్ట్రేటులు అవలంబించవలసిన పద్ధతులను గురించికూడా హైకోర్టువారు చర్చించిరి.

హైకోర్టువారు లోగడ ఇచ్చిన తీర్పులో నెట్టి మార్పును చేయవలసిన అవసరము



లేదనియు, ఈ విషయమై సెషన్సుజడ్జి చేసిన సూచనలు అప్రస్తుతము లనియు తీర్మానించిరి. హైకోర్టువారీవ్యవహారమునెల్ల చర్చించి తుదకు ఆగస్టు 16వ తేదీన జరిగిన కొట్లాట సందర్భములో శిక్షింపబడిన ముద్దాయీల శిక్షలను మాత్రము రద్దుచేయక వానిని ఖాయపరచిరి.

ఈకేసులను మద్రాసుహైకోర్టులో ముగ్గురు న్యాయమూర్తులు గల ఫుల్ బెంచివారు 1882వ సం. నవంబరు 21-23, 25-28 తేదీలలోను, డిశంబరు 1-2-4 తేదీలలోను, 1883వ సం. జనేవరి 9న తేదీనను విని పరిష్కరించిరి. ఇది ఇండియన్ లారిపోర్టు 6వ సంపుటము 203వ పుట మొదలు ఇరవైపుటలుగా ప్రచురణమైనది.

*- భారతి, డిసెంబరు **1944** - జనవరి **1945***



[1] The Hindu Golden Jubilee Number 1928, p 13- Article by Sri C. Vijayaraghavachariar.

[2] The Last Fifty years - Article by Dewan Bahadur P. Kesava Pillay, The Hindu, Golden Jubilee Number, 1928 P. 14.

# హిందూదేశపు 'సివిల్ మిలిటరీ' దేవతలు

హిందూదేశ ప్రభుత్వాన్ని నడిపే "ఇ.సి.ఎస్." శాఖలో నియమింపబడిన ఇంగ్లీషు యువకులు చాలా అదృష్టవంతులు. వారి కుద్యోగం యిచ్చిన మరుసటిక్షణం నుంచీ అత్తవారింటి క్రొత్త అల్లుళ్లలాగ అన్ని ఖర్చులనూ హిందూదేశప్రభుత్వంవారే భరిస్తారు. వారికిచ్చే జీతాలు గాక రకరకాల అలవెన్సులిస్తారు. ఇంగ్లాండు నుండి హిందూదేశానికి బయలుదేరి రావడానికి, గుడ్డలు గుడుసులు కొనుక్కోవడానికి, 'ఎక్విప్మెంటు అలవెన్సు' అనే సరంజామబత్తెము లిస్తారు. ఇదిగాక, సముద్రంమీద ప్రయాణం చేయగలందులకు ఓడరేవు, దారిబత్తెము మొదలైన ప్రయాణపు ఖర్చులిస్తారు. ఈ ఐ.సి.యస్. ఉద్యోగి ఓడదిగి బొంబాయిరేవులో అడుగు పెట్టగానే ఆయన కేదైనా పని చూపినా చూపకపోయినా కూడా నెలకి రు. 450ల చొప్పున జీతం యివ్వడం ప్రారంభిస్తారు. కళ్లు మూసుకున్నా కూడా అనాయాసంగానూ, అప్రయత్నంగానూ నెల 1కి రు. 2,250ల వరకూ జీతము అభివృద్ధి అవుతుంది. అతనికిగల అలవెన్సులు బత్తెములు కలుపుకొని నెలకు నాలుగువేల రూపాయిలు గిడుతుంది. కొంచెం తెలివికల వాడైతే నెలకు మూడువేలు మొదలు ఏడువేల రూపాయిలవరకూ జీతంగల పెద్ద ఉద్యోగాలు పొందవచ్చును. గవర్నరు కూడా కావచ్చును. ఈ ఐ.సి.ఎస్. శాఖవారికి అకాల బలవన్మరణము కలిగి నప్పుడుగాని, అపాయములవన అంగవైకల్యము దేహపీడ గలిగినగాని, అసాధారణపు పింఛనులు ఉపకారవేతనములు గ్రాట్యూటీలు నివ్వబడును. ఏకారణము చేతనైనా అశక్తులైఏనేచో, ప్రత్యేకశలవులు, ప్రయాణపుఖర్చులు మొదలైన సౌకర్యములు పొందడానికి అర్హతలున్నవి. ప్రతి ఉద్యోగికీ సముద్రం దాటి వచ్చినందుకు అదనపు జీతములు, సెలవు కంట్రిబ్యూషను, మారకము తేడా నష్టపరిహారము, ఇళ్లు, నౌకర్లు, ప్రయాణపు సౌకర్యములు ఉంటాయి. సాలుకు 25 పబ్లికు శలవులు, 20 రోజులు 'కాజుయిల్' లీవనే సెలవుగాక, పూర్తిజీతంమీద, అర్ధజీతంమీద, కలిపి ఒక్కసారిగా 8 నెలలు సెలవు తీసుకోవచ్చును. 22 నెలలు ఉద్యోగంచేస్తే 5 నెలలు సెలవు వస్తూవుంటుంది. అనారోగ్యపు సెలవు, పరీక్షలకు చదువుకోవడానికి సెలవు వుంటుంది. సెలవులో ఆదాయపు పన్నువుండదు. మారకంరేటు



ఏ ప్రకారంగా వున్నా రూపాయికి 20 పెన్నీల చొప్పున లెక్క చూసి వీరికి జీతం యివ్వాలి. 1935 సంవత్సరం నూతన యిండియా రాజ్యాంగ చట్టమువల్ల వీరి అత్యధిక బత్తెములలోగాని, ఇతర సౌకర్యములలోగాని ఆవంతయైనా మార్పులు లేకుండా బందోబస్తులు చేయబడినవి. ఐ.సి.ఎస్. ఉద్యోగుల జీతములలో నుండి పూర్వం నూటికి నాలుగు చొప్పున పింఛను ఫండునిమిత్తం ప్రభుత్వం తీసుకుని దానికి మరికొంత సొమ్ము కలిపి సాలుకు వెయ్యి పౌనుల చొప్పున పింఛను యిచ్చేవారు. 1919లో ఈ ప్రకారం నూటికి నాలుగు చొప్పున పుచ్చుకోవడం బాగా లేదని తీసివేశారు. పింఛనుకూడా చాలా హెచ్చుచేశారు. వెయ్యి మొదలు 1500 దాకా పింఛను ఏర్పాటు చేశారు. ఇంకా పెద్దజీతాల వారికి నాలుగు 5 వేలు మొదలు 7 వేలవరకూ పింఛను లిస్తారు. ఈ మొత్తాలు సీమలో చెల్లించేటప్పుడు ఆదాయం పన్నుకూడా లేదు. జబ్బుపడితే దామాషాపింఛను యిస్తారు. పింఛనులకు ఏకమొత్తంగా చెల్లించే "కామ్యుట్యేషన్" పద్ధతికూడా వీరికోసమే ఏర్పడింది.

పైన చెప్పిన సాధారణ పింఛనలుగాక ఐ.సి.యస్. వారు మిలిటరీ వారితోపాటు సర్వీసులో నుండగా అకస్మికముగా అంగవైకల్యము కలిగినా మరణించినా వీరికి, వీరి భార్యలకూ, బిడ్డలకూ గ్రాట్యూయిటీలనబడు ఉపకారవిరాళముకింద కొన్ని పెద్ద మొత్తము లిచ్చి సాలుకింత యని ఉపకారవేతనముకూడా ప్రభుత్వం వారిస్తారు. సీమకు పోయిన ఐ.సి.ఎస్.వారి కందరికీ సముద్రాంతరఅలవెన్సు లివ్వబడుతవి. ఇవి నెలకి 30 నవరసులదాకా వుంటుంది. దొరలు సర్వీసులో నుండగా సీమకు పోయి రావడానికి రానూపోనూ నాలుగు మొదటి తరగతి ఓడటిక్కెట్లిస్తారు. మారకం తేడా నష్టపరిహారంకూడా యిస్తారు. ఇదంతా మన ప్రజలసొమ్మే. ఇన్ని ప్రత్యేకర్యాలుండడంవల్లనే హిందూదేశపు "సివిలు మిలటరీ ఉద్యోగులు దేవలోకంనుంచి దిగివచ్చిన దేవతలసామెత" బైలుదేరింది.

హిందూదేశంలో పనిచేసే సివిలు మిలటరీ ఉద్యోగుల కుటుంబములకు ఉపకార వేతనాలివ్వడాని కేర్పడిన ఒకనిధి చిరకాలంకిందటనే స్థాపించబడింది. ఇందులో నాలుగు రకాల బాపతుసొమ్ము వచ్చిచేరింది. ఈ ఉద్యోగుల జీతాలలో నుంచి నెలకింత యని కంట్రిబ్యూషను పుచ్చుకొని హిందూ దేశ ప్రభుత్వంవారు దానికి మరికొంత సొమ్ము కలిపి ఆనిధిని వృద్ధిచేస్తూవుంటారు. ఇది పెరిగి పెరిగి ఇప్పటికి ఒకకోటి ఇరవైలక్షల నవరసులైనది. దీనిపైన సాలుకు నూటి కైదురూపాయిల చొప్పున అయినవడ్డీ 90 లక్షలు రూపాయలు ప్రతిసాలునూ భారతదేశ ప్రభుత్వం యిస్తూ వుంటుంది. ఈ నిధియొక్క నిబంధనల నిర్వహణమును గురించి 1935 సం॥రం నూ తన యిండియా రాజ్యాంగచట్టం యొక్క 273 సెక్షనులో కొన్ని కట్టుదిట్టములు చేయబడినవి. దీనిని గురించి ఇంకా

కొన్ని కట్టుదిట్టాలు చేస్తూ సభాయుతుడైన ఇంగ్లీషురాజుగారు ఒక "ఆర్డర్ ఇన్ కవున్సిల్" జారీచేయడానికి అధికార మివ్వబడింది. ఆ ప్రకారం ఒక ఉత్తర్వు జారిచేయబడింది. ఈ ఫండు వడ్డీలో నుంచి యీ ఉద్యోగుల కుటుంబములు కివ్వబడు ఉపకారవేతనములను గురించీ వివరాళములను గురించీ తగునిబంధనలు చేయబడినవి.

సివిలు మిలిటరీ ఆఫీసర్ల కుటుంబముల పించను ఫండు పుట్టుపూర్వోత్తరముల చరిత్ర చాలా చిత్రమైనది. బ్రిటిష్ రాజ్యతంత్ర ప్రారంభమున మొగలాయి రాజప్రతినిధిన్ని వంగరాష్ట్ర నవాబున్నూ అయిన సురాజుద్దౌలాపట్ల మీర్జాఫరు చేత స్వామిద్రోహము చేయించి క్లైవు అమితధనమును లంచముగా తీసికొని మీర్జాఫరును వంగరాష్ట్ర నవాబుగా చేశాడు. క్లైవు 1765లో మూడవసారి గవర్నరుగా వస్తూవున్న సంగతి తెలుసుకొని మీర్జాఫరు తన అవసానకాలం సమీపిస్తున్నందువల్ల క్లైవు తన కుమారుడి కేదైనా ఉపకారము చేయగలడనేనమ్మకంతో మీర్జాఫరుతన మరణశాసనంలో క్లైవుకు 70 వేల నవరసులు చెందచేస్తూ చనిపోయినాడు. అప్పటికే అన్యాయవిత్త సమార్జనము చేసినట్లు క్లైవుమీద ఇంగ్లాండులో ఫిర్యాదు లున్నందువల్ల అతడీ సొమ్మును తీసుకొని స్వప్రయోజనంకోసం వినియోగించుకోవడానికి సందేహించి ఈసొమ్మును ఒక ధర్మనిధిగా ఏర్పరచి దానిమీద వచ్చే ఆదాయాన్ని తూర్పు ఇండియా వర్తకకంపెనీవారి కొలువులో పనిచేసి సివిలు మిలిటరీ ఉద్యోగులలో జబ్బుపడిగాని అపాయమువలన అశక్తులైనగాని అసహాయులుగా నున్నవారి కుటుంబములకు ఆకస్మిక మరణము పొందువారి భార్యాబిడ్డలకున్నూ ధనసహాయం చేయుట కుపయోగించవలసిన దని చెప్పి క్లైవు ఆ సొమ్మును కంపెనీవారికిచ్చాడు. అందువల్ల ఈ నిధికి "క్లైవు ఫండు" అని పేరు వచ్చింది.

తమ ఉద్యోగులకు సహాయము చేయవలసిన బాధ్యత కంపెనీ ప్రభుత్వం వారికి కూడా ఉన్నది. కంపెనీ ప్రభుత్వం వారికి కూడా ఉన్నది. అందువల్ల వారీ సొమ్ముకు నూటి కెనిమిది వంతుల చొప్పున అదనముగా చేర్చి ఆ మొత్తమును వృద్ధిచేస్తూ వచ్చారు. తరువాత భారతదేశంలో పనిచేసే ఉన్నతోద్యోగులకు ఐ.సి.ఎస్. మిలిటరీ ఉద్యోగులకు, వారి వితంతువులకు, పిల్లలకు సహాయం చేయగలందుల కేర్పరుపబడిన వేర్వేరు నిధులు, కుటుంబ పింఛనుల ఫండులును ఏర్పరుపబడి ఉద్యోగుల జీతములనుండి ప్రతినెలలో కొంతసొమ్ము లీ నిధికి వచ్చి చేరినవి. ఇంగ్లీషు పార్లిమెంటువారి తనిఖీక్రింద కంపెనీ ప్రభుత్వంవారే ఈ ధర్మనిధిని సక్రమంగా పరిపాలించేవారు.

హిందూదేశంలో 1858లో కంపెనీ పరిపాలన రద్దు చేయబడి ఇంగ్లీషు రాజుమకుటం క్రింద పరిపాలింపబడడం ప్రారంభం కాగా ఈధర్మనిది, నిర్వహణ



బాధ్యతలను ఇండియా ప్రభుత్వంవారే వహించారు. ఇంగ్లాండులో వడ్డీరేటు చాలా తక్కువగా నున్నందువల్ల మారకం రేటుతో నిమిత్తం లేకుండా శాశ్వతంగా ఈనిధి సొమ్ముపైన నూటికైదు చొప్పున వడ్డీనిచ్చే బాధ్యత ఇండియా ప్రభుత్వంమీద వేయబడింది. ఈసొమ్ము ఇంగ్లాండులోని ఉద్యోగులు కుటుంబములకు సక్రమంగా చెల్లించబడుతూవుంది. దీనిలాభములు ఐ.సి.ఎస్. వగైరా శాఖలలో ఉద్యోగంచేసి తెల్లవారితో సమానంగా భారతీయులకు చెందవు. వారికి వేరే కొన్ని ఏర్పాటులు చేయబడియున్నవి.

(చూడు- భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము. - దిగవల్లి వేంకటశివరావు, పుటలు 269-276)

*- ఆంధ్రపత్రిక, **12.11.1943***



# "దిట్టము" అనే రైత్వారీ అమరకం

**తూ**ర్పు ఇండియా వర్తకసంఘంవారి పరిపాలనలో హిందూదేశ ప్రజలకు గల కష్టాలనుగురించి చెన్నపట్నం దేశీయ ప్రజాసంఘం (మద్రాసు నేటివు అసోసియేషను) వారు ఇంగ్లాండులో కామన్సు సభవారికి 10-12-1852వ తేదీన పంపిన మహజరు 26వ పేరాలో ఈ కింది సంగతులు వుదాహరించారు.

"రైత్వారీ పద్ధతిలో ప్రభుత్వోద్యోగులు ఎలాంటి క్రూరకృత్యాలు జరిగిస్తున్నారో తమకు విశదం కాగలందులకు ఇటీవల 1851లో జరిగిన సంగతులను గురించి తమకు నివేదిస్తున్నాము; గుంటూరుజిల్లాలో కలెక్టరు గారి అధికారం కింద వుండే రైతులు కొందరు తమ బాధలను గురించి ఆకలెక్టరు గారికి చెప్పకున్నప్పటికీ కలెక్టరుగారు వారి మొర లాలకించనందువల్ల జిల్లాకలెక్టర్ల పైన అధికారిగావున్న ఉత్తర సర్కారుల కమిషనరుగారికిన్నీ, రివిన్యూబోర్డువారికిన్నీ, సభాయుతులైన చెన్నపట్నం గవర్నరుగారికిన్నీ యీకిందివిధంగా అర్జీలు ఇచ్చుకున్నారు.

"కిందటి సంవత్సరం జరిగిన దిట్టం అనే సాలువారీ అమరకంలో అరు తాలూకాలలో తాశీల్దారులు జారీచేసిన దిట్టంపట్టాలను రైతులు పుచ్చుకోకుండా నిరాకరించారు. కారణం ఏమిటంటే ఆతాశిల్లారులు తయారు చేయించిన దిట్టంపట్టాలలో అదివరకు పనికిమాలినవైనందువల్ల రైతులు విడుదల పెట్టిన భూములనుకూడా చేర్చారు. పైగా మామూలుగా కొలిచే పగ్గాలతో గాక వాటి కంటె ఒక మూరెడు తక్కువ పొడుగుగల పిచ్చపగ్గాలు పెట్టి, భూములకు కొల్తలు వేయించారు. ఇలాగ తయారు చేసినదిట్టం పట్టాల మీద సంతకాలు చేయించారు. ఇలాగ తయారు చేసిన దిట్టం పట్టాల మీద సంతకాలు చెయ్యవలసిందని రివిన్యూ వుద్యోగులు రైతులను బాధించారు. బెత్తాలతో కొట్టి, అనేకవిధాలుగా హింసించి ఖైదులో వుంచి నిర్బంధించి బలవంతం చేశారు. ఇది చూచి తమకు కూడా యీ అవస్థపడుతుందనే భయంతో ఆతాలూకాలలో వుండే రైతులు కొందరు గ్రామాలు వదలి పారిపోయారు. అలాగ పారిపోయినవారికి కూడా బాధలు తప్పలేదు. వారివారికి నిర్ణయించిన భూములను నమోదు చేసిన పట్టాలమీద పారిపోయిన



వాళ్లపేర్లను ఆ గ్రామకరణాలే సృష్టింపులు చేయించారు. పారిపోకుండా వున్న రైతులు ఇదిచాలా అక్రమమని కలెక్టరుగారికి మొరపెట్టుకున్నారుగాని, దిట్టాలను మార్చడానికి వీలులేదని కలెక్టరుగారు అన్నారు. కొన్నాళ్లకు జమాబందీ వచ్చింది. ఆపట్టాలను బట్టి తమపైన విధించిన హెచ్చు మొత్తాలను చెల్లించడానికి రైతులు నిరాకరించారు. అంతట రివిన్యూ అధికారులు రైతుల యింటికప్పులను పీకి ఆకలపను, వాళ్ల నాగళ్లనూ, దుక్కి టెద్లనూ, విత్తనంగింజలనూ, పశువుల మేతనూకూడా జప్తు చేసి వేలంవేయించారు. ఇలాగ చేసినా గ్రామమొత్తం మీద ఇంకా చాలాసొమ్ము వసూలు కాకుండా దిగబడింది. ఆశిస్తుబకాయికి హామీగా కొందరు రైతులను పట్టుకొని ఖైదులో వుంచారు. రివిన్యూ బంట్రౌతులు కొందరి ఇళ్ళలో జొరబడి చేతికి దొరికిందల్లా లాక్కుని లూటీచేశారు. ఈజప్తుచేసిన ఆస్తిని వేలంవేయగా వచ్చిన సొమ్ములోనుంచే ఈ బంట్రౌతులకు బత్తెము యిచ్చారు. రైతుల మందపశువులను మేయనివ్వకుండా నిరోధించారు. ఊరి చెరువులలో నుంచీ బావులలో నుంచీ మంచినీళ్లు తెచ్చుకోకుండా రైతుల భార్యలను నిరోధించారు. ఈ అక్రమాలను గురించి సభాయుతుడైనగవర్నరుగారి కిచ్చుకున్న అర్జీ మామూలు ప్రకారం సంజాయిషీనిమిత్తం ఆకలెక్టరుగారికే పంపించబడింది. ఈలోపుగా అకలెక్టరు గారు సెలవు పెట్టినందువల్ల ఆ అర్జీ అవాహనా విసర్జనా లేకుండా అలాగే పడివుంది. ఇటీవల జరిగిన సంగతులను గూర్చి పైన చెప్పిన ఒక్క వుదాహరణాన్ని మాత్రమే తమ కిప్పుడు మేము మనవిచేసినా ఇలాంటి అక్రమాలు దేశమంతటా జరుగుతూనే వున్నాయని చెప్పడానికి సందేహమేమీ లేదు."అని వ్రాశారు. 'దిట్టము' అనేది రైతులకూ సర్కారుకూ ప్రతిసాలునా జరిగే అమరకం ఏర్పాటు ప్రతిగ్రామంలోనూ వుండే భూమి యావత్తూ పొలాలుగా విబజించబడి ఆ పొలాలన్నీ కరణం గారి పుస్తకములో వరసగా నమోదు అయివుంటాయి. కరణంగారు ఆలెక్కలో పొలం విస్తీర్ణము దానితరగతీ, శిస్తురేటు, ఆపొలంమీద వసూలు కావలసిన శిస్తు మొత్తమూకూడా నమోదు చేస్తాడు. సాగుచేయడం ప్రారంభం కాగానే ఏమిపైరు వేసినదీ కూడా నమోదు చేస్తాడు. పదిహేనురోజుల కొకమాటు, నెలకొకమాటు జమాబందీ వచ్చేవరకూ ఆజమాయిషీ చేస్తూ ఆలెక్కలను తాశిల్దారును పంపిస్తాడు. సాగుతరుణం రాగానే జూలై సెప్టెంబరు నెలల మధ్య దిట్టం అనే ఏర్పాటు జరుగుతుంది. అప్పుడు తాలూకారివిన్యూ అధికారులు గ్రామానికి వచ్చి ఏరైతు ఏపొలం సాగుచేయవలసినదీ నిర్ణయిస్తారు. ఇందుకోసం తాలూకాను మూడు నాలుగు ఫిర్కాలుగా విభజించి ఒక్కొక్క ఫిర్కాలో ఒక్కొక ఉద్యోగి ఈ ఏర్పాటు జరిగిస్తాడు. ఆ వుద్యోగి గ్రామానికి రాగానే గ్రామరైతులూ గ్రామకరణమూ మునసబూ ఆయన దగ్గిరకు వస్తారు. మామూలుగా

ఒకరైతు సాగుచేస్తూవున్న పొలం ఏదని అడిగి సాధారణంగా దానిని అతనికే యిస్తాడు. సాగుచేయకుండా దిగబడిన పొలాలు ఏవూనా వుంటే అవి ఎవరో ఒకరు సాగుచేసేటట్టు "కట్టుదిట్టం" చెయ్యాలి. భూముల మార్పిళ్లుకూడా రిజస్టరు చేస్తాడు. భూమిని దున్నకుండా రైతు పాడుపెట్టినట్టైతే మందలిస్తాడు. గ్రామమొత్తంమీద పొలాలన్నీ సక్రమంగా అమరకం చేయించడానికి ప్రయత్నిస్తాడు. తరవాత జమాబందీ జరుగుతుంది. అప్పుడు రైతులిచ్చుకున్న అర్జీలను విచారిస్తారని పేరు,కాని సాధారణంగా ఆలనపాలన చాలాఅరుదు. తరువాత ఆ ప్రకారం అమర్చబడిన భూములకు పట్టాలు జారీచేస్తారు. ఆకాలంలో సాగుచెయ్యడానికి వీలైన భూమినీ సాగుచెయ్యడానికి వీలులేని భూమినీకూడా పట్టాలలో చేర్చేవారు. సాగుచేయనిభూమికి శిస్తుముజరా (రిమిషను) యిస్తా మని అనేవారుగాని, ఆచరణలో పట్టాశిస్తు మొత్తం యావత్తూ వసూలుచేసేవారు. రిమిషన్లు బహు అరుదుగానూ, తక్కువగానూ యిచ్చేవారు. ఇందులో జరిగే అన్యాయాలు చాలా ఎక్కువ. గ్రామమొత్తంమీద తాలూకా మొత్తంమీద జిల్లామొత్తంమీద చెల్లింపవలసినశిస్తు యావత్తూ వసూలు చెయ్యాలని రివిన్యూబోర్డునుంచి తాకీదులు వస్తూవున్నందువల్లను, బకాయిలేకుండా శిస్తులు వసూళ్లు చేయించినకలెక్టర్లు చాలా గట్టివాళ్లని మెచ్చుకుంటూ వున్నందువల్లను, కలెక్టర్ల మెహర్బానీకోసం తాశిల్దారులు గ్రామాల మీద పడి రైతులను తిట్టికొట్టి చిత్రహింసలు పెట్టి శిస్తులు వసూల్లు చేసేవారు. దీనిని గురించి 1855లో ఒక విచారణ కూడా జరిగింది.

(The condition and Requirements of Madras John Bruce Norton pp 131-132) (1854).

– *ఆంధ్రపత్రిక, 31.10.1943*





# భారతదేశ సంస్కృతిని ఉద్ధరించిన పాశ్చాత్యులు

ఇంగ్లీషు తూర్పు ఇండియా వర్తక కంపెనీ వారికాలము 1783లో కలకత్తాలోని సుప్రీం కోర్టు న్యాయాధిపతిగా నియమింపబడిన సర్ విలియం జోన్సుగారు 1784లో నిట్లు వ్రాసిరి: "సంస్కృత భాష యెంత పురాతనమైనదో చెప్పుట కష్టముగాని, ఆ భాషయొక్క లక్ష్య లక్షణములు మాత్రము అత్యద్భుతములైనవి. సర్వాంగ సుందరమైనదని పాశ్చాత్యులనుకొనుగ్రీకుభాషకన్న నది సుందరమైనది. లాటినుకన్న పుష్టికరమైనది. ఆ రెండు భాషలకన్నను నాగరకమైనది" సంస్కృత భాషనుగూర్చి పరిశోధనలను జరుపుట కీయన కలకత్తాలో బెంగాల్ ఏసియాటిక్ సొసైటీ అనునొక సంఘమును స్థాపించిరి. జోన్సుగారు భారతదేశ సంస్కృతిని గూర్చి చేసిన పరిశోధనలను ప్రకటించుటయే గాక కాళిదాస మహాకవి విరచితమైన శాంకుతల మున కింగ్లీషులో నొక అనువాదమును ప్రకటించిరి. అంతట పాశ్చాత్యులకు సంస్కృత వాఙ్మయమునందు అభిరుచి కలిగి ఐరోపా దేశములోని వివిధ రాజ్యములలోని విశ్వవిద్యాలయములందు సంస్కృత భాషను, సాహిత్యమును బోధించు ఆచార్య పీఠములను స్థాపించిరి. పలువురు పాశ్చాత్య విద్వాంసులు సంస్కృతము నభ్యసించి దాని గొప్పదనమును గూర్చి వ్రాయసాగిరి. అంతట భారతీయులు కన్ను తెరచి తమ పూర్వ విజ్ఞానమును గూర్చి గర్వపడిరి. భారతీయ నాగరికతను గూర్చి మాక్సుమూలరు, మానియర్ విలియమ్సు మొదలైన జర్మను, ఆంగ్లేయ విద్వాంసులు చేసిన ప్రశంసలే భారతీయులు ఆధునిక పద్ధతులతో సంస్కృతమును అభ్యసించుటకు కారణమైన సంగతి ఆశ్చర్యకరముగా తోచవచ్చునుగాని ఇది సత్యమైన విషయము. భారతదేశములోని విద్యావంతులు, పాశ్చాత్యులు, ఇంగ్లీషులోని కనువదించిన గ్రంథములను చదివిన పిమ్మటనే ఆ వాఙ్మయము యొక్క స్వారస్యమును గ్రహింపగలిగి రనుటలో నతిశయోక్తిలేదు.

మాక్సుమూలరుగారు తూర్పు దేశపు పవిత్ర గ్రంథములను పేరుతో (Sacred Books of the East) ప్రకటించిన గ్రంథ ములవలన భారతీయ వేదాంత తత్త్వశాస్త్రము

లను పాశ్చాత్యులు పఠించుటకు వీలైనది. ఇంత గొప్ప విజ్ఞానమును, సంస్కృతియు భారతదేశమునకు కలవనుజ్ఞానము కలుగుటతో భారతీయులందు దేశాభిమానము వర్ధిల్లినది.

భారతీయులు గొప్పవారను భావము కలుగుటకు గల కారణములలో భారతదేశ పూర్వ చరిత్ర జ్ఞానము ప్రధానమైనది. అయితే భారతదేశ చరిత్ర మొన్నమొన్నటి వరకును విస్మృతమై యుండెను. పాశ్చాత్య విద్వాంసులెంతో కష్టపడి మెల్లమెల్లగా క్రమక్రమముగా మన పూర్వ చరిత్రను గూర్చిన యంశములనెల్ల పరిశోధించి, వానినిక్రోడీకరించి సమగ్రమైన చరిత్రను పునర్నిర్మాణము గావించిరి. వారట్లు చేయక పూర్వము మనకు మన చరిత్ర తెలియనే తెలియదు. చంద్రగుప్త మౌర్యుడును గ్రీకువీరుడగు అలెగ్జాండరును సమకాలీనులను, చరిత్రాంశము స్థాపింపబడుటతో కాలనిర్ణయముతోడి చరిత్రరచనకు వీలుకలిగినది. అశోకుని శిలా శాసనముల లిపిని తెలిసికొని అందలి చరిత్రాంశములను ప్రకటించుటతో భారతదేశ చరిత్రలో వొక అపూర్వమైన ఘట్టము ప్రఖ్యాతికి వచ్చేను.

ఈ భారతజాతి కేవలము విదేశీయులక్రింద పడియుండటయే గతిగా గల జాతి కాదనియు, అనేక శతాబ్దములపాటు స్వాతంత్ర్యము ననుభవించిన దనియు, మహోన్నత నాగరితక ననుభవించినదనియు, భారతీయులు గ్రహింప గలిగిరి. ఊరుపేరు లేకుండా మాసిపోయిన మహాపురుషుల చరిత్రలు బయల్పడినవి. విస్మృతములై పోయిన సామ్రాజ్యములు చరిత్రలు వెల్లడియైనవి. దేశదేశాంతరములందు వ్యాపించిన భారత నాగరికత ప్రచారమునకు వచ్చినది. ఇది భారతీయులకు తమ జాతీయ గౌరవమును గూర్చి గర్వపడుటకు గొప్ప కారణమైనది.

ఈ చరిత్ర పరిశోధనమునకును చరిత్ర యొక్క పునర్మిర్మాణమునకును సంస్కృతవాఙ్మయ ప్రకటనమునకును ఇంగ్లీషు పరిపాలకులు తోడ్పడిరి. ఇందుకు వారిపట్ల మనము కృతజ్ఞులమైవుండవలెను.

బెంగాల్ ఏషియాటిక్ సొసైటీ కార్యదర్శియైన జేమ్సు ప్రిన్సెపుగారు 1834లో అశోక శిలాశాసనములు లిపి, భాషలయొక్క కీలకమును కనుగొనగలిగిరి. దీనితో భారతదేశ చరిత్ర రచనమున నొక మహావిప్లవమే కలిగినది.

1860లో అలెగ్జాండర్ కన్నింగుహామ్‌గారు పురాతత్వ పరిశోధకశాఖ (ఆర్కియోలాజికల్ డైరెక్టర్) అధికారిగా నియమింపబడిరి. ఫెర్గుసన్ గారు భారతదేశములోని పురాతత్వ నిర్మాణములయందలి శిల్ప విశేషములను గూర్చి పరిశోధనము చేసి ప్రకటించుటతో భారతీయుల లలిత కళలయందు దేశీయులకును, విదేశీయులకును కూడా అభిరుచి కలిగినది.

భారతదేశము బ్రిటిష్ ప్రభుత్వమువారి క్రింద ప్రాచీన శిలా శాసనలిపి పరిశోధకునిగా డాక్టర్ హల్‌ట్జు గారిని నియమించుటతో భారతదేశ పూర్వ చరిత్ర పరిశోధనమునకును పునర్నిర్మాణమునకును రాజమార్గ మేర్పడెను. భారతదేశములో నలు ప్రక్కలను పురాతన శాసనములకొరకు గొప్ప అన్వేషణము ప్రారంభమయ్యెను. పూర్వ శాసన లిపిని చదువుట ప్రారంభమయ్యెను. దీని ఫలితముగా పూర్వ చరిత్ర నిర్మాణమునకు కావలసిన సాధన సామగ్రి లభింపసాగెను. ఈ పరిశోధన ఫలితముగా భారతీయులందు కలిగిన దేశాభిమానము వర్ణనాతీతమైనది.

నేడు మనము మౌర్యులను గూర్చికాని గుప్తచక్రవర్తులను గూర్చికాని శాతవాహనులను గూర్చికాని పల్లవులనుగూర్చికాని చాళుక్యులనుగూర్చి కాని చోళులను గూర్చికాని గర్వముతో సంస్మరించి ఆనాటి చరిత్రాంశములను వివరింపగలుగు చున్నామనినచో నాయా యుగములచరిత్ర విస్మృతమై యుండగా అందలి చరిత్రాంశముల నెల్ల పరిశోధించి అది అంతయు బయటికి తీసి పూసగ్రుచ్చినట్లొక చరిత్రను వ్రాసి మనకు ప్రసాదించి మహోపకారమును చేసిన పాశ్చాత్యుల యొక్కయు, ముఖ్యముగా ఇంగ్లీషు దొరల యొక్కయు కృషివల్లనే అట్లు చేయగలుగుచున్నాము. ఈ దొరలలో కొందరు భారతదేశమున ఇంగ్లీషు దొరతనము వారి కొలువులో నుద్యోగములు చేయుచు తమ తీరిక వేళలలో నిట్టి పరిశోధనలు సాధించినవారు. కొంతమంది కేవలము పరమార్థ చింతతో పనిచేసిన మహానుభావులు.

భారతదేశ చరిత్రమునేగాక బౌద్ధమతమును గూర్చిన విశేషములను, పాలీభాషను, పాలివాఙ్మయమును పరిశోధించి బయటకు తీసినవారుకూడా పాశ్చాత్య విద్వాంసులే. ఒక వేయి సంవత్సరములు పాటు విస్మరింపబడి రూపుమాసిపోయిన బౌద్ధమత ధర్మములను గూర్చి తలచినవారే లేరు. సంస్కృతములోనున్న బౌద్ధగ్రంథములనుకూడా చదివినవారు లేరు. బౌద్ధమతమన్న మనసంస్కృత విద్వాంసుల కసహ్యము. అందువలన వారు వానిని చదివి చెప్పరైరి. బుద్ధునొక అవతారముగ జేసి మత ధర్మములకు ప్రత్యేకత లేకుండా చేయుటతో నది రూపుమాసిపోయెను. పాశ్చాత్యులు దీనిని బయటకు తీసి ఆ చరిత్రయంతయు ప్రకటించిరి. ఇట్లే అశోకుని గూర్చి పరిశోధించి ఆ చరిత్ర ప్రకటించినవారు ఇంగ్లీషు విద్వాంసులే. భారతీయ విగ్రహముల శిల్ప సౌందర్యమును గ్రహించి ప్రశంసించినవారు కూడా పాశ్యాత్యులే. వీని యందమునకు ముగ్ధులై మన దేశమునకు మొదట వచ్చిన పాశ్చాత్యులు కొందరట్టి విగ్రహములను దేవాలయమునుండి

దొంగిలించికొనిపోవుచుండిరి.

భారతీయుల లలిత కళల యొక్క పాశస్త్యమును గ్రహించి లోకమునకు చాటిన గుణగ్రహణ పారీణులైన పాశ్చాత్య విద్వాంసుల రచనలవలననే భారతీయులకుకూడా వానియందు అభిరుచి కలిగెను. సంగీత సాహిత్యములు తప్ప భారతీయులు తక్కిన లలిత కళలను తమ పూర్వులు తమకు ప్రసాదించిన అమూల్యమైన సంస్కృత సంపదయని గ్రహింపనేలేదని శ్రీ కె.యం. పణికర్‌గారు తమ చరిత్రలో వ్రాసిరి. పందొమ్మిదవ శతాబ్దారంభమున ననగా 1800-1820 మధ్యకూడా ఎల్లోరా, అజంతా, మహాబలిపురము, అమరావతి మొదలగు ప్రదేశములందలి శిల్పములను గూర్చి భారతీయులెరుగనే ఎరుగరు. ఎలిఫెంటా గుహాలయముల శిల్ప సౌందర్యముగాని చోళరాజుల కాలమునాటి కంచు విగ్రహముల శిల్ప సౌందర్యమును గూర్చి గాని మనకు తెలియనే తెలియదు.

మన శిల్పకారులా యమూల్య శిల్ప సంప్రదాయములను వంశానుగతముగా నభ్యసించి దానిని కాపాడుచు వచ్చుచున్నను మన దేశ ప్రజలు పదునెనిమిదవ శతాబ్దిల అరాజకమునందు ప్రాణమానధనములకు రక్షణ లేనందువలనను తరువాత పందొమ్మిదవ శతాబ్దిలో పాశ్చాత్యుల విజాతీయనాగరికతా వ్యామోహమునందు మునిగి తన దేశ విద్యలపట్ల విముఖులగుటవలనను బారతదేశములో ముఖ్యముగా నుత్తర హిందూస్థానము నందు మన సంస్కృతి మాటుమణిగినది. హావెల్‌గారును ఆనందకుమారస్వామిగారును మన లలిత కళలయొక్క ప్రాశస్త్యమును శిల్ప సౌందర్యమును వెల్లడించువరకును మనవారిలో కదలిక పుట్టలేదు. నిజమునకు ఇంగ్లీషు పరిపాలనము వలన మనకు కలిగిన లాభములో నీపైన చెప్పినవాని విలువ, కాలము గడచిన కొలదియు ప్రజలుగ్రహించి కృతజ్ఞతతో స్మరింపగలుగుదురు.

## అమరావతి స్తూప పరిశోధనము

ఆంధ్ర సాతవాహన రాజవంశ చరిత్ర నిర్మాణమునకు ఆంధ్ర శిల్ప విజ్ఞానమునకు తోడ్పడిన పరిశోధనములతో అమరావతి స్తూపములో బయల్పడిన శాసనములు శిల్ప ఖండములు చాలా ప్రాముఖ్యము వహించినవి. ఇట్టి స్తూపమొకటి యున్నట్లు గాని దీని చరిత్ర ప్రాధాన్యముగాని 1867 వరకు భారతదేశములోని విద్యాధికులు గాని ఆంగ్ల చరిత్రకారులుగాని గమనింపనే లేదు. ఎర్లీహిస్టరీ ఆఫ్ ఇండియా అను భారతదేశ చరిత్ర గ్రంథమును రచించిన విన్సెంటు స్మిత్‌గారు అటుపిమ్మట హావెల్ గారును దీనిని గూర్చి వ్రాసిన పిమ్మటనే మన చరిత్రకారుల దృష్టి నాకర్షించినది. ఈ స్తూపమును బయటికి



తీసినవారు ఆంగ్లేయులే. తూర్పు ఇండియా వర్తకసంఘము వారు భాతరదేశము నాక్రమించి పరిపాలించుట ప్రారంభించిన కాలమున కర్నల్ కోలిన్ మెకంజ్ అనునతడు 1782లో మనదేశమునకు వచ్చి మద్రాసులోని కంపెనీ సేనలో వొక ఇంజనీరుగా ప్రవేశించెను. అతడు 1783 మొదలు చెన్న రాజధానిలోని కంపెనీ సేనలతో వివిధ ప్రాంతములందు సంచరించసాగెను.

ఆ సందర్భమున తూర్పు కనుమల లోయలలో తిరిగి ఒంగోలునుండి దత్త మండలములకు రహదారీ మార్గమును గూర్చి యొక పటమును తయారు చేయుటలో అతని తెలివితేటలపై యధికారము చేయుటలో అతని తెలివితేటలు పై యధికారుల నాకర్షించెను. 1790లో గుంటూరు మండలమును సర్వేచేయుట కాలనికి ఉత్తరువు లిచ్చిరిగాని, 1790 - 92 మధ్య కంపెనీవారికి మైసూరు ప్రభువగు టిప్పు సుల్తానుకు జరిగిన యుద్ధమువలన నా పనికి అంతరాయము కలిగెను. ఆ యుద్ధానంతర మాతనిని ఏలూరుకు బదిలీచేసిరి. కడప, కర్నూలు, నల్లమల ప్రాంతముల, రాయలసీమ, నెల్లూరు, గుంటూరు మండలములను సర్వే చేయవలసినదని గవర్నరు జనరలైన కారన్ వాలీసుగా రీయన నాజ్ఞాపింపగా ఇతడు తన యుద్యోగధర్మము నిర్వహించుట తాను సంచరించిన ప్రాంతము లందరి పురాతన దేవాలయములను, శిల్పములను, శాసనములను చూచి ముగ్ధుడై ఏలూరు కాపురస్థుడగు కావలి వెంకట బొర్రయ్యాగారి యొక్కయు, ఆయన సోదరుల యొక్కయు సహాయముతో స్థానిక చరిత్రలకు శిలాశాసనము ప్రతులను పురాతన గ్రంథములను పాతనాణెములను సేకరింపసాగెను. అతడు 1810లో మద్రాసు ప్రాంతమున సర్వేయరుగా నియమింప బడెను. 1811 - 1815 మధ్య జావా ఆక్రమణ సేనతో వెళ్ళవలసి వచ్చెను. 1816లో తిరిగివచ్చి పిమ్మట కంపెనీ ప్రభుత్వము వారితనిని భారతదేశ సర్వేయరు జనరలుగా నియమించిరి. అతడు 1821 వరకు నా పనిలో నుండి మరణించెను. అతని జీవితకాలములో నెంతో కష్టపడి సేకరించిన చరిత్ర సామగ్రి నెల్ల గవర్నరు జనరలైన మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సుగారు ఆయన భార్యకు పదివేల సవరను లిచ్చి కొనసీమ కంపిరి. ఇతడు సేకరించిన చరిత్రాధారముల గ్రంథములు కొన్ని మద్రాసులో కంపెనీవారి కాలేజి గ్రంథాలయమున భద్రపరచిరి. చరిత్ర సామగ్రి గల 48 సంపుటములు మద్రాసులోని ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమయందున్నవి.

కర్నల్ కోలిన్ మెకంజిగారు 1797లో కృష్ణాజిల్లాలో సంచారము వేయుచుండగా అమరావతి దగ్గర భూమిలో పూడుకొని పోయిన అమరావతి స్థూప మాయన దృష్టి నాకర్షించెను. అంతకుపూర్వము రెండు మూడు సంవత్సరముల క్రిందట చింతలపాటి

జమీందారుగారగు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు అక్కడి అమరేశ్వరాలయము పైన భక్తి కలిగి, తమ రాజధాని నక్కడ స్థాపింపదలచి భవనములను నిర్మించుటకు రాళ్లకొరకు దీపాల దిన్నెయనునొక మంటిదిబ్బను త్రవ్వించి అమరావతికి పడమర నరమైలు దూరమున ధరిణికోటయు పురాతన నగర గోడలను బ్రద్దలు కొట్టించి ఆ రాళ్లనుపయోగించుకొనుచుండిరి. దేవాలయ నిర్మాణమునకును. భవన నిర్మాణమునకును రాళ్ల నుపయోగించు సందర్భమున ప్రాచీనములైన రాతిఫలకములపైన శాసనము లెన్ని రూపుమాసినవో చెప్పుట కర్థము. అయితే విగ్రహములు చెక్కిన రాతిపలకము లింకను మట్టిలో పూడుకొని యుండుటవలన నవి మెకంజీగారి దృష్టి నాకర్షించెను. అప్పుడాయన దీనిని గూర్చి కలకత్తాలోని* బెంగాల్ ఏషియాటిక్ సొసైటీవారికి వ్రాసి పంపిరి. (Asiatic Researches Vol. IX, Page 272)

అయితే దీనినిగూర్చి యపుడెవ్వరు నెట్టి పరిశోధనమును జరుపలేదు. అటుపిమ్మట కొంత కాలమునకు అనగా 1816లో కర్నల్ మెకంజీ గారు కలకత్తాలో భారతదేశ సర్వేయర్ జనరల్‌గా నియమింపబడి కన్యాకుమారినుండి ఉత్తరసర్కారు వరకూ పర్యటనము చేయుటలో ఆయనక్రింద సర్వేయర్లను, లేఖకులను నియమించి వివిధ ప్రాంతములందరి స్థానిక చరిత్రలను సేకరించుటలో కొన్ని శాసనములను సేకరించిరి. ఆ సందర్భమున దీపాలదిన్నె దగ్గరనున్న చరిత్ర శిథిలములను త్రవ్వించి బయటకు తీయించిరి. అమరావతి చైత్యముయొక్క స్థానమును చుట్టునుండు ప్రదేశముల యొక్క పటములను వ్రాయించిరి. ఆ పటముల యొక్క ప్రతి నొకదానిని బెంగాల్ ఏషియాటిక్ సొసైటీలో నుంచుటకును, మరియొక ప్రతిని మద్రాసులో నుంచుటకును ఏర్పాటుచేసి, మూడవ ప్రతిని ఇంగ్లాండులోని తూర్పు ఇండియా వర్తక కంపెనీ డైరెక్టరులను పంపిరి. ఆ ప్రతి ఇక్కడి పుస్తక భాండాగారమున ఉంచిరిగాని దాని వివరములు తెలుపు చరిత్ర లేనందున అది ఎవ్వరికి అవగాహనము కాలేదు.

ప్రాచీన శాసనలిపిని పరిశోధించిన జేమ్సు పిన్సెపుగారు1837లో నా ప్రతులలోని రెండు శాసనములను భాషాంతరికరించి సొసైటీవారి పత్రికలో ప్రకటించిరి. 1840లో సర్ విలియట్‌గారు గుంటూరులో ఉత్తర సర్కారుల కమిషనరుగా నుండుట తటస్థించెను. పూర్వము కర్నల్ మెకంజీ గారు త్రవ్వింక సడలీన ప్రదేశమెల నీయన త్రవ్వించి అందులో దొరికిన విగ్రహములు చెక్కిన రాతిఫలకములను ప్రోగుచేసి మద్రాసుకు పంపగా నవి పదునాలుగు సంవత్సరములు ఆవాసము విసర్జము లేక పడియుండెను. అటుపిమ్మట వానిని 1856లో ఇంగ్లాండునకు పంపిరి. అయితే 1857లో సిపాయిల విప్లవములని



కల్లోల సందర్భములందు వీనినెవ్వరు నాచరింపక "Fife House" ప్రశీబంధ్ల లను భవనము ఆవరణలో ఒక గుర్రపు సాలలో పడవేసి యుంపిరి. తరువాత భారతదేశ పురాతత్వ శాఖ కధ్యక్షులైన ఫెర్గుసన్ గారి రాతిఫలకములను 1867లో బయటకు పంపించి వానికి ఫోటోగ్రాఫును తీయించి దాని సాధన వలన పరిశోధనలను గావించుటకు ప్రయత్నించిరి. అమరావతి స్తూపము యొక్క ఆకృతి యొకటి ఆ ఫోటోగ్రాఫులలో కనబడుటవలన దాని సహాయమున అదివరకు లభించిన రాతిఫలకములా నిర్మాణములోనే యే ప్రదేశములలో నుండెనో గుర్తింప గలిగిరి. అంతటా ఆర్కియోలాజికల్ డిపార్టు మెంటు అను పురాతత్వ శాఖవారి ద్వారా అమరావతి స్థూపమును అక్కడి పురాతన నిర్మాణములు, పనిముట్లు మొదలైనవి త్రవ్వించి బయటకు దీయు పని ప్రారంభించిరి. ఈ శాఖవారు ప్రతి సంవత్సరము తాము చేసిన పనిని గూర్చిన నివేదికలు ప్రకటింప సాగిరి. అమరావతి స్థూపమును గూర్చి ఫెర్గుసన్ గారొక గ్రంథమును, బర్జెస్ గారొక గ్రంథమును రచించిరి. అంతట అమరావతి స్థూపము చరిత్ర కెక్కినది.

*– ఆంధ్రప్రభ, 17.4.1960*



# బ్రిటిష్ సైనికు దోపిడి గాథలు

**యు**ద్ధసమయమున సముద్రముపైన గాని, నదీ ముఖములందుగాని దొరికిన శత్రు నౌకలను, అందలి సరకులను పట్టుకొనిన వారే వానిని తీసికొని పంచుకొనుట చిరకాలమునుంచి వున్న ఆచారము. యుద్ధసమయమున సముద్రముపైనగాని, భూమిపైనగాని లభించిన శత్రురాజ్య ప్రజల ఆస్తినికూడా అలాగే పంచుకొను చుండిరి. శత్రువుల పట్టణములను పట్టుకొనునప్పుడు సైనికులు “లూటీ” చేసి యెవరికి దొరికినది వారు సంగ్రహించుటకూడా శాస్త్రీయముగనే పరిగణించుచుండిరి. దీనిని ఇంగ్లాండు దేశములో “ప్రైజ్” అని వ్యవహరించిరి. ఇట్టి ఆస్తి పంపిణీని గూర్చిన న్యాయశాస్త్ర విదులుకూడా స్థిర రూపమును దాల్చినవి. ఆస్తిని పంపిణీచేయు నధికారమును “అడ్మిరాలిటీ” న్యాయస్థానమునకును, కమిషనరులకును ఇచ్చిన ఇంగ్లాడు రాజ శాసనములు కొన్ని వున్నవి.

హిందూ దేశములోని రాజులును, నవాబులును తమ శత్రువులను జయించుటకు ఇంగ్లీషు వర్తక కంపెనీవారి సహాయమును పొందుట ప్రారంభించగా అట్టి యుద్ధములందు పట్టుకొనిన పట్టణములను ఇంగ్లీషు సైనికులు దోచుకొని లాభముల పొందుట ప్రారంభించిరి. ఇలా సైనికులు లూటీచేయుట చూచి ప్రజలు బయపడి “అయ్యా మీరు లూటీచేయకండి. లూటీచేసినచో మీరు లభింపగల సొమ్మును మేమే మీకు ఇచ్చుకొందు” మని బ్రతిమాలు కొనసాగిరి. ఆ ప్రకారం లూటీ చేసిన సొమ్మునుగాని, లూటీ చేయకుండా ప్రజలిచ్చిన సొమ్మునుగాని ఇంగ్లీషు సైనికులు తీసుకొని పంచుకొనుట ఆచారమైనది.

ఇంగ్లీషు వారికి ఫ్రెంచివారికి ఐరోపా దేశాలలో యుద్ధములు జరిగినప్పుడు హిందూ దేశంలో వర్తకంచేయు ఇంగ్లీషు ఫ్రెంచి వర్తక కంపెనీల వారు కూడా ఇక్కడ యుద్ధములు చేయుచు ఒకరి పట్టణము నింకొకరు పట్టుకొనుట. లూటీ చేసి ధన కనక వస్తువాహనములను పంచుకొనుట జరుగుచుండెను. ఇలా ఫ్రెంచివారొకసారి చెన్నపట్టణమును ఇంగ్లీషువారొకసారి పాండిచేరిని దోచుకొనిరి.



## దోపిడిసొమ్ముకై తగాయిదాలు

హిందూదేశంలో జరిగిన యుద్ధములందు, ఆంగ్లసైనికుల వశమైన పటట్టణము లందలి ధనకనక వస్తువాహనములను పంచుకొను విషయమున ఆంగ్లరాజుకొలువులో పనిచేయు సైనిక వర్గాల వారికి ఇంగ్లీషు వర్తక కపంపెనీవారికొలువులో పనిచేయు సైనికవర్గాల వారికి తగవులు వచ్చుచుండెను. అంతట ఇంగ్లాండునేలు రెండవ జార్జిరాజు 1758 జనవరి 14వ తేదీన హిందూ దేశంలోని తూర్పు ఇండియా వర్తకసంఘం వారికిచ్చిన లెటర్సు “పేటెంటు” అనబడు పట్టాలో “హిందూ దేశంలో ఎక్కడనైనను శత్రునగరమును పట్టుకొనినప్పుడు ఆంగ్లరాజు కొలువులోని నౌకాదళమువారుగాని, సైనికదళమువారుగాని హాజరుగనున్నచో, అక్కడ లభించిన ధనకనకవస్తు వాహనములు ఆంగ్ల రాజాధికారము క్రిందవే పంపిణీ చేయబడవలెనని, అలాకాక కంపెనీవారి సైనికదళములు మాత్రమే హాజరుగనుండినచో అక్కడ దొరకిన లూటీ సొమ్ము వారిష్టానుసారముగా పంపిణీ చేసి వినియోగంపవచ్చునని శాసించెను. ఆంగ్ల రాజ్యాధికారము క్రింద చేయబడు పంపిణీ ఇంగ్లాండు ప్రభుత్వాధికారులే నిర్ణయింతురు.

పైన చెప్పినట్టు ఆంగ్లసైనికుల లూటీ శాసనబద్ధము చేయబడగా, కంపెనీవారు తమ సైనికదళములు పట్టుకొనిన పట్టణములందు దొరికిన దోపిడి ధనము విషయంలో, ఫిరంగులు, మందుగుండు సామగ్రి తప్ప మిగిలిన ధనకనకవస్తు వాహనములలో సగము కంపెనీవారికి మిగిలిన సగము సైనికులకు చెందవలెనని నిర్ణయించిరి.

ఆంగ్లరాజు సైనిక, నౌకదళములు హాజరైన దండయాత్రలందు లభించిన ధనకనక వస్తువాహనములను పంపిణీచేయుటలో చాలా ఆసల్యము జరుగుచుండెను. కేవలము కంపెనీవారి సైన్యములు పాల్గొనిన దండయాత్రలందు లభించిన వానిలో సగము కంపెనీ వారు తీసికొనుటకూడా అన్యాయమని సైనికులకు తోచుచుండెను. దీనివల్ల అసంతృప్తి వ్యాపించెను. కొన్నిచోట్ల తెల్ల సైనికులు తిరుగుబాటు చేయుట జరిగెను. దేశీయసిపాయిలు కంపెనీ వారి ఉప్పుతిని నందులను విశ్వాసము కలిగివుండి ఇట్టి తిరుగుబాటు చేయకుండిరి.

## మచిలీపట్నం దోపిడి

ఇంగ్లీషువారు మొదట ఉత్తరసర్కారులలో ప్రవేశించినప్పుడు ఆనందరాజుగారితో లూటీ సొమ్ముతాము తీసుకొను నట్లేర్పాటు చేసికొనిరి. 1769 లో మచిలీపట్టణములోని ఫ్రెంచి వారిపైకి దండయాత్ర చేయు ఆంగ్లసైనిక దళమున కధిపతియైన కర్నల్ ఫోర్డు,

క్రింది సేనాధిపతులు, ఉద్యోగులు, సైనికులు అక్కడ దొరకు దోపిడి ధనము నంతయు పంచిపెట్టిన గాని మేము కదలిరామనిరి.

యూరప్‌లోను, హిందూ దేశములోను జరిగిన యుద్ధములందు ఇంగ్లీషు సైనికులు చేసికొను ప్రైజ్‌మనీ పంపిణీ పద్ధతులను స్వయముగా నెరిగిన వెల్లింగ్టన్ డ్యూక్ - నెపోలియన్ చక్రవర్తిని జయించిన ఆంగ్లేయ సేనాధిపతి దోపిడి ధనమనగా నెవరి చేతికి దొరికినది వారు తీసికొనుటయే యని నిర్వచించి వున్నారు.

హిందూదేశంలో నింగ్లీషు కంపెనీవారి సహాయంపొంది శత్రువులను నిర్జించిన నవాబులు, రాజులు శత్రువులు పట్టణాలు సైన్యాలు పట్టుకొనినప్పుడు అక్కడ నిస్సైనికులు ప్రత్యక్షంగా లూటీచేయుటకు బదులుగా లూటీవలన లభింపగలదని అంచనా వేయబడు ధనమును చెల్లించు పద్ధతి ప్రారంభించి కంపెనీవారిని తృప్తి పరుపజూపిరి.

అయితే అక్కడి పురవాసులవలన రాబట్టగలదానికన్న లూటీ హెచ్చు మొత్తం చెల్లింపవలసి వచ్చినదని ఈ ఆంగ్లేయుల నాశ్రయించిన రాజులు, నవాబులు బాధపడగా తమకు నిజంగా రాదగినదానికన్న చాల తక్కువ వచ్చినదని ఇంగ్లీషు సైన్యము బాధపడుచుండిరి.

## ప్లాసీయుద్ధం

1757లో వంగరాష్ట్ర నవాబైన సురాజ్‌ఉద్దౌలా దర్బారులోని ప్రభువులతో ఇంగ్లీషువారు కుట్రచేసి, మీర్జాఫర్‌చేత స్వామి ద్రోహం చేయించిన దాని ఫలితముగా ప్లాసీయుద్ధమున నవాబు సైన్యము లోడిపోయెను. సురాజ్‌ఉద్దౌలా వధింపబడి ఇంగ్లీషువారి చేతిలో కీలుబొమ్మయైన మీర్జాఫఱు నవాబైనాడు. ఆ సమయమున మూర్షిదాబాదు నగరము నందలి ఖజానా కోట్లలో నుండిన ధనకనక వస్తు వాహనాలకులెక్కలేదు. క్లయివును, ఆయన క్రిందివారు నెంత తీసికొన్నను అడుగువారు లేరు. నిజముగా వారెంత తీసికొనిరో లెక్కపెట్టినవారును లేరు. అయితే బహిరంగంగా పంపిణీ చేయబడిన దోపిడి ధనమును గూర్చిమాత్రం కొన్ని లెక్కలున్నవి. అక్కడి లూటీసొమ్ము మొదటి పంపిణీలో పెద్ద ఉద్యోగులకు ఈ క్రిందివిధంగా నీయబడెను.

| | | |
|---|---|---|
| గవర్నర్ డ్రేక్ | 31,500 | నవరసులు |
| క్లయివు | 2,11,500 | నవరసులు |
| వాట్సు | 1,17,000 | నవరసులు |
| మేజర్ కిల్‌పాట్రిక్ | 60,750 | నవరసులు |
| మానింగ్‌హామ్ | 27,000 | నవరసులు |
| బోడామ్ | 11,367 | ॥ |
| మాకెట్ | 11,367 | ॥ |
| అమియట్ | 11,387 | ॥ |
| పెర్బ్ | 58,250 | ॥ |
| వాల్ష్ | 58,250 | ॥ |
| క్రాఫ్టన్ | 22,500 | ॥ |
| మేజర్ గ్రాంట్‌కు | 11,250 | ॥ |

ఇంగ్లీషు వారు 1778లో పాండుచేరి నగరమును పట్టుకొనినప్పుడు లభించిన లూటీ సొమ్ము పదేండ్లవరకు పంపిణికాలేదు. 1781లో నాగపట్టణమును పట్టుకొన్నప్పటి దోపిడి ధనములో మొదటి పంపిణీ మాత్రము 1789లో జరిగినది.

## రెండవ మైసూరు యుద్ధం

రెండవ మైసూరు యుద్ధము జరిగినప్పుడు దోపిడి ధనము నంతయు కలిపి ఒక "ప్రైజ్ ఫండ్" లేక నిధిగా నేర్పరచి దండయాత్రలో సాక్షాత్తుగా హాజరుగా నున్నవారికే గాక ఇంగ్లీషు సైన్యముల వారందరికిని పంచి పెట్టెదమని సర్. ఐర్‌కూట్, తక్కిన ఉద్యోగులును కలిసి అనుకొనిరి. అయితే, నౌకా దళశాఖ వారిని ఈ ఏర్పాటులో చేర్చలేదు. ఆ యుద్ధములో నావికాదళమువారే చాలాకష్టపడి పనిచేసిరి. సైన్యములోని వారందరికి పంచినచో తమవాటా తగ్గిపోవునని వారనిరి. అంతట దండయాత్రలో సాక్షాత్తుగా పాల్గొనినవారికి మాత్రమే వాటా పంచవలెనని నిర్ణయించబడెను. దీని ఫలితముగా సర్. ఐర్‌కూట్‌కు వాటా లేకపోయెను. అంత ఆయన అసంతృప్తితో దీనినిగూర్చివ్రాసెను.

లార్డ్ కారన్‌వాలిస్ గవర్నర్ జనరలుగా నుండగా ఈ దోపిడి ధనము పంపిణి యధావిధిగా జరుగునట్టు చూచుటకు ప్రయత్నించెను. మూడవ మైసూరు యుద్ధారంభమునందు నలుగురు ప్రైజ్ ఏజెంట్లు అనబడు దోపిడి ధనవ్యవహార్తలు నియమింపబడిరి, ఇందులో నిరువురిని అంగ్లరాజ సైనిక దళములవారిని, ఇద్దరిని కంపెనీ సైనికదళము వారిని ఎన్నుకొనిరి. అంతట ఆ యుద్ధానంతరము ఇంగ్లీషువారిచేత చిక్కిన ధనము ఆఫీసరులకు వారివారి బత్తాల రేటునుబట్టి పంచిపెట్టబడెను.

సార్జెంటులకు, ప్రైవేటు సైనికులవలెనే బత్తాలుండినందువలన వారి బత్తాకు రెట్టింపు చొప్పున పంచిరి. ఈ యుద్ధానంతరము పంపిణీ విషయమై తగవులు రాలేదు గాని

ఆఖరు మైసూరు యుద్ధమున టిప్పుసుల్తాను మరణానంతరము శ్రీరంగపట్టణము పడిపోయినప్పుడు దానిని తామే బాహుబలము వలన పట్టుకొనినందువలన అందులో దొరికిన ధన కనక వస్తు వాహనములన్నీ పంచుకొనుటకు తమకు హక్కుకలదని ఇంగ్లీషు సైనికులు వాదించుచున్నారని గవర్నర్ జనరల్ వ్రాశాడు. నిజానికి అప్పుడు దొరికిన ధనకనక వస్తు వాహనములు పంపిణీ నిధిలో చేరనేలేదు. ఎవరికి దొరికినది వారు హరించిరి. మిగిలినదే దోపిడినిధిలో చేర్చబడినది.

74వ దళములోని ఒక ఆంగ్ల సైనికుడు టిప్పుసుల్తాను చేతికి ధరించు వజ్రములు తాపిన బాజీ-బంద్ (armlets) సంగ్రహించి దానిని కంపెనీవారి సర్జెన్‌కు 1500 రూపాయలకు విక్రయించెను. ఆ సర్జన్‌గారీ యాభరణమును రెండేండ్లు తన నడుముకు చుట్టుకొని తుదకు దానితో సాలుకు రెండు వేల నవరసులు ఆదాయము వచ్చు ఎస్టేటును సంపాదించెను. అప్పుడు లభించిన "ప్రైజ్ ఫండు" లేక దోపిడి ధననిధి విలువ 50,00,000 వరహాలు లేక 20,00,000 నవరసులుండెను.

అందులోని అమూల్యములైన ఆభరణములను అమ్ముట చాలకష్టముగా నుండి నందువలన చాలా మంది సైనికోద్యోగులకు ఈ యాభరణములనే వారికివ్వదలచిన వాటా క్రింద నిచ్చిరి. ఆసందర్భమునే "జనరల్ జాన్ పేటర్‌కు" అమూల్యమైన "ఎలిఫెంట్ పెరల్" అని ప్రసిద్ధికెక్కిన వెలలేని ఆభరణము లభించినది.

## శ్రీరంగపట్టణం లూటీ

క్రీస్తుశకం 1779వ సంవత్సరం మేనెల నాలుగవ తేదీన మైసూరు సామ్రాజ్య భానుడస్తమించెను. మహావీరుడైన టిప్పు సుల్తాను తన గాయములలో నుండి రక్తములు కారుచుండినను లక్ష్యపెట్టక చివర వరకును పోరాడి వీరస్వర్గ మలంకరించెను. శ్రీరంగపట్టణము తమ చేతులలో పడగానే ఆంగ్లేయ ప్రభువులు మామూలు ప్రకారము ఆ నగరమును కొల్లగొట్టుటకు తెల్లసైనికుల కనుజ్ఞనిచ్చిరి. వశమైన కోటరాజభవనములు పట్టణములోని అసంఖ్యాక ధనకనక వస్తు వాహనములు పరిమాణమును బట్టి ఈ లూటీ కొన్నాళ్ళు జరుగుటలో ఆశ్చర్యంలేదు. శ్రీరంగపట్టణము చాల ధనవంతమైన పట్టణంగా నుండుటవలనను, దొరికిన వస్తువులను,సొమ్ములను సేనాధిపతి మొదలుకుని సామాన్య సైనికుని వరకును, తెల్లదొర లందరును పంచుకొనవలసి యుండినందునను పెద్ద యుద్యోగులు ఎప్పటికప్పుడీ నిధిని లెక్కచూచుచుండిరి. అయితే ఈ లోపున నెవరికి దొరికినది వారు రహస్యంగా హరించుచునే యుండిరి.



మేనెల 22వ తేదీ నాటికి లూటీ చేసిన ధనము, 25,05,804 వరహాలు వరకు లెక్క తేలినది. ఇంక దోపిడి పూర్తికాలేదు గనుక ఈ నిధి అనుదినము వృద్ధియగుచుండును. కనుకను 1799 జూన్ 28వ తేదీన ఈ దోపిడి ధనములో నుంచి మొదటి డివిడెండును పంపిణీ చేసిరి. లూటి తాలూకు లెక్కతేలిన మొత్తము ధనములో నుంచి సర్వ సేనాధిపతియైన హారిసుకు ఎనిమిదవవంతు అనగా రమారమి పదునొకండు లక్షలరూపాయ లిచ్చిరి. ఆయన క్రిందనుండు రెండవ సేనాధిపతి అయిన మేజర్ జనరల్ ఫ్లాయిడ్‌కు ఒక లక్షా ఇరువది అయిదువేల రూపాయలిచ్చిరి."జనరల్ ఆఫ్‌ది స్టాఫ్" అనబడు సైనికోద్యోగులు ఒక్కొకరికొక లక్షరూపాయలిచ్చిరి. మిగిలిన సొమ్ములో నుంచి కర్నలుల కొక్కకరికి 37 వేల రూపాయలు చొప్పున లెఫ్టినెంట్ కర్నల్‌లకు ఒక్కొక్కరికి 23వేల రూపాయలు,మేజరులకు 13వేల రూపాయలు కెప్టెన్‌లకు 7500 రూపాయలు, సైనికులకు 42రూపాయలు ఇచ్చిరి.

ఈ దోపిడీ ధనంలో అధిక మొత్తము లను తీసికొనినందుకు సర్వసేనానియైన "హారిసు"ను ఆరుగురు జనరల్ ఆఫీసరులను సీమలోని కంపెనీ డైరెక్టర్‌లు తరువాత మందలించిరి.

దోపిడి ధనములోనుంచి గవర్నరు జనరల్ వెల్లస్లీకి వాటాక్రింద ఒక లక్ష నవరసులు అనగా రమారమి పదిలక్షల యేబది వేల రూపాయలను ఆయన కివ్వబోగా, ఆసొమ్ము తన కక్కరలేదని, సైన్యమునకే చెందవలెనని చెప్పి ఆయన పుచ్చుకొనలేదు. అందువలన "1801లో కంపెనీ డైరెక్టర్లు టిప్పుసుల్తాను ఆభరణములలోనుంచి ఒక వజ్రముల పతకము నాయనకు ఇచ్చి సాలుకు అయిదువేల నవరసుల పింఛను కూడా మంజూరు చేసిరి!" అని 'తాంప్సను గెర్రాటులు" రచించిన బ్రిటిష్ ఇండియా చరిత్రలో నుదహరించిరి. [1,2,3]

1836 సంవత్సరపు ఏషియాటికు జర్నల్ 33వ పుటలో నీక్రింది సంగతి వివరింపబడియున్నది. కూర్గు రాజ్యము ఇంగ్లీషు కంపెనీ వారు స్వాధీనము చేసికొనుటలో ఆ దండయాత్రను నడిపిన సర్. పి. విండ్సే గారికి దోపిడి ధనములో పదునారవవంతు నిచ్చిరి. ఈ దండయాత్రలో పాల్గొనిన సైనికోద్యోగులకు నీవిధముగా పంచి పెట్టిరి :

| | |
|---|---|
| కర్నలు ఒక్కొక్కరికి | రూ 25 వేలు |
| లెఫ్టినెంటు కర్నలులకు | రూ. 15 వేలు |
| మేజరుల కొక్కొక్కరికి | రూ. 10 వేలు |
| కెప్టెనులకు | రూ. 5 వేలు |
| నబాల్టర్నుల కొక్కక్కరికి | రూ. 25 వందలు. |

ఈ అన్యాయమును గూర్చి చెప్పుకొనుటకు కూర్గురాజు 1852లో ఇంగ్లాండుకు వెళ్ళెను. గాని ఆయన మొర నాలకించిన వారులేరైరి.

## "నెత్తురు కూడు"

సింధుదేశము నేలు అమీరులు ఇంగ్లీషు వర్తక కంపెనీవారితో స్నేహంగా నున్నప్పటికిని వారి దగ్గర అమిత ధనమున్నదని తెలియునప్పటికి ఆంగ్లేయ వర్తకుల నోరూరెను. ఆఫ్ఘను యుద్ధంలో ఇంగ్లీషువారికి కలిగిన అపజయం వలన తటస్థించిన తల వంపులను మాపుకొనుటకై సింధు రాజ్యాక్రమణ దండయాత్రను చేయ నిశ్చయించిరి. 1843లో జరిగిన ఈ క్రూర కృత్యానికి కథానాయకుడు "సర్ ఛార్లెస్ నేపియర్" నాలుగు లక్షల నవరసుల రొక్కము, బంగారు వస్తు వాహనంతో సింధు అమీరులాతనికి చిక్కిరి.

అయితే నేపియర్ కంతటితో తృప్తి లేదు. సింధు రాష్ట్రము నతడు భీభత్సం చేసినాడు. పంటలను మంటగలిపినాడు. పట్టణాలను కొల్లగొట్టినాడు. కనబడినవారి నందరిని నరికివేసినాడు. నేపియర్ గారి మనుష్యులు కొందరు మాచకమ్మలను జనానాలోనికి పంపి ఆ రాణివాస స్త్రీ, నగలను కట్టుబట్టలను బలవంతంగా లాగికొని నారు. వారిని చిత్రహింసలు పెట్టిరి. ఈ దోపిడీ సొమ్ములో నుంచి నేపియర్ తనవాటాక్రింద 70వేల నవరసులు పుచ్చుకొనినాడు.

నేపియర్ క్రింద సేనాధిపతియైన మేజరు బోట్రాంగారికి మూడువేల నవరసుల నివ్వబోగా "ఈ నెత్తురుకూడు తినుట కిష్టపడక తన కత్యంత స్నేహపాత్రుడిగానున్న నేపియరుగారితో ఈ రాజ్యాక్రమణ రాజనీతి నా మనస్సున కెంతమాత్రము బాగాలేదు. కత్తిపుచ్చుకొని సర్వనాశనము చేయు నీపద్ధతి యుత్తమమైనదని అనునుగాని దానికన్న నిది సుళువైనది." అని సొమ్ము పుచ్చుకొనుటకు నిరాకరించెను.

సిందుదేశములో నేపియరుగారిని "సైతాన్ కా భాయీ" అని చెప్పుకొనసాగిరి.

## "ఢిల్లీ దోపిడి"

ఇంగ్లీషు కంపెనీవారి పరిపాలనను కూలద్రోయుటకై 1857లో జరిగిన సిపాయిల తిరుగుబాటును అణచి ఇంగ్లీషు సైన్యములు ఢిల్లీ, లక్నో నగరములను పట్టుకొని నప్పుడు వానిని శత్రు రాజ్యముల లోని పట్టణములుగా పరిగణించి కొల్లకొనుటకు వీలులేదను జ్ఞానమెవ్వరికిని లేక పోయెను.

ఆ నగరములందు చొరబడిన ఇంగ్లీషు సైనికులు రాజ నగరములనేగాక సంసారుల



గృహములను, సామాన్యుల ఇండ్లను కూడా కొల్లకొని దాచిన నిక్షేపములకని తలుపులు, గోడలు, చవటాలు పగులగొట్టి స్త్రీ పురుషులను, పిల్లలను వధించి ధనకనక వస్తువాహనములను హరించిరి. అప్పుడు జరిగిన ఘోర కృత్యములలో కొన్ని మాత్రము చరిత్రలందు వివరింపబడినవి. అప్పుడు మనదేశమున పర్యటించిన ఇంగ్లీషు టైమ్సు పత్రికావిలేకరి "రస్సెలు" గారిట్లువ్రాసెను :

"ఆ సైనిక దళములలోని సామాన్య సోల్జరులలో వేలకొలది నవరసరుల విలువ గల ధనమును సంపాదించినవారు చాలా మంది యుండిరి. తనపై యధికారికి కెప్టెనును లోబరచుకొనుటకై ఎంత సొమ్ము కావలసిన అంత బదులిచ్చెదనని ఒక సోల్దరు అప్పుడు చెప్పెనని అతడు వ్రాసెను. ఇతరులు సీమలోని తమ స్నేహితులకు పెద్దమొత్తములను పంపించిరి. ఈ లేఖ సీమకు చేరులోపల అనేక వజ్రములు, పచ్చలు, అమూల్యములైన ముత్యములు కెయిసరికాగ్‌లో జరిగిన దోపిడి కథ నక్కడ వేనోళ్ళ చాటగలవు. ఈ అమూల్య రత్నాభరణములను దరించు యువతులకవి ఎట్లు లభించెనో తెలియకుండుటయే మంచిది. ఈ ఉద్యోగులలో కొందరీ సందర్భమున గొప్ప సంపదనలనే సంపాదించినారు. దెబ్బతిని నలిగి పోయిన ఇంగ్లీషు సైనికుల దుస్తుల పెట్టెలలోని చిన్న పేటికలందు ఇంగ్లాండు, స్కాట్లాండ్ దేశములందలి గొప్ప సంస్థానములను ప్రపంచములోని వివిధ ప్రాంతములందలి మనోహరవిహార ప్రదేశములును ఇమిడియున్నవి.

అన్యాయార్జితము చిత్ర విచిత్రములైన జబ్బులను పుట్టించును. దోపిడీ ధనము మానవుల జీర్ణకోశమును పాడుచేయును. అమూల్య రత్నములు కుటుంబములోని వారిలో పొరుపులు పుట్టించును. సామాన్య సైనికుల నడుముచుట్టుగల పటకాలలోని మోరీలును, రూపాయిలును వారి తల తిరుగునట్లు చేయును. అందువలన నింకనీ సైనిక సేవలో నెందులకు కష్టపడవలెనని వారికి తోచి వారు సరిగా పనిచేయరు. రెండు యుద్ధరంగములును రెండుసార్లు దోపిడి ధన నిధి పంపిణీలో వచ్చిన వాటాలును గాక తమ చేతికి దొరికిన ధన కనక వస్తువాహనములు ఈసైనికులను సైనికసేవను చేయ నియ్యవు అని రస్సెలు వ్రాసెను. ఢిల్లీ నగరము ముట్టడికి ముందుగానే "ప్రైజ్ ఏజెంట్లు" అనబడు దోపిడినిధి పంపిణీ వ్యవహర్తలు నియమింపబడిరి. స్త్రీలను,పిల్లలను హింసింపరాదని సేనాపతియైన జనరల్ విల్సన్‌గారు ఉత్తర్వు చేసినమాట నిజమేగాని విజయముచే నొడలు తేలియని సైనికులలో దయాధర్మాలెట్లుండును.

1858 సెప్టెంబరు 21వ తేదీన గ్రిఫిత్సు ఢిల్లీలో చూచిన దృశ్యములు హృదయ విదారకంగా నుండెను. "ఏదో ఒక ఘోరవిపత్తు వచ్చి నట్లా రాజనగరవీధులు శవములతో

నిండియుండెను. మేము పోవుచుండిన వీథులలోని గృహములన్నియు కొల్లగొట్టబడి యుండెను. వీథులలో నగరవాసలు కళేబరాలు, సిపాయిల శవములు దొలగించువారు లేక క్రుళ్లి దుర్వాసన కొట్టుచుండెను. ఖాళీ అయిపోయిన ఆ నగరంలో కలరా వ్యాపించెను. పూడ్చిన ధననిధుల కొరకు ఇండ్లు, చవటాలు, గోడలు త్రవ్వివేసి వుండిరి. దోపిడి ధననిధిలో చేరవలసిన దన కనక వస్తు వాహనాలలో చాలాభాగము ఆఫీసరులు, సైనికులు హరించిరి. దేవాలయాల మూల విరాటులక్రింద నవరత్నములు నిక్షేపింతురని అందరెరిగిన విషయమైనందున ప్రతి దేవాలయ విగ్రహములను గృహదేవతార్చనము నందలి విగ్రహములను, పెల్లగించి వేసిరి. దాచిన ధనమును బయటపెట్టవలసినదని కోమటులను కాయస్తులను హింసించిరి."

ఒక సైనికాధికారికి రెండు లక్షల రూపాయల మొత్తము విలువగల దోపిడి సొమ్ము దొరికినదని "గ్రిఫిత్సు" వ్రాసి ఇంక నిటువంటి ఉదాహరణము లెన్నో కలవనినాడు, నూరు నవరసులు సంపాదించినవార సంఖ్యాకులుగ నుండిరనివ్రాశాడు. "సామాన్య ప్రయివేటు సైనికులు అనేకులు ఇంగ్లాండుకు చేరగానే తాము సంపాదించిన ధనమును, వస్తువులను ప్రదర్శించుచుండిరి. ఈ సంపాదనవలన చాలామంది మూడేండ్ల వరకు మాత్రము ఓపికపట్టియుండి తరువాత పనిమానుకొనసాగిరి. సీమలో మేము మకాము చేసినచోట నగరవర్తకులనేకులు తూర్పు దేశపు పనితనముగల నగలను అమ్మజూపు చుండిరి. వీనిని ఇంగ్లీషు సైనికులమ్మినా రని చెప్పుచుండిరి."

ప్రైజ్ ఏజెంట్లు ఢిల్లీ నగరమంతయు జయింపబడిన ప్రాంతముగనే పరిగణింపవలెననిరి. ప్రతి వీధిలోని ప్రముఖ వర్తకులను కాపురస్థులను పిలిచి ఆ వీధిలోని గృహములను కొల్లపెట్టకుండా నుండుటకు ఏమిచ్చెదరని అడుగగా అప్పటికే ఇండ్లన్నియు లూటీ చేయబడినందువలన మిగిలిన ఆస్తిని రక్షించుటలో ఆసక్తిలేక చాలా హీనమొత్తము ఇచ్చెదమనుచుండిరి.

"ఇక్కడ దరిలేని రక్తసముద్రమున్నది. నీ కన్నులకింకను ఏమికనబడగలదో దేవునికే ఎఱుక! అని "గాలిబ్" అను ఉర్దూకవి వగచినాడు. ఆయన నెఱిగిన మిత్రులందరు చనిపోయిరి. "ఎవరికై దుఃఖింపను? ఎవరికి చెప్పుకొనను? నేను పోయిన పిమ్మటనాకై యేడ్చువారు కూడ మిగులరు కాబోలు" నని దుఃఖించినాడు.

ఢిల్లీని కొల్లగొనుటలో ఇంగ్లీషు కంపెనీ వారి కెదురుతిరిగిన సిపాయిలేకాక నిరపరాధులైన స్త్రీ పురుషులును పిల్లలు కూడా నాశనమైపోయిరి.



## లక్నో దోపిడి

లక్నో నగరము నింగ్లీషు సైనికులు పట్టుకొని కొల్లగొట్టినప్పుడక్కడ జరిగిన ఘోర కృత్యములు వర్ణనా తీతములు. బీగము కోఠీదోపిడినిగూర్చి రస్సెలు ఇట్లువ్రాసెను? "ఆ దోపిడీ దృశ్యము వర్ణింపనలవికాదు. సోల్జరులు స్టోరుగదులలో జొరపడి అందులోని ధనకనక వస్తువాహనములను వీథిలో పడవైచిరి. బంగారు వెండి జరీబుటేదారీ పనితనముగల బ్రోకేడులు మొదలగు అమూల్యాంబరములు. వెండి బంగారు వస్తువులు. ఆయుధములు,శాలువలు, రుమ్మాళ్ళు, అద్దములు, బొమ్మలు, పుస్తకములు, సంగీత వాద్యములు, ఔషధసీసాలు, కత్తులు, డాళ్ళు, ఇతరాయుధములు ఇవియని అననేల? సమ సవస్తువులుండెను. ఈ వస్తుజాలముల పోగులమధ్య సైనికులు ఆవేశముతో గంతులు వేయుచుండిరి. ఇంగ్లీషు సైనికులు ఆయుధములకు తాపటము చేయబడిన నవరత్నములు తీసికొనుటకై వానిని పగులగొట్టుచుండిరి. వెండి బంగారు జలతారును తీసికొనుట కమూల్యాభరణములను మంటలో వేయుచుండిరి. శాలువలను, కర్రసామానులను కాల్చుచుండిరి. కేవలము పిచ్చివాండ్రవలె చీనాగాజు "జేడు" సామానులను పగులగొట్టి వేయుచుండిరి. పటములను చించి వేయుచుండిరి.

ఒకనేల కొట్టులో కనబడిన కాశ్మీరశాలువలు, వెండి బంగారు నగలు, నవతర్నములు తాపిన పిడులు గల ఆయుధములును గాక వంటయింటిలోని పోపుల పెట్టెవలె నున్న ఒక మందసములోని వేరువేరు గదులలో పోసియున్న నవరత్నములు ఇంగ్లీషుప్రభువుల శిరోవేష్టనముల పైన ధరించు వజ్రవైఢూర్యములకన్న నెన్నోరెట్లు విలువగల మణులు గల కలికితురాయి మొదలగు అమూల్య వస్తుజాలమును గూర్చి యొక ఆంగ్లేయ సైనికోద్యోగి వర్ణించినాడు.

ఇందులో చాల విలువగల నగలను వ్యక్తులు హరించిరి. లక్నో దోపిడి జరిగిన మూడేండ్లలో ఇంగ్లాండులో 1,30,000 నవరసుల తనఖీ బాకీ తీర్మానమైన యుదాహరణ నొక్కటి వ్రాసెను. ఇట్టి వెన్నోయుండెను. ఝాన్సీ పట్టణమును పట్టుకొని నప్పుడు ఇంగ్లీషు సైనికులు అక్కడి ధన కనక వస్తువాహనములను దోచుకొనుటయేగాక అపూర్వమైన సంస్కృత గ్రంథ బాండాగారమును తగులపెట్టిరి. పోరాటము ఆయిపోయిన తరువాత ఇంగ్లీషు సైనికాధికారులును సామాన్య సైనికులును కూడా ఊరిలో ప్రతి ఇంటిలోను జొరబడి ధన కనక వస్తు వాహనముల కొరకు మారు మూలలు వెతుక సాగిరి. క్రొత్తగా కట్టినట్టు కనబడు గోడలనుకాని రాతి చప్టాలను త్రవ్వి చూచిరి.

విచ్చలవిడిగా కొల్లగొన కూడదని పై అధికారులు జారీచేసిన యుత్తరువులు, కనబడిన విచిత్ర వస్తువులను సంగ్రహించు విషయమున వర్తింపదను భావముతో అధికారులు విలువగల అమూల్య వస్తుజాలమును సంగ్రహింపసాగిరి. దేవాలయము లందును, గృహాదేవతార్చనలందును గల వెండి బంగారు విగ్రహములను దానికి గల చక్కని నవరత్న ఖచితములైన నగలను హరించిరి. గణపతి, విగ్రహములు వాని అలంకరణములును సంగ్రహించిరి. సామాన్య సైనికులు బాహాటముగనే ధనకనక వస్తు వాహనములను కొల్లకొని దోచుకొనిరి. ఒడలే యెరగని ఆవేశముతో తమకుపయోగము లేని వస్తువులను పగులగొట్టిరి.[4]

**– *ఆంధ్రజ్యోతి, 9.1.1966***



1. Rise and fulfilment of British Rule
2. Meadows Taylor wrote in his student manual of Indian History. The amount availble for prize money was of 100000 which was at once distributed. He did not give details.
3. In his manual of Madras Sir Charles Lawson gave the details of the loot money
4. Prize money అనే శీర్షిక క్రింద డాడ్వెల్ గారు The Nababs of Madras అనే గ్రంథములో దాని పుట్టు పూర్వోత్తరాల చరిత్ర రాశారు.



# రాజ్యంలేనప్పుడే రాజధాని

ప్రస్తుతం (1944) ఆంగ్ల రాజ్య ప్రతినిధి యైన చెన్నపట్నం గవర్నరుకింద వున్న ఒక లక్ష నలభై రెండువేల చదరపు మైళ్ల వైశాల్యము, షుమారు అయిదుకోట్ల జనసంఖ్య గల ఈ విశాలరాజ్యాన్ని ఇంగ్లీషులో "మద్రాస్ ప్రెసిడెన్సీ" అనిన్నీ, తెలుగులో 'చెన్నపురిరాజధాని' అనిన్నీ వ్యవహరిస్తున్నారు. చెన్నపట్నాన్ని రాజధాని నగరం అంటున్నారు. రాజధాని అనేమాట ప్రెసిడెన్సీ అనే ఇంగ్లీషు మాటకు సరియైన తర్జుమా కాదు. ప్రెసిడెన్సీ అనే మాటలో రాజ్యముయొక్క ముఖ్యపట్నము అనే అర్థంగాని రాష్ట్రమనే అర్థంగాని లేదు. అయితే ఈ హిందూదేశములోని వివిధభాగాలు ఇంగ్లీషు పరిపాలనకిందికి వచ్చిన సందర్భాలనుబట్టి యీమాటకు అలాంటి అర్థాలు ఏర్పడినవి.

హిందూదేశంలో వ్యాపారం ప్రారంభించిన తూర్పుఇండియా వర్తక కంపెనీవారు అక్కడక్కడ స్థాపించిన వర్తక స్థానాలలో వ్యవహారాలను నిర్వహించడంకోసం ప్రతిచోట ఒక్కొక్క చిన్న వర్తకసంఘసభను, దానికి ప్రెసిడెంటు అనే అధ్యక్షుణ్ణీ యేర్పాటుచేశారు. ఈ ప్రెసిడెంటు అనే మాటనుబట్టి కొన్ని ప్రధానవర్తకస్థానాలను ప్రెసిడెన్సీ లన్నారు. తూర్పుఇండియా వర్తక సంఘమువారు క్రీ.శ. 1639లో చెన్న పట్నందగ్గర కాస్తభూమిని కవులు పొంది ఏజెన్సీ అనే చిన్నవర్తకస్థానాన్ని స్థాపించారు. 1658లో దీనిని ప్రెసిడెన్సీ అనే ప్రధాన వర్తకస్థానంగా చేశారు. 1653కి పూర్వముగాని, తరువాత ఇంకా ఒక వంద సంవత్సరాలవరకూ గాని ఈ ఇంగ్లీషు వర్తక సంఘమువారికి ఈ చెన్నపట్నం ప్రాంతాలలో ప్రభుత్వాధికారాలు లేవు. ఏలడానికి రాజ్యాలు లేవు సరికదా ఆఖరికి కొన్ని ఊళ్లైనా లేవు.

ఈ ఇంగ్లీషువర్తకులు మొదట విజయనగరసామ్రాజ్యవంశీకులైన చంద్రగిరి రాజుల తాబేదార్లకూ తరవాత గోలకొండ నవాబుల తాబేదారులకూ, అటుతరువాత మొగలాయీ చక్రవర్తి సుబేదారుడైన హైదరాబాదు నిజాము అధికారానికి లోబడిన కర్నాటక నవాబులనూ ఆశ్రయించి తలదాచుకుని వర్తకం చేసుకోవడానికి కొంత భూమిని, తరువాత కొన్ని గ్రామములకును పట్టాలను పొంది వారి అధికారానికి లోబడి వర్తక వ్యాపారమును

చేసికొంటూ క్రమక్రమంగా బలవంతులై రాజ్యాధికారములను సంపాదించి ప్రభువులైనారు. వారు వర్తకము చేసికొనుటకు కట్టుకొన్న గిడ్డంగులు కోట లైనవి. కోటలు సైనిక నివహాముల కాలవాలములగు దుర్గము లైనవి; సైనికనిచయములు సామ్రాజ్యసంపాదనకు సాధనములైనవి. ఈ ఆరోహణము, ఈమార్పు చల్లగా మెల్లగా జరిగిపోయినవి. అది ఒకచిత్రకథ.

## ఇంగ్లీషువర్తక సంఘసభలు

ఈ దేశమునుండి సీమకు సరుకుల నెగుమతిచేసికొనుటకు ఇంగ్లీషు వర్తకులీ దేశములో స్థాపించిన ఫ్యాక్టరీ లనేవర్తకస్థానములలోని సామాన్య వ్యాపార వ్యవహారాలను నిర్వహించుకోవడానికి ప్రతిచోట ఒక చిన్నవర్తకసంఘసభను, దానికి ప్రెసిడెంటు అనే అధ్యక్షుణ్ణి ఏర్పాటు చేసేవారు.[1] ఆ కవులను స్థిరపరుస్తూ చంద్రగిరి రాజైన శ్రీరంగరాయల వారు రాజశాసనం జారీ చేశారు. అన్ని వ్యవహారాలూ ఆ సభలో అధిక సంఖ్యాకుల తీర్మానాన్ని అనుసరించే జరపాలి. అధ్యక్షుడికిప్రత్యేక అధికారాలేవీ లేవు. ముఖ్యమైన వ్యవహారాలను గురించి సీమలోని పైఅధికారులకు తెలిపి వారి ఉత్తర్వుల ప్రకారం నిర్వహించాలి.

చిన్న చిన్న వర్తకస్థానాలను పెద్దవర్తక స్థానాల పై తనిఖీకి లోబడినశాఖలుగా చేసేవారు. ఈశాఖలను ఏజెన్సీ లనేవారు. పెద్ద వర్తకస్థానాలను ప్రెసిడెన్సీ లనేవారు. ఈ ప్రెసిడెన్సీలలో సంఘాధ్యక్షులను గవర్నరులనేవారు. గవర్నరనగా పరిపాలకుడు. కార్యాలోచనసంఘాన్ని కవున్సిలు అనేవారు. ఈ ప్రెసిడెంటు అనేగవర్నరూ, కార్యాలోచనసంఘమూ కంపెనీవారికి ఉద్యోగవర్గముగా వుండేది. తరువాత తరువాత వ్యాపారము ముదిరి కంపెనీవారు బలవంతులై రాజ్యాధికారములు కలిగినప్పుడు ఈ కార్యాలోచనసంఘములూ, వీని అధ్యక్షులూ పరిపాలక వర్గములై దేశపరిపాలనము చేయసాగినవి. అప్పుడు యీప్రెసిడెంట్లు లేక గవర్నరులకింద వుండే ప్రెసిడెన్సీలే రాజధానులైనందువల్ల ఈ పదము సార్థకమైనది.[2]

## "వ్యాపారం కోసం కాస్తస్థలం"

క్రీ.శ. 1639 నాటికి దక్షిణహిందూదేశములో పశ్చిమసముద్రతీరాన్ని సూరతు,కల్లికోట తూర్పుసముద్రతీరాన్ని మచిలీబందరు వీరవాసరము అర్మెగాను పులికాటులలో ఇంగ్లీషువారు వ్యాపారము చేసుకోవడానికి గిడ్డంగులుకట్టుకొని చిన్నచిన్న



వర్తకస్థానాలు ఏర్పరచుకున్నారు. చెన్నపట్నందగ్గిర డచ్చివారూ పోర్చుగీసువారూ వర్తకస్థానాలు ఏర్పరచుకొని వ్యాపారం చేస్తూవున్నందువల్లనూ అప్పట్లో దక్షిణదేశం లో తయారయ్యే నూలుబట్టల రకాలకు జావాద్వీపంలో చాలా గిరాకీ వున్నందువల్లను ఈ వర్తకం అభివృద్ధి చెయ్యడానికి చెన్నపట్నం దగ్గిరకూడా ఒక వర్తకస్థానం ఏర్పాటు చేసుకుంటే బాగుంటుందని ఇంగ్లీషు వర్తకులకు తోచింది. అంతట అక్కడ తామున్నూ వ్యాపారం చేసుకోవడానికి కాస్త స్థలం యిప్పించవలసిందని అప్పట్లో చెన్నపట్నం ప్రాంతాలకు చంద్రగిరి రాజు గారి క్రింద స్థానికాధికారిగా నున్న దామెర్ల వెంకటాద్రి నాయకుణ్ణి ఆశ్రయించి శాంతోముకు వుత్తరాన సముద్రతీరమువెంబడిని ఒక మైలు వెడల్పూ, ఆరుమైళ్ల పొడుగూ గల ఒక పీలికలాంటి ప్రదేశాన్ని ఇంగ్లీషు వర్తకుల ప్రతినిధియైన డే దొర 1639లో కవులుకు పుచ్చుకున్నారు. తరవాత ఆ కవులను స్థిర పరుస్తూ చంద్రగిరి రాజైన శ్రీరంగరాయల వారు రాజశాసనం జారీ చేశారు.

## 'తెల్లవారి బస్తీ' నల్లవారిబస్తీ కలిసి చెన్నపట్నం అయింది

పైన చెప్పిన పీలికలో కూమునది రెండు పాయలుగా చీలినందువల్ల ఒక చిన్న దీవి లాంటి ఇసకపర్ర ఏర్పడివుంది. ఇది షుమారు నూరుగజాల వెడల్పూ నాలుగు వందలగజాల పొడుగూ వుంటుంది. ఇక్కడ గనక తమ గిడ్డంగులు కట్టుకొని వాటి చుట్టూ ఒక కోటగోడ కడితే అప్పట్లో తమకు శత్రువులవల్ల భయంలేకుండా వ్యాపారం చేసుకోవచ్చునని తోచింది. ఆ ప్రకారం ఆదీవిలో గిడ్డంగులు కట్టుకొని చుట్టూ గోడకట్టుకున్నారు. ఆ ఆవరణలో తెల్లవారు తప్ప ఇతరులెవ్వరూ వుండకూడదని నిషేధించినందువల్ల దీనికి తెల్లవారి బస్తీ అని పేరు వచ్చింది. ఈ ప్రదేశానికి వుత్తరంగా దీనికి ఆనుకుని ప్రస్తుతం లాకాలేజీ ఎస్ప్లనేడు మొదలైన ప్రదేశాలలో ఈ ఇంగ్లీషు వారి వకర్తకంలో వారికి తోడ్పడిన నేతగాళ్లు అద్దకాలవాళ్లు చాకళ్లు యితరవృత్తులవాళ్లు చిల్లర వ్యాపారాలు చేసేవాళ్లు వుద్యోగులు మొదలైనవాళ్లందరూ ఇళ్లుకట్టుకుని కాపరాలు చెయ్యడం ప్రారంభించారు. వీరందరూ తెలుగువాళ్లే. ఆకాలంలో తెలుగువారిని పోర్చుగీసువారు ఇతర పాశ్చాత్యులూ "జెంటూ" లనేవారు. అందువల్ల వీరు వసించే పేటకు "జెంటూ టవును" అనిన్నీ, "నల్లవారిబస్తీ లేక "బ్లాక్ టవున్" అనిన్నీ పేర్లు వచ్చాయి. ఈ తెల్లవారి బస్తీని నల్లవారి బస్తీని కలిపి దేశీయులు చెన్నపట్నం అనేవారు. దొరలు మద్రాస్ పట్నం అనేవారు.

## చెన్నపట్నం ఏజెన్సీ

అప్పట్లో జావాలో బాంటం అనేచోట ఇంగ్లీషు వర్తకుల ప్రధాన వర్తక స్థానం ఉండేది. దానిని వారు ప్రెసిడెన్సీ అనేవారు. చెన్నపట్నం చిన్న వర్తక స్థానం అయినందువల్లను ఇక్కడినుంచి ఎక్కువగా జావాకే ఎగుమతి జరుగుతూ వున్నందువల్లను చెన్నపట్నాన్ని బాంటం ప్రెసిడెన్సీకి లోబడిన ఏజెన్సీ అనే వర్తకశాఖ కార్యస్థానంగా వుంచారు. చెన్నపట్నం ఏజెన్సీ వ్యవహారాలను నిర్వహించే కార్యాలోచన సంఘం అధ్యక్షున్ని ఏజెంటు అనేవారు. ఈ చెన్నపట్నం ఏజెన్సీ కార్యాలయంవారు 1642లో సీమతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినట్లు రికార్డులవల్ల కనబడుతూ వుంది. ఇంగ్లీషు వర్తక సంఘంవారు చెన్నపట్నంలో ముందుగా ఒకమట్టికోటను కట్టుకున్నారు. దీనిని కట్టడానికి 1644 నాటికి 22940 రూపాయిలు ఖర్చు అయినవి ఇంకా ఇరవైవేల రూపాయలు ఖర్చుపెట్టి దానిని బలపరిచి అందులో ఒక వందమంది సిబ్బందిని వుంచుతే ఇది శత్రువులకు దుర్భేద్యం అవుతుందని పైవారికి వ్రాశారు గాని అంతసొమ్ము ఖర్చు పెట్టడానికిగాని అంతమంది సిబ్బందిని వుంచడానికిగానికంపెనీ అధికారులు ఒప్పుకోలేదు.

ఇంతలో చెన్నపట్నం ప్రాంతాల రాజకీయపరిస్థితులు తారుమారు అయినవి. చంద్రగిరి రాజైన శ్రీరంగరాయలవారు గోలకొండ నవాబులసేనానితో చేసిన యుద్ధంలో ఓడిపోయి 1646లో మైసూరుకు పారిపోవడంతో ఈ ప్రాంతాలన్నీ గోలకొండ నవాబు రాజ్యంతో కలిసినవి. ఈ పరిస్థితులలో ఇంగ్లీషువారు గోలకొండ సేనాధిపతులను ఆశ్రయించి గోలకొండనవాబుల మంత్రులైన అక్కన్న మాదన్న గార్లదగ్గరికి రాయబారా లంపి ఆ నవాబు గారికి కప్పంకట్టి వర్తకస్థానం కాపాడుకున్నారు. చెన్నపట్నం పరిసరాలలో వున్న పరిస్థితులలో చెన్నపట్నం కోటను సంరక్షించుకోవడానికి అక్కడవున్న ఏజెన్సీ పరిపాలకసంఘము వారు సిబ్బంది హెచ్చు చెయ్యడానికి అంగీకరించలేదు. 1652 నాటికి చెన్నపట్నం కోటలో 26 మంది సైనికులు మాత్రం వుండేవారు. అంతకన్న సిబ్బందిని ఎక్కువ చెయ్యడానికి కంపెనీవారు అంగీకరించలేదు.

## మద్రాస్ ప్రెసిడెన్సీ

1653లో చెన్నపట్నం ఏజెన్సీని బాంటం ప్రెసిడెన్సీ కిందనుంచి విడదీసి ప్రెసిడెన్సీ అనే ఒక స్వతంత్ర వర్తకస్థానంగా చేశారు. ఈ వర్తకస్థానం వ్యవహారాలను చక్కబెట్టడానికి ఒక కార్యాలోచన సంఘమునూ దానికి ప్రెసిడెంటు అనే అధ్యక్షుణ్ణి ఒకడినిన్నీ



నియమించారు. ఈ ప్రెసిడెంటూ ఈ కార్యాలోచన సంఘమూ కలిసి ఈ ప్రెసిడెన్సీ అనే వర్తకస్థానంయొక్క వ్యవహారాలను చక్కబెట్టడం ప్రారంభించారు. 1654లో చెన్నపట్నం రాజధాని సిబ్బందిని ఇద్దరు ఫ్యాక్టర్లనే తెల్లగుమాస్తాలు, పదిమంది తెల్లసైనికులు మాత్రం వుండేటట్లు తగ్గించవలసిన దని కంపెనీవారు ఉత్తర్వు చేశారు. 1670 వరకూ చెన్నపట్నం వ్యాపార వ్యవహారాలు అంతబాగాలేవు. తరువాత ఈ ప్రాంతాలవ్యాపారం బాగా అభివృద్ధి అయింది. చెన్న పట్నంలో ఇంగ్లీషువారు కట్టినకోటకు వర్తకస్థానానికీ కలిపి సాలుకు రు. 1200 వరహాల చొప్పున గోలకొండ నవాబుగారి కిచ్చేటట్లు ఇంగ్లీషు వర్తక సంఘంవారు ఏర్పాటు చేసుకున్నారు. కవున్సిలు అనే ఆలోచనసభలో గవర్నరుగాక ముగ్గురు సభ్యులు. అందులో గవర్నరే మొదటి సభ్యుడు.

గవ్నరుకు సాలుకు 300 పౌనులు. (నవరసులు) జీతం.

రెండవ సభ్యుడికిసాలుకు 100 పౌనులు.

మూడవ సభ్యుడికి సాలుకు 70 పౌనులు

నాలుగవసభ్యుడికి సాలుకు 50 పౌనులు

వీళ్లను "మర్చెంట్సు" అనేవారు. వీళ్ల కింద "ఫ్యాక్టరు" లుండేవారు. వీరికి సాలుకు 20 మొదలు 40పౌనులు జీతం. రైటర్లు అనే గుమాస్తాలకు పదిపౌనులు. 'అప్రెంటీసు' అనే ఉమేదువారులకు సాలుకు 5 పౌనులు పదిమంది తెల్లసైనికులు. 20 మంది నేటీవులు అనే దేశీయసిపాయిలు వుండేవారు. తరవాత యీనేటీవు కాపలాజవానులు పెద్ద నాయకుడికింద పనిచేసేవారు.

## చెన్నపట్నం చుట్టుపట్ల గ్రామాలు

ఔరంగజేబు చక్రవర్తి 1687లో గోలకొండ రాజ్యాన్ని జయించి కర్నాటకాన్ని జయించడానికి తనసేనాధిపతి అయిన జుల్ ఫికరుఖాను నంపించాడు. అంతట చెన్నపట్నం పరిసరాలన్నీ మొగలాయీ చక్రవర్తి గారి రాజ్యంలో చేరినాయి. ఔరంగజేబు జుల్ఫికరుకానుకు కర్నాటక నవాబు అనే బిరుదాన్ని 1692లో ప్రసాదించాడు. ఇంగ్లీషువారు మెల్లగా జుల్ఫికరుఖానునీ, చక్రవర్తిగారి వజీరునూ, ఆశ్రయించి తమ వర్తకస్థానానికి మళ్లీ పట్టాపొందారు. అంతే గాక చెన్నపట్నానికి అంటివున్న ఎగ్మూరు, పారశవాకము, తండయారువేడు, తిరువలి క్కేణి అనే గ్రామాలకుకూడా 1698లో పట్టాపొందారు. కర్నాటకనవాబుకు లంచము లిచ్చి నజరానా లిచ్చి, ఇంకా కొన్ని సౌకర్యాలు సంపాదించారు.

చెన్నపట్నం దగ్గిర వున్న తిరువత్తియ్యూరు, కత్తివాకము, నుంగంబాకము వ్యాసార్పడి, నత్తెరిగాడు అనే అయిదు గ్రామాలను కూడా సంపాదిస్తే తమ వ్యాపారానికి వీలుగా వుంటుందని తోచి వాటిని కౌలుకిప్పించవలసిందని కంపెనీవారు దరఖాస్తు పెట్టుకున్నారు. ఇంతలో ఔరంగజేబు చక్రవర్తి 1707లో మరణించాడు.

## మద్రాసు గవర్నరు
## మొగలాయి చక్రవర్తిగారి మంత్రికి వ్రాసుకున్న మనవి

చెన్నపట్నం వర్తకస్థానానికి గవర్నరుగా వచ్చిన తామస్ పిట్టుగారు ఆ ప్రాంతాల పరిపాలకుడైన కర్నాటక నవాబుగారికి నజరులు చెల్లించి మెప్పించలేక ఆఖరికి చక్రవర్తిగారి దర్బారులోని అధికారులనే ఆశ్రయిస్తే లాభం కలుగుతుందని ఆలోచించి షాఆలం చక్రవర్తిగారి రాజనగరు వ్యవహారాలనుచూసే (Lord High Steward of the Household) అంతరంగిక మంత్రియైన 'జూడీ ఖాన్' గారికి అతివినమ్రతతోను భయభక్తులతోనూ 1708వ సం॥ జనేవరు 5వ తేదీన ఒక వత్తరం వ్రాసుకున్నాడు. అందులో మొగలాయీ ప్రభువుల గొప్పదనాన్ని ఆకాశాన్ని అంటేటట్లు పొగడి ఇంగ్లీషు వర్తకకంపెనీవారి దైన్యస్థితినిగురించి విన్నవించుకుని తమ కిప్పించవలసిందని దరఖాస్తు పెట్టుకున్న గ్రామాలకు పట్టాయిప్పిస్తేనే గాని తాము బ్రదకలేమని మనవిచేసుకున్నాడు.

పైసంగతులు వ్రాసుకున్న తరువాత జూడీ ఖాన్ గారిని ఉబ్బించడానికి యీ కిందివిధముగా వ్రాశాడు. "ఏలినవారు గోలకొండకు దయచేసినప్పుడు తమ రూపపటాన్ని నాకు పంపించవలసిందని మరిమరీ వేడుకుంటున్నాను. దానిని నేను సీమకు పంపించి ప్రపంచంలో కల్లా అతిచతురుడైన చిత్రకారునిచేత వ్రాయించి తెప్పించుకుంటాను. ఇంతేగాక తమ విగ్రహాన్ని చలువరాతితో తయారుచేయించి ఈ ప్రాంతాలలో ప్రజలందరూ సుఖంగా జీవించడానికి కారణభూతులైన తమఖ్యాతి ప్రపంచానికంతా తెలిసేటట్లు మీచరిత్రను దానికింద చెక్కిస్తాను" అంతట కంపెనీవారు కోరిన గ్రామాలను కౌలుకివ్వడానికి అంగీకరిస్తూ 1708లో వజీరు గారే స్వయంగా జవాబు వ్రాశారు. మొగలాయీ చక్రవర్తి గారి దర్బారువారికికంపెనీ వారింకా నజరులు చెల్లించలేదనే సంగతిని వజీరుగారు పిట్టుగారికీ జ్ఞాపకం చేస్తూ తమ కిష్టమైన బహుమతుల జాబితానుకూడా ఆ వుత్తరంతో జతపరిచారు. అందుకు జవాబుగా పిట్టుగారిలాగ న్నివించుకున్నారు. "దర్బారులో రాజకుమారులందరికిన్నీ ఇంకా గొప్ప గొప్ప ఉమ్రావులకున్నూ కూడా బహుమతులు పంపించాలని ప్రభువులవారు వ్రాయించినారు. వారివారి గొప్పదనాన్ని బట్టి పంపాలంటే



మాకంపెనీవారి ఆస్తిఅంతా అమ్ముకున్నా అది సాధ్యంకాదు. మా కంపెనీవారు సామాన్య వర్తకులనిన్నీ ఏదో కాస్త లాభంకోసం చాలా తెగింపు చేస్తూ లాభాలు రాకపోగా నష్టాలుకూడా అనుభవిస్తూంటారనిన్నీ తమరు ఎరగని విషయం కాదు. కాబట్టి మేము సమర్పించుకోదలచిన బహుమతులు తమ దర్జాను బట్టి గాక మాతాహతును బట్టి యిచ్చుకుంటామని చక్రవర్తిగారి దివ్య చిత్తానికి తేవలెను. చక్రవర్తిగారున్నూ రాజకుమారులున్నూ మాయందు దయయుంచి వాటిని ఆదృష్టితోనే స్వీకరిస్తారని నమ్ముతున్నాను" అని చాలావినయంతో వ్రాశాడు. (దీని వివరములకు వజ్రాల పిట్టు అనే శీర్షికతో ఆంధ్రవారపత్రిక 26-9-43 తేదీ లగాయతూ మూడు సంచికలలో ప్రకటింపబడిన కథను చూడవచ్చును.)

– *ఆంధ్రపత్రిక* ***5.3.1944***



---

1 చెన్నపట్నం చుట్టునున్న చిన్న చిన్న గ్రామములే పేటలుగా మారినవి. అందులో తెలుగువారే ప్రముఖులుగా నుండేవారు. ఎలిఫెంట్ గేటును ఏనుగు గేటని అనుచుండిరి. అందులో జనపసెట్టులు, గొల్లవారు కాపురముండిరి. పొరశవాకములో కుమ్మరివారుండిరి. వ్యాపారపాదులో కొల్లావారు, నీలం వారు పరచూరి వారి కుటుంబాలుండెను. కీలువాసము, ఎళంబూరులో తెలుగు నాయళ్ల కుటుంబములుండిరి. సత్రసాలము వారికి చాల భూములుండెను. నుంబంపాకము అసలుపురు లింగనపాకము, ఇందులో కాసీసెట్టివారి కుటుంబమును తెలుగు బ్రాహ్మణుల కుటుంబాలైన దొడ్లవారు, నోరివారు ఉండిరి. చెట్‌పట్‌ను చేతిపట్టు అనుచుండిరి.

2 ఇంగ్లీషు వర్తక కంపెనీవారు స్థాపించిన వర్తక స్థానములకు పరిపాలక సభలుండెను. కొంచెము అనుభవము గలవారిని ఛీఫ్ ప్రముఖ సభ్యునిగా నియమించుచుండిరి. వర్తకస్థానము, ఏజన్సీగా నుండినప్పుడితనిని ఏజంటు అనిరి. అది పెద్దదిగానున్నప్పుడు ప్రముఖ సభ్యుని ప్రసిడెంటనిరి. ఆ మాట నుండియే ప్రసిడెంటు అనుమాట వచ్చినది.

# రాయవేలూరి పితూరీ

**1806**వ సంవత్సరం జూలై 10వ తేదీన రాయవేలూరిలో దేశీయసిపాయిలు దొరల మీద తిరుగుబాటుచేశారు. అక్కడి తెల్ల అధికారిని చంపివేశారు. సైనికదుస్తులు ధరించి యున్నప్పుడు కవాతు చేసేటప్పుడు దేశీయ సిపాయిలు తమ వర్ణాశ్రమదర్మాలు తెలియజేసేటట్లు మొహాలమీద వికృతంగా బొట్లు నామాలు పెట్టకోకూడదనీ చెవులకు అంటుజోళ్లు పోగులూ తగిలించుకోకూడదనీ గడ్డాలు నున్నగా క్షవరం చేసుకొనివుండాలని ఎవరి యిష్టంవచ్చినట్లు వాళ్లు మీసాలు పెంచుకొనేపద్ధతి మాని అందరూ ఒకేమాదిరిగా మీసాలు కత్తిరించుకోవాలని ఒకే మాదిరిగా తలపాగాలు చుట్టుకోవాలని సైనికనిబంధనలు చేసినందువల్ల ఇది అంతా తమర్ని క్రైస్తవమతంలో కలపడానికి వర్ణ భ్రష్టలను చెయ్యడానికిచేస్తున్నారని హిందూసిపాయిలు భయపడి తిరగబడ్డారు.

“ఇది పైకి చాలా స్వల్పపు విషయంగా కనబడుతూవున్నా, నిజంగా ఒకజాతియొక్క మతవిశ్వాసాలకూ ఆత్మగౌరవానికీ భంగంకలిగితే – ఎలాగ సంభం కలుగుతుందో ఇదీ కూడా అలాంటి సందర్భమే.

క్రాపు జుట్లు వుంచుకునే మన ఇంగ్లీషు సైనికులనందరినీ బుర్రలు గొరిగించుకోవలసినదని ఒక వుత్తర్వు చేశారనుకోండి. అప్పుడు ఏమిజరుగుతుందో ఊహించుకోండి” అని అప్పట్లో చెన్నపట్నం రాజధానిలో వుద్యోగం చేస్తూవున్న సర్ తామస్ మన్రోగారు సీమలోవున్న తన తండ్రికి 1806వ సం॥ సెప్టెంబరు 4వ తేదీన వ్రాసిన వుత్తరంలో వ్రాశారు. (Life and letters of Sir Thomas Munro-Gleig)

## క్లైవు గెలిచిన సైన్యాలు

ఐరోపా ఖండమంత పెద్దదేశం ఇంత సులభంగా ఇంగ్లీషువారిచేతికి ఎలా చిక్కిందని వారికే ఆశ్చర్యంగా వుంటూవుంటుంది. ప్లాసీ యుద్ధభూమిమీద 1757లో క్లైవును ఎదురుకున్న సురాజ్ ఉద్దౌలా సైనిక శిబిరం ఎలాంటిదో కాస్త తెలుసుకుంటే ఇది సులభంగా అర్థమౌతుందని జాన్ లా అనే ఆంగ్లేయుడు 1908లో వ్రాశాడు.



ఆకాలంలో దేశీయ రాజులు, నవాబులూ యుద్ధానికి తర్లివెళ్లేటప్పుడు వారిసేనలతో పాటుపరివార మంతా బయలుదేరేవారు. జనానా స్త్రీలు, బోగమువాళ్లు, దుకాణాదార్లు, సంగీత పాటకులు, ఇంకా రకరకాల వాళ్లూ కలిసి, ఆశిబిరం కదులుతూవున్న ఒక మహాపట్నంలాగ వుండేది. రాత్రింబవళ్లు సంగీతకచ్చేరీలు జరుగుతూ వుండేవి. సైనికులు సర్వసాధారణంగా వుపయోగించే ఆయుధాలు విల్లుఅంబులే గాని తుపాకులు లేవు. ఉన్న కొద్ది ఫిరంగులూ చాలా బరువుగా వుండి ఉపయోగించడమే కష్టముగా వుండే తాతలనాటివి. పాతసరుకు”.

– *ఆంధ్రపత్రిక, 25.4.1943*



# రాయవేలూరు సిపాయిల తిరుగుబాటు (1806)

మద్రాసు రాజధానికి 1803-1807 మధ్య గవర్నరుగా నుండిన విలియం బెంటింకుగారి అంగీకారముతో ఆ రాష్ట్రము యొక్క సర్వసేనానియైన సర్ జాన్ క్రాడక్కు గారు సైనిక నిబంధనలయొక్క పదియవ విధినిబట్టి సిపాయిలు కవాతు మైదానముపైకి వచ్చినప్పుడు అందరు నొకే విధమైన దుస్తులను ధరించవలెననియు, వారు గడ్డములు నున్నగా గొరిగించుకొనవలెననియు, తలపైన క్రొత్తగా చర్మముతో తయారుచేయబడిన దొర టోపీలను ధరించవలెననియు, హిందువులు మామూలుగా ముఖములపై ధరించు బొట్టుగాని చెవులకు పెట్టుకొను పోగులుగాని ఉండరాదనియు శాసించెను. మహమ్మదీయులు గడ్డములను నున్నగా గొరిగించుకొనుట మతాచారవిరుద్ధము. హిందువులకు బొట్టు, చెవుల ప్రోగులు తీసివేయుట మతాచారమునకు విరుద్ధము. హిందువులు చర్మమును తాకినచో మైలపడుదుమనుకొందురు. మహమ్మదీయులా చర్మము అపవిత్రమైన పందితోలు కావచ్చునను అనుమానముతో దానిని ముట్టుకొనరు.[1] పాశ్చాత్యులైన పరంగీలు హిందువులను మహమ్మదీయులను ఇట్లు మతభ్రష్టులు గాచేసి పరంగీల మతములో కలపదలచినారను అనుమానము సిపాయిలందరికిని కలిగెను.

భారతదేశమున మహమ్మదీయ ప్రభుత్వ కాలమునందు హిందువులను బలవంతముగా మహమ్మదీయ మతమున కలుపుకొనుచుండిరి. అందువలన నీదొరతనములో కూడా దొరలు తమ మతమున కలుపుకొందురేమో యని అనుమాన ముండుట సహజము. కిరస్తానీమతమనగా దొరలు ధరించు దొరటోపీలను పెట్టుకొని గొడ్డు మాంసమును పంది మాంసమునుతినుట, ఘాటైన సీమసారాయమును త్రాగుటయు, శౌచవిదుల నుల్లఘించుటయు ననియు, ఈకిరస్తానీ మతమిట్టి పనులు చేయు పరంగీల మతమే గాని నీతి నియమములు ఆస్తిక జిజ్ఞాసయుగలట్టి మతము కాదనియు దేశీయులనుకొనుచుండిరి. అందువలన నామతమున గలసినవా రందరును



అస్పృశ్యులు, నపవిత్రులు నను భావముండెను. తాము మత భ్రష్టుల మగుదుమను భయోద్రేకము లీసిపాయిలలో కలుగుటకీ పిచ్చియుత్తరువులే చాలియుండెను.[2]

అంతట రాయవేలూరులోని దేశీయ సిపాయిలు 10-7-1806వ తేదీన తిరుగుబాటు చేసి, అక్కడి ఇంగ్లీషుజాతి సైనికోద్యోగులలో 19 మందిని, జాతి సైనికులను 82 మందిని గాయపరచిరి. తరువాత అర్కాటునుండి ఇంగ్లీషువారి సైనిక బలములు వచ్చి సిపాయిలను పట్టుకొని పితూరీ నణచివేసిరి. (ఉత్తర హిందుస్థానములోని మతావేశపరులైన వాహబీ లను మహమ్మదీయులు తమ ఫకీరులను దక్షిణ దేశమున కంపి ఇంగ్లీషు వారి పట్ల ద్వేషభావము పురికొల్పు చుండిరనియు, అట్టి ఫకీరులలో నొకడు రాయవేలూరి బజారులలో కొంతకాలము నుండి తిరుగుచూ సిపాయిలలో నుద్రేకము కలిగించుచూ నీ ఇంగ్లీషు ప్రభుత్వము కూలిపోవునని చెప్పుచుండెననియు తెలియవచ్చెను ఇంతేగాక ఆ సమయమున రాయవేలూరు కోటలో టిప్పుసుల్తాను గారి కుమాళ్లును కుటుంబమువారును రాజకీయ ఖయిదీలుగా నుంచబడియుండిరి. వారును వారి పరిజనులు నీ సిపాయిల తిరుగుబాటుకు కుట్రచేసిరని సైనికోద్యోగులనిరి రాజకుటుంబమువారి మనుష్యులు సిపాయిలతో రహస్యముగా మాట్లాడుచుండినట్లును, ఈపితూరీ జరిగినప్పుడు టిప్పుసుల్తాను గారి ఆకుపచ్చజెండా ఎత్తబడినట్లును తెలిసినది అయినను తరువాత జరిగిన విచారణ వలన, మద్రాసు రాజధానిలో కొత్తగా ప్రవేశపెట్టబడిన సైనిక నిబంధనల వలన సిపాయిలలో కలిగిన భయోద్రేకములే ఈ తిరుగుబాటుకు ముఖ్యమైన కారణమని తెలియవచ్చెను అటుపిమ్మట నీ నిబంధనలను జారీచేసిన సర్వసేనానిని, విలియం బెంటింకు గారిని మద్రాసునుండి పని మాన్పించిరి

మద్రాసులో చాలాకాలము గొప్ప ఉద్యోగములు చేసిన (సర్) తామస్ మన్రోగారు 4-9-1806వ తేదీన తన తండ్రికి లేఖ వ్రాయుచు, "సిపాయిలు సైనికదుస్తులు ధరించినప్పుడు బొట్టుపెట్టుకొనరాదనియు, చెవులకు పోగులు దరింపకూడదనియు, వారి బుగ్గలను నున్నగా గొరిగించు కొనవలెననియు, మీసముల నొకేరీతిగా కత్తిరించు కొనవలెననియు చేయబడిన ఉత్తరువులవలననే దేశీయ సిపాయిల పితూరీ జరిగినది ఇది త్వరలోనే అణచివేయబడినప్పటికిని, ప్రపంచంలో నేజాతి యొక్క ఆచార వ్యవహారములను గాని తృణీకరించినప్పుడా జాతిలో కలుగు ఉద్రేకమువంటిదే యిది మనబ్రిటీషు సైనికులందఱిని తలలు నున్నగా గొరిగించుకొనుడని శాసించినచో నేమి జరుగునో యూహింపుడు" అని వ్రాసిరి.[3]

దేశీయ ప్రజలను క్రైస్తవ మతమున గలుపుకొనుటకై క్రైస్తవమత ప్రచారకులు

చేయు ప్రయత్నములకు కుంపిణీ యధికారులు తోడ్పడినందు వలననే అది జరిగినదని క్రమక్రమముగా బయల్పడెను.

1807వ సంవత్సరములో రెవరెండ్ సిడ్నీస్మిత్తుగారు ఎడింబరో రివ్యూలో వ్రాసిన లేఖనుబట్టి, 1805 మార్చి 31 తేదీన కొందఱు మిషనరీలు మద్రాసులోని కుంపిణీ యధికారులను సందర్శింపగా వారు గ్రామములందుప్రచారము చేయుటకు సౌకర్యములు కలిగింతుమని వాగ్దానము చేసిరనియు, క్రైస్తవమత ప్రచారపు కరపత్రములను ఉచితముగా సర్కారు ముద్రణాలయమున అచ్చొత్తించి యిచ్చుట కంగీకరించిరనియు తెలియుచున్నది వేలూరి తిరుగుబాటుకు పూర్వము క్రైస్తవమత ప్రచారకులు సీమకు వ్రాసినలేఖలో, తమకు మద్రాసు ప్రభుత్వమువారు మత ప్రచార విషయమున చేయుచున్న సహాయమును వివరించిరి.[4]

ఎడింబరో రివ్యూలో నింకొక సంచికయందు, రాయవేలూరులో వధలు జరిగిన పదునైదుదినములకు మద్రాసులోని మత ప్రచారకులిట్లువ్రాసిరి: "ఈ దేశములో స్థాపింప బడిన కుంపిణీ ప్రభుత్వమువారి వలన మాకు అన్నివిధములైన సహాయమును లభించినది. మేముగాని ఇతరులుగాని వారిని కోరిన కోర్కెలన్నిటిని వారు చెల్లించిరి. మేము యిక్కడికి వచ్చుటకు వారు అనుమతిచ్చుట, మద్రాసు కోటలో మేము ప్రార్థనలు జరుపుట కంగీకరించి మాపనికి తోడ్పడుట, క్రైస్తవమత ప్రచారవర్గమువారు పనిచేయుట కవసరమైన వసతిని, నివేశనస్థలమును యిచ్చుట, యను విషయములందు మనకే యిబ్బందియు కలుగకుండా కావలసిన సహాయమునెల్ల చేయుదురు. ఇది ఏసుక్రీస్తు ప్రభువుయొక్క దయయని తలచుచున్నాము.[5]

ఆ కాలమున స్వతంత్రులైన క్రైస్తవ మతబోధకులు కొందరు తమ స్వంతబాధ్యతపైన మనదేశములో ప్రచారము చేయుటకు బయలుదేరి వచ్చిరి. వీరు తమ యిచ్చవచ్చినరీతిగా మన మతములను దూషించుచు క్రైస్తవ మతము లోనికి ప్రజలను కలుపవలెనని ప్రయత్నము చేయుచుండిరి. దేశీయుల స్వభావమును గూర్చియు వారి యాచారములను గూర్చియు వారి దేవుళ్లను గూర్చియు చాలా అవమానకరముగా మాటలాడుచుండిరి. ఈ దేశీయులను కిరస్తానీమతమున కలుపుటకు కృషిచేయుట పుణ్యమను భావముతో ధనవంతులట్టి మత బోధకులను ప్రోత్సహించి పంపిరి. వారు కుంపిణీ ప్రభుత్వమువారి యుద్యోగుల సహాయముతో నిక్కడ ప్రచారము సాగించుచుండిరి. యుద్ధములు లేనప్పుడు సిపాయిలు తీరికగా నుందురు గనుక వారికి మతబోధ చేయసాగిరి. తమ ప్రభువులైన కుంపిణీ బహుదూర్ వారి జాతి వారని సిపాయిలు జమేదారులు కొన్నాళ్లు ఓపికపట్టి



వీరు తమ మతమునెంత దూషించుచున్నను మర్యాదతో వినిరి. అదిచూచివీరు మఱింత విజృంభించిరి. సిపాయిల మనస్సులో చాలా బాధకలిగెను. ఈ దుష్ప్రచారమునకు కుంపిణీవారు హర్షించుచున్నారనియు వారికి కూడా తమను మతభ్రష్టులుగా చేసి కిరస్తానీ మతమున కలుపునుద్దేశ మున్నదనియు అనుమానపడిరి. అంతట నీ మద్రాసు రిగ్యులేషను నిబంధన వారి అనుమానములను స్థిరపరచెను. సిపాయిల మనస్సులకు కష్టము కలుగునట్లు వారిమతాచారములకు భంగము కలిగింపగల నిబంధనలను అమలు పరచి ఇంగ్లీషు దొరలీ రాయవేలూరు పితూరీని కొని తెచ్చుకొనిరి.

ఈ తిరుగుబాటుకు గూర్చి హెరియట్ మార్టిన్యూ 1857లో రచించిన బ్రిటిష్‌రూల్ ఇన్ ఇండియా అను గ్రంథమున నిట్లు వ్రాసెను.

ఈ రాయవేలూరు పితూరీ జరుగుటకు ముందిట్టివి జరుగునను సంగతి ఆంగ్లేయాధికారులకు కొన్ని సూచనలవలన తెలిసినప్పటికిని వారెట్టి చర్యయు తీసికొనలేదు. వీరు క్రొత్తగా అమలు జరిపిన నిబంధనలలో సిపాయిల కులాచారములకు సంబంధించిన బొట్టును, చెవులపోగులు తీసివేయవలెనను నిబంధనగాక వారు క్రొత్తగా ధరించవలెనని నిర్ణయించిన దొరటోపీ వంటిది ధరించినచో సిపాయిలు ఫరంగివారివలె నుందురని వారికి తోచెను. ఈ టోపీని పెట్టించుటలో వారు తమను మత భ్రష్టులుగా చేసి తరువాత కిరస్తానీ మతమున గలుపవలెనని ఉద్దేశించిరని సిపాయిలకు తోచెను. ఆటోపీని పెట్టుకొనుటకు నిరాకరించిన సిపాయిలను కొందరిని మేనెలలో పట్టుకొని చిల్లులుగల కొరడాలతో చావగొట్టిరి. ఒక్కొక్క దెబ్బ తినిన సిపాయియు, అతని బంధువర్గమును మిత్రులును కుంపినీవారిపైన క్రోధం వహించి వారిని ద్వేషించుటలో ఆశ్చర్యము లేదు. అట్లు చావగొట్టిన సిపాయిలను కొందరి నింకను సైనికవిధుల ప్రకారము శిక్షించుటకు మద్రాసుకు పంపిరి. కొందరు దూరదృష్టిగల ఉద్యోగు లీ నిబంధనలను అమలుజరపక ఉపేక్షించిరి.

ఈ కుంపిణీవారు నిజముగనే ఈ విషయమున కుట్రచేసిరని సిపాయిలు తలచిరి. ఈ విషయమును గూర్చి సిపాయిలు వారి బంధు మిత్రులును చర్చించుకొనుచుండిరి. ఆయుత్తరువులను ప్రతిఘటించి బాధ లనుభవించిన సిపాయిలు వీరులుగా పరిగణింప బడిరి.

ఈ విషయములో సిపాయిలు తిరుగుబాటు చేయుటకు కుట్రచేయుచున్నారని ఒకడు ఇంగ్లీషు దొరకు చల్లగా చేరవేసెను. అయితే ఆనాటి దొరలు దేశభాషలను నేర్చుకొను ఓపికగలవారు కారు. అందువలన ఆ దొర దీనిని గూర్చి విచారింపుదని

కుట్రదారులలోని వారికే ఆ సిపాయిని వప్పగించెను. అంతట వారితడు చెప్పునది అసత్యమని తీర్మానించి వానిని ఖైదు చేసిరి.

ఈ క్రొత్త నిబంధలను ప్రతిఘటించుట కొరక సిపాయిల రహస్య సంఘ మేర్పాటు కాబడినట్లు కొన్ని వారముల క్రిందటనే కొందఱికి తెలిసెనుగాని, వారెట్టి చర్యయు తీసికొనలేదు.

రాయవేలూరు బజారులో నాకాలమున నొక ఫకీరు తిరుగుచు నీ బ్రిటిషు రాజ్యము నశించునని బాహాటముగా చెప్పుచుండెను. ఆంగ్లేయాధికారులు వీనిని లెక్కచేయలేదు.[6]

రాయవేలూరు వీధులలో తిరుగుచుండిన ఫకీరు వాహబీశాఖకు చెందినవాడే. ఆ కాలమున నీశాఖవారు భారతదేశమునందు కాఫరులైన ఇంగ్లీషువారి పైన యుద్ధము చేయవలెనని మహమ్మదీయులను ప్రోత్సహించుచుండిరి.

రాయవేలూరి తిరుగుబాటు జరుగుటకు ముందుకూడా 1857లో జరిగిన భారత స్వాతంత్ర్య యుద్ధమునకు పూర్వము వలెనే మద్రాసులో ఒకగ్రామమునుండి మరియొక గ్రామమునకు చపాతీలను గోధుమరొట్టెలను పంపుచుండిరని, అందువలన నీఆచారములో నేదొయొక అంతరార్థమున్నదని అది తెలియుటలేదని తారన్‌హిల్లుగారు వ్రాసిరి.[7]

– *కృష్ణాపత్రిక*, ***13.9.1958***



1. (Eighteen Fifty Seven S.N. Sen. p. 2)
2. Oxford History of India V. A. Smith. P. 610
3. Life and Letters of Sir Thomas Munro, Gleig. Vol. 1 p 305.
4. Rise of Christian power in India. Major B.D. Basu. P. 484-5
5. Christianization of India, D.V. Siva Rao, Immortal Message May 1940
6. British Rule in India Horriet Martineau (1857) pp 205-221
7. The personal Adventures of a Magisrate during the Mutiny 1857. P 2, 3 Eighteen Fifty seven S.N. San P. 398.



# రాజా వెంకటప్పనాయకుని ఆయుర్దాయం

**పూ**ర్వము హైదరాబాదు నవాబుగారికి కప్పముచెల్లించు సామంతరాజులలో నేటి రాయచూరుజిల్లాలో షోరాపూరును రాజధానిగా చేసికొని ఆ ప్రాంతమునేల బోయజాతి బేదరునాయకులు బలవంతులుగా నుండిరి. ఆ సంస్థానమునేలు కృష్ణప్పనాయకుడు చనిపోవగా ఆయన మైనరుకుమారుడైన రాజా వెంకటప్పనాయకుని తల్లి ఈశ్వరమ్మగారికిని పినతండ్రి పెద్దినాయకునికి తగవులు కలిగెను. అప్పుడు ఆ సంస్థానము హైదరాబాదు నవాబు గారికి చాలాసొమ్ము బాకీయుండెను. ఆ సమయమున నా సంస్థానముయొక్క వ్యవహారములు చూచుటకు మెడోస్ టెయిలర్ అను నొక ఇంగ్లీషు దొర నియమింపబడెను. అతడు తన జీవితచరిత్రలో నా సంస్థానమును గూర్చిన కొన్ని విశేషములను వ్రాసియున్నాడు:

"రాణి ఈశ్వరమ్మగారికి చాలా జబ్బుచేసి బాధపడుచుండగా నేనామెను చూచుటకు వెళ్లితిని. అప్పుడామె ఆ సంస్థానముయొక్క రాజపురోహితునికి కబురంపి పిలిపించిరి. ఆ శాస్త్రులు గారు బాగా చదువుకొనినవారు. అక్కడ సంస్కృతపాఠశాలలో నాచార్యులుగ నుండిరి. ఆమె ఆయనను దగ్గరకు పిలిచి, సంస్థానముయొక్క రహస్యరికార్డుల నుంచు పెట్టెను తెప్పించి తనమెడలో కట్టుకొనియున్న తాళపుజెవిని తీసియిచ్చి ఆ పెట్టె తాళము తీయుమనెను. అప్పుడా బ్రాహ్మణుడు సంకోచించుచు, ఈ కాగితములను స్వర్గస్థులైన పెద్ద రాజగారు తప్ప ఇతరు లెవ్వరును చూచియెరుగురుకదా! వీని నిప్పుడీ టెయిలరు దొరగారికి చూపించుట యెందుల కని అనెను. ఈశ్వరమ్మగారు తనమాట కితరులెవ్వరు నెదురాడుట సహింపదు. అందువలన నామె కన్ను లెఱ్రచేసి మీ కెందులకు? నేను చెప్పినట్లు చేయండి అని గద్దించి పలికిరి.

ఆ బ్రాహ్మణుడు గడగడవడకుచు పెట్టె తాళము తీసెను. అంతట ఎఱ్ఱనిదారము కట్టినవ్రాత కాగితములకట్ట యొకటినాకు కనబడినది. ముందుగా దీనిని గురించి టెయిలరుగారికి చెప్పుడని యామె శాస్త్రిగారిని హెచ్చరించెను. శాస్త్రిగారికి మహారాష్ట్రము, హిందూస్తానీ భాషలు రెండును బాగా వచ్చును. "ఇది మీరు వినతగినదికాదు. ఇది

చిన్నరాజా గారు జన్మించినప్పుడు నేను వ్రాసిన జాతకము. ఆయన కాయుర్దాయము బాగుగాలేదు" అనెను. "అవును, వీడు దరిద్రుడు. వీని తండ్రి యెందులకు చచ్చెను? సంస్థాననాశకారకుడైన వాడుపుట్టగానే వీనిగొంతుకనేలపిసికివేయనైతిని? అవును. వీని కాయుర్దాయము లేదు. ఇరువది నాలుగేండ్లు నిండకుండగనే వీడు మరణించును. నేను, నాభర్తగారును ఈ కాగితములను వాసికకును, కాశికిని ఇంకను గొప్పశాస్త్రజ్ఞులున్న పలుతావులకును పంపి కనుగొంటిమి. అందరు నేక గ్రీవముగా చెప్పినారు. -24 సంవత్సరములు నిండవని. ఏమి! శాస్త్రిగారూ!! నేను చెప్పినమాట నిజమేనా మేము దీనివిషయమై ఒక లక్షరూపాయలు ఖర్చుచేసినాము" అని ఈశ్వరమ్మగారనిరి.

"ఇది నిజమే! నేను జాగ్రత్తగా గుణించి చూచితిని. ఇరువదినాలుగేండ్లు నిండవు. ముమ్మాటికి నిండవు" అని శాస్త్రిగారనిరి.

ఈశ్వరమ్మగారు తానికజీవింపనని తలచియే ఈ రహస్యమును నాకు వెల్లడించిరి. దీని నితరులకు చెప్పనని నాచేత ప్రమాణము చేయించుకొనెను. ఆ కాగితము, నితరకాగితములను గల ఆ పెట్టెకు మరల తాళము వేయించి సీలువేసి దానిని భద్రపరపుడని యామెనాకిచ్చెను" అని టెయిలరుగారు వ్రాసిరి.

1853లో చిన్నరాజుకు మైనారిటీ వెళ్లగానే అనగా అతనియిరువదియొక్క సంవత్సరము రాగానే టెయిలరుగారా సంస్థానము నాతనికి నప్పగించి వెళ్లిపోయిరి. ఆపెట్టె ఖజానాకొట్టులో నుంచిరి. దానినిగూర్చి తలచినవారు లేరు.

1857లో జరిగిన సిపాయిల తిరుగుబాటు కాలమున వెంకటప్పనాయకుడు విప్లవకారులతోచేరి యింగ్లీషు సేనాధిపతి నెదిరించి ఓడిపోవగా ఆయనను పట్టుకొని హైదరాబాదులో ఖైదుచేసిరి. ఇంగ్లీషు సైనికులురాజభవనములోని ధనకనకవస్తు వాహనములను దోచుకొనిరి. టెయిలరుగారిని మరల షోరాపూర్ పరిపాలకునిగా నియమింపగా నాయనవచ్చి చూచినప్పటికి రాజభవనంలో రాణివాసము వారుకూడా లేరు. వారెక్కడనో తలదాచుకొనిరి. ఆ పెట్టె ఏమైనదో తెలియలేదు. ఆ శాస్త్రిగారు మాత్రమింకను జీవించిఉండిరి.

టెయిలరుగారి సిఫారసువలన నైననేమి, రెసిడెంటుగారి దయవలననేమి వెంకటప్పనాయకునికి రాజద్రోహముచేసినందులకు - తిరుగుబాటు చేసినందులకు మొదట మరణదండన శిక్ష విధింపబడినను దానిని తగ్గించి యావజ్జీవ కారాగార శిక్షగా మార్చిరి. గవర్నరుజనరలు గారా శిక్షను కూడా తగ్గించి వెంకటప్ప నాయకుని చెన్నపట్టణము దగ్గర నొకకోటలో నాలుగేండ్ల నిర్బంధమున నుంచునట్లును, అతని కిష్టమైన



భార్యలను అతని దగ్గర నుంచుకొనునట్లును, అతడు బుద్ధికలిగి యున్నచో అతని సంస్థానము నతనికి మరల నిచ్చునట్లును ఉత్తరువు చేసిరి. ఈ వార్త షోరాపూరులో నున్న టెయిలరుగారి తెలియగా ఆయన చాలా సంతోషించిరి. పూర్వ మీచిన్నరాజాగారి జాతకమును వ్రాసిన ముదుసలి శాస్త్రిగారిని టెయిలరుగారు పిలిపించి ఈ చిన్నరాజా కిరువదినాలుగేండ్లు నిండవని పూర్వము మీరు వ్రాసిన జాతకము అబద్ధమై పోయినది. చూచితిరా! అని టెయిలరు గారనిరి. అప్పుడా శాస్త్రిగారు తలపంకించి "అయ్యా మారాజుగారికి మారకయోగము తప్పిపోయినదని నే ననుకొనను. ఒక్కొక్కప్పుడు మునుముందేదైనను ఘోరవిపత్తు సంభవింప బోవునప్పుడు కూడా పరమదయాళుడగు పరమేశ్వరుడు అపశకునములు కలిగించి బాధింపడు. ఏమైననేమి, ప్రస్తుతపు శుభవార్తను రాణిగారికి చెప్పి వచ్చెదను" అని ఆయనవెళ్ళిరి. రాణివాసమువారందరూ నీవార్త విని చాలా సంతోషించిరి.

కొలది దినములలో వెంకటప్ప నాయకుని హైదరాబాదునుండి నిర్బంధ ప్రవాస ప్రదేశమునకు పంపుచున్నామనియు ఆయనను కర్నూలుదగ్గర కలసికొనుటకు ఫలానిదినమున ఆయన రాణులను పంపవలసినదనియు టెయిలరుగారికి లేఖవచ్చెను. ఆదినము మధ్యాహ్నమే రాణులను పంపదలచి ఆయన వారికి ముందుగా కబురంపిరి. ఆ దినము బ్రాహ్మణులకు వర్షాశనములిచ్చు దినముగనుక ఆ ముదుసలి శాస్త్రిగారు కూడా అక్కడకు వచ్చిన బ్రాహ్మణులలో నుండిరి. ఆయన టెయిలరు గారి మేజాదగ్గర కూర్చుండి టెయిలరుగారికి సహాయము చేయుచుండిరి. ఆసమయమున *మిరపకాయ టపాబంట్రోతు మువ్వల - చప్పుడు వినబడెను.

*పూర్వము ఎక్కడను ఆగకుండా పరుగెత్తు టపా బంట్రోతులకు మువ్వలుకట్టిన కర్రకొక మిరపకాయ తగిలించుచుండిరి. ఆ టపాబంట్రోతు తెచ్చిన కాగితమును విప్పి చూడగా టెయిలరుగారి గుండె గుబేలుమనెను. "ఈ దినమున షోరాపూరు రాజా మార్గమధ్యమున నొకమకాములో తుపాకితో కాల్చుకుని మరణించినాడు" అని యిందులోనుండెను! ఆసమయముననే ఓ సంస్కృతభాషలోని పత్రములను టెయిలరుగారికిచదివి వినిపించుచున్న శాస్త్రిగారు నాముఖములోని మార్పును చూచి తటాలున నాచేతిని పట్టుకుని, "ఆయన మరణించినాడు! మరణించినాడు' ఓ టెయిలరు దొరగారు మీముఖమువలన నిది నాకు రూఢియైనది!!!' అని ఎలుగెత్తి పలికిరి.

అంతట టెయిలరు "అవును అతడు దుర్మరణము పొందినాడు" అనిరి. శాస్త్రిగారు నిశ్చేష్టులైరి.

శాస్త్రిగారు మరల మాటాడ గలిగినంతటనే "జ్యోతిషము వృధాపోదు. ఆయుర్దాయము లేనప్పుడు ఆయన మృత్యువునెట్లు తప్పించుకొనగలుగును?" అనిరి. ఈ జ్యోతిషమిట్లు నిజమైనందులకు టెయిలరుగారత్యంతాశ్చర్యము జెంది తన జీవితచరిత్రలో దీనిని వివరించిరి.

మరునాడు రాజాగారి మరణమును గూర్చిన వివరములు తెలిసెను. గవర్నరు జనరల్‌గారి తీర్పునతడు విని తన కృతజ్ఞతను వెల్లడించి తనపట్ల నింతకరుణను చూపి నందులకు తాను దీనికి అర్హుడనని రుజువగునట్లు ప్రవర్తింతుననెను. కర్నూలు దగ్గర తన భార్యలను కలిసి కొందునని సంతోషించెను. ఒక పల్లకీలో నతనిని కూర్చుండపెట్టి సైనికుల కాపలాతో తీసికొనుపోవుచుండగా దగ్గరనున మరుసటి మజిలీలో సైనిక దళాధిపతి తనరివాల్వరున్న తోలుపటకాను తీసి కుర్చీకి తగిలించి మొగము కడిగికొనుటకు అవతలికి వెళ్లెను. అంతలో తుపాకి ప్రేలిన చప్పుడు వినబడగా నతడు లోపలికి వచ్చిచూచునప్పటికి రాజు కడుపులో గుండుదెబ్బ తగిలి చచ్చిపడియుండెను. ఇది ఆత్మహత్యయై యుండదనియు, బహుశా క్రొత్త వస్తువునుచూచు కుతూహలముగల ఈ చిన్న రాజా ఆపటకాలోని రివాల్వరునిటునటు త్రిప్పి చూచుటలో నది ప్రేలి యతడు మరణించి యుండుననియు టెయిలరుగారూహించిరి. ఆ రాజా మరణముతో నాతని వంశమంతరించెను.

– *ఆంధ్రప్రభ, 12-12-65*

